# కొడవటిగంటి కుటుంబరావు

## వ్యాస ప్రపంచం - 7

# తాత్త్విక వ్యాసాలు

కూర్పు

కృష్ణాబాయి, ప్రసాద్





విప్లవ రచయితల సంఘం

ఆంధ్రప్రదేశ్

కొడవటిగంటి కుటుంబరావు
వ్యాసప్రపంచం – 7
**తాత్విక వ్యాసాలు**



ప్రచురణ
**విప్లవ రచయితల సంఘం**
ఆంధ్రప్రదేశ్

మొదటి ముద్రణ :
**ఆగస్టు 2002**

కవర్ డిజైన్
**మోహన్**

ముద్రణ
నాగేంద్ర ప్రెస్, విజయవాడ

సోల్ డిస్ట్రిబ్యూషన్
నవోదయ బుక్ హౌస్,
కాచిగూడ, హైద్రాబాద్ – 500 027

# కృతజ్ఞతలు

సారస్వత నికేతనం, వేటపాలెం

సజ్జా వెంకటేశ్వర్లుకీ,
ఆయా పత్రికల వారికీ,
ఆయన రాసిన ఉత్తరాలందించినవారికీను

కొడవటిగంటి కుటుంబరావుగారి వ్యాసాల ప్రచురణకి అనుమతించి ఎంతో అప్యాయంగా, మాతో సహకరించిన కొడవటిగంటి వరూధినిగారికి విరసం తరపున కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

**- విరసం**

# సదసత్సంశయం

కొడవటిగంటి కుటుంబరావుగారి వ్యాస ప్రపంచంలో తాత్విక వ్యాసాలు ఏడవ సంపుటం అయినా దీనిని చిట్టచివరకి ప్రచురిస్తున్నాం. ఇందులోని వ్యాసాల మీద అప్పట్లోనే తీవ్రస్థాయిలో చర్చలు చెలరేగాయి విరసం సభ్యులు, అభిమానులు, ఇతరులు వీటిల్లో చాలా ఆసక్తిగా పాల్గొన్నారు కుటుంబరావుగారు ఎంతో ప్రజాస్వామికంగా చర్చను ఆహ్వానించారు

అంతేగాక చివరి దాకా చర్చను కొనసాగించారు కూడా ఈ వ్యాసాల చిరు సంకలనం "బుద్ధి కొలత - అసాధారణ అనుభవాలు" అనే పేరుతో 1983లో వెలువడింది అందులో వున్నవన్నీ ఇందులోనూ చేర్చాము ఉత్తరాలు కూడా కలిపాము 'మాయదారి దేవుడు' (1975) చరిత్ర వ్యాసాలు (ప్రాచీన భారతం)లో చేర్చాము అయినా ఇక్కడ కూడా అవసరం అనిపించి ఇప్పుడు మళ్ళీ చొప్పిస్తున్నాం

ఇందులోని వ్యాసాల రచన వివిధ దశలలో కొనసాగింది. దీని రేఖాచిత్రం స్థూలంగా ఇది ఆరు వ్యాసాలు (1935-40), ఒక వ్యాసం (1950), తొమ్మిది వ్యాసాలు (1958-62), ఒక లేఖ (1965), ముప్ఫయి ఎనిమిది వ్యాసాలు (1973-80), ఇరవై తొమ్మిది లేఖలు (1977-80).

దయ్యాలు, దేముళ్ళు, మతం, నాస్తికత్వం, పూర్వ జన్మలూ, పునర్జన్మలు, సోదె, జోస్యం, స్థల, కాలాల స్వరూప స్వభావాలు, విచిత్ర మానసిక శక్తులు, టెలిపతి, సైకొమెట్రీ వీటన్నింటి ఊసులు వీటిల్లో విస్తారంగా ఉన్నాయి వీటిని విశదపరచి, ఒప్పించి, సమన్వయం చేయాలని కొ కు కోరిక అందుకోసం విశ్వ ప్రయత్నం చేశారు కాని ఇవి చాలామందికి మింగుడు పడలేదు, కొందరికి కొరుకుడు పడలేదు. ఉదా త్రిపురనేని మధుసూధనరావుగారికి రాసిన ఉత్తరంలో ఇలా అన్నారు - "బుద్ధి కొలత వ్యాసాలు విరసంకు సంబంధించినవి కావు"(7-5-80) అల్లం రాజయ్యకు రాసిన ఉత్తరంలోనయితే "బుద్ధి కొలత గురించి నేను రాస్తున్నది అర్థం కాకపోతే వదిలెయ్యండి నాకే సరిగా తెలీని అనేక శాస్త్ర విషయాలను ఆధారం చేసుకుని ఆ సిద్ధాంతానికి రూపుదిద్దుతున్నాను" అని పేర్కొన్నారు (5-8-80)

మార్క్సిస్టు జ్ఞాన సిద్ధాంతం తాను మావో నించి నేర్చుకున్నాననేవారు కొ.కు కాని ఇందులో ఆయన ప్రస్తావించిన అనేక అంశాలు మార్క్సిజంతో ఎంతమాత్రం పొసగవు పైగా కొన్ని పూర్తిగా విరుద్ధమయినవి కూడా వున్నాయి. ఇది కొ కు లోని వైరుధ్యం అయితే ఇది మిత్ర వైరుధ్యమే అందుకే వీటిని యధాతథంగా అచ్చువేసి

అందజేస్తున్నాం. అవగాహనకు తోడ్పడతాయనే ఆశతో చివరలో కొన్ని కామెంట్సు వేరే ఇస్తున్నాం. వీటిని కూడా పరిశీలించమని విన్నపం. మళ్ళీ చదువుదాం, చర్చిద్దాం.

కుటుంబరావుగారి రచనావ్యాసంగం అర్ధశతాబ్దం (1931-80) పాటు కొనసాగింది. కన్నుమూసేంతవరకు కలం మూయలేదు. చివరలో రాసి సొరుగుల్లో దాచిన కొన్ని వ్యాసాలు ఆయన చనిపోయినాక పత్రికల్లో అచ్చుకావడం విశేషం. వ్యాస రచనలో ఆయన సవ్యసాచి. ఏక కాలంలో అటు తాత్విక వ్యాసాలూ, ఇటు సామాజిక, సాంస్కృతిక వ్యాసాలూ కూడా రాశారాయన. అయితే తాత్విక వ్యాసాల నీడలు సామాజిక, సాంస్కృతిక వ్యాసాలకి సోకకపోవడం గమనార్హం. అందుకనే 'ప్రజాసామ్యం', 'పుచ్చిపోయిన జీవితం'(1980) లాంటి వ్యాసాలు బావుటాల్లా ఎగిరాయి, వెలుగులు విరజిమ్మాయి తెలుగు వ్యాసరచనలో సాటిలేని మేటి మన కుటుంబరావు.

*ఆగస్టు, 2002* **కృష్ణాబాయి, ప్రసాద్**

# దర్శని

## I. జిజ్ఞాస - మీమాంస



## II. మాయదారి దేవుడు



## III. Dimensions

# IV. బుద్ధికొలత



# V. అసాధారణ అనుభవాలు

# VI. లేఖా సంభాషణలు

# కొకు వ్యాస ప్రపంచం

1) సైన్సు వ్యాసాలు - మొదటి ముద్రణ - జనవరి 1989
   రెండవ ముద్రణ - జనవరి 1997

2) చరిత్ర వ్యాసాలు - అక్టోబర్ 1999

3) సంస్కృతి వ్యాసాలు - అక్టోబర్ 1999

4) సినిమా వ్యాసాలు 1, 2 భాగాలు - డిసెంబరు 2000

5) సాహిత్యవ్యాసాలు - మే 2001

6) రాజకీయ వ్యాసాలు - ఆగస్టు 2001

7) తాత్విక వ్యాసాలు

8) లేఖలు - 2002

# 1. దయ్యములు

దయ్యాలు లేవని భావించటం ఈ కాలపు మూఢనమ్మకాలలో ఒకటి. అటువంటి నమ్మకం కల వాళ్ళు తమ నమ్మకాన్ని దృఢపరుచుకునేటందుకు తగిన ప్రయత్నం చేసినట్లు కన పడదు. సహజమైన చావుచావక బలవన్మరణం పొందినవాళ్ళు మాత్రమే దయ్యాలవుతారు. వాళ్ళలోకూడా అంతా అవుతారని చెప్పలేం సహజమైన చావు చచ్చినవాళ్ళు ఇహవాసనను సొంతంగా వదిలించుకుని సూక్ష్మజీవులై వారి లోకానికి పోతారు. బలవన్మరణం సంభవించినవాళ్ళు ఈ ప్రపంచానికీ ఆ ప్రపంచానికీ కూడా కాకుండా తిరుగుతూంటారు. వారి దృష్టి యావత్తూ ఈ ప్రపంచం మీదే ఉంటుంది మనం వారికి కనపడుతూంటాం. మనం చేసే పనులన్నీ వారికీ చెయ్యాలని ఉంటుంది. కాని వాళ్ళు మనకు కనపడని కారణంచేతా, వారిని మనం గమనించాలని ప్రయత్నం చేయకపోవటం వల్లా వాళ్ళకు త్వరలోనే వెర్రెత్తుతుంది ఇటువంటి అనుభవం ఆ పరిస్థితుల్లో మనకే వస్తుంది. అటువంటి దయ్యాలు కొన్ని కలిసి దాడివెడలుతై మనుష్యుల మీదికి.

కొంతమందికి (సామాన్యంగా స్త్రీలందరికీ) సైకిక్ పవర్ (యోగశక్తి) ఉంది. అటువంటి శక్తిగల వాళ్ళని దయ్యాలు సులభంగా ఆవేశించగలవు. ఆ విధంగా ఆవేశించినప్పుడు మనవాళ్ళు చెప్పులూ, చీపురుకట్టలూ తీసుకుని దయ్యంపట్టిన మనిషిని కొట్టటం కద్దు. అనేక దయ్యాలకు తాము చచ్చినట్టు కూడా తెలీదు. కొన్నిటికి తెలిసినా ఇంకా చెప్పుదెబ్బల భయం పోదు. అందుచేత కానీ, నిజంగా దెబ్బలు దయ్యానికి తగిలే కాని, దయ్యం తాత్కాలికంగా మనిషిని విడిచిపోయినా; మన దృష్టిని ఆకర్షించగలిగినందుకు తృప్తిపడి, పదే పదే తిరిగివస్తూ ఉండటం, ఆవేశించిన మనిషి చేత ఘోరమైన పనులు చేయించి ఆ మనిషి శరీరం హూనం చెయ్యటం అవుతూ ఉంటుంది. నా ఉద్దేశం దయ్యాలతో మృదువుగా సంభాషించటం మంచిదని. దయ్యాల విషయంలో సానుభూతి చూపిస్తే ఆవేశించిన మనిషికి బాధ తగ్గుతుంది. రంగు ముగ్గులూ బిందె నాదాలూ దయ్యాలని భయపెట్టటానికే.

ఇక వాటి జీవితం చాలా హేయంగా నిరర్థకంగా ఉంటుందనటానికి సందేహం లేదు. వాటిది ప్రపంచంలో చాలా కొద్ది సంఖ్య. ఒక దయ్యాన్ని చూస్తే ఒక దయ్యానికున్న ఆకర్షణకన్న అన్నిటికీ భూమిమీద జీవితాన్ని చూస్తే ప్రేమజాస్తి ఇందులో కొందరు నాయకులుగా ఉండి మిగిలిన దయ్యాలకు దారి తీస్తూండటం కూడా జరుగుతుంది. అందుచేతే ఒక్కో దెయ్యం "నేను ఫలానా కావూరి అన్నపూర్ణమ్మ శిష్యురాలిని !" అని గర్వంగా చెప్పుకుంటుంది. దయ్యాలు, పాపం, మధ్య మధ్య ఆత్మకథ ప్రారంభిస్తే చూసేవాళ్ళు ఎగతాళిచేసో, తిట్టో, కొట్టో దానికి వెర్రెత్తిస్తారు మన సంఘంలో ఉండగా నాగరికతకు కట్టుబడిఉన్న మృగసంబంధమైన ఉద్రేకాలన్నీ దయ్యంకాగానే అంకుశం పోవటం వల్ల పైకొచ్చి రేగటం మొదలుపెడతై.

*(ఆంధ్రభూమి, మాసపత్రిక నవంబరు 1934)*

# ౨. భగవంతుడు

భగవంతుడు ఉన్నాడా లేదా అన్న ప్రశ్న అర్థం లేని ప్రశ్న. అటువంటి ప్రశ్న ఎవరైనా వేస్తే నీకు భగవంతునితో ఏమైనా పనుందా అని వెంటనే ఎదురు ప్రశ్న వెయ్యాలి భగవంతుడి వల్ల కాగల పని ఏమిటని తరవాత ఆలోచించుకోవచ్చు ! ఉన్నాడనిగాని లేడనిగాని మీమాంస చెయ్యటం మరీ అన్యాయం, తెలియని విషయాల గురించి ఖండితంగా మాట్లాడటం అనాలోచనాపరుడి లక్షణం. ఉన్నాడని వాదించే వాళ్ళలో చాలామంది తమ బాధ్యతలన్నీ ఆతడి నెత్తిన వెయ్యదలచినవాళ్ళే. భగవంతుడి యందు నమ్మకం లేనివాళ్ళు తమ వ్యవహారాలన్నీ యావత్తూ తామే చక్కబెట్టుకోగలమనే ధైర్యంతో ఉన్నవాళ్ళు.

భగవంతుడి ప్రకృతి జనసామాన్యం దృష్టిలో మారుతున్నది ! భూమి అడునుముద్దగా ఉండి జీవకోటి యావత్తూ జలచరంగా ఉన్నప్పుడు సమర్థత గల మత్స్యం ఒకటి భగవంతుడని పించుకుంది అట్లాగే అవతారాలన్నీ. విచిత్రమేమిటంటే ఈ భగవంతుడు మన అవసరమైన రూపంలో వస్తేనే దణ్ణం పెడతాం కాని అంతకన్నా హెచ్చు మహిమలతో వస్తే వాడికి మొహాన మొద్దులే. మత్స్యావతారం కాలంలో ఏ రాముడో వచ్చి వుంటే ఆ జలచరాలన్నీ పీక్కు తినేవే ! అయినా ఇప్పటికి అయిదువేల సంవత్సరాల క్రితం దేవుడనిపించుకున్న శ్రీరాముడికింకా మర్యాదలు జరుగుతున్నవి. ఈ రోజుల్లో ఊరికో రాముడుండటానికి అవకాశం ఉంది సరే కదా ఈ నాగరికతలో రాముడల్లే ప్రవర్తించేవాడు లోకంచేత తక్షణం బహిష్కరింప బడతాడు ఈ పరిస్థితుల్లో రాముణ్ణి ఇంకా దేవుడుగానే భావించటం అజ్ఞానం, కాకపోతే తప్పకుండా ఎగతాళే ! కొందరు మేధావులీ విషయమై నిజానిజాలు కనుక్కున్నవాళ్ళు నిరాకారాన్ని అమల్లోకి తెచ్చారు. అటువంటి నిరాకారుడు ఉన్నాడని భావించడానికైనా కారణం కనిపించదు ఆ నిరాకారంతో మానవుడికి ఏం పని ? పని లేకుండా ధ్యానం చెయ్యటంలో అర్థం ఏమిటి ? ఏదో పొందుదామనేగా ? ఏదో అవుదామనేగా ? ఆ అవడానికీ పొందటానికీ సహాయభూతుడయ్యే భగవంతుడు సాకారుడు కావటం లేదా ? ఒకవేళ సాకారుడు కానక్కర్లేకపోతే ! ఆ పొందేదేమిటో అయ్యేదేమిటో ఆ భక్తులకే స్పష్టంగా తెలియదన్నమాట ! ఆ ధ్యానం బకధ్యానం !

భగవంతుడనే మాటలో అర్థం ఏదైనా ఉంటే సాకారుడైన భగవంతుడి యందే వుంది. ఎవడైనా విపరీతమైన ఆపదలో ఉన్నప్పుడు మరోడు వాణ్ణి కాపాడితే రక్షింపబడేవాడి ఆపత్తు యొక్క ఎక్కువ తక్కువలనుబట్టి ఎక్కువ తక్కువలుగా రక్షించేవాడు భగవంతుడి ఆకారం పొందుతాడు ఒక్కో సమయంలో నడివీధిలో రక్షింపబడ్డ మనిషి రక్షించినవాడి పాదాలమీద పడి, అంతా మరిచిపోయి ధ్యానం చెయ్యటం మొదలుపెట్టినా ఆశ్చర్యం లేదు. అంత మాత్రానికే మనం ఆ రక్షించిన మనిషే భగవంతుడు, వాణ్ణే మనం కూడా ధ్యానం చేద్దామనే బుద్ధి పుడు తుందా ? ఆ మనిషికే తెలియదా తనకే ఏ భగవంతుడన్నా అడ్డుపడవలసిన ఇక్కట్లు రావచ్చునని? అంతదాకా ఎందుకు ? ఏ ఒక వ్యక్తి అయినా శాశ్వతంగా ప్రపంచంలో యుద్ధాలు లేకుండా చేస్తే అతడు భగవంతుడిగా పరిగణింపబడతాడు - తిరిగి జనసంఖ్య పెరిగి నెలకో మహా సంగ్రామం అవసరం అయ్యే వరకూ ! చూడరాదూ దశావతారాల్లో ఒక పరశురామావతారం, ఒక బుద్ధావతారం, ఒక వామనావతారం, ఒక కల్క్యావతారం. భగవంతుడు తిరిగి తన వంశంలో తాను పుట్టడు !

మనం నిత్యకర్మకు భగవంతుడిమీద ఆధారపడి లేం. ఎవరిచేతనో చాకిరి చేయించుకొని, నా పొలంలో పండించుకుని తినే భోజనానికీ, ఇంకో దేశాన్ని దోచి దెచ్చుకు తినే రొట్టెకూ, ఓ భగవంతుడా నా అనుదినమైన భోజనాన్ని (లేక రొట్టెను) నాకిమ్ము అనటం భగవంతుణ్ణి ఎగతాళి

చెయ్యటమో నన్ను నేను ఎగతాళి చేసుకోవటమో తెలవటం లేదు. ప్రతి పనీ చేసి కృష్ణార్పణమనటం, ప్రతి పనీ మనచేత భగవంతుడే చేయిస్తున్నాడనటం బొల్లి కబుర్లు - భగవంతుడికి మనచేత వెధవ పన్లన్నీ చేయించటమే పనయినట్టు ! ఇక న్యాయస్థానాలెందుకు ? శిక్షలెందుకు ? ఒకరినొకరు వేలుపెట్టి పొడుచుకోటాలెందుకు ? భగవంతుణ్ణి స్మరించని జన్మ వ్యర్థమని భాగవతాది గ్రంథాలు మొదటినుంచి చివరివరకూ ఒకటే ఘోష. హిరణ్యకశిపుడి కంటే సమర్థుడికి భగవంతుణ్ణి స్మరించవలసిన అవసరం ఎట్లా కలుగుతుందో ఎవరైనా చెప్పగలరా ? భగవంతుడే లేడని నమ్మాడంటే వాడి తప్పా ? వాడు భగవంతుణ్ణి నమ్మక చచ్చాడనటం మహా ఘోరం ! అనారోగ్యం వల్ల చావనివాడు ప్రమాదాలవల్ల చచ్చినట్టు, సహజమైన చావు చావకుండా కట్టుదిట్టాలు చేసుకున్న జీవి అసహజమైన చావు చావటంలో వింత నాకేం కనపడటం లేదు కాకపోతే వాడు లోక కంటకుడు కనక వాణ్ణి చంపేసిన మహామృగం ఏదైతే ఉందో అది ఏకగ్రీవంగా భగవంతుడనిపించుకుంది ఆ ఆకారం ఇప్పుడు దిగివస్తే దాన్ని తక్షణం చంపి వినోదంగా బ్రిటిష్ మ్యూజియంలో పెడతారు పటాలు కట్టీ, గుళ్ళు కట్టీ దణ్ణాలు పెట్టే మహాభక్తులే ఈ వార్త విని సంతోషిస్తారు

భగవంతుడి ఆవశ్యకతను గురించి ఆలోచిద్దాం మనకు చాతనైన పనికి భగవంతుణ్ణి ఎప్పుడూ పిలవం గజేంద్రుడు - వెనుకటి జన్మలో ఎవడైనా కానీ - సామాన్యపు అడివేనుగు మొసలి చేతిలో చిక్కింది. యుద్ధం చేసింది లాభం లేకపోయింది. దాని మనస్సులో ఒక విధమైన ప్రార్థన ప్రారంభమయింది. రోజుకు నూరు చావులు తప్పించుకునే జీవికా ప్రార్థన రాదు మానసికంగా గజేంద్రుడికీ ఆపదల్లో కూడా తలవనిదది ఇటువంటి చావుకది అంగీకరించలేదు. అందులో స్వార్థం చాలా వుంది చివరకు దాని మోక్షంలో ఫలితానికొచ్చింది ఆ స్వార్థమే మొసలిని జయించే శక్తి తనలోనించి రాదని తేలిపోయింది ఇక అది ఎక్కణ్ణించన్నా రావాలి ఆ వచ్చే వ్యక్తి మొసలిని పిప్పి పిప్పిగా కొట్టగల ఆయుధాలు అనేకం తీసుకురావాలి. అట్లాగే వచ్చాడు ఆ సమయాన ఏ పిట్టలను కొట్టేవాడు వచ్చి మొసలిని చంపినా అతణ్ణి గజేంద్రుడు భగవంతుడుగా గణించటానికి సిద్ధమే !

అన్నదానం చేసిన భగవంతుడికన్న ప్రాణదానం చేసిన భగవంతుడు సహజంగా ఎక్కువవాడుగా వుంటాడు. శరీరాన్ని కాపాడుకోటానికి భగవంతుణ్ణి ప్రాధేయపడేకాలం క్రమంగా నశిస్తుంది. మనస్సుకు కలిగే బాధలు నివారించే దేవుడు సహజంగా శరీరాన్ని కాపాడే దేవుడికంటే తెలివిగా వుంటాడు మనుషులు క్రమంగా నాస్తికులు కావటానికీ భగవంతుడు వాళ్ళకు దూరం కావటానికీ కారణం సులభంగా ఊహించవచ్చు ఏ కష్టాలు మనకు పాతబడిపోతవో వాటిని గురించి భగవంతుణ్ణి ప్రార్థించటం క్రమంగా అనవసరం అవుతుంది. ఎప్పుడూ చచ్చేవాళ్ళకి ఏడిచే వాళ్ళెవరన్నట్టు హమేషా ఉండే బాధను చూస్తే భయం తగ్గటం ఒకటి, భగవంతుడది తీసెయ్యలేడనే నమ్మకం, రెండు ! అందుకనే అప్పుడప్పుడూ వచ్చిపడే ప్లేగు మొదలైనవి దేవతాస్వరూపాలు ప్రతి సంవత్సరం ప్లేగుతో బాధపడే నైజాం దేశమంటిచోట ఎంతకాలం ప్రార్థన చేస్తూ కూర్చుంటారు ? ఇవాళ భగవంతుడివల్ల తప్ప కానిపని రేపు మనం స్వయంగా చేసుకుంటాం ! గజేంద్రుడు మరి రెండు మూడుసార్లు మొసలి చేతులలో చిక్కితే భగవంతుణ్ణి ప్రార్థించటం అనుమానమే అవుతుంది ఒకవేళ ప్రార్థించినా ఆ ప్రార్థన నాలికమీది నించి రావలసిందే ! వేల సంవత్సరాల కింద మనం వల్లెవేసినవి, అర్థమైనా చేసుకోకుండా, మన విధి మనం నిర్వర్తించినట్టు సంతృప్తి చెందుతున్నాం అటువంటివి మనకు మామూలే. కానీకి నిప్పుపెట్టి చిక్కే యీ రోజుల్లో నిత్యాగ్నిహోత్రి అనే మిషమీద గౌరవం పొందుతున్న వాళ్లు లేరూ ? మన పూర్వులు వేటికోసం ప్రార్థించారో వాటికోసం మనం కూడా ఎందుకు ప్రార్థించాలని ఎవరికీ ఉండదు - భజన పరుల్లో, అసలు ఉత్తభజనలో అర్థం ఏమిటి ?

భగవంతుడనే వాడుండి మన అందరి మొరలూ వింటున్నాడనే గ్యారంటీ ఎప్పుడూ లేదు అనేకమంది మాకు ఇంకా బతకాలనుందో అంటూ చస్తున్నారు. అంతమాత్రాన మనుషులు ప్రార్థించటం మానరు అది అసంభవం నిజమైన ప్రార్థన మనస్సులోనించి అప్రయత్నంగా వస్తుంది అది ఎవరు వింటారు, కోరిక నెరవేరుతుందా అనే ప్రశ్నలుండవు. భగవంతుడు నిజంగా లేకపోయినా చెయ్యటం తప్పదు కనుక ప్రార్థన చేసినంత మాత్రాన భగవంతుడంటూ ఒకడున్నాడని రుజువు కావటం లేదు కాని మన కోరిక నెరవేరినప్పుడు మన కోరిక ఏ శక్తి నెరవేర్చిందో ఆ శక్తే భగవంతుడుగా నమ్మి ధ్యానం చెయ్యటంలో ఏమీ తప్పులేదు ఎందుచేతంటే మన కోరిక ఏదైనా తెలిసిన పద్ధతిగా నెరవేరేదైనా, దానియొక్క అవశ్యకత మనకు అంత ఎక్కువైనది కాకపోయినా మనలో ప్రార్థన బయలుదేరదు కనక. ప్రార్థన అందరూ ఒకదానికే చెయ్యరు సరేకదా ఒకరికొకరు విరుద్ధంగా కూడా ప్రార్థిస్తారు. ఒకడు కొత్తగా వితంతువులైన వాళ్ళ తలగొరుగుడు పడకుండా చెయ్యమనీ, ఇంకోడు వితంతువుల జుట్టు దానంతట అదే రాలిపడేటట్టు చెయ్యమనీ ! ఒకదేశం మమ్మల్ని యుద్ధంలో గెలిపించి విరోధులను చంపమనీ, అవతలి దేశస్థులు కూడా అట్లాగే ! అదీ ప్రార్థనే, ఇదీ ప్రార్థనే ! శిలల్లే ఒక్కడే దేవుణ్ణిపెట్టి, ఇన్ని పనులూ వాడే చేస్తున్నాడనా ?

భగవంతుడికి సంబంధించిన నిరర్థకపు విషయాల్లో - భగవంతుడియందు ప్రేమ, లేక భక్తి అమ్మాయిల సంగతి తెలీనంత కాలం మనిష్టమొచ్చిన అమ్మాయిని ఊహించుకుని ప్రేమించటం ఎంత సులభమో భగవంతుణ్ణి ప్రేమించటం అంత సులభం, అమ్మాయిలను గురించి తెలుసుకోదగినదంతా తెలిసికున్న తరువాత అమ్మాయిలను ఊహించుకొని ప్రేమించటం ఎంత కష్టమో భగవంతుణ్ణి గురించి తెలుసుకోవటం అసంభవమని తెలుసుకున్న తరువాత భగవంతుడి మీద ప్రేమ అంత అసంభవం. "ఓ భగవంతుడా ! నీతో ఆడతాను. పాడతాను. నిన్ను కౌగిలించుకుంటాను. ఓ నాథా ! ఓ అథా ! ఓ ఇథా !" అనే మనస్తత్వం నా తలకు మించినది

"భగవంతుడున్నాడని సంచరిద్దాం ? ఉన్నాడా ? యే ఇబ్బంది లేదు ! లేడా? (బహుశా ఇక్కడ కన్ను కొట్టాలి !) నష్టం లేదు !" ఇదో అభిప్రాయం - వ్యాఖ్యానం అనవసరం

ఈ మధ్య బెర్నార్డుషా భగవదన్వేషణ చేసిన ఒక నీగ్రో పిల్ల అనుభవాలను గురించి చిన్న గ్రంథం వ్రాశాడు బాగానే వుంది కాని ఎందుకు రాశాడో తెలీలేదు. దానిమీద ఎవరో మరో పుస్తకం రాసి అంత ఖరీదుకే అమ్ముతున్నారట చదవలేదు గాని బహుశా ఆ కారణానికే (బెర్నార్డుషా ఎందుకు రాశాడో అందుకే !) అయి వుంటుంది.

నేను మాత్రం ఈ వ్యాసం రాసిన కారణం దాచుకోదలుచుకోలేదు. మన జీవితంలో దేనితోనూ చేయబడని చీకటికి స్థానం ఉన్నట్టే అగమ్యగోచరంగా ఉన్న ఈ భగవంతుడికీ స్థానం వుంది. ప్రతీదాన్ని గురించి నిజానిజాలు తర్కించటం ఎంత అవసరమో దీన్ని గురించి తెలుసుకోవటం కూడా అంత అవసరం. ప్రకృతి మానవుడికి చాలా శక్తి నిచ్చింది కాని దాన్ని మానవుడు చాలా దుర్వినియోగం చేస్తున్నాడు.

భగవంతుడికి పది ఆకారాలు కల్పించి ఒక్కొక్క అకారం చుట్టూ ఒక్కో మతం అల్లుకొచ్చారు. చాలా భాగం మనిషి యొక్క మనశ్శక్తి ఎవరి మతాన్ని వారు సమర్థించుకోవటంలో సరిపోతున్నది భగవంతుడు లింగాకారమా లేక భగవంతుడికి పంగనామాలున్నయ్యా అనేదాన్ని గురించే ఎంత రాయబడ్డదో చూస్తే కడుపు తరుక్కుపోతుంది. దీన్ని గురించి అభిప్రాయ భేదంవల్ల (రెండు) మతాలు ! మతమేమిటో తెలియకుండా ఈ విధంగా ఒకరి తలకాయ ఒకరు

పగులగొట్టుకుంటుంటే అందరూ ఆలోచించవలసిన అనేక విషయాలు అట్లాగే ఉండిపోవటమే కాక ప్రమాదం జరుగుతున్నది

మన ఆరోగ్యం, మన ఐశ్వర్యం, మన బుద్ధి వికాసాలు, ఒక చెంప సారస్వతం, ఆర్థికస్థితి, కళలు, శాస్త్రాలు, విద్య, నాగరికత ఇవన్నీ వృద్ధి అయ్యే మార్గం ఏమిటి ? ఈ 1935 లో మనకన్న ఈ విషయాల్లో ఎన్ని దేశాలవాళ్ళు ఉన్నత దశలో ఉన్నారు ? మనం చెయ్యవలసిన ప్రయత్నం ఏది ? అది మన చేతులో ఎంతవరకుంది ? భగవంతుడిమీద ఎంత భారం వేద్దాం ! దానివల్ల ఎంత ఫలితం కలుగుతుంది ? మనకు కావలసింది మోక్షమా ? అభివృద్ధా ? మోక్షం వచ్చేటంత అభివృద్ధి భగవద్భక్తిలో వస్తుందని నమ్మి ఊరుకోవాలా ? దాన్ని గురించి కూడా ఆలోచించి మన ఆలోచన ప్రకారం నడుచుకుందామా ? ఉన్నట్టుండడం చాలా సులభం అభివృద్ధి కేవలం భజనతో కాదేమోనని నా భయం.

*(ప్రబుద్ధాంధ్ర, మాసపత్రిక, జనవరి 1935)*

# 3. సత్యాన్వేషణ

సత్యాన్వేషణ ఎందుకు చెయ్యబడాలంటే ఎవరూ చెప్పలేరు సూర్యాస్తమయం కాగానే దీపాలు వెలిగించుకోవటం ఎందుకు ? భగవంతుడిచ్చిన చీకటితో తృప్తిపడి ఉండరాదూ ? అజ్ఞానికి కూడా ఉండరాదనే తోస్తుంది మరి. తమస్సులో పుట్టాం, సత్యాన్వేషణ చేసి తీరాలి. కాలక్రమాన మనో చైతన్యం కలవాడికి "ఇది పరమార్థం" అనే నమ్మకం ఎప్పటికో అప్పటికి కలిగి తీరుతుంది. సందేహం లేదు

సత్యమనేది భిన్నంగా ఉంటూంటుంది. గణిత శాస్త్రానికి సంబంధించిన సత్యం ఒకటుంటుంది యాభైమంది కూలీలు ఒక బండను ఒక నిమిషంలో యాభై అంగుళాలు దొర్లించగలిగితే, గణితశాస్త్రం ప్రకారం ఒకడు అదే కాలంలో అదే బండను ఒక అంగుళం దొర్లిస్తాడనటం సత్యం ఆ ముక్క పదార్థ విజ్ఞానశాస్త్రజ్ఞుడికి చెప్పితే "ఫ్రిక్షన్" అనే కొత్త విషయం ఒకటి ఎత్తి ఒకడికాబండ మొదలు కదలనే కదలదంటాడు తార్కికుణ్ణడిగితే మనుష్యులంతా సమానమైన బలం గలవాళ్ళుగా ఉండాలికదా లెక్క వెయ్యటానికంటాడు మనం కూడా కొంత తర్కం ఉపయోగించి ఈ ఒక మనిషి సరిగా ఆ యాభైమంది యొక్క మొత్తం బలంలో యాభయ్యోవంతు బలం గలవాడనుకోమనాలి అప్పుడు అవతలవాడు అది సరిగా నిర్ణయించటం కంటె ఒకడిచేత ఈడ్పించి చూడటం చాలా సులభమని చెప్పి గణితశాస్త్రం ఎందుకూ పనికిరానిదని నిరూపిస్తాడు

కనక సత్యమనేది భిన్నంగా వుంటూంటుంది

కొంచెం ఆలోచిస్తే సత్యమనేది లేనేలేదని సిద్ధాంతం చెయ్యవచ్చును మనకు కనపడుతున్న ప్రపంచాన్ని గురించి మనం తెలుసుకోవాలంటే పంచేంద్రియాలు తప్ప గతిలేదు. వాటి లోపాలన్నీ, కంటి అద్దంయొక్క రంగల్లే సత్యవీక్షణాని కడ్డం అవుతై భూదేవి ఒక విధమైన గంధం - దుర్గంధమైనా సరే, సుగంధమైనా సరే - వెదజల్లుతూండవచ్చును మనం కనుక్కోగలగటం అసంభవం గాలికి రంగుండవచ్చును మనకు తెలీదు దూరాన చాకలివాడు బట్టలు ఉతుకుతూంటాడు కన్ను చూసిన కొంతసేపటికి చెవి వింటుంది కొత్తలో కన్ను నిర్ఘాంతపోయింది కంటిలోపం కంటె చెవిలోపం జాస్తని తెలుసుకున్నప్పుడు కన్ను చెవిని హేళన చేస్తుంది చలికాలంలో గచ్చు తగలగానే ప్రాణం పోతుంది, కంబళి కప్పుకోగానే వెచ్చగా వుంటుంది కాని గచ్చెంత చల్లగా ఉందో కంబళీ అంత చల్లగానే వుంది ఐతే గచ్చు నీవేడి నాకిమ్మంటుంది, కంబళి అనదు ! వెధవ గచ్చు చల్లగా ఉందంటాం ! అబద్ధం !

ఈ సందర్భంలో ఒక ప్రశ్న సత్యాన్వేషణ పరుడికి గచ్చూ, గొంగళీ సమానంగా చల్లగా ఉన్నవనేది ఎంతవరకు ఉపయోగిస్తుంది ?

ఇంకో ఉదాహరణ -

ఒక ఎల్లమ్మ ఒక పుల్లయ్యతో పోతున్నదని ఏమీలేందే పుకారు పుట్టింది ఎల్లమ్మ అందరితో పోయి "నన్ను పుల్లయ్యతో పోతున్నానంటున్నారో !" అని మొరపెట్టుకుంది. అప్పుడెవరైనా తార్కికుడు ఎల్లమ్మతో "నువ్వు పుల్లయ్యతో పోయినావంటున్నారనేనా, నీ అభ్యంతరం ? అసలు పోయిన మాట ఉత్తదే కదా ? అనటానికొస్తే నీనోటిమీదిగా నువ్వూ అంటూనే ఉంటివిగా - వాళ్ళున్నదానికి నూరిన్నిసార్లు ?" అంటాడనుకుందాం తార్కికుడు చెప్పింది నిజమే ఔ గాక ! ఎల్లమ్మ ఆత్మ ఏం శాంతించింది ?

ఆ విధంగానే - మశూచికం మహామారీ కాదూ మట్టిగడ్డలూ కాదు క్రిములవల్ల కలిగే

జాడ్యం అని తెలుసుకున్నంత మాత్రంచేత మశూచికం పడ్డవాడికేం ఒరిగింది ?

ఇది ఇట్లా ఉండగా సత్యాన్వేషణ ప్రియుడు జాగర్తగా ఉండకపోతే ప్రమాదం వుంది !

థామస్ హార్డీ మహాశయుడు రాసిన ఒక నవలలో కథానాయిక తనేదో మంచిపని చేస్తున్నాననుకుని తన భర్తతో తన్ను చిన్నతనంలో మరోడు చెరిచిన సంగతి చెప్పేస్తుంది ఆ క్షణంనించీ కథ నిరాఘాటంగా విషాదాంతం కావటం మొదలుపెడుతుంది ఎవడు కానీ భరించలేని సత్యాన్ని తెలుసుకోకూడదు ఇటువంటిది దాంపత్యంలో ప్రతి స్వల్ప విషయంలోనూ జరుగుతూంటుంది పెద్ద విషయాలట్లా వుంచి సంఘంలో ఒకరిని గురించి ఒకరు అనేక స్వల్ప విషయాలు తెలుసుకోకూడదు కాఫీ అలవాటైనవాళ్ళు ఒక్కొక్కరు కాఫీ తాగుతుంటే అటుకేసి చూడకూడదు !

తెలుసుకోకూడని విషయాలున్నట్టే తెలుసుకోవలసిన విషయాలున్నై అవి మతాచారాల దాస్యంనించి విముక్తి పొందటమూ వాటి తాలూకు సత్యం ప్రచారం చెయ్యబడటమూ జరగాలి మశూచికం ఉంది దాన్ని వెనకటి మాదిరిగా నమ్మకాలతో నయం చేసుకోనక్కర్లేదు రాకుండా చేసుకోటానికీ వస్తే నయం చేసుకోటానికీ వైద్యం వుంది. ఆ విధంగానే ఈ రోజుల్లో 'ఏమోనబ్బా ! నాకు పరలోకాన్ని గురించి ఎంత మాత్రమూ నమ్మకం లేదు నేను ఉమర్ ఖయామ్ పద్ధతిమీద నడుస్తాను !' అనక్కర్లేదు. ఆ విషయమై ఇంగ్లీషులో కావలసినంత వాఙ్మయం ఉంది

ముఖ్యంగా మతం నమ్మకాలతో కూడినది వంద సంవత్సరాల క్రితం మతగ్రంథాలలో ఉండదగిన విషయాలీరోజున శాస్త్రగ్రంథాల్లో ఎక్కుతున్నై అందుచేత మతం సంస్కరింపబడుతూండాలి అటువంటి పని చెయ్యటం ఇష్టమో, శక్తోలేక అవసరమైన సత్యప్రచారాని కడ్డుపెట్టడం మూర్ఖ లక్షణం

సత్యాన్వేషణను గురించి నాకు తోచిన అంశాలివి

1) ఏ అమానుష దృష్టిలోనైనా సత్యం మిథ్య కావచ్చుగాక సత్యాన్వేషణ చేసేవాడికి మానుష దృష్టే ఆదర్శం సత్యాన్వేషణకు ప్రత్యేక శాస్త్రాల పక్షాన పరిపూర్ణత్వం లేదు

2) సత్యాన్వేషణ మానవ తత్వానికి సరిపడేటట్టుండాలి ఆ తత్వంయొక్క అభివృద్ధి సత్యాన్వేషణకు అనుకూలంగా జరగాలి కాని ప్రతికూలంగా జరగరాదు. ఆ రోజుకారోజు మనిషి ఎక్కువ సత్యాన్నెదుర్కొంటూండడమే రానురాను కలికాలమనిపించుకుంటూండటానికి ముఖ్య కారణం వెనకటి చరిత్రలు కవులు రాస్తే ముందు రాబోయే చరిత్రలు శాస్త్రజ్ఞులు రాస్తారు - ఆ మాట మరిచిపోగూడదు ! మనం చాటుగా చేస్తున్న పనులు ఇతర దేశాల్లో బహిరంగంగా చెయ్యటం వల్ల మనకు ఆ దేశాలను చూస్తే కొంత నిరసనమన్న ముక్క మరిచిపోగూడదు ! అంత సత్యాన్ని మనం ఎదుర్కొనే స్థితికి వచ్చిన తరువాత - కాలక్రమాభివృద్ధిలో - మనం వాళ్ళల్లే కావటానికి అనేక అవకాశాలు లేకపోలేదు !

3) సత్యాన్వేషణ చేయబడ్డ విషయాలను గురించి నమ్మకాలు కలిగివుంటాననటం పొగరుబోతు తనం

నమ్మకాలు సహజమైనవి కావు ఆ మాటకొస్తే మనిషి ఒక కాలిమీద నిలబడటం కూడా అసహజమే కాని నడిచిపోతున్నవాడు ప్రతి మరుక్షణమూ ఒక కాలిమీద ఉంటుంటాడు అట్లాగే ముందు పొయ్యేవాడు సత్యాన్వేషణ చెయ్యబడని విషయాలను గురించి నమ్మకాలు కలిగించుకోవటం తప్పులేదు వాటిని యుగాల తరబడి నమ్మకాల కిందనే ఉండనివ్వటం చాలా అసహజం

*(ఆంధ్రభూమి, మాసపత్రిక, మార్చి 1935)*

# 4. అసత్యమూ - నాగరికతా

హరిశ్చంద్రుడి చరిత్ర సత్యవ్రతానికి అనవసరమైన ప్రచారం చాలా చేసింది. నా మందబుద్ధికి, హరిశ్చంద్రుడు, గుడ్డెద్దు చేలోపడ్డట్టు నిజం చెప్పటం, అన్నివిదాలా హానికరమని చక్కగా నిరూపిస్తున్నట్టు కనిపిస్తుంది. కాకపోతే అటువంటి వ్రతాలకు ప్రత్యేక వ్యక్తులకు సంబంధించినంతవరకు కొంత ప్రాముఖ్యత లేకపోలేదు. అబద్ధానికి నైతికమైన బలం లేదని తేల్చేవరకూ సత్యవ్రత దీక్షకు మౌనవ్రతదీక్ష మొదలైన దీక్షలకంటె ఎక్కువ స్థానం ఇవ్వక్కర్లేదు. ఆ దీక్షను గురించి రాయటం కీర్తించటంకన్న హానికరమైన విషయం ఉండబోదు.

అనృతం యొక్క నైతికబలం విచారిద్దాం దానికిముందు అనృతం యొక్క స్వరూపం విచారించవలసి వుంది.

దీర్ఘంగా ఆలోచిస్తే సత్యంయొక్క స్వరూపం నిర్ణయించటం చాలా కష్టమనీ, బహుశా అసంభవమనీ తేలుతుంది

సత్యప్రకటన మాటలద్వారా జరిగినపుడు మాటలలో ఉన్న అసత్యం, ప్రకటింపబడే సత్యాన్ని అరికట్టుతుంది చంద్రుడెట్లా ఉంటాడని ప్రశ్న వస్తే సమాధానం అబద్ధాలమయం అయి తీరవలసిందే ఎన్ని మాటలతో చంద్రుడియొక్క ఆకారం వినేవాడి కళ్ళకు కట్టినట్టు చెయ్యగలం ? యుగాలు చాలవు, వాఙ్మయం యావత్తూ నిరర్థకం అయిపోతుంది. ఉపమానాలు తెస్తామా, ప్రతి ఉపమానమూ, సత్యాన్ని మరింత దూరంగా తోలేస్తుంది చంద్రుణ్ణి చూపించి జ్ఞానేంద్రియం ద్వారా ఇట్లా ఉంటాడని తెలియజేద్దామా, చక్షురింద్రియం యొక్క లోపాలన్నీ సత్యాన్ని కప్పేస్తయి. చంద్రుడి సమీపానికి వెళ్ళినకొద్దీ చంద్రుడి ఆకారం మారటం నిశ్చయం. అంత దూరం పోకుండా టెలెస్కోపులో నుంచి చూసినా తేలిపోతుంది కంటికి ఇఱ్ఱిగానూ మఱ్ఱిగానూ కనిపించే చంద్రుడిమచ్చ క్రేటర్స్‌గా కనిపిస్తుంది దుర్భిణితో చూస్తే

స్వల్ప విషయాల్లో మనం సత్యం చెప్పగలగటం లేదా ? 'చేతివేళ్ళెన్ని ?' అంటే 'పది' అని చెప్పలేమా ? అని ఎవరైనా అడగవచ్చును. అటువంటి సత్యం మనకెంతవరకు ఉపకరిస్తుంది? అంతకన్న డాక్టర్లు తెలీక చెప్పే అబద్ధాలు ఎక్కువ ఉపకారం చేస్తున్నై

ఒక పని చెయ్యవచ్చును, తియరీ ఆఫ్ రిలెటివిటీ ఆధారం చేసుకుని ఒకదానికన్న ఒకటి ఎక్కువ సత్యం అనవచ్చును. అనగా ఒకదాన్లో కంటె మరొకదాన్లో ఎక్కువ అసత్యం ఉంటూ ఉంటుంది సత్యాసత్యాలనేవి, అన్నిటిలోనూ పాళ్ళుగా ఉన్నప్పుడు సత్యవ్రత దీక్ష హాస్యాస్పదం కాదా ? హరిశ్చంద్రుడి ఎదట అంతకన్న సత్యవంతుడు పుట్టవచ్చును దీనికి అంతేది ?

మాటలకన్నా, జ్ఞానేంద్రియాలకన్నా సత్యగ్రహణ శక్తిగలది మనస్సొకటి ఉంది సత్యాన్వేషణపరుడి మొదటి విధి దాన్ని అభివృద్ధి చెయ్యటం దాని అభివృద్ధికి నాగరికత ఏ మాత్రం తోడ్పడుతున్నది ? పదార్థ విజ్ఞానశాస్త్రం, రసాయనశాస్త్రం, ఇంకా తదితర శాస్త్రాలూ అభివృద్ధి పొంది పంచేంద్రియాల లోటుపాట్లను సక్రమంగా నిరూపించి మనస్సును వాటి దాస్యంనించి తొలగించాలని ప్రయత్నం చేస్తున్నమాట వాస్తవమే 'అదుగో సూర్యోదయం' అంటుంది కన్ను. 'అయితే సూర్యుడు ఉదయించి ఎనిమిది నిమిషాలైంది' అని లెక్కచేసుకుంటుంది మనస్సు. ఇందువల్ల మాత్రం ఏం లాభం ఉందని అడగవచ్చునెవరైనా చాలా లాభం ఉంది మొదటి సంగతి, ఇటువంటి అభ్యసనంవల్ల మనసు జ్ఞానేంద్రియాల దాస్య విముక్తి పొందటమేకాక, సృష్టియొక్క రహస్యాలను ఛేదించటానికి మానవ మనశ్శక్తి తగిన అభివృద్ధి పొందటం కూడా జరుగుతుంది. ఎప్పటికైనా సత్యాన్వేషణయొక్క గమ్యస్థానమదే - ఏదైనా ఉండటమంటూ ఉంటే

సత్యాన్వేషణకు మానవమృగం తగిన పరికరాలు కలిగిలేదు అయినా ఇంతకంటె తగిన మృగం వచ్చేవరకూ ఇది అభివృద్ధి అవుతూ దాని రాకకు నిరీక్షిస్తూ ఉండటంకన్న గత్యంతరం లేదు.

ఇవి నిజంగా సత్యాన్వేషణకు అనుకూలమైన రోజులే సందేహం లేదు కాని మనం సత్యాన్వేషణకు చుట్టూ తిరిగిపోతున్నామేమో అని నాకు గట్టి అనుమానం వుంది ఇన్ని టెలెస్కోపులూ, అబ్జర్వేటరీలూ లేకుండా పూర్వులు అద్భుతమైన జ్యోతిశ్శాస్త్రం నిర్మించారు పెద్ద పెద్ద యంత్రాల సహాయంతో చేసే పనులు బైరాగులల్లే వచ్చి మూలికలతోనూ, మంత్రాలతోనూ చేస్తున్నారు. మనిషిలో ఎవరూ ఊహించని, ఎవరూ నమ్మని శక్తులు విదితం కానున్నై ఈ శక్తులన్నీ పరిపూర్ణత్వానికి వచ్చేవరకూ మరో మృగం యొక్క రాక అనవసరం ప్రతి పదార్థమూ ఎలక్ట్రాన్ ప్రోటాన్ల కలయికచేత కలుగుతున్నదని శాస్త్రజ్ఞులు ఊహిస్తుండగా, ఎక్టోప్లాజం అనే పదార్థం కనిపెట్టబడ్డది దానిచేత చేయబడిన జుట్టు మామూలు జుట్టల్లేనే ఉంది. ఇతర పదార్థాలను కూడా ఎక్టోప్లాజం తయారుచేస్తుందని నమ్మబడుతున్నది. ఎక్టోప్లాజం మనం ఇంటిలో వాడుకునే ఉప్పువంటి అనేక పదార్థాల యొక్క కలయికవల్ల తయారవుతున్నది ! ఇప్పుడు ఎలక్ట్రాన్ ప్రోటాన్లను ఏం చెయ్యాలి ? శాస్త్రజ్ఞులని పేరు పెట్టుకుని బిరుదులు పొంది కులుకుతున్నవాళ్ళు ఇది 'స్పిరిచుయలిజం' కు సంబంధించిన విషయమని ఎక్టోప్లాజం జోలికి పోకుండా ఉన్నారు. ఈ పాశ్చాత్య నాగరికత పాశ్చాత్య దేశాలనూ వాటివెంట మనవంటి అర్భకులనూ తప్పు దోవను తీసుకుపోతున్న దనటానికి సందేహం ఉందా? ఒక్క ఈ విషయంలోనేకాక ఇతర విషయాలలోనూ పాశ్చాత్య నాగరికత ఇట్లాగే ఉన్నట్టు కనిపిస్తుంది. మంచి తెలివిగలవాడు పది నిమిషాలలో చెయ్యగల తీర్మానం బ్రిటిషు పార్లమెంటు అయిదు సంవత్సరాలకు మించని కాలంలో చేస్తుందట ! గోరుతో పొయ్యేదానికి గొడ్డలి - అదీ ఈ నాగరికతయొక్క పద్ధతి ప్రపంచం అంతటా రాజ్యాంగ విధానాల దగ్గిర్నించీ బట్టలు ధరించుకోవటం వరకూ అసలు సూత్రాన్ని అర్థం చేసుకోకుండా మధనపడటంగా కనబడుతుంది

ఉన్న నాగరికత ఒక్కరోజులో పొయ్యేది కాదు ఈ నాగరికతలో అబద్ధానికి స్థానం వుంది

ఈ రోగి జీవించే ఆశ వదులుకోండి ! అని డాక్టరు చెప్పగలిగిన పరిస్థితులు కలిగినపుడు ఆ విషయమై డాక్టరు చెప్పాలా, అబద్ధం ఆడాలా అనేది నైతిక సమస్య. ఆ మాట అనటంవల్ల చావబొయ్యేవాడికీ దగ్గిరవాళ్ళకూ చాలా బాధ కలుగుతుంది. అబద్ధం ఆడితే రోగి చెయ్యవలసిన పనులు చెయ్యకుండా చావటం తటస్థించవచ్చును అటువంటప్పుడు నాగరికత డాక్టరుచేత లౌక్యంగా అబద్ధం ఆడిస్తుంది 'రోగి జీవిస్తాడని నాకు చాలా గట్టి నమ్మకం ఉంది. ఎటుపోయి ఎటు వచ్చినా కీడెంచి మేలెంచమన్నాడు. నేను మందివ్వగలను కాని అయుర్దాయం .' అటువంటప్పుడు నాగరికత యొక్క అభివృద్ధిలో చావుకు కూడా కొంత స్థానం ఇవ్వబడటం, ప్రతివాడూ చావును ధైర్యంగా ఎదుర్కోగలగటం కూడి రావాలి అంతవరకూ డాక్టరు అబద్ధాలాడ వలిసిందే. లేకపోతే ఎవరూ పిలవరు లేదా ఆ స్థితిగతులలో డాక్టరుయొక్క అబద్ధాలకు మరో పేరు పెట్టాలి. ప్రస్తుతం అట్లాగే జరుగుతున్నది.

ఈ విధంగానే ప్రతి ఎసెంబ్లీ సెషనులోనూ, పార్లమెంటరీ సెషనులోనూ, ప్రతి వార్తాపత్రికలోనూ, ప్రతి మీటింగులోనూ, ప్రతి పుస్తకంలోనూ, ప్రతిచోటా, ప్రతివాడిచేతనూ, అన్ని సమయాలలోనూ నాగరికతను సమర్థించటాని కబద్ధాలాడబడుతున్నై. మనం ఉన్న నాగరికతతో తృప్తిపడిపోయినామని సూచించబడుతున్నది ఇందు మూలంగా !

ఇవేకాక ప్రతి రాజకీయ రహస్యమూ ఒక అబద్ధం కింద నేను లెక్కవేస్తాను - అవసరమైన

అబద్ధమనండి కావాలంటే, అన్ని అవసరమైన అబద్ధాలలోనూ ఇదొకటి ఆ విధంగానే మన ప్రవర్తనను కట్టుబాటుచేసే నియమాలన్నీ అబద్ధాలు ఎదురుగా 'ఏమండీ' అంటాం అవతలికి వెళ్ళిన తరువాత అతణ్ణి గురించి మాట్లాడుతూ 'గారు' తగిలించమని మనకూ తెలుసు, వాడికీ తెలుసు 'ఏమండీ' అనేది ఒక అబద్ధం బాహ్యంగా అచ్చులో పేరు చివర తగిలించే 'గారు' అబద్ధం. ఇటువంటివి శతసహస్రాలు. వీటిని నేను ఖండించటంలేదు అవి తెలీకపోవటం పెద్ద తప్పుగా కూడా భావిస్తాను. నాగరికత ఎంత అసత్యాన్ని పురస్కరించుకుని ఉందో మనవి చేస్తున్నాను ఇవన్నీ క్రమంగా తగ్గిపోవాలని కూడా అంటాను అందువల్ల నాగరికత వెనక్కు పోతుందని సంశయం రావచ్చును అట్లా ఎప్పటికీ కాదు అతి నాగరికతా, అసలు నాగరికత లేకపోవటం ఒక్క విధంగానే కనిపిస్తయి స్థూలదృష్టికి. అడివి మనుష్యులూ తక్కువ గుడ్డలతో జరుపుకుంటారు పాశ్చాత్య స్త్రీలూ గుడ్డలు లేకుండానే జరుపుకుంటారు నాగరికత మనుష్యులచేత అటువంటి పనులు చేయిస్తుంది ఈ గుడ్డలు లేకపోవటం అడివి మనుష్యులలోనూ, పాశ్చాత్య సౌందర్యవతులలోనూ ఒకటిగానే ఉందని ఒక్కనాటికి అనుకోరెవరూ అట్లాగే ఇటువంటి చిన్న చిన్న సమస్యలు నాగరికత లేనప్పుడు అసలుండవు క్రమంగా వచ్చిపడతై

అబద్ధాన్ని విషం మాదిరిగా ఉపయోగించాలి ఎంత పెద్ద జాడ్యానికుపయోగిస్తే అంత విలువ ఉంటుంది దానికి పూర్తిగా జాడ్యరహితమైన నాగరికత ఎప్పుడు వస్తుందో ఏ రూపంలో వస్తుందో ఊహించటం నా తలకు మించిన పని

*(ఆంధ్రభూమి, మాసపత్రిక, ఏప్రిల్ 1935)*

# 5. నాస్తికత

వెనుక నేను "ప్రబుద్ధాంధ్ర"కు రాసిన "భగవంతుడు" అనే వ్యాసంలో భగవంతుడు ఉన్నాడని నిరూపించటం ఎంత కష్టమో లేడని నిరూపించటం కూడా అంత అసాధ్యమే అని ఉన్నాను ఇది కేవలమూ సత్యంకాదు ఎందుచేతనంటే భగవంతుడు లేడని వాదించటం అమిత సులభమూ, ఉన్నాడని నిరూపించటం అసంభవమూనూ. ఇటువంటి statement చేసేటప్పుడు శ్రీ విశ్వనాథ సత్యన్నారాయణగారు ఒకసారి ఉపన్యసిస్తూ అన్నట్టు "భగవంతుడు" అనేదాన్ని నిర్వచించవలసిన అవశ్యకత వుంది మీదు మిక్కిలి "భగవంతుడు" అనేది అత్యవసరంగా నిర్వచించవలసిన శబ్దం - ఏ ఇద్దరి భగవంతుడూ ఒకటి అయినట్టు కనిపించదు

అయితే ఈ సందర్భంలో భగవంతుడు ఎటువంటి స్వరూపం కలవాడైనా, అసలు స్వరూపమే లేనివాడైనా కూడా నేను అన్నముక్క వర్తించుతుంది కనుక భగవంతుణ్ణి నిర్వచించవలసిన అవసరాన్నించి నేను ఇప్పటిమటుకు విముక్తుణ్ణి అయినాను

ప్రస్తుతం నేను రాయదలుచుకున్నది భగవంతుడు లేడనే వాదాన్ని గురించి (మతమూ వేదాలూ మొదలైనవాటిని విశ్వసించని వారిని కూడా నాస్తికులంటున్నాం వాడుకలో. కాని వారంతా అసలు మొదలు భగవంతుడు లేడనే వారికిందనే నాస్తికులవుతారు అట్లా కాకపోయినట్టయితే ఏది లేదని వాదించేవాడయినా నాస్తికుడే కావాలి.) నాస్తికతను నిష్పాక్షికంగా పరిశీలించినట్లయితే అదొక మతంకాదు, తెలివితోగాని, విజ్ఞానంతో గాని కూడుకున్న విషయం కాదు. మనకు ప్రత్యక్షం కానిదీ, మనకు నిమిత్తం లేనిదీ అయిన ఒకానొక పదార్థం యొక్క ఉనికిని సందేహించి మనం నాస్తికుల మనిపించుకుంటున్నాం ప్రపంచం నాస్తికత్వంలో పుట్టింది, బిడ్డ తల్లిదండ్రులను గురించిన అజ్ఞానంలో పుట్టినట్టు. ఈ నాస్తికత్వంలో "భగవంతుడు" అనేది ఒక భావం (concept) గా బయలుదేరింది, కాని ఒక అనుభవంగా బయలుదేరలేదు కొలంబను అమెరికాను దర్శించినట్టు, ఒకడు భగవంతుణ్ణి దర్శించి తన అనుభవాన్ని ప్రకటించటం జరగలేదు, ఒక శాస్త్రజ్ఞుడు "ఈథర్" అనేదాన్ని ఊహించినట్టు ఒక జ్ఞాని భగవంతుణ్ణి ఊహించాడు. (ఒకరికొకరు సంప్రదించుకోకుండా అనేకమంది జ్ఞానులు భగవంతుణ్ణి ఊహించారని చెప్పాలి.) శాస్త్రజ్ఞులు "ఈథర్"ను ఊహించటానికి కూడా కారణం ఉండి ఉంటుందనుకోవాలి.

భగవంతుడు అనే భావం ఒకటి ఉత్పత్తి అయిన తరువాత, ఆ భగవంతుడి వల్ల ఆ భావాన్ని సృష్టించిన మనిషికి ప్రయోజనం ఏమిటి ? అని పృచ్ఛ చెయ్యటానికి ఇతర మానవులకు అధికారం వుంది ప్రతి పదార్థాన్నీ తీసుకుని, "దీని ఉపయోగమేమిటి ?" అని అడుగుతూండడం చాదస్తం కావచ్చుకాని, అమలులోకి వచ్చిన ఒక ఊహను గురించి ఆ విధంగా ప్రశ్న చెయ్యడం తప్పుకాదు ఒక భావం కలగటమూ దానిక ప్రచారం జరగటమూ ఒక జాతికి చెందినవి కావు. రెండు తలలతో పుట్టిన శిశువును కళ్లారా చూచిన నేను ఎనిమిది తలల వాళ్ళు ఏ గోళం మీదనో నివసిస్తూ వున్నారని ఊహించడం సకారణం కావచ్చును ఆ ఎనిమిది తలలున్న వాళ్ళను గురించి నేను ప్రచారం ప్రారంభించగానే "వాళ్ళవల్ల ప్రయోజనమేమిటి ?" అని నన్ను ప్రతివాడూ సహజంగా అడుగుతాడు

కాని భగవంతుడితో మనిషికున్న అవసరం అపారం తనకు తను సహాయం చేసుకోలేని స్థితిలో, ఇతరులు కూడా తనకు సహాయం చెయ్యనప్పుడూ - చెయ్యలేనప్పుడూ - మానవుడు ప్రార్థించవలసిన వాడేకాని మరొకటి లేదు. అందువల్ల భగవంతుడి ఉనికికి సంబంధించిన ప్రచారం

ిర్విఘ్నంగా జరిగిపోయింది భగవంతుడున్నాడనే నమ్మకం మీద అనేక మతాలు పుట్టినై.
భగవంతుడు లేడని వాదించడం మహా పాతకమై పోయింది

అయితే నాస్తికత్వం మటుకు నశించలేదు. అందుకు ముఖ్యకారణం ఏమిటంటే నాస్తికత్వం సహజమైనది - చీకటీ, చలీలాగా. అట్లాగే భగవంతుడున్నాడనే విశ్వాసమూ, మతమూ కృత్రిమమైనవి. సహజమైన చలిలోనూ, చీకటిలోనూ ప్రాణి ఉద్భవించటమే అసహజమని మన శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. నిరూపిస్తున్నారు. కాని అపరిమితమైన కాంతి, వేడీ ఈ ప్రాణులను నిర్మూలం చెయ్యడానికి చాలును. ఇప్పుడు చంద్రుడున్న స్థానంలో సూర్యుడుంటే భూమి కిరసనాయిలు పోసి అంటించినట్లు మండిపోతుంది. అందుకని సహజమైన నాస్తికత్వాన్ని కాని కృత్రిమమైన ఆస్తికత్వాన్ని కాని ఎంతవరకు ఉపయోగించుకోవటం వల్ల మనకు అధికమైన లాభం వుందో ఎప్పటికప్పుడు మానవుడు నిర్ణయించుకోవాలి అట్లా కాకుండా ఇటువంటి నిర్ణయాలు ఒక్కసారి చేసిపెట్టుకుని ఊరగాయ వేసుకోవచ్చునని నమ్మేవాళ్ళు అమిత సోమరులూ, అజ్ఞానులూనూ. ఎందుకంటే ప్రస్తుత విషయంలో చూసుకున్నా, భగవంతుణ్ణి గురించీ, భగవంతుడితో మనకు గల అవశ్యకతను గురించీ మానవుడి అభిప్రాయాలు మారుతూనే వున్నై - ఇకముందు కూడా మారుతూ వుంటై. అదికాదు నాస్తికత్వమే మారుతున్నది ఆ విషయానికి తరువాత వద్దాము.

భగవంతుడున్నాడని నమ్మడం వట్టి మూఢవిశ్వాసం అనుకునే వాళ్ళలో అమిత మేధావులున్నారు నాస్తికులు నీచాతినీచుల తరగతికి చెందుతారని నమ్మేవాళ్ళలో ఎంతో జ్ఞానులున్నారు (అభిరుచులకొద్దీ పేలే మూర్ఖులనూ మూఢులనూ తీసుకోనేవద్దు) నాస్తికత్వమూ, ఆస్తికత్వమూ ఇంత ఎడమొఖాలూ పెడమొఖాలుగా వున్నప్పటికీ, అమిత పెద్ద మనుష్యులూ, ఎంతో మంచివాళ్ళు, నిస్వార్థులూ, లోకోపకార పరాయణులూ, నీతిపరులూ, అయినవాళ్ళు, నాస్తికులలోనూ వున్నారు. ఆస్తికులలోనూ వున్నారు ఇహానికి సంబంధించినంతవరకు వారిలో వొకరికొకరు ఏ విధంగానూ తీసిపోరు కాక పరానికి వెళ్ళిన తరువాత ఒకరు నరకానికీ ఒకరు స్వర్గానికీ పోవచ్చును అది సంశయనీయాంశము.

ఈ పరిస్థితులలో ప్రవర్తనను బట్టి నాస్తికులెవరో ఆస్తికులెవరో చెప్పటం అసాధ్యంగా వుంది "నేను నాస్తికుణ్ణి" అని తనంతట తను చెప్పుకునేవరకూ మనం ఎవరినీ నాస్తికుడని చెప్పలేం అట్లా చెప్పుకున్న తరువాత అతని జ్ఞానాన్ని కాకపోయినా, అతని ధైర్యాన్నన్నా మనం మెచ్చుకోవలసిన వాళ్ళం అవుతున్నాం, మరొక ముఖ్య విషయం ఏమిటంటే ఆస్తికుణ్ణని చెప్పుకునే వాడొకడు నాస్తికుణ్ణని చెప్పుకునేవాణ్ణి చూసి "వీడు భగవంతుడి యందు విశ్వాసం లేకుండా ఉన్నాడు. నాకు భగవంతుడంటే నమ్మకం ఉంది. అందుచేత నేను వీడికంటె సత్పురుషుణ్ణి" అని చెప్పుకునేటందుకు లేదు. ఒక్క ఆస్తికుణ్ణని చెప్పుకున్న మాత్రాన అతడికి భగవంతుడివల్ల ఉత్కృష్టమైన ప్రయోజనం ఉందని నిర్ధారణ కాలేదు. ఆ విధంగానే నాస్తికుడు గూడా తనకు భగవంతుడియందు నమ్మకం లేదు. కనుక తను ఆస్తికుడికంటే భగవంతుడిమీద తక్కువ ఆధారపడి ఉన్నాననీ చెప్పలేడు

భగవంతుడనే భావం కూడా ఎన్నడూ ఎరగని అడివి మనుష్యులూ, పశుపక్ష్యాదులూ, కొత్తగా భూమిమీద పడ్డ పిల్లలూ భగవంతుణ్ణి ప్రార్థించినట్లు నాగరికుడు ప్రార్థించలేడు వేటగాడి చేతజిక్కిన మృగం యొక్క రోదనల్లోనూ, ఆకలి అయిన చంటిపిల్ల ఏడుపులోనూ ఉన్న ప్రార్థన బలమూ భగవంతుడికే అర్పితం. వాటి బాధ నివారణ అయినప్పుడు భగవంతుడు స్వయంగా వచ్చి సహాయపడటం లేదు. కాని ఆ ఆర్తుల ప్రాణానికి భగవంతుడు బాధ నివారణ చేసిన వ్యక్తే. కానీ ఆ పశుపక్ష్యాదులూ, పసిపిల్లలూ, అడివి మనుష్యులూ ఆస్తికులని మనం ఒప్పుకోం.

మనం ఒప్పుకోని ఆస్తికత మరొకటి కూడా ఉంది మనం హిందువులం, కిరస్తానులనూ, మహమ్మదీయులనూ, పైశాచమతస్థులనూ తదితర అన్యమతస్థులనూ ఆస్తికుల కింద గణించం. "ఎవరి దేవుడు వారికున్నాడు !" అని సర్దుకుపొయ్యేవాడు మతబుద్ధి లేనివాడూ, నిజమైన నాస్తికుడూనూ.

భగవంతుడిమీద ఆధారపడి ఉన్న ఇతర ప్రాణులనూ, భగవంతుడున్నాడని నమ్మిన ఇతర మతస్థులనూ మనం నాస్తికులకింద గణించటానికి ఏమధికారముంది ? భగవంతుడున్నాడని నమ్మటం - లేక నమ్ముతున్నట్లు నటించటమూ, చెప్పుకోవటమూ - ఆస్తికత్వం కాదు. ఎందుకో ఒకందుకు భగవంతుడిమీద భారం వెయ్యటం కూడా ఆస్తికత్వం కాదు. భగవంతుడనే భావాన్ని ఎంత సద్వినియోగం చేస్తున్నామో దాన్నిబట్టి ఉంటుంది మన ఆస్తికత రోగాలు నయంచేసే భగవంతుణ్ణీ, లంచాలు పుచ్చుకునే భగవంతుణ్ణీ అంగీకరించనందువల్ల నేను నాస్తికుణ్ణి కాను.

ఏది మనవల్ల సాధ్యమో అది భగవంతుడికి వదిలిపెట్టినవాడు సోమరి లేక మూఢవిశ్వాసపరుడు. (నాస్తికుడెవరో తరువాత తేల్చుకుందాం.) మానవజాతి అజ్ఞానాన్నీ, అసమర్థతనూ, అనాగరికతనూ, అసంస్కారాన్నీ కాస్త కాస్తే తొలిగించుకుంటూ ముందుకు పోతున్న కొద్దీ జాతికి భగవంతుడిమీద ఆధారపడవలసిన ఆవశ్యకత తగ్గుతున్నది.

పూర్వం మనం దేనికైతే భగవంతుడిమీద ఆధారపడవలసి వచ్చేదో దానికి మనం యీనాటి మానవుడి మీద ఆధారపడగలుగుతున్నాం చికిత్స లేని రోగాలూ, కరువులూ వచ్చినప్పుడు ఒకప్పుడు భగవంతుణ్ణి శరణు వేడటం తప్ప గత్యంతరం లేకపోయేది పూర్వం విధిగా అనుభవించవలసిన కష్టాలకు ఈనాడు మనం పరస్పర సహాయం వల్ల ప్రతిక్రియ చెయ్యాలని ప్రయత్నం చేస్తున్నాం - కొంతవరకు మన ప్రయత్నం సఫలమవుతున్నది ఎప్పటికైనా మానవజాతి తన కష్టసుఖాలకు తనే సంపూర్ణమైన బాధ్యత వహించగలుగుతుందనీ ఆ బాధ్యతలు భగవంతుడిమీద వెయ్యవలసిన అవసరం లేనిదవుతుందనీ నమ్మటానికి ఏమీ అభ్యంతరం కనిపించదు

జాతి అటువంటి అభివృద్ధి పొందటానికి మూఢుల ఆస్తికత చాలా అంతరాయం కలిగిస్తూ ఉంటుంది అప్పుడప్పుడు మరొక విధంగా అనర్థకర్మ చెయ్యలేని దుర్మార్గులు దేవుడిపరంగా అనేక తప్పుడు పనులు చేస్తూండటం మనం కళ్ళారా చూస్తూనే వున్నాం. దుష్కర్మ రెండు విధాల జరుగుతుంది - కేవలమూ Instinct వల్లా, లోభంవల్లా. తమ పొట్టనిండటం కోసం మతాన్ని జాగ్రత్తగా పట్టుకొని వస్తున్నవాళ్ళూ మతం చాటున దాక్కుని ఆత్మతృప్తి కోసం అసహ్యకరమైనవీ, అవినీతికరమైనవీ అయిన పనులు చేస్తున్నవాళ్ళు అట్లా వుండగా మతం అండ చూసుకుని చెయ్యగూడని పనులు చేసి ఒక విధమైన తృప్తి పొందేవాళ్ళున్నారు. (అందుకు తార్కాణం - టైఫాయిడు జ్వరం వచ్చి నలభైమూడు లంకణాలు చేసి పథ్యంపెట్టిన ఒక కుర్రవాడి తాలూకు బంధువు ఎవరో చచ్చిపోతే అతని తాలూకు ఆడబంధువులు డాక్టరుకు తెలియకుండా అతని స్నానం చేయించారు.)

ఆస్తికత్వం కుళ్ళి సంఘానికీ, సంస్కారానికీ చెరుపు చెయ్యకుండా మధ్య మధ్య ఒక విధమైన నాస్తికత్వం బయలుదేరి చాలా ఉపకారం చేస్తుంది. అటువంటప్పుడది మతతుల్యం. రష్యాలో ప్రస్తుతం అమల్లో ఉన్న నాస్తికత్వం వల్ల రష్యాకు చాలా లాభం ఉందంటం నిర్వివాదాంశం అది మందువంటిది. దాన్ని ఆహారంకింద వినియోగించకుండా ఉండటమే చాలా అవసరమైన పని.

ప్రపంచ ఆర్థిక సమస్యలు ప్రపంచ నాగరికతో పరిపూర్ణత్వం ప్రసాదించిన తరువాత

జాతికి భగవంతుడితో సంపూర్ణంగా అవసరం తీరిపోతుందా అన్నది ఒక ప్రశ్న మన ఆర్థిక సమస్యలకూ, నాగరికతకూ పరిపూర్ణత్వం సిద్ధించటమంటూ ఉండదు కనుక మనకు భగవంతుడితో అవసరం ఎప్పటికీ తీరదని సమాధానం చెప్పవచ్చును కాని అది సరైన సమాధానం కాదు కష్టదశలోనే మనకు భగవంతుడి అవసరం ఉందని అనుకోనక్కర లేదు సుఖంలో కూడా మనకు భగవంతుడితో అవసరం వుంది అపరిమితమైన ఆనందంలో మన కళ్ళవెంట వచ్చే నీళ్ళూ మన హృదయాన్నించి వచ్చే కృతజ్ఞతా భగవంతుడికే నోరు మూసుకుని చేసే ప్రార్థన ప్రార్థనాకాదు, నోరు తెరుచుకుని ఏ రాతి విగ్రహం ముందో మోకరించి భగవంతుడికి తెలిపే కృతజ్ఞత కృతజ్ఞతా కాదు - మన కృతజ్ఞతనూ, సుఖాన్నీ భగవంతుడిపరం చెయ్యటం ఆస్తికత్వమైతే ఆస్తికులమని చెప్పుకునే మనలో చాలామంది పసిపిల్లలూ, పశుపక్ష్యాదులు ఎంత ఆస్తికులో అంతకంటే ఆస్తికులు కారు అంటే మానవుడు సాటి మానవుడికి కృతజ్ఞుడుగా వుండరాదని కాదు కాని సాటి మానవుడికి సంబంధం లేకుండా మానవుడు పొందగల సంతృప్తి చాలా ఉంది ఒక చక్కని ప్రకృతి దృశ్యం చూసి ఆనందించే మానవుడు ప్రకృతికి కృతజ్ఞుడు కావటం హాస్యాస్పదంగా ఉంటుంది ప్రకృతి మానవుడి ఆనందాన్ని గాని కృతజ్ఞతను గాని అర్థం చేసుకోలేదు ఆ పనులు నిర్వర్తించే భగవంతుడనేది లేకపోతే మానవుడు అర్థం లేని జీవి అవుతాడు.

అదీకాక ఏ సామ్యవాదము నివారించలేని ఇక్కట్లు మానవజాతికి చాలా ఉన్నై. వాటిని లెక్కలోకి తీసుకొనేటట్లయితే మానవుడు ఏ శాశ్వత నిర్మాణమూ చెయ్యలేడు, ఏ సంస్థా నెలకొల్పలేడు రష్యావారు చేస్తున్న ప్రయత్నమంతా సఫలమైన మర్నాడు పెద్ద ప్రళయం వచ్చి రష్యాదేశం యావత్తూ భూగర్భంలోకి వెళ్ళిపోవచ్చును. అట్లా జరగకుండా ఉండగలందులకు రష్యావారు ప్రకృతిని ప్రార్థించి ఏమీ ప్రయోజనం లేదు ప్రకృతి కొన్ని నియమాలను అనుసరించి ప్రవర్తించే యంత్రము వంటిది ఒకరు సదుద్దేశంతో కొంత కర్మ చేస్తున్నప్పుడు దాని ఫలితం జాతికి చెందేటట్టు చేసే బాధ్యత అన్ని అపాయాలకూ అతీతమైన ఒక శక్తికి వదలి వెయ్యవలసిందే అంతదాకా ఎందుకు ? స్వార్థం ఎవరినో వంచన చేసేటప్పుడు కూడా తను తన దుష్కార్య ఫలితం అనుభవించ టానికి వీలు ఎవరో ఇస్తారని నమ్మే చేయాలి సామాన్య మానవుడు తనకు ఈ అవకాశం ఇవ్వడు ఇక తనకు భగవంతుడే శరణ్యం

సత్కార్యాలు విఫలమైనా దుష్కార్యాలు ఫలించినా కూడా మనకు భగవంతుడియందు విశ్వాసం ఉంచక తప్పేదిలేదని తెలుసుకోవాలి. ఈ భౌతిక విషయాలే కాక మనకు ఆధ్యాత్మికమైన విచారణ కూడా ఒకటి వుంది దట్టమైన తెరలోనించి అస్పష్టంగా కనిపించే దృశ్యం మాదిరిగా మనకు పరం అప్పుడప్పుడూ దృగ్గోచర మవుతూంది చచ్చిపోయినవాళ్ళు చచ్చిపోయినట్లుండరు కలల ద్వారానో, దయ్యాల రూపంగానో, మరెట్లాగో చచ్చిపోయినవారు తిరిగి మనను చేరుతూ వుంటారు ఇటువంటివాటిని గురించి ఎంత శాస్త్రీయమైన చర్చ జరిగినా ఇవి లేకుండాపోవు. అప్పుడప్పుడూ సర్ విలియం క్రూక్స్, సర్ ఆలివర్ లాడ్జ్‌వంటి శాస్త్రజ్ఞులు మృతజీవులను గురించి శోధన ప్రారంభించి లోకాన్నంతా కలవరపరుస్తారు

చావు తరువాత ఏమున్నది ? ఈ లోకంలో ఈ సృష్టిలో ఏ మాత్రమూ అన్యాయం జరగకుండా చూడటం ఎవరివల్ల నవుతుంది ? మానవుడివల్ల కాదు మానవుడు ఒక్క ఇహంలోనే న్యాయం జరిగించలేడు. ఇక పరమంటూ కూడా ఒకటి ఉంటే ? ఎవడైనా దుర్మార్గుడు తన దుర్మార్గం లోకానికి కనపడకుండా దాచగలిగితే వాడు సన్మార్గితో సమానమైన హోదా అనుభవించ గలడు ఇహంలో పరం ఉండి, అక్కడికి ఈ యిద్దరూ వెడితే వీరిద్దరికీ సమానమైన హోదా రాకుండా చూసేవాడెవడన్నా లేకపోతే ఎలా ? పరం లేదనుకున్నా, ఇహంలో న్యాయం జరిగేటట్టు

చెయ్యటం మానవుడికి చాతనవుననుకున్నా పై ప్రవర్తన ఒకటిగా ఉన్నంతకాలమూ ఒక ఉదార స్వభావుడూ, ఒక నీచ స్వభావుడూ ఇక్కడ సమానమైన న్యాయం పొందుతారు. వారి స్వభావంలోని తేడా గ్రహించేటందుకు ఏ భగవంతుడూ లేకపోతే ఇహంలో మాత్రం న్యాయం జరిగేది యెట్లా ? నీచుడు నీచుడుకావటమే శిక్ష, సత్పురుషుడు సత్పురుషుడు కావటమే బహుమానం అంటారా - నీచులుగా వుండటానికి ఏ మాత్రమూ అభ్యంతరంలేని నీచుల మాట ఏమిటి ? ........

సృష్టిలో ఏదో ఒక విధమైన న్యాయం లేదని అనుకున్నట్టయితే ఈ సృష్టిలో భాగమైన మనం న్యాయం ఆధారం చేసుకొని వ్యాపారం చెయ్యలేము. తుఫాను రేగుతున్న సముద్రంమీద తేలుతున్న వ్యక్తి నిశ్చలంగా ఉండి మాత్రమే జరుపదగిన వ్యాపారానికి ఎట్లా పూనుకుంటాడో నాకర్థం కాదు గతించిన లజపతిరాయిలాంటి ప్రముఖుడి మోస్తరుగా "భగవంతుడు లేడు. ఈ లోకంలో న్యాయం లేదు" అన్నవాళ్ళు ఎవళ్ళూ అన్యాయంగా ప్రవర్తించి ఎరుగరు

సృష్టిలో న్యాయం ఉన్నదనేమాట నిర్వివాదాంశము సృష్టిలో ఉన్న న్యాయం నియమాల రూపంగా మనకు గోచరిస్తున్నది. మంచు కాలదు, అగ్ని చల్లగా వుండదు మానవుడు ఏర్పరిచే న్యాయం ప్రకృతి న్యాయానికి విరుద్ధంగా ఉన్నప్పుడు మానవుడి న్యాయం దెబ్బ తింటుంది. మానవ న్యాయం మానవుణ్ణి శరీర సౌఖ్యానికి దూరం చేస్తే జాతి అంతరించటానికి ఎంతో కాలం పట్టదు - ఈ లోపల మొగవాళ్ళకూ ఆడవాళ్ళకూ పిచ్చలూ వెర్రులూ ఎత్తటం మాట అట్లా ఉంచి.

ఒక కులంయొక్క సౌభాగ్యాన్నో, ఒక దేశంయొక్క సౌభాగ్యాన్నో, ఒక జాతియొక్క సౌభాగ్యాన్నో ఉద్దేశించి యేర్పాటు చేసే మానవ న్యాయాన్ని భగవంతుడు ఆమోదిస్తాడనుకోటం వట్టి భ్రమ. మానవజాతి యావత్తూ ఒకటై పశుపక్ష్యాదులకూ చెట్లచేమలకూ అన్యాయం తలపెట్టినా భగవంతుడు ఆమోదిస్తాడనుకోను. మనకు యే మృగాలవల్ల చెట్లచామల వల్లా అపకారం వుందో వాటిని నమూలంగా నిర్మూలం చెయ్యటమే న్యాయం కావచ్చును. అటువంటి న్యాయసూక్ష్మత నిర్ణయించటానికి నేను చాలను కాని అది తెలిసిన భగవంతుడొకడున్నాడనీ, మన న్యాయచట్టం మనం సరి చేసుకొనేవరకూ, మనకు ఆ భగవంతుడి వల్ల అన్యాయం జరుగుతూనే ఉంటుందని నేను గట్టిగా నమ్ముతున్నాను. మనం ఏవో చట్టాలు పెట్టుకుని, అవి న్యాయచట్టాలని మనం చెప్పాము గనక భగవంతుడు విశ్వసించుతాడని అనుకోవటం వట్టి భ్రమ

*(వీణ, మాసపత్రిక, జనవరి 1938)*

# 6. సత్యస్వరూపం

అందరికీ సత్యం కావాలి. దానితో ప్రతి ప్రాణికీ ప్రయోజనం ఉంది అప్రయత్నంగానో ప్రయత్నపూర్వకంగానో ప్రతిజీవీ సత్యాన్వేషణ చేస్తున్నది సత్యం చలనం లేనిది, మార్పు చెందనిది క్షణక్షణమూ మార్పుచెందే ఈ ప్రపంచంలో మనం ఆధారపడ దగినది సత్యమే. అదే చలించినట్టయితే మనకు విశ్వాసాలుండటం అసంభవం మనకు జ్ఞానాన్వేషణ అసాధ్యం.

మన దృష్టిలో కొందరు సత్యాన్ని ఎదుర్కోలేనివాళ్ళుగానూ సత్యం అవసరం లేనివాళ్లగానూ కనిపించటం కద్దు. అంతమాత్రానికే వారికి సత్యంతో ప్రయోజనం లేదనీ వారికి విశ్వాసాలు లేవనీ భావించటం పొరపాటు ఒకరు త్యాగంలో నమ్మకం గలవారు కావచ్చును. మరొకరికి స్వార్థంలో విశ్వాసం ఉండవచ్చును. ఇద్దరూ చెరొక సత్యాన్నీ నమ్ముతున్నారు అట్లా చెయ్యటం వల్ల ఇద్దరికీ రెండు రకాల ప్రయోజనం ఉంటున్నది "సత్యం ఇంత విరుద్ధంగా ఉంటుందా ? ఇన్ని రకాల సత్యాలున్నాయా ?" అన్న ప్రశ్నలకి ముందు ముందు సమాధానం స్పష్టంగా చెబుతాను. ప్రస్తుతానికి మటుకు సత్యం ఒకటేనని నమ్మేవారు ఒకే సత్యాన్ని అనేక వైపుల నించి చూడటానికి ఆరాధించటానికీ అవకాశం ఉందని సమాధానపడవచ్చును.

ఏవో కొన్ని విశ్వాసాలు లేకుండా జీవించటం ఎవరి తరమూ కాదు. కాని మనం విశ్వసించేవి అసత్యాలయినప్పటికీ సగం సత్యాలయినప్పటికీ మనకు పని గడిచిపోతున్నది. కనుకనే నిన్న ఏ విశ్వాసం కోసం కొందరు ఆత్మార్పణ చేసుకున్నారో ఈనాడు దానికి విరుద్ధమైన విశ్వాసం కోసం మరికొందరు ఆత్మార్పణ చేసుకుంటున్నారు. పరస్పర వైరుధ్యంగల మతాలను అవలంబించి మానవులు ఒకే విధమైన ఆధ్యాత్మిక సంతుష్టి పొందగలుగుతున్నారు. దీన్నిబట్టి చూస్తే మనకు సత్యం కంటె కూడా సత్యమందు మనకు గల విశ్వాసంతోనే విశేషంగా ప్రయోజనం ఉన్నట్టు కనిపిస్తుంది.

ఇంతేకాక ఒక సత్యమందు మనకు గల విశ్వాసం వల్ల మనకెంత ప్రయోజనం ఉందో దాన్నిబట్టే ఆ సత్యమందు మనకుండే విశ్వాసం యొక్క గాఢత్వం కూడా నిర్ణయమవుతున్నట్టు కనిపిస్తుంది. భగవంతుడున్నాడని నమ్మినవాడికీ లేనివాడికీ జీవితం ఇంచుమించు ఒకేవిధంగా వెళ్ళిపోవచ్చును కాని ఎక్కాల పుస్తకం అబద్ధమని అనుమానించినవాడికీ, నిజమని నమ్మినవాడికీ జీవితం ఒక విధంగా వెళ్ళటం అసంభవం అందుకనే మనలో ఎవరం కూడా ఎక్కాల పుస్తకంలో ఉండే విశ్వాసం భగవంతుడిలో ఉంచలేం ఎక్కాల పుస్తకంలో కంటే భగవంతుడి యందు ఎక్కువ విశ్వాసం ఉన్నట్టు ఎవరైనా నటించినట్టయితే వాడు మూఢులో వంచకులో అయి ఉండాలి. అటువంటివారి ప్రవర్తనను జాగ్రత్తగా పరిశీలించినట్టయితే వారికి భగవంతుడియందున్న విశ్వాసంలో ఎక్కువ విశ్వాసం లేదని బయటపడటమే కాకుండా ఏ దుకాణదారైనా వారికి తక్కువ చిల్లర ఇచ్చినట్టయితే ఎక్కాలయందు వారికున్న విశ్వాసంలో ఎంత విశ్వాసముండేదీ బయటపడి తీరుతుంది ఒక అభిప్రాయం సత్యం కాకపోయినప్పటికీ అది మనదృష్టికి సత్యంగా కనిపించినంత కాలమూ అది సత్యమని మనం విశ్వసించదగినంత కాలమూ మనం దాన్ని ఆధారం చేసుకోగలమని పైన తెలుసుకున్నాం కాని మన అభిప్రాయాలు స్థిరంగా ఉండటం లేదు. అవి పరివర్తన చెందుతూ ఉండటమూ, సంస్కారం పొందుతూ ఉండటమూ, అంతరించిపోతూ ఉండటమూ మనం చూస్తూనే ఉన్నాం మన విశ్వాసాలు ఇట్లా మార్పు చెందకపోయినట్టయితే మన సంస్కారమూ, నాగరికతా నిలిచిపొయ్యేటందుకవకాశం ఉంది. కొంతకాలం క్రితం సంపూర్ణమైన సత్యాలుగా భావించబడి ఈనాడు అసత్యాలుగా పరిణమించిన కొన్ని అభిప్రాయాలు తీసుకుని

అవి శాశ్వత సత్యాలుగా గణించబడితే జీవితం ఎట్లా అధోగతికి పొయ్యేదో మనం కొంతవరకు ఊహించవచ్చును సహగమనాచారంలో మన పూర్వుల కుండిన విశ్వాసం ఈ విధమైన విశ్వాసాలలో ఒకటి మనం సహగమనాన్ని ఏ దృష్టితో చూస్తున్నామో మన ముందువాళ్ళు అస్పృశ్యతనూ, విడాకులు లేని వివాహాలనూ ఆ దృష్టితోనే చూస్తారని భావించవలసి ఉంది దీన్నిబట్టి మనం నేర్చుకోదగినదేమంటే మనం ఏ విశ్వాసాల వల్ల ప్రస్తుతం కొంత ప్రయోజనాన్ని సాధిస్తున్నామో అవి సంపూర్ణమైన సత్యాలని భావించుతూ కూడా వాటిని ప్రళయపర్యంతమూ అందరూ సంపూర్ణమైన సత్యాల క్రింద పరిగణించాలనే భ్రమకు లోబడకుండా ఉండటం

బొత్తిగా సంస్కారం అవసరం లేని శాశ్వత సత్యాలు కూడా ఉన్నవని నేను గుర్తిస్తాను. ఎక్కాలు ఆ జాతివే కాని వాటిని గురించి ఉద్రేకం తెచ్చుకోవాలని ఎవరికీ తట్టదు దురదృష్టవశాత్తూ కాలవశాన మార్పు చెందేవి, చెందవలసినవీ అయిన సత్యాలను సమర్థించటానికే మనం ఉద్రేకం తెచ్చుకుంటాం

సత్యాన్వేషణపరుడికి పరమ విరోధి ఈ ఉద్రేకమే ఉద్రేకం మెదడును చంపేస్తుంది. తను సమర్థించే సత్యం యొక్క బలాన్ని హరిస్తుంది లేదా తను అన్వేషించే సత్యాన్ని దూరం చేసుకుంటుంది. సత్యాన్వేషణ పరుడికి ఉద్రేకమే కాక మంచీ చెడూ విచక్షణ కూడా లేదు. విజ్ఞానంతో కూడుకున్నవి శాస్త్రగ్రంథాలు వాటిలో మంచీ, చెడూ అనే రెండు మాటలకూ ఎక్కడా అవకాశం ఉండదని నేను వేరే చెప్పనక్కర్లేదు. మంచి చెడ్డలు ఆదిలో ఉండినవి కావు. అంతంలో ఉండబోయేవీ కావు. మధ్యలో మన వీలుకోసం మానవులం కల్పించుకున్నవే

ఉద్రేకాన్నీ, ద్వంద్వాన్నీ విసర్జించినవాడే మన విశ్వాసాలను సంస్కరించగలడు (ఎవరూ సంస్కరించకుండానూ మార్చకుండానూ మన విశ్వాసాలు వాటి కవి మారవు.) వాడు శాస్త్రీయమైన దృష్టికలవాడు.

శాస్త్రీయమైన దృష్టి ఏ సంఘంలో తక్కువగా ఉంటుందో ఆ సంఘం తప్పనిసరిగా వెనకబడి ఉంటుంది అందుకు కారణాలు క్లుప్తంగా వివరిస్తాను

శాస్త్రీయమైన దృష్టి కలవాడి బుద్ధి అనుక్షణమూ "ఏమిటి ? ఎందుకు ?" అని పృచ్ఛిస్తూ ఉంటుంది అటువంటి జిజ్ఞాసలేనిదే సత్యం బయటికి రాదు. శాస్త్రీయమైన దృష్టికీ, జిజ్ఞాసకూ ఆదరణలేని మన సంఘంలో విజ్ఞాన వ్యాప్తీ, దాన్ని అనుసరించి విశ్వాసాలు సంస్కారం కావటమూ జరగదు. అనేక శతాబ్దాల పాటు విశ్వాసాలు చెక్కు చెదరకుండా ఉండటమే కాక వాటిని సమర్థించేవారు వాటి విషయమై చాలా ఉద్రేకాన్ని ప్రకటిస్తారు. మనకు అనాదిగా వస్తున్న సత్యాలు శాశ్వత సత్యాలే అనుకుందాం, అవి చలనంలేని సత్యాలని నిరూపించటానికి సహాయపడేది ఉద్రేకం కాదు - విజ్ఞానమూ, శాస్త్రీయమైన దృష్టీనీ. సంప్రదాయంగా వస్తూ విజ్ఞానం చేత సంస్కారం పొందని అభిప్రాయాలు మనం చాలా అమలులో ఉంచాం. చిన్నతనంలోనే భర్తపోయిన పిల్ల యావజ్జీవమూ ఏకాంత జీవనం చెయ్యగలదనీ, అట్లా చెయ్యటం ఎట్లాగో ఆ పిల్లకూ తత్సంబంధీకులకూ చాలా మంచిదనీ మనం విశ్వసిస్తున్నాం. మనిషికీ, మనిషికీ పుట్టుకలోనే కులం వల్ల ఒక తారతమ్యం ఏర్పడుతున్నదనీ, అది అలవాట్లవల్లా, పెంపకంవల్లా పోదనీ మనం విశ్వసిస్తున్నాం. ఇటువంటి విశ్వాసాలు అసంఖ్యాకంగా ఉన్నై వాటి యధార్థం గురించి ఒకనాడు మానవులకు ఎటువంటి సంశయమూ ఉండి ఉండక పోవచ్చును కాని ఈనాడు ఆ యధార్థాన్ని కొంతవరకైనా పరీక్షించేటందుకు తగిన విజ్ఞానం ప్రపంచం మీద ప్రబలి ఉంది శాస్త్రీయమైన దృష్టిలేని కారణం చేత మనం అసత్యాలని సులభంగా నిరూపణ అయ్యేవాటిని విశ్వసించటం జరుగుతున్నది.

మూఢ విశ్వాసాలకు కూడా శాస్త్రీయమైన దృష్టి లేకపోవుటయే కారణం. నిజానికి విశ్వాసాలన్నీ ఒక జాతివే. ఏ విశ్వాసాన్నీ సొంతంగా నిరూపణ చేసి న్యాయం (Logic) చేత నిర్ధారణ చెయ్యలేం అందుకని ఎంత మూర్ఖుడు కూడా ప్రతి అభిప్రాయాన్నీ విశ్వసించడు. మన విశ్వాసాల వల్ల ఏదో ప్రయోజనం మనకుండాలి మన విశ్వాసాల వల్ల మనకు ప్రయోజనము లేకపోగా పైపెచ్చు నష్టం ఉన్నప్పుడు కూడా వాటిని మనం పట్టుకు వేళ్ళాడుతుంటే మన విశ్వాసాలు మూఢ విశ్వాసాలవుతై నిజానికి ఎవరి విశ్వాసం వల్ల ఎవరికేవిధమైన లాభం కలుగుతున్నదో మరొకరు కనుక్కోవటం చాలా కష్టం ఎవరి మూఢ విశ్వాసాలను వారు కనుక్కోవాలి. దానికి శాస్త్రీయమైన దృష్టీ విజ్ఞానమూ అత్యవసరం.

ఒకటి మాత్రం ఒప్పుకోవాలి. విజ్ఞానమూ, శాస్త్రీయమైన దృష్టీ అభివృద్ధి అయిన కొద్దీ విశ్వాసాలయందు గాఢమైన అభిమానం తగ్గుతుంది. కాని ఇట్లా జరగటం తప్పుకాదు. అటువంటి పరిస్థితి కలిగినప్పుడే మనకు మన విశ్వాసాల వల్ల అధికమైన ప్రయోజనమూ అల్పమైన అపకారమూ జరిగేది

శాస్త్రీయమైన దృష్టి అలవడటం వల్ల మనకు కలిగే మరొక లాభం ఏమంటే మనకు విశ్వసించగలదాన్ని గురించి ఎంత బాగా తెలిసి ఉంటుందో విశ్వసించరానిదాన్ని గురించి కూడా అంత బాగా తెలిసి ఉంటుంది. ప్రస్తుతం మన సంఘంలో మన విశ్వాసాలనే మనం సరిగా అర్థం చేసుకోం. మన విశ్వాసాలకు విరుద్ధంగా ఉన్న విశ్వాసాలను ఎట్లా అర్థం చేసుకోగలం ? భగవంతుడి యందు విశ్వాసం ఉంచగలిగినవాడు తన విశ్వాసాన్ని కొంతవరకు సమర్థించగలగటమే కాక నాస్తికుడి వాదనను సొంతం అర్థం చేసుకుని దానిలో లోపాలు కూడా చూపించగలిగి ఉండటం శాస్త్రసమ్మతమైన పని. కాని మనం మన విశ్వాసాలను ఉద్రేకంతో సమర్థించినంతకాలమూ మనకు విరుద్ధంగా ఉన్న విశ్వాసాలను గురించీ, వాటివల్ల మనకు ఉండదగిన ప్రయోజనం గురించీ నిష్పాక్షికంగా ఆలోచించలేం. ఇటువంట ప్పుడు మనకు రెండు విధాల హాని కలుగుతూ ఉండవచ్చును. మన విశ్వాసాలు మనకు అపకారం చేస్తూ ఉండవచ్చును. మనం ఆమోదించలేని విశ్వాసాల వల్ల మనకు కలగదగిన ప్రయోజనం దూరం అవుతూ ఉండవచ్చును. ప్రస్తుతంలో మనకీ రెండు విధాలా హాని జరుగుతూ ఉండటం నిర్వివాదాంశం.

ఇక విశ్వాసాల సంగతి కట్టిపెట్టి సత్యం సంగతిని విచారించుదాం. ఆ రెంటికీ ఉన్న సంబంధం అందరికీ సులభంగా అర్థమయ్యేదే. మనం ఏ విషయాన్ని కానివ్వండి యథార్థమని నమ్మకుండా విశ్వసించలేం. దేన్నీ విశ్వసించలేని పరమ నాస్తికుడు కూడా తన కళ్ళనూ, చెవులనూ నమ్మకుండా ఉండలేడు. మన కళ్ళూ చెవులూ ఏ విధంగా మనని వంచిస్తాయో తెలుసుకోగలిగిన శాస్త్రజ్ఞుడు ఆ వంచనను గురించి సత్యం తెలుసుకుని తన జ్ఞానాన్ని ఎలా అభివృద్ధి చేసుకుంటున్నాడో, ఏ శాస్త్రజ్ఞుడైనా తన జ్ఞానేంద్రియాలను నమ్మకపోవటానికి తోడు అవి చేసే వంచన యొక్క విధానాన్ని కూడా నమ్మలేక పోయినాడో అతనికి జ్ఞానం అసంభవం.

ఈ సత్యం యొక్క స్వరూపం ఏది ? ఇది మనకు ఎప్పుడూ అందుబాటులోనే ఉన్నట్టుంటుంది ఎప్పుడూ అందదు పైగా సత్యం అనేక స్వరూపాలలో ఉన్నట్టు కనిపిస్తుంది. ఒక ప్రయోజనం సాధించటానికి మనం సత్యం కింద స్వీకరించేది మరొక ప్రయోజనం సాధించటానికి వట్టి అబద్ధంగా కనిపిస్తుంది ప్రాణులంతా ఒకటేనని నమ్మవలసిన ఆవశ్యకత ఉన్నట్టే, ఏ ఇద్దరు ప్రాణులూ ఒకటి కాదని గుర్తించవలసిన ఆవశ్యకత కూడా ఉంది

సత్యాలలో తారతమ్యం ఉందని జ్ఞానాన్వేషణ చేసేవారికి సులభంగా తెలుస్తుంది వెలురుతు సమ రేఖలలో ప్రసరిస్తుందనేది ఒక సత్యం దాన్ని అనేక విధాల రుజువు చెయ్యవచ్చును

అద్దంలో చూసి పాపడ తీసుకునే ప్రతి ఆడదీ ఆ విషయం రుజువు చేస్తూనే ఉంది కాని విజ్ఞానానికి పైన చెప్పినది స్థూలంగానే సత్యం వెలుతురు సమరేఖల్లోనే పోదనీ, అది కూడా పక్కదార్లు తొక్కుతుందనీ శాస్త్రజ్ఞుడు రుజువు చెయ్యగలడు ఇంకా సూక్ష్మంగా వెళ్ళినకొద్దీ వెలుతురు యొక్క ప్రసారాన్ని గురించిన సత్యం సామాన్య మానవులకు దుర్గ్రాహ్యమైపోతుంది

ఈ విధంగా సూక్ష్మంగా పోగా పోగా పరిపూర్ణమైన అసలు సత్యం మానవుడికి గ్రాహ్యమవుతుందా ? ఆ ఆదర్శస్థితిలో వివిధ సత్యాలకు ఏకత్వం సిద్ధించుతుందా ? ఈ ప్రశ్నలకు వేదాంతులు అదివరకే ఏదో విధంగా సమాధానం చెప్పి ఉంటారు కేవలమూ, వేదాంత దృష్టిలో కాక భౌతికశాస్త్ర దృష్టిలో ఈ ప్రశ్నలకు ఏ సమాధానం లభిస్తుందో చూద్దాం

భగవంతుడు మానవుడికి అనేక రకాల మానసిక శక్తులు ప్రసాదించాడు. అందులో న్యాయశక్తి ఒకటి జ్ఞానం ఆధారం చేసుకుని సిద్ధాంతం చెయ్యగల శక్తి న్యాయశక్తి జ్ఞానం పంచేంద్రియాల ద్వారా సంపాదించినది. పంచ జ్ఞానేంద్రియాల సహాయం లేకుండానే సత్యాన్ని చూడగల అసామాన్య శక్తి కొందరు మహాత్ములకున్నదని మరికొందరు నమ్మగలుగుచున్నారు ఉండవచ్చును. కాని ఆ మహాత్ముల జ్ఞానం వారికే తప్ప ఇతరులకు వినియోగపడటం అసంభవం వారు కనిపెట్టిన సత్యాన్ని ఇతరులు అర్థం చేసుకోగలగటం కాని, ఆ సత్యమందు నిజమైన విశ్వాసం ఉంచగలగటం కాని ఇతరులకు అసాధ్యం. అటువంటి మహాత్ములు కూడా చాలా సకృతుగా ఉన్నారని భావించాలి. వారిని తప్పించి తదితరులు సత్యాన్ని అవగాహన చేసుకోవటానికి న్యాయశక్తి (logical faculty) తప్ప మరొకటి లేదు జన్మతహా మూఢులైన కొందరు (congenital imbeciles) న్యాయశక్తిని కూడా వినియోగపరచలేని మాట వాస్తవమే కాని వారి సంఖ్య జాస్తిగా ఉండదు పాశ్చాత్య దేశాలలో ఇటువంటి మూఢులు రెండు వందల మందికి ఒకరు చొప్పున ఉన్నారని వింటున్నాము మన దేశంలో అంతకంటే కొంచెం ఎక్కువగా ఉన్నట్టు కనిపిస్తారు అయినప్పటికీ జన బాహుళ్యానికి విశ్వాసాలు కల్పించేదీ, సత్యస్వరూపం ప్రకటించేదీ న్యాయశక్తే

న్యాయశక్తి సంపూర్ణంగా మన జ్ఞానేంద్రియాల మీద ఆధారపడి ఉందనుకున్నాం పంచేంద్రియాల ద్వారా మనం అనేక విషయాలు గమనించగలం. వాటి అనుభవం మీద అనేక విషయాలు ఊహించగలం కొన్ని కొన్ని విషయాలకు గల అవినాభావ సంబంధం గమనించి సిద్ధాంతాలు కూడా చెయ్యగలం నీటిని నిప్పుమీద పెడితే అది వేడెక్కుతుంది. దాని పరిమాణం జాస్తి అవుతుంది. ఆఖరుకు అది ఆవిరి అవుతుంది వేడికి వస్తువుల పరిమాణం జాస్తి కావడమేకాక ఆ జాస్తి కారణం ఎప్పుడూ ఒకే విధంగా ఉష్ణస్థితిని బట్టి ఉంటుందని గమనించి, వస్తువుల వేడిని కొలవటానికి మనం ఉష్ణమానమనే సాధనాన్ని చేసుకోగలిగాం. దాని సహాయం వల్ల నీరు ఆవిరి కావటం ఎప్పుడూ ఒకే ఉష్ణస్థితిలో జరుగుతుందని గమనించి నూరు డిగ్రీలు (సెంటిగ్రేడ్) దాటితే నీరు ఆవిరి రూపంలోనే ఉంటుందని సిద్ధాంతం చేశాం కాని సూక్ష్మంగా గమనిస్తే నీరు ఆవిరి కావటం ఎప్పుడూ సరిగా నూరు డిగ్రీలకే కాదని గమనించగలిగాం ఈ తభావతుకూ, గాలి వత్తిడికీ, నీటిలో కరిగి ఉన్న పదార్థాలకూ సంబంధం ఉందని గ్రహించగలిగాం

మన జ్ఞానాన్వేషణ ఎంత దూరం పోయినా పై పద్ధతినే పోతూ ఉంది ఎంత దూరం పోయినా మనం పంచేంద్రియాలూ వాటిని శాసించే బుద్ధీ - వీటికి అతీతంగా వెళ్ళం, వెళ్ళలేం. వెళ్ళితే మనం న్యాయాన్ని అతిక్రమించి వెళ్ళినవాళ్ళ మవుతాం ఈ విధంగా మనం చెయ్యగల సిద్ధాంతాలను, ఆర్జించిన సత్యాలను, నిరూపించటం కూడా ఇంద్రియాల ద్వారానే.

ఇంద్రియాలను ఎంత మాత్రమూ నమ్మరాదనే సంగతి తెలుసుకోవటానికి వేదాంతి

కానవసరం లేదు  రోజూ మనం ఇంద్రియాల వంచననే కాక దాన్నించి తప్పించుకోవటం కూడా తెలుసుకుంటున్నాం  కంటిని తీసుకున్నట్లయితే దూరాన ఉన్న వస్తువును కన్ను చిన్నది చేసి చూపిస్తుంది  కాని దూరాన ఉన్న వస్తువులు చిన్నవని మనం భ్రమపడం  ఆకుపచ్చ అద్దాలు పెట్టుకుని నీలాకాశం చూస్తే ఆకుపచ్చరంగుగా కనిపిస్తుంది  పచ్చగా గాని, నీలంగాగాని కనిపించదు అట్లాగే చెవులు కూడా వంచించుతాయి  మనను సమీపిస్తున్న రైలు ఇంజను కూత యొక్క శ్రుతి హెచ్చుతున్నట్టు వినిపిస్తుంది ఒకటే శ్రుతిలో ఉన్నప్పటికీ. ఆ విధంగానే మన చర్మానికి కొన్ని వస్తువులు చల్లగానూ మరికొన్ని వేడిగానూ తగులుతాయి. ఏవి చల్లని వస్తువులో ఏవి వేడి వస్తువులో నిర్ణయించడానికి శాస్త్రీయమైన పద్ధతి ఏమీ లేదు  ప్రతి వస్తువులోనూ కొంత వేడి ఉంది. మన చర్మం ఇతర వస్తువుల నుంచి వేడి గ్రహించుతున్నప్పుడు ఆ వస్తువులలో వేడి ఉన్నదనీ, ఇతర వస్తువులకు వేడి నిస్తున్నపుడు అవి చల్లగా ఉన్నవనీ భ్రమపడుతుంది

మనకు ద్వంద్వాలన్నీ ఇంద్రియాల ద్వరానే కలుగుతున్నవనటానికి మన స్పర్శజ్ఞానమే తార్కాణం. ప్రకృతిలో చీకటీ, వెలుతురూ అంటూ లేదు  శక్తి ప్రసారం మాత్రమే ఉంది  ఆ ప్రసారంలో కొంతభాగం మాత్రమే కన్ను స్వీకరించగలదు  దాన్నే మనం వెలుతురు కింద గుర్తించి మిగతా ప్రసారాన్ని చీకటిగా గణించుతున్నాం. మనం కన్ను పొడుచుకున్నా కనిపించని చీకట్లో కొన్ని జీవరాశులు సులభంగా చూడగలవనేది నిర్వివాదాంశం  మనం హాయిగా చూడగల వెలుతురులో చూడలేని జీవులు కూడా ఉన్నాయి. మనం చూడలేని శక్తి ప్రసారాన్ని ఫోటోగ్రాఫిక్ ప్లేటు రికార్డు చెయ్యగలదు  మనం వినలేనంత హెచ్చు శ్రుతి శబ్దాలను కుక్కలు వినగలవని చెబుతారు.

ఇదంతా తెలుసుకుంటే మన ఇంద్రియాలు ఏమంత ఆదర్శప్రాయంగా పనిచెయ్యటం లేదని తెలుతుంది. మాటవరసకు మనకు ఆదర్శప్రాయంగా పనిచేసే ఇంద్రియాలే ఉన్నవనుకుంటే మనం పరమసత్యాన్ని గ్రహించగలుగుతామేమో ఆలోచించటం ఇక్కడ అప్రస్తుతం కాదు

ఆదర్శప్రాయంగా పనిచేసే కంటిని తీసుకుందాం  వెలుతురు యొక్క ప్రకృతి తెలియకుండా ఆదర్శప్రాయంగా పనిచేసే కంటిని నిర్వచించటం అసంభవం  వెలుతురును గురించిన విజ్ఞానం యావత్తూ ఇక్కడ వెదజల్లలేను  కనుక ఆదర్శప్రాయమైన కంటి యొక్క పాట్లు రెండు రకాలుగా ఇక్కడ చెబుతాను  అన్నిరకాల శక్తి ప్రసారాన్నీ హెచ్చుతగ్గులు లేకుండా సమంగా చూడగల కంటికి ఏ వస్తువూ కనిపించటానికి అవకాశం లేదు  ఒకటే రంగు గల వస్తువునుమనం చూడగలుగుతున్నామంటే దానికి ఆ వస్తువు తాలూకు వెలుతురే కాక నీడ కూడా సహాయ భూతమవుతున్నది  అనేక రంగులతో కూడుకున్న దృశ్యాన్ని చూసేటప్పుడు వెలుతురు నీడలే కాక రంగులు కూడా మనకు ఆధారభూతమవుతున్నాయి  ఆదర్శప్రాయమైన కన్ను వెలుతురు నీడలకూ రంగు రంగుకూ తేడా కనిపెట్టగూడదు  ఆ స్థితిలో దానికి చూసే శక్తే ఉండదు  మన ఆదర్శప్రాయమైన కంటికీ, గుడ్డి కంటికీ ఏ వ్యత్యాసమూ లేదు  ఆదర్శప్రాయమైన చూపును మరొక విధంగా చిత్రించవచ్చును  కన్ను రంగులను చూడగలగటం కూడా స్థూలంగా చూడటమే అవుతుంది  ఆదర్శప్రాయమైన కన్ను కాంతి ప్రసారం యొక్క పరమాణువులను (quanta) చూడాలి  ఆ పరమాణువులకు మనం గుర్తించే కాంతికుండే భౌతిక విలక్షణాలేవీ ఉండవు కాంతి సహాయం వల్ల మనం చూసే వస్తువుల తాలూకు పరమాణువులైనా అంతే

కొందరు శాస్త్రజ్ఞులు Law of Emergence అనేదాన్ని గుర్తిస్తున్నారు  దాని ప్రకారం అణువులకు లేని లక్షణాలు అణు సముదాయాలకు ఆపాదించుతాయి  ఇందులో అబద్ధం ఏమీ లేదు  నీటి యొక్క గుణాలేవీ నీటి అణువులకు ఉండవు  నీటి అణువు '0' డిగ్రీల వేడికి

ఘనీభవించదు. 100 డిగ్రీల వేడికి ఆవిరిగా మారదు. అటువంటి లక్షణాలన్నీ నీటి అణువుల సముదాయానికి మాత్రమే వర్తించుతాయి. ఆ విధంగానే, బొగ్గు యొక్క అణువులు నల్లగా ఉంటాయని గాని, మైలతుత్తపు అణువులు నీలంగా ఉంటాయని గాని అనుకోవటం తప్పు అవుతుంది.

మన మేధస్సు కూడా Law of Emergence కు లోబడి పనిచేస్తున్నదే. మనం న్యాయశక్తి అన్నా, జ్ఞాపకశక్తి అన్నా, భావనాశక్తి అన్నా అవి మెదడు తాలూకు వివిధ భాగాల్లో ఉండే జీవకణాల సముదాయం యొక్క ఉమ్మడి లక్షణాలు. విడివిడిగా ఆ జీవకణాలకు ఇటువంటి శక్తులుండటం అసాధ్యం.

కొన్ని పరమాణువుల సముదాయమైన కన్ను, తనలో ఉన్న పరమాణువుల ఉమ్మడి లక్షణాల (emerged qualities) తో పనిచేస్తే ఇతర వస్తువుల తాలూకు పరమాణువుల లక్షణాలను కనిపెట్టటం అసంభవం

ఆ విధంగానే మన న్యాయశక్తి కూడా కొంతవరకే సూక్ష్మంగా వెళ్ళగలదు. కాని అంతకు మించి వెళ్ళగలగటం అసంభవం న్యాయశక్తిని మించిన శక్తులున్న మహాత్ములుండి ఉంటారని ఇంతకు పూర్వం ఒప్పుకున్నాం కాని ఆ శక్తులు కూడా ఉమ్మడి లక్షణాలు (emerged factors) అయి ఉండాలి కనుక వాటి ద్వారా కూడా పరమ సత్యం (ultimate truth) తెలియటం అసంభవం. ఆ పరమసత్యం పరమాణువులకే సంబంధించి ఉంది. దాన్ని గురించి తెలుసుకోవటానికవకాశం ఉంటే అది మరొక పరమాణువుకే ఉండాలి కాని పరమాణువు గుణాతీతమైనది తెలుసుకోవటమనేది ఒక సముదాయానికి సంబంధించినది కాని ప్రత్యేకాణువులకు సంబంధించినది కాదు

ఇంతకూ అసలు పరమాణువులే లేవేమో ! మనం పరమాణువుగా భ్రమిస్తున్నదాన్లో ఇంకా సముదాయాలున్నవేమో !

(ఆంధ్ర పత్రిక, వార పత్రిక, ప్రమాది ఉగాది సంచిక, 22-3-1939)

# 7. శాస్త్రదృష్టి

ఇటీవలనే పూనాలో ఇండియన్ సైన్స్ కాంగ్రెస్‌వారి 37వ వార్షిక సమావేశం ముగిసింది. దీనిని ప్రారంభిస్తూ డా శ్యామ ప్రసాద్ ముఖర్జీగారు శాస్త్రదృష్టి యొక్క ప్రాముఖ్యం గురించి చెప్పారు శాస్త్రకృషి వల్ల కలిగే ఫలితాలన్నింటిలోకీ శాస్త్రదృష్టి సర్వోత్తమమని ఆయన అన్న మాటలో అతిశయోక్తి లేదు

కళాదృష్టిలాగే శాస్త్రదృష్టి కూడా మానవుడికి అడుగడుగునా అక్కరకు వస్తుంది మానవుడికి జగత్తుతో గల సంబంధాలన్నింటి మీదా దాని ప్రభావం ఉంటుంది శాస్త్రదృష్టి మానవుడి కృషికి ఒక మార్గం చూపి దాన్ని ఫలవంతం చేస్తుంది ఈ శాస్త్రదృష్టి ఎటువంటిది ? దీన్ని ఎట్లా సాధించాలి ? ఈ ప్రశ్నలు కలుగుతాయి

శాస్త్రదృష్టి తాత్విక దృష్టిలాగా విశాలమైనదీ కాదు, స్వార్థపరుడి దృష్టివలె సంకుచితమైనదీ కాదు. అది ప్రత్యక్షానుభవాలను దాటి వెళ్ళదు ఇష్టాయిష్టాలను అధిగమించటానికి జంకదు. భౌతిక, లౌకిక విషయికమైనది దానిద్వారా మనకు సృష్టి రహస్యాలు తెలియకపోవచ్చు మన ఆధ్యాత్మిక చింతనకది ఉపకరించకపోవచ్చు కాని ప్రకృతి రహస్యాలను అది మనకు వెల్లడి చేస్తుంది మన లౌకిక జీవితాలను పై అంతస్తుకు చేరవేస్తుంది.

శాస్త్రజ్ఞానాన్వేషణ ఏ విధంగా జరిగేదీ తెలుసుకుంటే, మనకు శాస్త్రదృష్టిని గురించి తెలిసే అవకాశం ఉంది.

శాస్త్రవిజ్ఞానం రెండు రకాలుగా ఉంటుంది. అందులో ఒకటి స్థూలమైనది సృష్టిలో ఎన్ని రకాల జీవరాసులున్నాయి ? ఆకాశాన ఎన్ని రకాల గోళాలున్నాయి ? కనిపించే జడపదార్థాల తాలూకు మూలపదార్థాలెన్ని ? ఈ విధమైన జ్ఞానాన్వేషణ స్థూలమైనది ఇంతకన్న చాలా సూక్ష్మమైనది సత్యాన్వేషణ విషయజ్ఞానం యొక్క కుదుళ్ళే సత్యాలు

ప్రకృతిలో జరిగే ప్రతి సంఘటనకూ వెనక ఒక భౌతిక కారణం ఉంటుందనీ, అది అన్వేషించడానికి వీలున్నదనీ శాస్త్రజ్ఞుడు విశ్వసిస్తాడు రోజూ తూర్పున సూర్యుడు ఉదయించి పడమట అస్తమించడం లగాయతు, ఆటలమ్మ పోసిన పిల్లలందరికీ ఒకే రకం వ్యాధి లక్షణాలుండడం వరకూ ప్రతి సంఘటనకూ వెనుక ఉండే కారణాలను అన్వేషిస్తాడు మలేరియా వచ్చిన వారంతా పూర్వజన్మలో ఒకే విధమైన పాపం చేసి ఉంటారని ఎవరైనా విశ్వసించి సంతృప్తి పడవచ్చు శాస్త్రజ్ఞుడికది చాలదు ఇటువంటి సత్యం శాస్త్రదృష్టిని సంతృప్తి పరచదు ఎందుచేత?

పూర్వజన్మలో ఏదో ఒక దానం చెయ్యని వాళ్ళందరికీ ఈ జన్మలో కంటి కలక వస్తుందని మాట వరసకి సిద్ధాంతం చేద్దాం (సిద్ధాంతాలు చేయటానికి శాస్త్రజ్ఞుడు ఎంతమాత్రమూ వెనకాడడు!) కాని ఆ సిద్ధాంతం నిజమో కాదో రుజువయ్యే దెట్లా ? రుజువయ్యే అవకాశం ఉంటే ఏ సిద్ధాంతాన్నయినా పరిశోధనకు పెట్టి చూస్తాడు శాస్త్రజ్ఞుడు. టైఫాయిడ్ జ్వరంతో బాధపడేవాడి రక్తంలో ఒక కొత్త క్రిమి అనగా ఆరోగ్యవంతుడి రక్తంలో కనిపించనిది ఉన్నట్టయితే, రోగకారణం అదేననే సిద్ధాంతంతో బయలుదేరతాడు కాని అంతటితో తృప్తిపడడు టైఫాయిడ్ జ్వరంతో బాధపడే వారందరి రక్తంలోనూ ఆ క్రిమి అతడికి కనిపించాలి అక్కడితో కూడా శాస్త్రజ్ఞుడు ఆగడు ఆ క్రిమిని ఆరోగ్యవంతుడి రక్తంలో కెక్కించి టైఫాయిడ్ జ్వరం తెప్పించినప్పుడుగాని శాస్త్రజ్ఞుడి శాస్త్రదృష్టి తృప్తిచెందదు

ఎంత శాస్త్రపరిజ్ఞాతా, జ్ఞానీ అయినవాడు కూడా జీవితంలో కొన్ని విశ్వాసాలు లేకుండా జీవించలేడు మానవుడి అనుభవాలన్నింటి వెనకా ఉన్న సత్యాలన్నీ సమగ్రంగా కనుక్కోబడినవని ఎవరూ చెప్పలేరు ఆ విధంగానే లోకంలో ఉన్న మానవులందరి అవసరాలూ సాధించటానికి నిర్దిష్ట సాధనాలున్నాయని కూడా ఎవరూ అనలేరు మన రాజకీయ జీవితమూ, సాంఘిక జీవితమూ, కళలూ, ఆర్థిక వ్యవస్థా, వ్యక్తి జీవితమూ అనేక విశ్వాసాలకు కట్టుబడి ఉంటాయి

కాని శాస్త్ర దృష్టి కలవాడు ఈ విశ్వాసాలను సత్యాలని ఎన్నటికీ భ్రమపడడు అనుక్షణమూ తనకు జరిగే అనుభవం తన విశ్వాసాలను ఎంతవరకు బలపరుస్తున్నదో, ఎంతవరకు ఖండిస్తున్నదో, తన విశ్వాసాలను బలపరిచే అనుభవాలలో కాకతాళీయం ఎంత ఉన్నదో, తన అనుభవాలను ఖండించే అనుభవంలో తన భ్రమలు ఎంతవరకు పాల్గొంటున్నాయో వెయ్యి కళ్ళతో కనిపెట్టి ఉంటాడు

తిరుపతి వెంకటేశ్వరస్వామి ఆగ్రహం వల్ల తనకు తలనొప్పి వచ్చిందని ఎవరన్నా అంటే, ఆ విశ్వాసాన్ని మనం గర్హించనవసరం లేదు. కాని ఆ తలనొప్పి వచ్చిన మనిషి, మరొకరు అటువంటి తలనొప్పిని అర్థణా మందుతో పోగొట్టుకోవటం చూసి కూడా ఆ మందు వాడి చూడకపోతే, అతనికి సత్యం తెలుసుకొనే ఇచ్ఛ లేనందుకూ, రుజువుగాని విశ్వాసాన్ని సత్యంగా భ్రమించినందుకూ మనం గర్హించవలసి ఉంటుంది

కాని పై ఉదాహరణలో ఒకటి తెలుసుకోవాలి లౌకికానుభవానికి ఆ లౌకిక కారణాలను విశ్వాస మాత్రంగా ఆమోదించడమే శాస్త్ర దృష్టికి విరుద్ధం అనుభవానికి భౌతిక కారణాలన్నీ అన్వేషించిన తరవాత అలౌకిక కారణాలను ఆమోదించవచ్చు. అలౌకిక కారణాలు ఆమోదించటమంటే, శాస్త్ర దృష్టిలో, సమస్యను గాలికి వదలటమన్న మాట

ఇంకొక ముఖ్య విషయమేమంటే శాస్త్రదృష్టి గలవాడు చెప్పు కోసం తాటి చెట్టెక్కడు అతని విశ్వాసాలకు కూడా కొంత ఆధారం ఉండేటట్టు చూసుకుంటాడు సత్యాలు కాదగిన విశ్వాసాల సత్యాన్నే అన్వేషిస్తాడు గాని ప్రతి తలా తోకాలేని సిద్ధాంతాన్ని ఊహించుకుని అది అసత్యమని రుజువుచేస్తూ కూర్చోడు సాధ్యమైనంత వరకు తన అనుభవానికి సన్నిహితంగా ఉండే సత్యాలనే పరిశోధిస్తాడు అంత దగ్గరిగా సత్యం దొరక్కపోతే ఒక్కొక్క అడుగే దూరంగా పోతాడు అంతేకాని, దూరం నుంచి దగ్గరకు రాడు సత్యాన్వేషి ఇంకొకటి కూడా చేయటానికి సిద్ధంగా ఉంటాడు ఇవాళ సత్యమని రుజువైనది, రేపు మరొక అనుభవం ద్వారా అసత్యమని రుజువైతే, మరికొంత అన్వేషణ చేయటానికి సిద్ధంగా ఉంటాడు

శాస్త్రదృష్టిని గురించి తేలికగా మాట్లాడే వర్గం ఒకటి ఉన్నది మనిషికి భౌతిక క్షేమం కంటే ఆధ్యాత్మిక క్షేమం ప్రధానమనీ, లౌకిక చింతన కంటే పారలౌకిక చింతనలకు శాస్త్రదృష్టి అడ్డం వస్తుందనీ వారంటారు వారి వాదనలో అబద్ధం ఏమీ లేదు కాని శాస్త్రదృష్టి తాను సాధించలేనిదాన్ని సాధించిపెట్టేట్టు నటించదు. రూపాయి డబ్బులిస్తే మన పితృదేవతలను స్వర్గానికి పంపేవారికన్నా, శాస్త్రదృష్టిని ఒక వంక ఖండిస్తూ మరొకవంక తమ రోగాలు నయం చేసుకోవటానికి నికరమైన మందులు మాత్రమే పుచ్చుకొనేవారి కన్నా శాస్త్రదృష్టి చాలా రెట్లు నయం. లౌకిక క్షేమానికి భంగం కాకుండా ముముక్షువులుకాగోరేవారు లౌకిక వ్యవహారాలకు సంబంధించినంత వరకైనా శాస్త్రదృష్టితో వ్యవహరిస్తే ఉభయతారకంగా ఉంటుంది గాని, లౌకిక దృష్టినీ, శాస్త్రదృష్టినీ ఖండించటం వల్ల రెంటికీ చెడడం జరగవచ్చు

అదీకాక, అలౌకిక చింతనలో మునిగి ఉన్నవాడు శాస్త్రదృష్టితో వ్యవహరించటం లేదని ఎవరూ అనరు. అటువంటివాడితో ఒకరికి గాని మరొకరితో వాడికిగాని సామాన్యంగా జోక్యం ఉండదు అతి చిన్న విషయాలలో కూడా కించిత్తయినా శాస్త్రదృష్టి అవలంబించలేని వాళ్ళతోనే సాటి మానవులకు బాధ కలుగు తుంది తన కూతురికి ఎవడు రాసి పెట్టి ఉంటే వాడే మొగుడౌతాడని కూర్చున్న తండ్రి చెడ్డ తండ్రి అవుతాడు ఏదన్నా వస్తువు పోగొట్టుకుని అది ఎక్కడపోయి ఉంటుందో ఓర్పుగా ఆలోచించక, ఏదో ఒక చోట వెతికి అక్కడే పెట్టానన్న మూఢ విశ్వాసంతో ఇంటిల్లిపాదినీ దొంగల్ని చేసేవాడు "న్యూసెన్సు"గా తయారుకాక తప్పదు. ఈ విధంగా లక్షలకొద్దీ ఉదాహరణలివ్వవచ్చు. ఏ ఆధ్యాత్మిక దృష్టీ కూడా వీరిని సరి అయిన పౌరులుగా చేయలేదు.

**(తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 6-1-1950)**

# 8. ఆధ్యాత్మిక పరిశోధనలు

మనకు కనిపించేదే జగత్తనిగాని, పంచేంద్రియాల ద్వారా తెలుసుకోవటానికి లేనిదంటూ సృష్టిలో లేదని గాని మన పూర్వీకులెవరూ అనుకోలేదు చావుతో మనిషి యొక్క వ్యక్తిత్వం నశించదనీ, ఈ లోకం కాక ఇతర లోకాలున్నాయనీ వారు చూపినట్లు నమ్మారు మన పురాణాలలోనే గాక ఇంకా అనేక దేశాలలో గల పురాణాలలో ఆత్మ జీవులను గురించి, స్వర్గ నరకాలను గురించి వివరించి చెప్పబడి వున్నది.

మూడు శతాబ్దాల క్రితమే ఆధునిక శాస్త్ర వైజ్ఞానిక యుగం బేకన్ ప్రభృతుల కృషితో ఆరంభమయింది దాని వెంబడినే "భౌతిక" వాదమూ, "పదార్థం"లో సంపూర్ణ విశ్వాసమూ, జ్ఞానేంద్రియాల ద్వారా సంపాదించే జ్ఞానం సమగ్రమైనదన్న దృఢ నమ్మకమూ అమలులోకి వచ్చాయి వీటి ఆధారంపై ఆధునిక మానవుడు ఇప్పటి నాగరికతను నిర్మించుకున్నాడు

మరణానంతర జీవితమంటూ ఉన్నదనీ, మానవులలో అనేకమందికి అతీంద్రియ జ్ఞానం సాధ్యమనీ, మనకు కనిపించే జగత్తు కాక ఇంకా ఉన్నదనీ నమ్మటం మటుకే అయితే అలాంటి నమ్మకాలున్నవారు ఈనాడు కూడా ఉన్నారు కానీ, వారి జాబితాలో మేధావులు మాత్రం చేరరు ఈ పరిస్థితి మూడు శతాబ్దాలకు పూర్వం లేదు మేధావులు సయితం జ్ఞానేంద్రియాలకు అందని వాటిని నమ్మగలిగిన స్థితిలో ఉండేవారు.

19వ శతాబ్దాంతం వరకూ "భౌతికవాదం" ప్రభ అనర్గళంగా సాగింది న్యూటన్ చైతన్య సూత్రాలూ, డాల్టన్ ప్రభృతులు ప్రతిపాదించిన పరమాణు సూత్రాలూ జగత్తును సులభగ్రాహ్యం చేసినట్లుగా కనబడ్డాయి కానీ, ఈ బొమ్మరిల్లు అంతలోనే భగ్నమయింది శాస్త్ర విజ్ఞానం పంచేంద్రియాలకు అతీతమైన ప్రకృతి ధర్మాలను ఎదుర్కొనసాగింది గోలికాయలాగా ఉంటుందనుకున్న పరమాణువు ఒక చిన్న సూర్యకుటుంబం రూపంలో పొడగట్టటమే కాకుండా ఎవరూ ఎన్నడూ ఊహించని సూక్ష్మ పదార్థాలను వెలువరించ సాగింది. వాటిలో కొన్నింటిని కిరణాలనాలో, నలుసులనాలో శాస్త్రవేత్తలకు సరిగా అర్థం కావటం లేదు. ఈ లోపుగా ఐన్‌స్టయిన్ కాలాన్ని, దూరాన్ని ముడిపెట్టి గణిత సూత్రాలు తయారు చేశాడు ఊహకు అందని సాపేక్ష సిద్ధాంతం వెలువడింది. అద్దంలో నుంచి దూసుకుపోయినట్టుగా అనేక అడుగుల మందం గల లోహాలలో నుంచి దూసుకుపోయే కిరణాలు కనిపెట్టబడ్డాయి

"భౌతికవాదం" పూర్తిగా ఓడిపోయిందని కాదు, "పదార్థం" అన్నది మటుకే అస్పష్టం కాసాగింది విశ్వం యొక్క రూపం కూడా అనుకున్నంత సులభ గ్రాహ్యం కాదని స్పష్టమయింది. జ్ఞానాన్వేషణకు గాను మనిషి సృష్టించిన సాధనాలే అనేక వింత విషయాలను బయటపెట్టాయి. 200 అంగుళాల టెలిస్కోప్ విశ్వం యొక్క పరిమాణాన్ని ఎనిమిదింతలు చేసింది ! మైక్రోస్కోపులు సూక్ష్మక్రిములను కంటికి ప్రదర్శించాయి

ఈ పరిస్థితిలో ఒక కొత్త శాస్త్ర అన్వేషణ తలెత్తింది. అది ఆధ్యాత్మిక శాస్త్ర పరిశోధన. అయితే, జన బాహుళ్యానికి ఇటువంటి శాస్త్రం ఒకటి ఉందనీ, అందులో పరిశోధనలు జరిగాయనీ, జరుగుతున్నాయనీ, వాటిని సాగించిన వారిలో సర్ విలియం క్రూక్స్, సర్ ఆలివర్ లాడ్జి, ఆల్ఫ్రెడ్ రసెల్ వాలస్, సర్ విలియం బారట్, ప్రొఫెసర్ హెన్రీ బెర్గ్‌సన్, ప్రొఫెసర్ ప్రైస్ మొదలైన ప్రముఖ శాస్త్రవేత్తలున్నారనీ తెలియదు

ఇందుకు కారణాలు ఎన్నయినా ఉన్నాయి. ఆధునిక సంస్కృతిలో ఆధ్యాత్మిక విషయాలు అభూత కల్పనల దశ సంపాదించుకున్నాయి. మన పూర్వీకులు కేవలం ఐహిక

ప్రయోజనాల నిమిత్తమే ఆముష్మికాన్ని సృష్టించారని మనం నమ్మాం ఆ నమ్మకం నమ్మదగినదిగానే కనబడింది దానికి తోడు 19వ శతాబ్దందాకా శాస్త్రవేత్తలు సృష్టికీ, పదార్థానికీ ఏర్పరచిన సరిహద్దులు మనుషుల మనస్సులలో ఇంకా చెక్కుచెదరకుండా ఉన్నాయి అతీంద్రియ జ్ఞానం అంటూ ఉండే అవకాశం లేదు ఆత్మలంటూ ఉండటం అసంభవం వాటిని గురించి "శాస్త్రీయంగా" పరిశోధించటం అసంభవం ఎవరన్నా పరిశోధనలు చేస్తుంటే వాళ్ళు మోసం చేస్తున్నారన్నమాట!

"ఆధ్యాత్మిక దృగ్విషయాలున్నాయనటం అబద్ధం ఎందుకంటే అవి ఉండే అవకాశం లేదు గనక !" అన్నాడొక శాస్త్రవేత్త

"ఆధ్యాత్మిక విషయాలు నిజమే అయినప్పటికీ నాకు వాటితో ప్రమేయం లేదు" అన్నాడింకొక శాస్త్రవేత్త

శాస్త్రవేత్తలు ఇటువంటి వైఖరి అవలంబించటం కొత్త కాదు. ఒకప్పుడు ఒక శాస్త్రవేత్త గురు గ్రహం చుట్టూ ఉన్న ఉపగ్రహాలను టెలిస్కోప్‌లో చూడ నిరాకరించాడు. వాటిని చూసినట్టయితే అయనకున్న అభిప్రాయాలను మార్చుకోవలసిన స్థితి ఏర్పడింది జ్ఞానంపైన ఉండే మమకారం ఒక్కొక్కసారి దారితప్పి అజ్ఞానానికి దారితీస్తుంది

ఆధ్యాత్మిక పరిశోధనలను గురించి జన బాహుళ్యానికి తెలియకపోవటానికి ఇంకొక కారణం కూడా ఉంది (అది మనదేశం లాంటి దేశాలలో వర్తించకపోవచ్చును గాని పాశ్చాత్య దేశాలలో గణనలోకి వస్తుంది ) అదేమిటంటే ఆధ్యాత్మిక పరిశోధకులతో బాటు ఆధ్యాత్మిక వాదులు కూడా బయలుదేరి సంఘాలుగా ఏర్పడి ఒక విధమైన మతంలాంటిది ప్రారంభించారు. వీరు కూడా పరిశోధనలలలాంటివే చేశారు గాని, అవి ఎక్కువగా మరణానంతర జీవితానికీ, ఇతర లోకాలలో ఉండే పరిస్థితులు తెలుసుకొనటానికీ, చనిపోయినవారితో ప్రసంగించటానికీ జరిగాయి

ఆధ్యాత్మికవాదులు చేసిన పరిశోధనలను ఆధ్యాత్మిక పరిశోధకులు ఆమోదించారు ఒక ఆత్మ వచ్చి తాను ఆ లోకంలో గడిపే జీవితాన్ని గురించి చెబితే దానికి రుజువూ, సాక్ష్యమూ లేదు. కాని న్యాయానికి ఆధ్యాత్మికవాదులే ప్రజలను అధికంగా ఆకర్షించారు ఆప్తులను పోగొట్టుకుని దుఃఖించేవారికి ఆ ఆత్మలు వచ్చి, తాము ఫలానా అని స్పష్టంగా రుజువు చేసుకుని తాము సుఖంగా ఉన్నామనీ, తమ ఆప్తులను తరచు చూస్తూనే ఉన్నామనీ చెబితే అంతులేని ఆనందం కలుగుతుంది. అటువంటి అనుభవాలు అసంఖ్యాకులకు పదే పదే అయిన మీదట ఈ లోకాన్ని గురించి, జీవితం గురించీ, ప్రవర్తన గురించీ కొన్ని అభిప్రాయాలు తప్పక కలిగి తీరుతాయి

నా ఉద్దేశంలో ఆధ్యాత్మిక వాదులు జరిపిన పరిశోధనలను కొట్టి వేయవలసిన అవసరం లేదు ఎందుచేతనంటే ఆధ్యాత్మిక పరిశోధకులు సజీవ వ్యక్తులకు గల అతీంద్రియ శక్తులను గురించే అధికంగా పరిశోధనలు చేశారు ఆధ్యాత్మిక వాదులు ఆత్మలను గురించి కూడా శ్రద్ధ కనబరిచారు మనం రెండు రకాల పరిశోధనలను గురించీ తెలుసుకోవచ్చు.

ఈ పరిశోధనలలో ఆధ్యాత్మిక పరిశోధకులు జరిపిన పరిశోధనలకు ఎవరూ ఏలాంటి అభ్యంతరమూ చెప్పే అవకాశం ఉన్నట్టు కనబడదు. ఈ పరిశోధనలు ఒక దారికి వచ్చాకనే, 1882లో ఇంగ్లాండులో మొట్టమొదటగా ఆధ్యాత్మిక పరిశోధనా సంస్థ (సైకిక్ రిసెర్చ్ సొసైటీ) ఏర్పడింది దాని వ్యవస్థాపకులలో ప్రముఖుడు ఎఫ్ డబ్ల్యు హెచ్ మయర్స్ అనే ఆయన మానవ వ్యక్తిత్వం మరణంతో అంతంకాదని వాదిస్తూ అయన ఒక గ్రంథం వ్రాశాడు ఈయన కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో చదువుతున్న కాలంలోనే ఈయనా, ఈయనకు గురువైన హెన్రీ సిజ్విక్ కలసి ఆధ్యాత్మిక వాదులు చెప్పే కొన్ని విషయాలను ప్రయోగాల రూపంగా పరిశీలించ నిశ్చయించారు

1882లో ఏర్పడిన సంఘంలో హెన్రీ సిజ్‌విక్ అయన భార్యా, ఆమె సోదరులు ఇద్దరూ,

ఆమె బావమరిది లార్డ్ రాలే, సర్ విలియం బారెట్ (రాయల్ సొసైటీ సభ్యుడు) ఉన్నారు హెన్రీ సిడ్జ్విక్ అధ్యక్షతన 1882 జులై 17న తొలి సమావేశం జరిగింది తరువాత కొద్ది కాలానికి ఎడ్మండ్ గీర్నీ అనే దీక్షాపరుడైన పరిశోధకుడు కూడా ఈ సంస్థలో చేరాడు

ఈ సంస్థకు ఎలాంటి విశ్వాసాలూ ఆధారంగా లేవనీ, సత్యం అన్వేషించటమే దాని ఆశయమనీ హెన్రీ సిడ్జ్విక్ తన తొలి అధ్యక్షోపన్యాసంలో స్పష్టం చేసినప్పటికీ, ఈ సంస్థ తీవ్రమైన ప్రతిఘటనను ఎదుర్కొన్నది. "ఇలాంటి విషయాలను గురించి పరిశోధించటమే ఉన్మాదం" అన్నారు విమర్శకులు అయినా సభ్యులు ఓర్పుతో పరిశోధనలు సాగించారు ఈ ఉద్యమం రాను రాను విస్తరించింది 1884లో అమెరికాలో కూడా ఇలాంటి సంస్థ ఏర్పడింది డాక్టర్ యుజీన్ ఓస్టీ అధ్యక్షతన పారిస్‌లో ఒక సంస్థ ఏర్పడింది. ఇరవయ్యో శతాబ్దం ప్రారంభమయ్యాక హాలండ్, డెన్మార్క్, నార్వే, పోలండ్, గ్రీస్ మొదలైన దేశాలలో ఇలాంటి సంస్థలు రాసాగాయి కొన్ని విశ్వవిద్యాలయాలలో ఉండే మనో వైజ్ఞానిక వేత్తలు ప్రయోగాలు సాగించారు. హార్వర్డ్ విశ్వవిద్యాలయంవారు ఈ పరిశోధనల నిమిత్తం స్కాలర్‌షిప్ కూడా మంజూరు చేశారు. మయర్స్ స్మారకార్థం 1940లో కేంబ్రిడ్జి ట్రినిటీ కాలేజిలో ఒక స్కాలర్‌షిప్ ఏర్పాటయింది

ఇదిగాక అనేకమంది వ్యక్తులు స్వయంగా పరిశోధనా సంస్థలు సాగించారు వారిలో హారీప్రైస్ అనే ఆయన ఒకడు తాను 50 ఏళ్ళపాటు సాగించిన పరిశోధనలను ఈయన ఒక గ్రంథంలో వివరించాడు

ఈ సంస్థలన్నీ ఏ విధంగా పరశోధనలు చేసింది, ఏమి ఫలితాలు సంపాదించిందీ సంగ్రహంగా తెలుసుకుందాం

**"టెలిపతి" రాబోయేది తెలుసుకోవటం**

మనిషికి జ్ఞానేంద్రియాలున్నాయి వాటి ద్వారా మనం బాహ్య ప్రపంచం గురించి తెలుసుకుంటాం కళ్ళు చూస్తాయి, చెవులు వింటాయి, చర్మం స్పృశిస్తుంది వీటితోపాటు నాడీమండలమూ, మస్తిష్కంలోని పొరలూ చేరి మనస్సుకు జ్ఞాన గ్రహణశక్తినిస్తాయి ఒకరి మనసులోని భావాలు ఇంకొకరు తెలుసుకోవటానికి భాషా, రచనా, అభినయమూ మొదలైనవి అదనంగా పనిచేస్తాయి

19వ శతాబ్దం ఆఖరువరకూ శాస్త్రజ్ఞులు అవలంబించిన "భౌతికవాదం" ప్రకారం మనసు తెలుసుకోవటానికి మరొక మార్గం లేదు (ఇప్పటికీ ఈ విధమైన భౌతికవాదం అవలంబిస్తుంటే వారికి టెలిపతీని గురించి జరిగిన పరిశోధనలను గురించి ఏమీ తెలియదన్నమాట ) అయితే మనస్సుకు శాస్త్రజ్ఞులు వూహించిన దానికన్నా ఎక్కువ శక్తులున్నట్టు అదివరకే గమనించబడింది మెస్మరిజం, హిప్నాటిజం, రాబోయేది చెప్పటం ఎలా సాధ్యమవుతున్నదో శాస్త్రవేత్తలకు తెలియదు అందుచేతవారు వాటిని నమ్మ నిరాకరించారు న్యాయంగా వారిలో సత్యాన్వేషణాసక్తి ఉంటే మనస్సుకు ఆపాదించబడే ఈ శక్తులను శాస్త్రవేత్తలు అన్వేషించి ప్రయగాల ద్వారా అవి లేవని రుజువు చేయవలసింది. కాని అలా చేయకపోగా మనసుకు గల అసాధారణ శక్తులను నమ్మేవారు "అమాయకు''లనీ, తాము అటువంటి వంచనకు లోబడమనీ చెప్పి శాస్త్రజ్ఞులు కొందరు తప్పించుకున్నారు మరికొందరు పరిశోధనలు జరిపి టెలిపతీ అనేది ఉన్నదని ఖండితంగా రుజువు చేశారు

ఇద్దరు వ్యక్తులు ఇతర ఇంద్రియాల సహాయం లేకుండా ఒకరి మనస్సులో ఉన్నదాన్ని మరొకరు తెలుసుకోవటం టెలిపతీ ఇద్దరి నోటివెంట ఒకే వాక్యం ఒకేసారి వెలువడటమూ, పక్కన ఉన్నవాళ్ళు "మీ ఇంటికి చుట్టాలు వస్తారు" అనటం ప్రతివారికీ అనుభవమేననుకుంటాను

కాని ఇది అసాధారణ శక్తిగా మనం భావించం తరచు కాకపోవచ్చు కూడా. ఎందుకంటే, ఇద్దరి నోటివెంట ఒకేమాట వచ్చినప్పుడు ఇద్దరికీ ఒకే ఆలోచన తట్టటానికి తగిన కారణాలు అక్కడ ఉండనే ఉంటాయి

కాని ఆధ్యాత్మిక పరిశోధకులు సేకరించిన సాక్ష్యాలు ఇలాంటివి కావు. ఒక ఉదాహరణ తీసుకుందాం మిసెస్ ఫీల్డ్ (అసలు పేరు కాదు) 1939 జనవరిలో తన కుమార్తెను ఇంటివద్ద విడిచి తన సోదరిగారి వూరు వెళ్ళింది అక్కడ ఉండగా ఆమెకు తన కుమార్తె వద్ద నుండి ఒక ఉత్తరం వచ్చింది ఆ ఉత్తరంలో ఆమె "నాయనమ్మ దగ్గుతో మంచం పట్టింది" అన్న వాక్యం చదివింది తరువాత ఆమె ఇంటికి వెళ్ళి తన కుమార్తెను, "నాయనమ్మకెలా ఉన్నది ?" అని అడిగింది "బాగానే ఉన్నదనుకుంటాను నాకేమీ తెలీదు" అన్నది కూతురు "ఆవిడ పడక వేసిందని రాస్తివి గదా" అన్నది తల్లి "నేను రాయందే !" అన్నది కూతురు వెళ్ళి చూస్తే నాయనమ్మ ఇప్పుడే కోలుకుంటున్నది మిసెస్ ఫీల్డ్ తన ఉత్తరం చదివి చూసుకుంటే ఆవిడ చదివిన వాక్యం ఎక్కడా లేదు !

పై సంఘటనలో మిసెస్ ఫీల్డ్ నాయనమ్మ దగ్గు గురించి టెలిపతీ ద్వారా తెలుసుకున్నది

(ఈ విధంగా ఉత్తరాలలోనూ, పుస్తకాలలోనూ లేని వాక్యాలు చదివి, వాటికోసం ఎంతో శ్రమపడి విఫలులయ్యేవారు చాలామంది ఉండి ఉండాలి. "ఏదో పొరపాటు జ్ఞాపకం !" అనుకోకుండా వారు శ్రద్ధగా పరిశోధించినట్టయితే ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడైనా టెలిపతీ పనిచేసినట్టు రుజువు కావచ్చు )

ఇంకొక ఉదాహరణ మిసెస్ ఇ ఇ వెస్ట్ అనే ఆవిడ 1937 డిసెంబర్ నెలలో సబ్బు నీటిలో ఏవో వస్తువులు తోమటం జరిగింది తరువాత చూసుకుంటే ఆమె చేతి ఉంగరంలోని కెంపు పోయింది. అది సబ్బు నీళ్ళలో జారిపడి, సబ్బు నీటితోబాటు కందకంలోకి వెళ్ళిపోయి ఉంటందనుకుని ఆవిడ దాన్ని వెతకటం మానేసింది మర్నాడుదయం ఆవిడ ఆ గదిలో ఉన్న సమయంలో ఎవరో తనతో, 'కెంపు మాటేమిటి ?' అని అడిగినట్టు అనిపించింది వెంటనే ఆవిడ "ఆఁ అది దొరకదు వెతకడం వృధా !" అని పైకి జవాబు చెప్పేసి తనతో ఎవరూ మాట్లాడటం లేదని వెంటనే గ్రహించింది కాని, అంతలోనే ఎవరో ఆమెను భుజాలు పట్టుకుని తిప్పినట్లయింది. ఆమెకు నేలమీద ఎండపొడలో పోయిన కెంపు మిలమిలలాడుతూ కనబడింది.

సాక్ష్యంతో సహా రుజువైన ఈ సంఘటనను నూటికి తొంభైతొమ్మిది మంది ఆత్మలున్నాయన్నదానికి సాక్ష్యంగా ఆమోదిస్తారు. కాని, ఆధ్యాత్మిక పరిశోధకులు దీన్ని టెలిపతీ కింద జమకట్టేశారు కొంతమంది "దయ్యాలను" చూస్తారు లేదా చూసినట్టు భ్రమపడతారు. ఆ దయ్యాలూ భ్రమలూ నేరుగా ఆ చూసేవారి మనసులలో ఉత్పన్నమైనవి కాకపోతే టెలిపతీ ద్వారా ఉత్పన్నమైనవని పరిశోధకులు భావిస్తారు అంతేగాని దయ్యం ఏదో ఒక రూపంలో ఆ సమయాన అక్కడ ఉండనవసరం లేదు

ఆధ్యాత్మిక పరిశోధనా సంస్థవారు అనేక వేల అనుభవాలను సేకరించి, ప్రతి అనుభవానికీ గల ప్రబలమైన సాక్ష్యాన్ని ఎంతో ఓపికతో సేకరించారు. పూర్తిగా రుజువైన సంఘటనల సంఖ్య అనేక వందలున్నది. సాక్ష్యం సమగ్రంగా లేని అనుభవాలను వారు ప్రచురించలేదు. వారు ప్రచురించిన వందలాది అనుభవాలు చదివినవారికి టెలిపతీని గురించి ఎలాంటి సందేహమూ ఉండవలసిన అవసరం లేదు

1920లో మా అన్న కొడవటిగంటి వెంకట సుబ్బయ్యగారు ఆకివీడులో సబోవర్సీరుగా పనిచేస్తుండేవాడు ఒకనాడు మామూలుగానే ఆఫీసుకు బయలుదేరి సగం దారిలోనే వెనక్కు

తిరిగి ఇంటికి వచ్చేశారు. ఆయన అలా ఎన్నడూ ఆఫీసు మానేసి ఇంటికి రాలేదు వంట్లో సరిగా లేదా అని మా వదిన అడిగితే సరిగానే ఉన్నదన్నాడు పని చెయ్యడానికి బద్ధకం తోస్తే ఆఫీసుకు వెళ్ళి సెలవు పెట్టి రాగూడదా అన్నది వదిన "ఎందుకో ఇంటికి తిరిగి రావాలనిపించింది" అన్నాడాయన వాళ్ళు మాట్లాడుకుంటూ ఉండగానే అన్నకు టెలిగ్రాం వచ్చింది మా అమ్మ పోయిందని అప్పటికప్పుడే బయలుదేరి ఆయన మధ్యాహ్నం రైలు అందుకుని తెనాలి వచ్చేశాడు టెలిగ్రాంకన్నా ముందే ఆయనకు దుర్వార్త అందిందనటానికి సందేహం లేదు కాని అదేమిటో ఆయనకు తెలీదు

టెలిపతీ ద్వారా ఒకరి మనసు "చూసినది" ఇతరులు కూడా చూడటం సాధ్యమనటానికి నిదర్శనాలున్నాయి కాశన్ బోర్న్ అనే ఆయన తెల్లగుర్రం ఎక్కి మరి కొంతమందితో వేటకు బయలుదేరాడు ఆయన కుమార్తెలు బండిలో తాము కూడా వేట చూడటానికి బయలుదేరారు కాని మధ్య దారిలో వారికి ఇంటికి పోవాలనిపించి బండిని వెనక్కు తిప్పమన్నారు. సరిగా ఆ సమయానికి కుమార్తెలలో ఒకావిడకు తన తండ్రి అంత దూరాన గుర్రం మీద రమ్మని చేత్తో సంజ్ఞ చేస్తూ కనిపించాడు ఈ దృశ్యాన్ని రెండవ కుమార్తె, బండివాడూ కూడా చూశారు బోర్న్ ఎక్కిన గుర్రం మట్టి కొట్టుకుని ఉన్నట్టు కనిపించటం వల్ల బండివాడు ఏదో ప్రమాదం జరిగి ఉంటుందన్నాడు. వాళ్ళు ఆదుర్దాగా ఆయన కనిపించిన చోటుకు వెళ్ళితే కనుచూపు మేర దూరంలో ఎక్కడా ఒక పురుగు ఉన్నట్టు లేదు వారు వెతికి వెతికి ఇంటికి చేరుకున్న పావుగంటకు తండ్రి కూడా వచ్చేశాడు తీరా విచారిస్తే ఆయన వారిని చూడలేదు, పిలవలేదు. ఆయనకు ఎటువంటి ప్రమాదాలూ జరగలేదు కూడా అంతా భ్రమ. కాని ఆ భ్రమను స్పష్టంగా ముగ్గురు ఒక్కసారిగా పంచుకున్నారు. వారికి కనిపించిన మనిషి బతికున్న వ్యక్తి కాక చనిపోయిన మనిషి అయి ఉంటే వారు ముగ్గురూ చూసింది దయ్యమని దాదాపు ప్రతి ఒక్కరూ నమ్మి ఉందురు

ఇలాంటిదే ఇంకొక సంఘటన జరిగింది విశ్రాంతి కోసం కొత్త చోటుకి పోతున్న భార్యాభర్తలిద్దరూ ఒకేసారిగా ఒక హోటలులాంటి భవనాన్ని చూశారు. అక్కడ బస చేద్దామనే ఉద్దేశంతో వారు అవతలి మజిలీలో బస్సు దిగి ఆ హోటలు కోసం ఎంత వెతికినా అది కనిపించలేదు విచారించగా, వారు చూసిన భవనం లాంటిది ఆ ప్రాంతాలలో ఎక్కడా లేదని తెలిసింది

టెలిపతీని గురించి పోగు చేసిన సాక్ష్యంలో కొంత భాగం జోస్యంగా పరిణమించింది. టెలిపతీ ఎంత దూరాన ఉన్నవారి మధ్యనైనా సాధ్యమవుతుంది "దూరం" ఏ మాత్రమూ అడ్డం రాదు. అలాగే "కాలం" కూడా అడ్డు రాదనడానికి చాలా నిదర్శనాలు కనిపించాయి

1887లో జరిగిన ఈ క్రింది సంఘటనను సర్ విలియం బారెట్ స్వయంగా పరిశోధించి యదార్థం నిరూపించాడు. కాప్టెన్ మాక్ గొవాన్ అనే సైనికాధికారి సెలవు మీద బ్రూక్లిన్‌లో ఉన్నాడు. ఆయన వెంట ఆయన కొడుకులిద్దరు ఉన్నారు వారి బడికి సెలవులు ఒక సాయంకాలం ఆయన తన కుమారులను థియేటరుకు తీసుకుపోతానని మాట ఇచ్చాడు ఒక రోజు ముందుగానే మూడు టిక్కెట్లు కొన్నాడు. థియేటరుకు వెళ్ళవలసిన రోజు ఆయనతో ఎవరో "నీ పిల్లల్ని థియేటరుకు తీసుకుపోవద్దు" అన్నట్టయింది. ఈ మాటలు ఆయన మనసులో నుంచి పోలేదు. ఆ రోజు మధ్యాహ్నం ఆయన తన పిల్లలతోను, మిత్రులతోను "ఇవాళ మేం థియేటరుకు పోవటం లేదు" అని చెప్పాడు పిల్లలకు ఆశ పెట్టి మానెయ్యటం చాలా అన్యాయమని మిత్రులన్నారు ఆయన కూడా సరే పోనిమ్మన్నాడు. కాని ఆయన మనసులో నుంచి ఆ మాటలు పోనేలేదు. చిట్టచివరకాయన ఇంకొక గంటకు ప్రదర్శన ఆరంభ మవుతుందనగా తన పిల్లలను తన వెంట న్యూయార్క్‌కు బయలుదేరదీశాడు. ఇలా చేస్తున్నందుకాయన చాలా సిగ్గుపడ్డాడు

కూడా ఆ రాత్రి ఆ థియేటరు అంటుకున్నది మూడు వందల మంది చనిపోయారు. మాక్ గొవాన్‌కు ఇలాంటి అనుభవం అంతకు మునుపుగాని అటు తరువాత గాని కలగలేదు

ఇటువంటి అనుభవాలు పరిశోధనా సంస్థవారి రికార్డులో అసంఖ్యాకంగా ఉన్నాయి. మనిషి జరగబోయేది ముందుగా తెలుసుకోవటం సాధ్యమని ఈ అనుభవాలు స్పష్టం చేస్తున్నాయి. మనదేశంలో భవిష్యత్తు చెప్పే జ్యోతిష్కులున్నారు వారిలో కొందరు కొన్ని విషయాలైనా సరిగా చెబుతారనటానికి సందేహం లేదు కాని జ్యోతిషంలో విపరీతమైన మానవ శక్తుల ప్రమేయం ఏమీ లేదు.

ఇంతకుమునుపు చెప్పినవన్నీ టెలిపతీని వివరించే అనుభవాలు మాత్రమే కాని పరిశోధకులు ఈ అనుభవాలతో తృప్తిపడక, టెలిపతీని నిరూపించటానికి ప్రయోగాలు చేశారు. వారు జాస్తిగా వినియోగించిన విధానాన్ని స్టాటిస్టికల్ మెథడ్ అంటారు ఈ పద్ధతిని గురించి మనం సంగ్రహంగా చర్చించుదాం

మాట వరసకు ఒక స్త్రీ కనబోతున్నదనుకుందాం. ఆమెకు మగ పిల్లవాడు పుడతాడా, ఆడపిల్ల పుడుతుందా అని వూహించటానికి రెండు వూహలు చాలు "అయితే ఆడపిల్ల, కాకపోతే మగ పిల్లవాడు" అన్న సామెత ఉండనే ఉన్నది అంటే ఎవరు ఎలా ఊహించినా ఆ ఊహ సరి అయే అవకాశం సగం అన్నమాట. దీన్నే ఇంకో విధంగా చెప్పాలంటే, పుట్టబోయే పిల్లను గురించి ఒక వందమంది ఊహించారనుకోండి వారిలో సగం మంది - 50 మంది ఊహ సరి అయ్యే అవకాశం ఉంది ఊహించేవారి సంఖ్య ఎంత హెచ్చితే ఈ "సగం" అన్నది అంత బాగా ఋజువవుతుంది

ఆధ్యాత్మిక పరిశోధకులు ఒక రకం పేకముక్కలను ఉపయోగించి ఊహల ద్వారా పరిశోధనలు చేశారు ఈ పేకలు 25 ముక్కలుంటాయి అయిదు రకాల కార్డులు, రకానికి అయిదేసి చొప్పున ఉంటాయి. ఒక మనిషి ఈ పేకను కత్తిరించి కలిపి ఒకొక్క ముక్కే తీసి చూస్తూ పోతాడు అవతల గదిలోనో, ఇంకొక భవనంలోనో ఉన్న మనిషి ఈ ముక్కలు ఫలానా అని ఊహిస్తాడు. ఊహించేవారికి ఏ అసాధారణశక్తీ లేకపోయినా, తగినన్ని అవకాశాలిస్తే అయిదోవంతు ఊహలు సరిగా తగిలే అవకాశం ఉంది అంతకన్న హెచ్చు ఊహలు సరి అయినట్టయితే అది అసాధారణంగా భావించవచ్చు ఒకటి రెండు సార్లు దారి తప్పి హెచ్చు ముక్కలు ఊహించటం వల్ల ఏమీ ఋజువు కాదు కాని నెలల తరబడి అవకాశాన్ని మించి ఊహించినవారు కొద్దిమంది ఉన్నారు వారి ద్వారా టెలిపతీ ఋజువయింది ఈ ప్రయోగాలను గుర్తించి వివరించటం ఇక్కడ సాధ్యం కాదు. అమెరికాలో, బ్రిటనులో కూడా ఎంతోమంది ఎన్నో వేల ప్రయోగాలు చేశారు. వీటిలో ఒక భాగం టెలిపతీని ఏ మాత్రమూ రుజువు చేయలేకపోయాయి

ఈ ప్రయోగాలలోనే భవిష్యత్తు తెలుసుకునే శక్తి కూడా అనుకోకుండా ఋజువయింది. ఎందుచేతనంటే రాబోయే ముక్కను అవకాశాన్ని మించి ఊహించినవారున్నారు. ఈ విధమైన ప్రయోగాలు మనం కూడా చేసి చూడవచ్చు

ఆధ్యాత్మిక పరిశోధకులు టెలిపతీని, ఆధ్యాత్మిక శక్తినీ వేరుచేసి ప్రయోగాలు చేశారు ఉదాహరణకు, టెలిపతీలో ఊహించే వ్యక్తి ఇంకొకరు ఆ క్షణాన చూస్తూ ఉండిన ముక్కను ఊహిస్తాడు ఆధ్యాత్మిక శక్తి పరీక్షలో కలిపి పెట్టిన పేక ముక్కలు ఎవరూ చూడకుండా బల్ల మీద పెడితే పై నుంచి కిందికి పాతిక ముక్కలనూ ఊహిస్తాడు ఈ విధంగా కూడా అవకాశాన్ని మించి సరిగా ఊహించినవారున్నారు.

ఈ పరిశోధనలు సాగించినవారిలో ప్రముఖ శాస్త్రవేత్తలూ, కాలేజీ విద్యార్థులూ, బీబీసీ

కూడా సహాయం పడటం జరిగింది. పేక ముక్కలతో చేసినట్టే బొమ్మలతో కూడా ప్రయోగాలు చేశారు.

నిజానికి శాస్త్రజ్ఞానాభివృద్ధికి ప్రయోగాలు తప్పనిసరి కాదు. నక్షత్ర శాస్త్రం ప్రయోగాలు అవసరం లేకుండానే ముందుకు సాగుతున్నది పరిశీలన చాలా అవసరం ఆధ్యాత్మిక పరిశోధకులు మరణానంతర జీవితం గురించి పరిశీలించనప్పటికీ ఆత్మ జీవులతో సంబంధం ఉన్నట్టు కనబడిన అనేకమంది అనుభవాలను పరిశీలించి ఆత్మ జీవులున్నారనీ వారి మనస్సులు తమ ప్రభావాన్ని బతికున్నవారి మనస్సులపై ఏదో విధంగా వేయగలరనీ నిర్ధారణ చేశారు. ఇలాంటి పరిశోధనలను గురించి చదవగోరేవారికి జి ఎన్ ఎం టిరెల్ రచించిన "ది పర్సనాలిటీ ఆఫ్ మాన్" (పెలికాన్ ప్రచురణ) చాలా మంచి పుస్తకం.

**(ఆంధ్రప్రభ, వారపత్రిక, 1-1-1958)**

# 9. దయ్యాల కొంప

న్యూయార్క్ రాష్ట్రంలో హైడ్స్‌విల్ అని ఒక గ్రామం ఉన్నది 1848లో ఆ గ్రామంలో ఒక ఇంట జాన్ డి ఫాక్స్ అనే ఆయనా, ఆయన కుటుంబమూ ఉంటూ వచ్చారు ఆ ఇంట్లో ఎక్కడ బడితే అక్కడ ఎవరో కొట్టినట్టు చప్పుళ్ళు కలగసాగాయి తలుపులు ఎవరో తట్టినట్టు చప్పుడయింది వాకిలికి అటూ ఇటూ మనుషులు నిలబడి కాపలా కాసినా చప్పుళ్ళు ఆగలేదు. చప్పుడే చేసే మనుషులు కనిపించలేదు ఒక్క వారం లోపల ఫాక్స్ భార్య జుట్టంతా నెరసిపోయింది.

ఫాక్స్ వెంట ఇద్దరు కూతుళ్ళుంటున్నారు మార్గరేటు అనే పిల్లకు పదిహేనేళ్ళు, కాథరీన్‌కు పన్నెండేళ్ళు రాత్రివేళ ఎవరో సామాను జరిపినట్టూ, గోడల మీదా, తలుపుల మీదా తట్టినట్టూ చప్పుళ్ళు అయి ఇంట్లోవారికి నిద్రాభంగం అవుతూ వచ్చింది. రాను రాను ఈ చప్పుళ్ళు మరింత ఘోరంగా పరిణమించాయి గొంతు పిసికితే మనిషి చేసే చప్పుడూ, ఏదో శరీరం దభీమని కిందపడిన చప్పుడూ వినిపించాయి ఇంట్లో వాళ్ళ పక్క బట్టలు ఎవరో లాగేసేవారు. కుర్చీలూ, బల్లలూ ఉంచిన చోట ఉండేవి కావు. ఒక రాత్రి ఆడపిల్లలకు తమ కాళ్ళ మీదుగా ఏదో కుక్క పడుకుని ఉన్నట్లు కనిపించింది. వాళ్ళ ముఖాలను చల్లగా ఏదో తుడిచినట్టయింది.

ఇటువంటి 'ఆగడాలు' చేస్తున్నదెవరో తెలుసుకోవాలని చాలా ప్రయత్నించారు. కాని 'దొంగ' దొరకలేదు ఎవరికీ నిద్రలుండేవి కావు.

1847 డిసెంబరు 11న ఆ కుటుంబం ఆ ఇంట్లో ప్రవేశించారు. 1848 మార్చి 30 రాత్రి యావత్తూ వారు జాగారం చేశారు. తెల్లవార్లూ ఇల్లంతా దెబ్బలతో మారుమోగిపోయింది. అది దయ్యాల కొంప అని ఫాక్స్ కుటుంబంవారు నిర్ధారణ చేసుకున్నారు

మర్నాడు రాత్రి చాలా చలిగా ఉంది మంచు కూడా పడింది. గాలికి కిటికీల తలుపులు చప్పుడవుతున్నాయి వాటిని సరిగా మూయలేదేమోనని, ఫాక్స్ లేచి వెళ్ళి కిటికీ రెక్కలను తట్టి చూచాడు

ఆయన వాటిని తట్టినప్పుడల్లా అదృశ్య వ్యక్తి ఒక దెబ్బ కొట్టటం కేటీ (కేథరీన్) గమనించింది ఆయన ఆ రెక్కలను ఎన్నిసార్లు తట్టితే అన్ని దెబ్బలూ అవతల నుంచీ వినిపించాయి

ఆడపిల్లలిద్దరికీ భయం పోయి ఏదో ఉత్సాహం వచ్చింది కేటీ ఆ అదృశ్య వ్యక్తితో 'ఇదిగో దయ్యమా ! నేను చేసినట్టు చెయ్యి' అంటూ చిటికెలు వెయ్యసాగింది.

ఆమె చిటికె వేసినప్పుడల్లా దెబ్బ వినిపించటం చూసి అందరూ నిర్ఘాంతపోయారు. మార్గరెట్ కూడా 'ఆట'లో చేరి, 'నేను చేసినట్టు చెయ్యి, ఒకటి, రెండు, మూడు, నాలుగు ' అంటూ చేతులతో చప్పట్లు చరచసాగింది ఈ చప్పట్లకు సరిగా దెబ్బలు కూడా వినిపించాయి.

ఇంతలో కేటీకి ఒక కొత్త వూహ తట్టింది ఆమె చప్పుడయ్యేటట్టు చిటికెలు వేయటం మానేసి, చప్పుడు కాకుండా వేయసాగింది. అయినా కూడా ఆమె చిటికె వేసినప్పుడల్లా దెబ్బ వినపడింది

కేటీ తల్లి కేసి తిరిగి, "అమ్మా, దానికి కనిపిస్తుంది కూడా !" అన్నది

ఇప్పుడు ఫాక్స్ సతి ముందుకు వచ్చి "పది దెబ్బలు కొట్టు !" అని అదృశ్యంగా ఉన్న శక్తిని పరీక్షకు పెట్టింది పది దెబ్బలు వినిపించాయి

"నా కెందరు పిల్లలు ?" అని అడిగిందామె

ఏడు దెబ్బలు వినిపించాయి ఈ సంఖ్య పొరపాటని ఆమె అన్నది కాని మళ్ళీ ఏడే

జవాబు వచ్చింది అప్పుడు గాని ఆవిడకు, తన బిడ్డలు ఆరుగురే బతికి ఉన్నప్పటికీ, ఒక బిడ్డ చనిపోయిన సంగతి జ్ఞప్తికి రాలేదు.

తన బిడ్డలందరి వయసులూ చెప్పమని ఆమె మళ్ళీ అడిగింది. ఒక్కొకరి వయసూ దెబ్బలతో సూచిస్తూ, బిడ్డకూ బిడ్డకూ మధ్య ఆగుతూ అదృశ్య శక్తి "ఆరుగురి" వయసులూ సరిగా చెప్పి మళ్ళీ కొంచెం ఆగి మూడు దెబ్బలు కొట్టింది. అది చనిపోయిన బిడ్డ వయసు.

ఈ అదృశ్య వ్యక్తికి సమాధానాలిచ్చే దక్షత ఉన్నదని తెలియగానే ప్రశ్నలు వేసేవారికి అడగాలన్న ఆత్రం జాస్తి అయింది. "అవును" అనటానికి గబగబా దెబ్బలు కొట్టమనీ, "కాదు" అనటానికి మౌనంగా వుండమనీ సంకేతాలు ఏర్పాటు చేశారు. "నువ్వు ఆత్మ జీవివా ? అయినట్టయితే రెండు దెబ్బలు కొట్టు" అని ఫాక్స్ భార్య అడిగింది. సమాధానంగా రెండు దెబ్బలు వినిపించాయి.

ఫాక్స్ కుటుంబానికి ముందు ఆ ఇంటిలో వీక్‌మన్ అనే అయనా, ఆయన కుటుంబమూ ఉండేవారు. తాముండేటప్పుడు కూడా ఇంట్లో అర్థంలేని చప్పుళ్ళు వినిపిస్తూ వచ్చాయని ఆయన అన్నాడు. వీక్‌మన్‌కు ముందు జాన్ సి. బెల్ అనే కమ్మరీ, ఆయనకు పూర్వం ఫాక్స్‌కు ఏడేళ్ళ క్రితం - విలియమ్ డ్యూజ్లర్ అనే ఆయనా ఆ యింట కాపరం ఉన్నారు.

డ్యూజ్లర్ ఉంటుండగా అది దయ్యాల కొంపకాదు. ఈ లోపుగా ఈ మార్పు ఎలా వచ్చిందో తెలుసుకోటానికి విలియమ్ డ్యూజ్లర్ వచ్చాడు. ఆయన చాలా ఓపికగా ఈ చప్పుళ్ళను పరిశోధించాడు. ఆ ఇంట్లో అదివరకు కాపరం ఉన్నవారందరితోనూ మాట్లాడి ఆయన ఒక విషయం తేల్చాడు. బెల్ కుటుంబం వెళ్ళిపోయి వీక్‌మన్ కుటుంబం ఆ ఇంట ప్రవేశించిన నాటినుండీ దానికి దెయ్యాల కొంప లక్షణాలు వచ్చాయి

డ్యూజ్లర్ కూడా దయ్యంతో సంభాషణలు జరిపాడు ఇందుకుగాను ఆయన మరికొన్ని సంకేతాలను ఏర్పరిచాడు ఏ ప్రశ్నకైనా సమాధానం రాకపోతే ఆయన ఆ ప్రశ్నను తల్లకిందులు చేసి వేసేవాడు "నా కెవరైనా ద్రోహం చేశారా ?" అంటే అవునని సమాధానం వచ్చింది "ఎవరినైనా బాధ పెట్టటానికి వచ్చావా ?" అంటే ఆత్మ జవాబివ్వలేదు "నీకు నేనుగాని నా వాళ్ళు గాని ఘోరం చేశామా ?" అంటే జవాబు లేదు. "నీకు ఘోరం చేసినదెవరు ?" అంటూ ఆయన ఆ ఇంట్లో ఉండిన ప్రతి వ్యక్తి పేరూ ఇచ్చి, సరి అయిన పేరును సూచించమన్నాడు. ఈ విధంగా ప్రశ్నించి ఆయన ఎవరికీ తెలియని ఒక హత్యా రహస్యాన్ని బయటికి తీశాడు

ఆ ఇంటిని ఆవహించిన ఆత్మ బార్ట్స్ బి. రోజ్నా అనే సంచార వ్యాపారిది. అతని వయసు 31 ఒకనాటి అర్థరాత్రి బెల్ అనే కమ్మరి అతన్ని పడకటింట్లో హత్యచేసి, శవాన్ని బొగ్గులుంచే నేల మాళిగలో పాతేశాడు నాలుగైదేళ్ళ క్రితం ఒక మంగళవారం రాత్రి 12 గంటలకు ఈ హత్య జరిగింది ఆ రాత్రి బెల్ భార్యగాని, వారి పని మనిషి లూక్రీషియాగాని ఇంట్లో లేరు ఈ సంభాషణలన్నీ అనేకమంది వింటుండగా జరిగాయి శవాన్ని పాతిన స్థలం కూడా చూపబడింది ఆ శవం హత్య జరిగిన మర్నాడు ఉదయం నేల మాళిగలో పది అడుగుల లోతున పాతిపెట్టబడ్డట్టు ఆత్మ సూచించింది

ఇదంతా నిజమని నిరూపించాలంటే శవాన్ని తవ్వి తియ్యాలి నేల మాళిగలో తవ్వారు మూడు అడుగులు తవ్వేసరికల్లా నీరు వూరింది తవ్వటం అప్పటికి మానేసి వేసవిలో మళ్ళీ తవ్వారు అడుదడుగుల లోతున ఒక కొయ్య పలక కనిపించింది ఇంకా అడుగున సున్నమూ, బొగ్గూ, వాటి కిందుగా ఒక మానవ కపాలం తాలూకు భాగమూ, కొద్దిగా మనిషి ఎముకలూ దొరికాయి అవే రోజ్నా ఎముకలై ఉంటాయని కొందరు తృప్తి చెందారు

కాని రోజ్నా అసలు శవం మరి 50 ఏళ్ళకు గాని దొరకలేదు. అది దొరికింది నేల మాళిగలో కానేకాదు ఆ ఇంటి గోడలో ఉన్న ఒక సొరుగులో. రోజ్నాను హత్య చేసినవారు మొదట అతన్ని నేల మాళిగలో పాతేసిన మాట నిజమే. అక్కడ కనిపించిన కపాల భాగం ఆ శవానిదే కాని తరువాత ఆ శవాన్ని అక్కడి నుండి ఎత్తి గోడలో ఉన్న ఒక అరలో పెట్టి పూడ్చేశారు. ఈ సంగతి ఏ కారణం చేతనో రోజ్నా ఆత్మకు తెలియదు.

ఈ లోపల ఈ దయ్యాల కొంప అనేక వందల మంది పరిశోధకులను ఆకర్షించింది. ప్రతివాళ్ళూ వచ్చి తమ పిల్లల వయసులు అడగసాగారు. "అవును, కాదు" అని సమాధానాలు రాదగిన ప్రశ్నలడిగారు. అన్నిటికీ సమాధానాలు సరిగా రాసాగాయి. "ఫాక్స్ కుటుంబంవాళ్ళు ఏదో మోసం చేస్తున్నారు" అన్న నమ్మకంతో వచ్చిన వాళ్ళు కూడా ఇందులో మోసానికి తావులేదని ఒప్పుకోవలసి వచ్చింది. కనుకట్టు చేసి దెబ్బలు కొట్టటం సాధ్యం కావచ్చు, కాని ఎవరెవరో పరీక్ష చెయ్యటానికి అడిగిన ప్రశ్నలన్నిటికీ సరి అయిన సమాధానాలివ్వటం ఏ మానవమాత్రుడి వల్లా అయ్యే పని కాదు

ఈ విధంగా ఒక చనిపోయిన సంచార వ్యాపారి ఆత్మ తన ఉనికిని గురించి ప్రపంచానికి చాటి రుజువు చేసుకున్నది. అయితే దానితోబాటు ఇంకొక విషయం కూడా రుజువయింది రోజ్నా ఆత్మ ఈ లోకంలో వారితో మాట్లాడటానికి అవసరమైన శక్తి ఫాక్స్ కుమార్తెలు సరఫరా చేశారు !

ఫాక్స్ కుటుంబానికి చూడవచ్చేవారి తాకిడితో వూపిరి సలపలేదు వాళ్ళ యిల్లు ఒక తీర్థంలాగా తయారయింది వారి కుమారుడు డేవిడ్ అనేవాడు రెండు మూడు మైళ్ళ దూరంలో ఉంటున్నాడు తనతో వచ్చి ఉండమని తల్లిదండ్రులనూ, చెల్లెళ్ళనూ ఆహ్వానించాడు. వారు సంతోషంగా వెళ్ళారు

అయితే "చప్పుళ్ళు" కూడా వారి వెంట వెళ్ళాయి ! మనుషులను విడదీస్తే ఈ బెడద తగ్గిపోతుందనే ఆశతో ఫాక్స్ పెద్ద కుమార్తె లియా తన తల్లినీ కేటీని రోచెస్టర్ నగరంలో ఉన్న తన ఇంటికి తీసుకుపోయింది మార్గరెటా మటుకు తన అన్న డేవిడ్ వద్ద ఉండిపోయింది. అయితే "చప్పుళ్ళు" నిలిచిపోలేదు వాటిని పుట్టించగల శక్తి ఇద్దరాడపిల్లలకూ ఉన్నట్టు స్పష్టమయింది కొన్నాళ్ళకు మార్గరెటా కూడా రోచెస్టర్ చేరింది

రోచెస్టర్ నగరంలో ఈ ఆడపిల్లలున్నచోట ఆత్మలు చేరి అందరితోనూ సంభాషణలు సాగించాయి

అయితే ఈ సంఘటనలు ఫాక్స్ కుటుంబం వారికి ఖ్యాతి చేకూర్చలేదు. వారిని అనేకులు "సైతాను దూతలు"గా చూడసాగారు లియా సంగీత పాఠాలు చెప్పుకుని నాలుగు డబ్బులు సంపాదించుకునేది. ఆమె శిష్యులు చాలామంది చాలించుకున్నారు

ఇదంతా చూసి ఫాక్స్ కుటుంబంవారు ఆత్మలను తమ జోలికి రావద్దని వేడుకున్నారు. బహిరంగ సమావేశాలలో ప్రదర్శనలిచ్చి, ఇందులో మోసంలేదని రుజువు చేసుకోమని ఆత్మలు సూచించాయి కాని ఇప్పటికే చాలా అపవాదు వచ్చిందన్నారు ఫాక్స్ కుటుంబంవారు ఆత్మలు ఆ తరువాత వారిని విడిచి వెళ్ళిపోయాయి మొదట్లో వారికి చాలా తృప్తి కలిగింది కాని క్రమేణా జీవితం డొల్ల అయినట్టు వారు భావించసాగారు వారు ఆత్మలను వచ్చి మాట్లాడమని వేడుకున్నారు బహిరంగ ప్రదర్శన లిస్తామన్న తరువాత గాని ఆత్మలు రాలేదు

మొట్టమొదటి బహిరంగ ఆధ్యాత్మిక ప్రదర్శన సమావేశం రోచెస్టర్ నగరంలో 1849 నవంబరు 14న జరిగింది ఆరోజు వేదిక మీద కూచున్న వారిలో మార్గరెటా ఒకటే "మీడియం"

కార్రన్ అనే ఆయన "చప్పుళ్ళ కథ"ను సభికులకు వివరించి చెప్పాడు ఆయన మాట్లాడుతున్నంత సేపూ హాలు అంతటా చప్పుళ్ళు వినిపించాయి

ఆ సమావేశానికి వచ్చిన సభికులలో అయిదుగురిని ఏరి ఒక కమిటీగా వేసుకున్నారు వారు "మీడియం"ను పరీక్షించి తమ నివేదికను పై సమావేశానికి సమర్పించేటట్టుగా తీర్మానం జరిగింది.

రెండవ సమావేశంనాటికి నివేదిక తయారయింది అది 'మీడియం' కు అనుకూలంగా ఉంది. చప్పుళ్ళలో మోసం ఏమీ లేదు

కాని సభికులు తృప్తిపడలేదు. మరొక కమిటీ ఎన్నుకోబడింది ఈ కమిటీ సభ్యులు మీడియంతో ముందుగా చెప్పకుండా ఎవరి ఇంటికో తీసుకపోయి అక్కడ ప్రదర్శన ఏర్పాటు చేసేవారు. అయినా ఆత్మలు వచ్చి సంభాషించేవి దెబ్బలు కొట్టటానికిగాని, చప్పుళ్ళు చేయటానికి కాని మీడియంలు కృత్రిమ సాధనాలు ఉపయోగిస్తున్న జాడలేమీ లేవు

రెండవ కమిటీవారి నివేదిక మూడవ సమావేశానికి సమర్పించబడింది. అది కూడా మీడియంలకు అనుకూలంగానే ఉంది. ఇది చూసి సభికులు సంతోషించటానికి బదులు మండిపోయారు "మోసం" బయట పెట్టగలందులకు ఇంకొక కమిటీ వేయబడింది

మీడియంలు విద్యుచ్ఛక్తిని ఉపయోగిస్తున్నారనే ఉద్దేశంతో వారిని దిళ్ళ మీద నిలబెట్టారు. గాజు పలకలపై నిలబెట్టారు. వారి దుస్తులన్నిటినీ పరీక్షించారు. మోకాళ్ళతోనూ, మడమల కీళ్ళతోనూ చప్పుళ్ళు చేయకుండా కాళ్ళు భద్రంగా కట్టారు ఇన్ని జాగ్రత్తలు పడినప్పటికీ గోడల మీదా, కప్పు మీదా కూడా చప్పుళ్ళు వినిపించాయి పరీక్ష చేసేవారు తమ మనస్సులో అనుకున్న ప్రశ్నలకు కూడా సరి అయిన సమాధానాలు వచ్చాయి అందుచేత నాలుగవ సమావేశంలో చదివిన నివేదిక కూడా మీడియంకు అనుకూలంగానే ఉంది ఇది ప్రేక్షకులలో కొందరికి ఏ మాత్రమూ రుచించలేదు. కొందరు రౌడీలు టపాకాయలు పేల్చి అల్లరి చేశారు మీడియంలను పోలీసు రక్షణతో ఇంటికి చేర్చవలసి వచ్చింది

కాని ఆధ్యాత్మిక పరిశోధనలు ఇంకొక విధంగా వ్యాప్తి చెందాయి తమతో మాట్లాడటానికి వచ్చిన వారికి ఆత్మలు మీ ఇళ్ళలోనే ప్రదర్శనలు ఏర్పాటు చేసుకోండి అని సలహా ఇచ్చాయి ఈ విధంగా అక్కడక్కడా చిన్న కూటాలు ఏర్పడి ఆధ్యాత్మిక పరిశోధనలను సాగించటం ద్వారా ఆధ్యాత్మిక శాస్త్రానికి పునాదీ, వ్యాప్తీ ఏర్పడింది

ఫాక్స్ కుటుంబంలాగా అదివరకు ఎన్నో కుటుంబాలు దయ్యాల కొంపలలో కాపరం ఉండటం జరిగింది. కాని ఆ దయ్యాలు మనుషులలాగా చూడటమూ, వినటమూ, అర్థం చేసుకోవటమూ నేర్చినవని కేటీ ఫాక్స్‌లాంటి చిన్న పిల్ల గుర్తించటంతో ఆధ్యాత్మిక శాస్త్రం ఒకటి ఏర్పడటం జరిగింది శాస్త్ర పరిశోధనలకు ఇలాంటి అల్ప సంఘటనలు మూలంగా ఉండటం పరిపాటే చెట్టు నుంచి ఆపిల్ పండు కిందపడటం గమనించిన న్యూటన్ గురుత్వాకర్షణ సిద్ధాంతం ప్రతిపాదించాడు. చచ్చిన కప్ప కాలు కదలటం నుంచి "గాల్వనిజం" వచ్చింది స్టీవెన్సన్ నీటి కెటిల్ నుంచి ఆవిరికి గల బలాన్ని గుర్తించి ఆవిరి యంత్రాలు చేశాడు

× × ×

దయ్యాల కొంపలన్నవి ప్రతి దేశంలోనూ, ప్రతి యుగంలోనూ ఉన్నాయి వాటిని గురించి పత్రికలలో తరుచు వార్తలు కూడా ఉంటాయి. అంతర్జాతీయ ఆధ్యాత్మిక పరిశోధనా సంస్థవారు 1,400 ఏళ్ళ మీదట (530 నుంచి 1935 దాకా) దయ్యాల కొంపల మీద వెలువడిన పుస్తకాలూ, వ్యాసాలూ, వార్తలూ జాబితా తీశారు అది బ్రహ్మాండమైన కేటలాగుగా తయారయింది

పేదవాళ్ళ ఇళ్ళూ, అనామకుల ఇళ్ళూ మాత్రమే కాక సంపన్నుల యిళ్ళూ, ఘరానా మనుషుల ఇళ్ళూ కూడా దెయ్యాల కొంపలు కావటం కద్దు ఇలాంటి ఇళ్ళలో దయ్యాలు "అల్లరి' ' సాగిస్తాయి చప్పుళ్ళు చేస్తాయి బిందెలు, తప్పేలాలు మోగిస్తాయి వాటిని తలకిందులు చేసి వాటిలో ఉన్నవి ఒలకబోస్తాయి వస్తువులు గిరవాటు వేస్తాయి మనుషుల పక్కగా రాళ్ళు పడేస్తాయి కర్ర సామాను అటూ ఇటూ ఈడ్చేస్తాయి

దయ్యాల కొంపల్లో గంటలు మోగవచ్చు మనుషులూ, పసిపిల్లలూ, గొడ్లూ నడిచిన చప్పుళ్ళు వినిపించవచ్చు కర్రలు నేల మీద ఎగురుతున్న చప్పుళ్ళు కూడా వినిపించవచ్చు

ఒక్కొక్కసారి మనిషి గొంతులు వినిపిస్తాయి మూలగటమూ, రహస్యం చెప్పటమూ, పొలికేకలూ, ఈలలూ, మనిషి గొంతులతో పాటు మాటలు స్పష్టంగా వినిపించక పోవచ్చు

కొన్ని ఇళ్ళలో దయ్యాలు కనిపిస్తాయి కూడా అవి స్త్రీ పురుషుల ఆకారాలు కావచ్చు. లేక కదిలే నీడలుగా ఉండవచ్చు ఒకొక్కసారి జంతువులు కూడా కనిపిస్తాయి సృష్టిలో లేని జంతువులు కూడానూ.

ఇంట్లో ఉన్నవారిని "ఏడిపించటమూ", "మేము తలుచుకుటే ఏమైనా చెయ్య గలం" అని రుజువు చెయ్యటమూ దయ్యాల ఆశయంగా కనబడుతుంది ఒక "దయ్యం" వంట ఇంట్లో అశుద్ధం వేసేది మనుషులు పడుకున్న చోట పై నుంచి ఇటుక రాళ్ళు పడేసేది. ఇంట్లో పాత్రలన్నీ తీసుకుపోయి ప్రహరీ గోడమీద వరసగా పేర్చి పెట్టేది !

దయ్యాలు వస్తువులను కదిలించటం చాలామంది చూశారు అయితే వస్తువు ఉన్నచోటినుంచి కదలటం ఆరంభం కావటం ఎవరికీ కనబడ్డట్టు లేదు కదలుతూ ఉన్న వస్తువే తరచు కనిపిస్తుంది ఇంకొక చిత్రమేమిటంటే ఏ వస్తువు గాని ఒకచోటి నుంచి ఇంకొక చోటికి చేరినప్పుడు విసిరివేసిన వస్తువులాగా దొర్లటం గాని, పక్కకు పడటం గాని చేయదు ఎవరో తెచ్చిపెట్టినట్టుగా చేరిన చోట నిలబడి ఉంటుంది. ఈ కదిలే వస్తువులు విసిరివేసిన వస్తువులంత వేగంగా కదలవని చాలామంది చెబుతున్నారు ఇంతకన్నా వింత ఏమిటంటే కదలివచ్చే వస్తువు మధ్య దారిలో ఇంకొకవేపు తిరగటం కూడా జరుగుతుంది. విసిరిన వస్తువయితే సూటిగా ప్రయాణిస్తుంది.

కప్పునుంచి రాళ్ళూ ఇటుక పడటం జరుగుతుందన్నాను తీరా విచారిస్తే, ఇలా పడిన ఇటుకలూ, రాళ్ళూ కప్పు తాలూకువి అయి వుండవు ఇంట్లో ఎక్కడా లేని రాళ్ళూ రప్పలూ వచ్చి ఇంట్లో పడతాయి. పడిన వెంటనే వాటిని తాకినట్టయితే అవి వేడిగా ఉంటాయి. ఒక్కోసారి తాకటానికి వీలులేనంత వేడిగా ఉంటాయిట.

దయ్యాలు బతికి ఉన్న వారి మీది 'కసి' కొద్దీగాని, వారిని 'శిక్షించటానికి' గాని పైన చెప్పిన 'అల్లరి పనులు' చేస్తాయని చాలామంది నమ్ముతారు కాని ఇది అపోహగా కనిపిస్తుంది ఎందుచేతనంటే దయ్యాల ఇళ్ళలో ఉండేవారికి హాని జరగటం ఎప్పుడూ వినం 'అవి' తలచుకుంటే ఎంత హాని అయినా చెయ్యగలవని దయ్యాల ఇళ్ళ అనుభవం గల వారు సులువుగా వూహించగలుగుతారు 'ఇంత పెద్ద ఇటుకరాయి నాకు అరంగుళాలలో పడింది కాస్త అయితే నా తల పగిలిపోవలసిందే !" అంటారు కాని ఆ 'కాస్తా' ఎప్పుడూ కాదు దయ్యపు చేష్టలు ఎంత బీభత్సంగా ఉన్నా నిరపాయంగా ఉంటాయని ఒప్పుకోవాలి ఒకొక్కసారి వస్తువులు తగలబడటం కూడా జరుగుతుంది. కాని అటువంటి మంటలు ఎన్నడూ ప్రమాదకరంగా పరిణమించవు. కుండలూ, చట్లూ పగిలినా, కాగితాలు తగలబడిపోయినా కూడా 'నష్టం' అట్టే జరగదు.

ముఖ్యంగా ఈ 'దయ్యాలు' పిల్లల జోలికి ఎన్నడూ పోవు  దయ్యాల కొంపల్లో ఉండే పిల్లలు పెద్దవాళ్ళ లాగా భయపడరు కూడా

దయ్యాలు ఈ పనులు ఎలా చేస్తాయి అన్న ప్రశ్నకు సమాధానం వూహించవచ్చు ఆ ఇంట్లో వుండేవారిలో ఎవరో ఒకరు - ముఖ్యంగా చిన్న వయసువారు, అందులోనూ ప్రత్యేకించి స్త్రీలు - దయ్యాల చేతులకు అవసరమైన 'శక్తి' సప్లయి చెయ్యాలి

ఒకే కుటుంబం గల ఇళ్ళలోనే "దయ్యాలు" చేరతాయనుకోవటానికి కూడా ఆధారం ఉంది  ఆధునిక నగరాలలో 'దయ్యాల కొంపలు' చాలా తక్కువ.

ఎలాంటి ఆత్మలు దయ్యాలుగా వ్యక్తమవుతాయన్న ప్రశ్నకు రెండు రకాల సమాధానాలిస్తున్నారు  భౌతిక వాసనలు వదలని ఆత్మలు దయ్యాలవుతాయని ఒక వాదన. కాని కొందరు దీన్ని ఆమోదించరు  "ఇంకొక ప్రపంచం ఉన్నదనీ, జీవితమంటే భూమిమీది జీవితం మాత్రమే కాదనీ బతికున్నవారికి జ్ఞప్తి చెయ్యటానికి దయ్యాలు కృషి చేస్తాయి" అంటారు వారు.

రెండో అభిప్రాయమే సరి అయినది కావచ్చు. ఎందుచేతనంటే 'దయ్యాల కొంప'లు ఎల్లప్పుడూ అలాగే ఉండిపోవు  సాధారణంగా కొద్ది నెలల తరువాత దయ్యం తన 'పని' ముగించుకుని వెళ్ళిపోతుంది

**(ఆంధ్రప్రభ, వారపత్రిక, 8-1-1958)**

# 10. విచిత్రమైన శరీరధర్మం

డాక్టర్ కిల్నర్ అనే ఆయన ఆధ్యాత్మిక పరిశోధకుడు కాడు. ఆయనకు ఆ పరిశోధనలను గురించి కూడా ఏమీ తెలియదు కాని ఆయన మానవ శరీరాన్ని గురించి చేసిన విచిత్రమైన పరిశోధనలు ఆధ్యాత్మిక పరిశోధకుల అనుభవాలను బలపరుస్తున్నాయి. తన పరిశోధనలను ఆయన "ది హ్యూమన్ ఎట్మాస్ఫియర్" అనే గ్రంథంలో వివరించాడు

ఆయన కనిపెట్టిన ప్రధాన విషయమేమంటే మానవ శరీరంతటా నాడీ శక్తి ఒకటి వ్యాపించి, శరీరాన్ని చుట్టి ఉంటుందనీ, ఆ శక్తిని వినియోగపరచుకుని మనస్సు పనులు చేయిస్తుందనీ. చిత్రకారులు సాధారణంగా దేవతలను చిత్రించేటప్పుడు వారి తలల చుట్టూ కాంతివంతమైన ప్రకాశాన్ని చిత్రిస్తారు. అలాంటి "ప్రకాశం" అదృశ్యంగా మనుషుల శరీరాల చుట్టూ ఉంటుందనీ కిల్నర్ కనిపెట్టాడు. ఈ ప్రకాశం వూహ్యం మాత్రమే కాదనీ, ప్రదర్శనీయమనీ ఆయన క్లోరీన్ మొదలైన వాయువుల సహాయంతో రుజువు చేశాడు. అంతేకాదు ఈ ప్రకాశం తాలూకు "రంగు"లను ఔషధాల ప్రయోగంతో మార్చవచ్చు. ఒక మనిషి శరీరం చుట్టూ ఉండే ప్రకాశం యొక్క రంగూ, ఆకారమూ, ప్రమాణమూ మొదలైనవాటిని బట్టి ఆ శరీరంలో ఉన్న వ్యాధిని నిదానించడం కూడా ఆయన చేశాడు.

ఆయన ఈ ప్రకాశాన్ని మామూలు కళ్ళతో చూడడానికి కొన్ని "స్క్రీన్"లు తయారు చేశాడు. ఈ ప్రకాశం గురించి ఆయన గమనించిన అనేక విషయాలు ఆయనకే సరిగా అవగాహన కాలేదు. కాని ఇవి ఆధ్యాత్మిక పరిశోధకులకు సులువుగా అర్థమవుతాయి.

ఒక స్త్రీ తన బుద్ధి శక్తి చేత తన ప్రకాశాన్ని చాలా దూరం కర్రల రూపంలో పంపగలిగేది. ఆ 'కర్రలు' ఆమె శరీరంలో ఆమె తలచుకున్న భాగం నుంచి తోసుకువచ్చేవి అదే విధంగా ఆమె తన ప్రకాశం తాలూకు రంగును కూడా ఇష్టం వచ్చినట్లు మార్చగలిగేది.

"ఆమె శరీరపు ప్రకాశాన్ని అనేకమంది వైద్యులు కూడా గమనించిన కారణం చేత కొన్ని వింత విషయాలు బయటపడ్డాయి. ఒకసారి ఆమె తన చేతులు వేళ్ళాడవేసి నిలబడి ఉండగా, ఆమె శరీరం నుంచి మూడు కాంతివంతమైన కిరణాలు బయలుదేరి ఆమె శరీర ప్రకాశాన్ని దాటి చాలాదూరం వెళ్ళాయి. ఇంకొక సందర్భంలో గది వేడెక్కిపోవడం చేత ఆమెకు నిస్సారం వచ్చేసింది. వెంటనే ఆమె శరీర ప్రకాశం మందగించింది. తిరిగి ఆమెకు సత్తువ వచ్చాకగాని అది యథాస్థితికి రాలేదు" అని డాక్టర్ కిల్నర్ రాశాడు

ఇంకొక మనిషి శరీరం నుంచి నాలుగు కిరణాలు వెలువడడం కనబడింది.

నిజానికి మామూలు వైద్యుడికిదంతా అయోమయంగా ఉంటుంది.

కిల్నర్ గమనించిన ప్రకాశాన్ని రుజువు చేయటానికి ఒక హోర్లిస్ట్రీట్ నిపుణుడు ఒక ప్రయోగాన్ని కనిపెట్టాడు. ఆ ప్రయోగం ఇది సామాన్యంగా మనం దీపాలు వెలిగించుకోవడానికి ఉపయోగించే గృహ విద్యుత్తును టాన్స్‌ఫార్మర్ ద్వారా అతి సూక్ష్మ విద్యుత్ప్రవాహం చెయ్యాలి దానిని మనిషి ద్వారా ప్రవహింపజేసి "ఎర్త్" చేయాలి ఈ కొద్దిపాటి విద్యుత్ప్రవాహానికి మనిషి "షాక్" తినడు. అతని శరీరంలో విద్యుత్తు ప్రవహిస్తున్నట్లు కూడా తెలియనవసరం లేదు

ఈ స్థితిలో ఆ మనిషి దగ్గరికి ఒక నియాన్ ట్యూబ్‌గాని, నియానుగాసు నింపిన బల్బు గాని తీసుకురావాలి. ట్యూబు (లేక బల్బు) మనిషికి రెండు అడుగుల దూరంలో ఉండగా అందులో కొద్దిపాటి వెలుగు ఆరంభమై, దగ్గరికి వచ్చినకొద్దీ బాగా వెలుగుతుంది

ఆ ట్యూబులో వెలిగేది విద్యుచ్ఛక్తేనని వేరే చెప్పనవసరం లేదు మనిషి శరీరానికి ట్యూబు తగలటం లేదు గనుక ఆ శరీరం చుట్టూ ఉండే ప్రకాశమే విద్యుత్తును అందించాలి

ఈ ప్రకాశాన్ని గురించి ఆధ్యాత్మిక పరిశోధకులు చెప్పే సంగతులు తెలుసుకుందాం

మానవుడు అనుక్షణమూ కిరణాలను వెదజల్లుతాడు ఈ కిరణాలతో కూడుకున్న ప్రకాశం భావానికి వాహనం లాంటిది శరీరతత్వ శాస్త్రవేత్తలు ఏ విధంగానైతే భావాలను మెదడుతో ముడిపెడతారో అదే విధంగా ఆధ్యాత్మికవాదులు భావాలను ఈ పదార్థంతో ముడిపెడతారు భావాలను బట్టి ఈ సూక్ష్మపదార్థము మార్పులు చెందుతూ ఉంటుంది. దీనిపై మనిషి నడవడిక యొక్క ప్రభావమూ, ఆరోగ్యం యొక్క ప్రభావం కూడా ఉంటాయి. ఈ పదార్థం సహాయంతోటే సమస్తమైన ఆధ్యాత్మిక దృగ్విషయాలూ సాధ్యపడుతున్నాయి

మానసిక ప్రవృత్తులన్నీ ఈ పదార్థమే క్షేత్రంగా కలిగి ఉంటున్నాయి గనుకనూ, ఇలాంటి పదార్థం ఉన్నట్టు అనేకమంది పరిశీలకులు స్వతంత్రంగా నూరేళ్ళకు పైగా రుజువు చేస్తూ వస్తున్నారు గనుకనూ, జీవతత్వశాస్త్రజ్ఞులు అనేక అద్భుతమైన పరిశోధనలు జరపవచ్చునని ఆధ్యాత్మికవాదులు భావిస్తున్నారు

ఈ పదార్థానికి "సైకోప్లాజం" అని పేరు పెట్టారు ఘనీభవించిన సైకోప్లాజంను శాస్త్రజ్ఞులు "ఎక్టోప్లాజం" అనీ, "టెలీప్లాజం" అనీ అంటున్నారు. ఈ స్థితిలో ఇది మామూలు కళ్ళకు కనిపిస్తుంది దీన్ని పట్టుకుని చూడవచ్చు ఫోటోగ్రాఫు చేయవచ్చు, దాని దార్ఢ్యం పరిశీలించవచ్చు. ఇవన్నీ చేయటమే గాక శాస్త్రజ్ఞులు కేవలం జ్ఞానాన్వేషణతో దీన్ని రసాయనిక విశ్లేషణ కూడా చేశారు

తమ శరీరాలు విద్యుదయస్కాంత పదార్థంతో చేయబడినవని ఆత్మలు చెప్పుకున్నాయి. "విద్యుదయస్కాంత"శక్తి అన్నది భౌతిక శాస్త్రవేత్తలకు చిర పరిచితమైనదే అది ఒక పదార్థంగా వారెన్నడూ భావన చెయ్యరు కాని ఆత్మలు అలాంటి పదార్థం కాని కాకపోతే అవి మానవ శరీరాల నుంచి వెలువడే ప్రకాశాన్ని వినియోగించుకొని ఆధ్యాత్మిక దృగ్విషయాలు సంఘటింప చేసే అవకాశం లేదు. ఇది ఖచ్చితమైన భౌతికవాదం

ఆ లోకంలో ఉండే ఆత్మలకు మన "భౌతిక" శరీరాలు కనిపిస్తాయో లేదో స్పష్టంగా తెలియదు. కాని వారికి మన శరీరాల వెంట ఉండే "సైక్లోప్లాజం" కనిపిస్తుంది దాన్ని వారు స్పృశించగలరు. దానితో ఏది కావాలంటే అది తయారు చేయగలరు. సజీవ ప్రకృతిలో ఇది హెచ్చుగా ఉన్నప్పటికీ జడప్రకృతి వెంట కూడా ఈ పదార్థం కొంత ఉండనే ఉన్నది

ఆధ్యాత్మిక ప్రదర్శనలు చేసేవారు గాలిలో తేలినా, తమ శక్తి చేత ఇతర వస్తువులను గాలిలో నడిపించినా, ఆత్మల చేత మాట్లాడించినా ఆత్మలను తాము చూసినా, వాటికి శరీరాలిచ్చి అందరికీ కనబడే లాగు ప్రత్యక్షం చేసినా ఆత్మలిచ్చే సందేశాలను తను చేతులతో రాసినా సైకోప్లాజంవారికి సహాయభూతమవుతుంది

సాధారణ పరిస్థితులలో అదృశ్యంగా ఉండే ఈ పదార్థం పొగమంచు రూపంలో మీడియం ఉండే చోట, లేక ఆధ్యాత్మిక ప్రదర్శన జరిగేచోట, కనిపించడం అనేకమంది అంతులేనిసార్లు చూశారు. ఇది కంటికి కనిపించినప్పుడు ఎక్టోప్లాజం రూపంలో బూడిద రంగుగా గాని, తెల్లగా గాని ఉంటుందట. ఒక్కొకప్పుడిది ఉల్లిపొర బట్టలాంటి రూపంలో తటస్థ పడుతుంది అలాంటి స్థితిలో అది షిఫాన్ లాగాగాని, ఇంకా గరుకుగాగాని ఉండవచ్చు.

మనం నిత్యజీవితంలో పంచేంద్రియ జ్ఞానంతో గుర్తించే పదార్థమంతా ఈ "ప్రకాశం" యొక్క రూపమేనని కొందరు నమ్ముతున్నారు. ఇదే నిజమైనట్టయితే దీన్ని మనం

సృష్టి యొక్క మూల పదార్థంగా భావించవచ్చు అది అవ్యయం, ఆదిమధ్యాంత రహితం, శాశ్వతం. "నైనం ఛిందంతి శస్త్రాణి, నైనం దహతి పావకః, నచైనం క్లేదయం త్యాపో, నశోషయతి మారుతః" అన్న భగవద్గీత శ్లోకం ఈ పదార్థానికి వర్తిస్తుంది

ఛిందించగలేదు కత్తి
నిప్పు దాన్ని కాల్చలేదు
నీరు దాన్ని ముంచలేదు
గాలి దాన్ని చెనకదంట
ఆ శ్లోకానికి శ్రీశ్రీ కవితానువాదం

సం॥

నిజానికి ఈ ఉన్నతస్థానం ఒకప్పుడు పరమాణువులకు ఇవ్వబడింది. ఎన్ని రసాయనిక మార్పులు జరిగినా, పరిణామాలు జరిగినా మూల పదార్థాల తాలూకు పరమాణువులకు "చలనం" లేదని ఒకప్పుడు శాస్త్రవేత్తలు నమ్మారు. గాలిలో ఉండే ప్రాణవాయువు పరమాణువులే నీటిలో కూడా ఉంటాయి కానీబిళ్ళలో ఉన్న రాగిలోహం తాలూకు పరమాణువులే మైలతుత్తంలో కూడా ఉంటాయి

అయితే రూథర్‌ఫర్డ్ పరిశోధనల అనంతరం పరమాణువులకు గల ఈ అవ్యయత్వం పోయి పరమాణువులు శాశ్వతం కాదని తెలిసిపోయింది అణువు బాంబులో పరమాణువుల విచ్ఛిత్తి, హైడ్రోజన్ బాంబులలో హైడ్రోజన్ పరమాణువుల సంయోగం ద్వారా హీలియం పరమాణువుల సృష్టి జరిగింది

ఐన్‌స్టెయిన్ నిర్వచనం ప్రకారం పదార్థమంతా "ఘనీభవించిన" శక్తి. శక్తిని శాసించే అధికారం మనస్సుకున్నట్టుగా మరిదేనికీ లేదు ఆ కారణం చేత, ఆధ్యాత్మికవాదులు మనస్సు అనేదాన్ని పదార్థానికి ప్రత్యేకించి మెదడుకు భిన్నంగా ఉన్నదానినిగా భావించడంలో కొంత ఔచితి ఉన్నట్టు కనబడుతుంది

మనసుకు మెదడు ఒక బాహ్య సాధనమా, లేక మెదడు యొక్క గుణం మనస్సా అన్నదాన్ని గురించి వితర్కించవచ్చు. మనస్సు మెదడును, కండరాలను ఉపయోగించినట్టే, తన పరికరంగా ఉపయోగిస్తుందని కొందరి వాదం. "మనం దేన్నయినా జ్ఞాపకం ఉంచుకొనవలసి వస్తే ఆ విషయాన్ని మెదడులో ఒక భాగానికి చేర్చవచ్చు లేదా నోటు పుస్తకంలో రాసుకోవచ్చు నోటు పుస్తకంలో రాసుకున్నది నోటు పుస్తకంతోపాటు పోయినట్టే, జ్ఞాపకశక్తికి ఆధారభూతమైన మెదడు భాగానికి దెబ్బ తగిలితే జ్ఞాపకం కూడా పోతుంది. తిరిగి నోటుపుస్తకం దొరికితే ఏమవుతుందో దెబ్బతిన్న మెదడుకు చికిత్స జరిగినా అదే అవుతుంది" అని వారి వాదం

ఒక్క మెదడే కాదు, నాడులకు దెబ్బ తగిలినా, కండరాలకు పక్షవాతం వచ్చినా మనస్సు కొన్ని పనులు చేయించలేకపోతుంది దానిని బట్టి ఇవన్నీ మనసు సాధనాలేగాని వీటి తాలూకు గుణం మనస్సు అనుకోవటానికి అంతగా ఆధారం కనబడదు

ఈ విషయంలో సందేహం ఏమైనా ఉంటే "టెలిపతీ" ఈ సందేహాన్ని పూర్తిగా నివర్తి చేసేసింది "టెలిపతీ" అంటే మనసును మనసు అందుకోవడం శాస్త్రవేత్తలు చాలాకాలం '

'టెలిపతీ" అనేది ఉన్నదని ఆమోదించలేదు, కాని అంతులేని సాక్ష్యం లభించినమీదట ఆమోదించక తప్పింది కాదు. అలాగే హిప్నాటిజమును కూడా శాస్త్రజ్ఞులు ఆమోదించవలసి వచ్చింది వాస్తవాన్ని ఎదుర్కొని నిజం అన్వేషించి, ప్రచారంలో ఉన్న అపోహల స్థానంలో శాస్త్రీయమైన విశ్వాసాలను నెలకొల్పి, శాస్త్ర పురోగమనంతో బాటు మానవ సౌభాగ్యాన్ని పెంపొందించడం శాస్త్రవేత్తల ధర్మం హిప్నాటిజం ఈనాడు ఆస్పత్రులలో సైతం బాధానివారణకూ, ప్రసూతికీ వాడుక చేయబడుతున్నది ఇంతకూ అసలు విషయం ఏమిటంటే, మనస్సు కేవలం మెదడు యొక్క లక్షణమే అయినట్టయితే దూరాన ఉన్న మనస్సులు ఒకదాని నొకటి అర్థం చేసుకోవటం టెలిపతీ - ఎలా సాధ్య మవుతుంది ?

దీనికి సమాధానం లేదు

మనస్సుకు ఇతర శరీర ధర్మాల మీదగల అపారమైన శక్తిని హిప్నాటిజం ప్రత్యక్షం చేస్తున్నది. హిప్నాటిజం చేసిన మనిషి శరీరానికి కాలుతున్న సిగిరెట్టును నొక్కి పెడితే ఆ మనిషికి బాధ తెలియలేదు సరికదా, కాల్చినచోట బొబ్బ కూడా ఎక్కలేదు ఈ విషయాన్ని ప్రొఫెసర్ జే.బి యస్. హాల్డేన్ స్వయంగా చూశాడు "శరీర ధర్మశాస్త్రం గురించి అనేక విషయాలు మనకు తెలియవు హిందూ యోగులకు అవి తెలుసు" అన్నాడాయన.

ఒక భారతీయ యోగి లండన్‌లో ఇచ్చిన ప్రదర్శనం వివరాలివి ఆ యోగి పేరు తానాబే అని చెప్పబడుతున్నది. 1927లో ఆయన ఈ క్రింది ప్రదర్శన ఇచ్చాడు 1929లో ఇలాంటి ప్రదర్శనే ఒక ఫ్రెంచి థియేటరులో ఇచ్చాడు.

ఆయన చేసే ప్రతి పనీ విమర్శగా చూడటానికి నూరుమంది వైద్యులు స్టేజిమీద కూచున్నారు. వారు ముందుగా ఆయనను పరీక్షించారు తర్వాత ఆయన తనను తాను కత్తితో పొడుచుకున్నాడు ఆయన పొడుచుకున్న పోటుకు మరొకడైతే ప్రమాదస్థితికి రావచ్చు, చావవచ్చు కూడా కాని ఆయన తన గాయాల నుంచి రక్తం కారకుండా నిగ్రహించి చూపాడు తరువాత ఆ గాయాల నుంచి రక్తం తెప్పించి చూపాడు ఆయన ఇష్టానుసారమే రక్తం బయటకు వచ్చింది ఎనిమిదేసి అంగుళాల దబ్బనాలు (సూదులు) రెండు రెండు దవడలలో గుచ్చుకుని, కంఠంలో శ్వాసనాళం వెనుకగా కత్తి దిగవేసుకుని తనను పరీక్షించటానికిగాను ఆయన వైద్యుల మధ్య తిరిగాడు. ఒక్క చుక్క రక్తం కారలేదు. ఒక్క వైద్యుడు కూడా అందులో కనికట్టున్నదని ఆరోపించలేదు అది అయ్యాక ఆయన పదిహేను నిమిషాలపాటు నేలలో పాతేయించుకున్నాడు. ఆ తరువాత ఆయన కవర్లలో ఉన్న ప్రశ్నలను చింపి చూడకుండా చదివి సరి అయిన సమాధానాలు చెప్పాడు డర్బీ రేసులో గెలవబోయే గుర్రం పేరు కూడా సరిగానే చెప్పాడు అలాంటి ప్రశ్నలు తనను అడగవద్దన్న సంగతి జ్ఞాపకం చేశాడు.

కొద్దిరోజులపాటు పత్రికలు దీనిని గురించి వింతగా రాశాయి తరువాత ఎండుగడ్డి మంటలాగా చల్లారిపోయింది సాధారణ మానవులు ఇటువంటి అనుభవాలను జీర్ణించుకుని, వాటి వెనుక నిగూఢంగా వున్న సత్యమేమిటో అన్వేషించలేరు కాని శాస్త్రజ్ఞులు కూడా అదే వైఖరి అవలంబించడమూ, అలాంటి సంఘటనలను గురించి ఎవరైనా ఎత్తితే, "అంతా భ్రమ అయి ఉంటుంది !" అనటమూ శోచనీయము

దైహిక శక్తుల పైన మనస్సుకు గల ఆధిపత్యం శాస్త్రీయంగా రుజువు కావటం ఆధ్యాత్మిక వాదానికి బలం చేకూర్చింది ఎందుచేతనంటే, చాలామంది ఆత్మలున్నాయనీ, అవి బతికున్న వారితో సంభాషించి, గత విషయాలను కూడా తెచ్చి తమను తాము రుజువు చేసుకుంటాయని ఒప్పుకోవటానికి మనసును సాకుగా చెప్పారు. శరీరంతోపాటు జ్ఞానేంద్రియాలూ, మెదడూ పోయాక

ఆత్మలకు "జ్ఞాపకం" ఎలా సాధ్యమవుతుంది ? "మెదడూ, జ్ఞానేంద్రియాలు, నాడీమండలమూ జ్ఞాపక సాధనాలేగాని మనసు కానేకాదు అది శాశ్వతం" అని సమాధానం చెప్పగల స్థితిలో ఉన్నారు ఆధ్యాత్మికవాదులు

"మాట్లాడేది ఆత్మలే అనడానికి దాఖలా ఏమిటి ? టెలిపతీ ఉన్నదని మేము ఒప్పుకుంటున్నాం సోదె చెప్పే మనిషి సోదె అడిగే మనిషి మనస్సులో ఉండే విషయాలు టెలిపతీ ద్వారా తెలుసుకుని ఏదో ఆత్మ చెబుతున్నట్టుగా చెప్పవచ్చు గదా ?" అన్న ధోరణిలో కొందరు శాస్త్రవేత్తలు వాదించారు

సోదె అడిగే మనిషికి తెలిసిన విషయాలే సోదెలో వచ్చినంతసేపూ ఈ అభ్యంతరాన్నీ కొట్టి పారెయ్యడానికి లేదు కాని ఎన్నోసార్లు అడిగే మనిషికీ తెలియనివీ, చెప్పే మనిషికి తెలిసి ఉండటానికి వీలులేనివీ సోదెలో వస్తే దానికేమనాలి ?

ఫాక్స్ కుటుంబం విషయంలో సంచార వర్తకుడి ఆత్మ ఫాక్స్ భార్యకు ఏడుగురు పిల్లలన్నప్పుడు ఆమె ఒప్పుకోలేదు. ఒక బిడ్డ పుట్టి చనిపోయిన సంగతి మొదట ఆమె మనసులో లేదు. మళ్ళీ మళ్ళీ ఏడు సంఖ్య వచ్చిన మీదట ఆమె ఆ చనిపోయిన బిడ్డను జ్ఞాపకం తెచ్చుకున్నది

ఇటువంటి తార్కాణమే ఒకటి ఛార్ల్స్ జె. సేమూర్ తన అనుభవంలో నుంచి ఉదహరించాడు (ఈయన రచనలు చదివితే, ఆధ్యాత్మిక పరిశోధనలు చేసేవాళ్ళు "నమ్మని" వాళ్ళకన్న కూడా ఎంత ఎక్కువ "అనుమానం" మనుషులో సులువుగా అర్థమవుతుంది.)

ఈయన పరిశోధనలు ప్రారంభించిన కొత్తలో "పరిచిత వ్యక్తి"గాని "ప్రముఖ వ్యక్తి" గాని కాడు. ఎక్కడెక్కడ "సమావేశాలు" జరిగితే అక్కడికల్లా వెళుతూ వుండేవాడు ఉన్నట్టుండి ఒకనాడు ఒక మీడియం ఆయనకు "శారా" అనే పేరు అందజేసింది ఆ పేరు ఇంగ్లీషు స్త్రీలలో సామాన్యమైనది. బంధువులలోనో, స్నేహితులలోనో ఆ పేరు గల స్త్రీలు ఉండనివారు బహు అరుదు కాని సేమూర్ విషయంలో అది అబద్ధమయింది ఆయన ఎరుకలో "శారా" అనే పేరుగల సన్నిహితురాలెవరూ లేదు. అది లగాయతు పదిమంది మీడియములు వేరువేరు సందర్భాలలో ఆయనకు అదే పేరు అందజేశారు.

చిట్టచివరకు పదకొండో మీడియం ద్వారా "శారా" అనే ఆడగొంతు ఆయనతో నేరుగా మాట్లాడింది. "నన్ను శాలీ అని పిలిచేవాళ్ళు నేను చాలా ఏళ్ళుగా నీ వెంట ఉండి నీకు సహాయ పడుతున్నాను" అన్నదావిడ.

"నువ్వెవరో నాకు తెలియదనుకుంటాను" అన్నాడాయన.

"నువ్వు నన్నెరగవు నాయనా. నేను నీ చిన్న అమ్మమ్మను" అన్నదావిడ.

ఇది నిజమో కాదో తేల్చుకునే అవకాశం లేనందుకు సేమూర్ చింతించాడు ఆయన తల్లివైపు వారిలో పెద్దవారంతా పదేళ్ళ క్రితమే గతించారు.

మరికొంత కాలానికి ఆయన దూరపు బంధువులెవరో, మీ పిన్నమ్మ ఆలిస్ వార్తలేమైనా తెలుస్తున్నాయా ? ఆమె ఫలానా చోట ఉంటున్నది" అన్నారు ఆలిస్ బతికి ఉన్నదని కూడా సేమూర్‌కు తెలియదు. ఆయన ఆవిడను కలుసుకుని, తన అమ్మమ్మ అప్పచెల్లెళ్ళలో శారా అనే ఆవిడ ఒకతె వుండేదనీ, ఆమె పదిహేడవ ఏట - ఆలిస్ పుట్టక పూర్వం పోయిందనీ తెలుసుకున్నాడు.

సేమూర్‌కు తెలియని ఈ విషయం లండను నగరంలో పదకొండు మంది మీడియములకు "టెలిపతీ" ద్వారా తెలియటం అసంభావ్యం

**(ఆంధ్రప్రభ, వారపత్రిక, 22-1-1958)**

# 11. ఆధ్యాత్మిక శక్తులు

సాధారణంగా మానవులలో ఉండే శక్తులనే అసాధారణ ప్రమాణంలో చూసి మనం అద్భుతం చెందుతాం. ఏడెనిమిదేళ్ళ కుర్రవాడు గొప్ప సంగీత విద్వాంసులతో సరిసమానంగా స్వరజ్ఞానమూ, రాగజ్ఞానమూ, తాళ జ్ఞానమూ కనబరిస్తే అతణ్ణి సరస్వతీ అవతారమంటాం అదే విధంగా గణితంలోనూ, చిత్రలేఖనంలోనూ, జ్ఞాపకశక్తిలోనూ, ఇతర విద్యలలోనూ అసాధారణ ప్రజ్ఞ కనబరిచే వారిని గురించి లోకం గొప్పగా చెప్పుకుంటుంది

మనిషి ప్రదర్శించే అసాధారణ శక్తులలో కొన్ని ఆధ్యాత్మిక శక్తులుగా భావించబడు తున్నాయి మన పూర్వీకులు అణిమాది అష్టసిద్ధులు చెప్పారు. ఇవి యోగం ద్వారా సాధించదగినవి పాశ్చాత్య దేశాలలో ఆధ్యాత్మిక శక్తులు ప్రదర్శించినవారు యోగాభ్యాసం చేసినవారు కారు వారికా శక్తులు సహజంగా వచ్చాయి. లేదా వాటిని పెంపొందించుకొనటానికి వారు ఇతర పద్ధతులు అనుసరించి ఉంటారు

ఆధ్యాత్మిక శక్తి అనేక విధాలుగా వ్యక్తమవుతుంది అందులో ఒకటి "స్వయం ప్రేరిత రచన" (ఆటోమాటిక్ రైటింగ్) పిల్లలమర్రి పిన వీరభద్రకవికి సరస్వతీదేవి స్వయంగా జైమినీ భారతం రాసిపెట్టిందనీ, బమ్మెర పోతనగారు రుక్మిణీ కల్యాణం రాసేటప్పుడు ఒక పాదం సరస్వతీదేవి స్వయంగా రాసిందనీ మనం కట్టుకథలు విన్నాం ఈ కట్టుకథలను మనం ఈనాడు నమ్మలేం అయితే ఈ కథల ఆశయం కవిచేత ఏదో బాహ్యశక్తి రాయించిందని చెప్పటం అయిన పక్షంలో ఆ ఆశయం బొత్తిగా అసమంజసమైనది కాదు ఎందుకంటే స్వయం ప్రేరిత రచనలో జరిగేది ఇదే.

అటువంటి రచన చేసే మనిషికి తాను ఏమి రాస్తున్నదీ తెలియకపోవచ్చు ఆ రచనలో తెలుపబడిన విషయాలు రాసే వ్యక్తికి ఏ మాత్రమూ తెలిసినవి కాకపోవచ్చు

స్వయం ప్రేరిత రచనలో రాసే మనిషి వ్యక్తిత్వం బొత్తిగా ఉండదని కాదు. కాని ఆ వ్యక్తిత్వంలేని అంశాలూ, తెలియని విషయాలూ రచనలో ఉండటమే అసాధారణ విషయం. కొందరు తాము ఎరుగని లిపులూ, భాషలూ కూడా రాశారు బోస్టన్ నగరవాసిని అయిన మార్గరీ క్రాండన్ అనే ఆవిడ చీనాలిపి రాసిందట

పూనకం వచ్చినవారు మాట్లాడటం మొదలు పెడితే తాము సహజంగా మాట్లాడే దానికన్న ఎక్కువ ధారాళంగా మాట్లాడతారు తమకు తెలియని విషయాలు బయటపెడతారు స్వయం ప్రేరిత రచన చేసేవారు కూడా అంతే. వారి రచన అతి వేగంగా సాగుతుంది అది స్వయం ప్రేరిత రచన అని గుర్తించటానికి ఒక్కొక్కసారి ఈ వేగం తప్ప వేరే ఆధారం కూడా ఉండదు

మిసెస్ అండర్ వుడ్ అనే ఆమెకు స్వయంప్రేరిత రచనాశక్తి అలవడింది మొదట్లో ఆమెకు అర్థంలేని చెత్త రచనలు వచ్చాయి. కొంతకాలానికి ఈ దశ పోయింది తనకు "ఫారోస్" అనే ఆత్మజీవి తోడ్పడుతున్నట్టు ఆమె తెలుసుకున్నది తాను ఒక మీడియం (ఆధ్యాత్మిక శక్తి గల వ్యక్తి) అని అందరికీ తెలిసిపోతుందని ఆమె చాలా బిడియపడింది ఆ దశలో ఆమె రాస్తున్న రచన కాస్తా మధ్యలో నిలిచిపోవటమూ, "పిరికి పంద" అన్నమాట పెద్ద అక్షరాలతో లిఖించబడటమూ జరుగుతూ వచ్చింది చివరకామె తనకు గల శక్తిని లోకానికి వెల్లడించ నిర్ణయించింది. ఆ తరువాత ఆమెకు "రచన" నిర్విఘ్నంగా సాగింది

ఆమె రచనలను డబ్ల్యు టి. స్టెడ్ అనే ఆయన పరిశీలించాడు ఆయన కూడా స్వయం ప్రేరిత రచనలు చేయగలవాడే. "ఆమె రచనలలో మేమనుకునే వానికి వ్యతిరేకమైన భావాలు చాలా ఉండేవి" అన్నాడాయన మనసులో అనుకున్నదే సోదెలో వస్తుందని సామెత ఆ సామెత

నిజమైతే సోదె అబద్ధం అయ్యే అవకాశం ఉంది

"బోస్టన్ ఇన్వెస్టిగేటర్" అనే పత్రికను నడిపే జె పి మెండ్‌హామ్ అనే ఆయన 1891 జనవరి 11న చనిపోయాడు ఆయన జనవరి 21న షికాగోలో ఉన్న మిసెస్ అండర్‌వుడ్ ద్వారా తనను గురించి ఆమెకు తెలియని అనేక విషయాలు ఆమె ద్వారా తెలియబరిచాడు. తరువాత పత్రిక ఫైల్స్ చూస్తేనేగాని ఆ విషయాలు యథార్థమని రుజువు కాలేదు ఆయన మరణానికి కారణం కూడా ఆమె చేతి మీదుగానే లిఖించబడింది

మిసెస్ కురాన్ అనే మరొక అమెరికన్ స్త్రీ "కాలక్షేపం" కోసం స్వయం ప్రేరిత రచన అభ్యాసం చేసింది ఆవిడ ప్రయత్న ఫలితాలు, ఆవిడనూ, ఆవిడ మిత్రులనూ కూడా ఆశ్చర్యపరిచాయి ఆవిడ పని పెట్టుకుని కృషిచేసి అద్భుతమైన రచనలు చేయసాగింది ఆమెచేత రచనలు చేయిస్తున్నది పేషన్స్ వర్త్ అనే ఆంగ్ల స్త్రీ అనీ, ఆమె 17వ శతాబ్దంలో ఇంగ్లండులో జీవించి ఉండిందని ఆ రచనలు వ్యక్తం చేశాయి. ఆ రచనలను పరిశీలించినవారు వాటి తాలూకు భాషా, విషయాలూ కూడా ఎలిజబెత్ రాణి కాలంనాటివని అంగీకరించారు భాషా తత్వవేత్తలు ఆ రచనలలో ఆధునిక పదాలు లేవనీ, ఈ కాలపువారు కృత్రిమంగా అలాంటి శైలిలో రాస్తే అది ఇంత నిర్దిష్టంగా ఉండటం సాధ్యం కాదనీ ఒప్పుకున్నారు మిసెస్ కురాన్ ఏనాడు అమెరికా దాటి వెళ్ళి ఉండలేదు ఆమెకు ఐతిహాసిక జ్ఞానం దాదాపు ఏమీ లేదు. ఎలిజబెత్ రాణి కాలపు వ్యవహారాలను ఆమె ప్రగాఢంగా పరిశీలించి ఉండటం అసంభవం (ఈ పేషన్స్ వర్త్ ఉదంతం కూడా "ది పర్సనాలిటీ ఆఫ్ మాన్" అనే గ్రంథంలో కొంతవరకు విపులంగా చెప్పి ఉన్నది.)

మీడియం సమక్షంలో కాగితంపై పెన్సిలు దానంతట అదే రాసే పద్ధతి కూడా ఉన్నది. మీడియం రచన జరిగే స్థలానికి ఎడంగా కూచుంటుంది ఇలాంటి రచనను "డైరక్ట్ రైటింగ్" లేక "సైకోగ్రఫీ" అంటారు "సైకోగ్రఫీ" గురించి రివరెండ్ స్టాంటన్ మోజెస్ అనే ఆయన ఒక పుస్తకం రాశాడు. అందులో బేరన్ గుల్డెన్‌స్టబ్ అనే ఆయన అనుభవాలు చాలా ఉన్నాయి.

కాగితాలు ఒకచోట ఉంచి బేరన్ వాటికి అంతదూరంలో కూర్చుని ఉంటే కొద్ది సేపటికల్లా ఆ కాగితాల నిండా రచన ఉండేదట ఇలా ఎన్నోసార్లు ఎంతోమంది సాక్షుల సమక్షంలో జరిగింది. ఇరవైకి పై బడిన భాషలలో ఈ రచనలున్నాయి 1857 లగాయతు 1872 దాకా ఈ విధంగా రెండు వేలకు పైబడిన రచనలు వెలిశాయి బేరాన్ ఎన్నడూ కాగితాల వెంట పెన్సిలు కూడా ఉంచలేదు.

ప్రసిద్ధ శాస్త్రవేత్త అయిన సర్ విలియం క్రూక్స్ ఇటువంటి రచన గురించి తన అనుభవాలు రెంటిని తెలిపాడు. మొదటిసారి మిస్ ఫాక్స్ అనే ఆవిడ మీడియంగా పనిచేసింది. రచన చీకట్లో జరిగింది. ఆ సమయంలో అక్కడ సర్ విలియం, ఆయన భార్యా, ఆయన బంధువురాలు కానిడా ఉన్నారు సర్ విలియం ఒక చేత్తో మీడియం రెండు చేతులనూ పట్టుకుని, రెండవ చేత్తో పెన్సిలు పట్టుకున్నాడు కాగితాలు సర్ విలియం ముందున్న బల్లమీద ఉన్నాయి. ఆయన చూస్తూండగానే ఒక ప్రకాశవంతమైన చెయ్యి గది పై భాగం నుంచి దిగివచ్చి, ఆయన దగ్గర కాసేపు తారట్లాడి, చివరకు ఆయన చేతిలో ఉన్న పెన్సిలు తీసుకొని, గబగబా కాగితంమీద రాసి, పెన్సిలు అవతల పడేసి పైకి వెళ్ళిపోతూ చీకట్లో అంతర్థానమయింది

"నా రెండవ అనుభవం ఒక విఫల యత్నాన్ని గురించినది. సరి అయిన విఫల యత్నం నుంచి కూడా నేర్చుకోదగినది ఉంటుంది ఈసారి పూర్తి వెలుగులో ప్రదర్శన ఏర్పాటయ్యింది. నా గదిలో కొద్దిమంది మిత్రులూ, డి డి. హోం ఉన్నారు (డి.డి హోం ప్రఖ్యాతి చెందిన మీడియం) ఆ పూట "శక్తి" ఉచ్ఛులో ఉన్నట్టు కనబడింది - వివరాలు అనవసరం.

అందుచేత నేను ప్రత్యక్ష లేఖనం కావాలని కోరాను  అలాంటి దాన్ని గురించి అంతకుపూర్వమే ఒక మిత్రుడు చెప్పగా విన్నాను.  బల్లమీద పెన్సిలూ, తెల్లకాగితాలూ ఉన్నాయి  కొద్ది సేపట్లో పెన్సిలు మొనమీద లేచి నిలబడి, అనుమానంగా కదులుతూ కాగితం కేసి జరిగి పడిపోయింది అది రెండవసారి మళ్ళీ పడిపోయింది  అది మూడవ ప్రయత్నం కూడా చేసింది కాని లాభం లేకపోయింది  ఇంతలో బల్ల కింద ఉన్న రూళ్ళ కర్ర ఒకటి పెన్సిలు దగ్గరికి జరిగింది  పెన్సిలు ఈసారి లేచి రూళ్ళకర్ర నానుకుని నిలబడి రాయటానికి ప్రయత్నించి పడిపోయింది  ఇది మూడుసార్లు జరిగాక రూళ్ళకర్ర యధాస్థానానికి జరిగిపోయింది''' అని సర్ విలియం క్రూక్స్ తన రెండో అనుభవం గురించి రాశాడు.

రెండు పలకల మధ్య బలపాన్ని పెట్టి కట్టి ఆ పలకలపైన రచన తెప్పించినవారు చాలామంది ఉన్నారు  ఇది కూడా పైన చెప్పిన ప్రత్యక్ష రచన లాంటిదే  స్వయంప్రేరిత రచనలోకన్న ఈ ప్రత్యక్ష రచనలో "అవతలి" వేపు నుంచి సహాయం రావటం మరింత స్ఫుటంగా కనిపిస్తుంది.

భవిష్యత్తు చెప్పటం మరొక రకం ఆధ్యాత్మిక శక్తి  జ్యోతిష్యులూ, హస్త సాముద్రిక వేత్తలూ కూడా భవిష్యత్తు చెబుతారు  (వారు చెప్పేది ఏదీ నిజం కాదనుకోవటం అజ్ఞానం తగినంత అనుభవం ఉన్నవారికి జ్యోతిషం కొంతవరకు నిజమవుతుందని తప్పక తెలిసి ఉంటుంది ) అయితే జ్యోతిషమూ, హస్త సాముద్రికమూ, భౌతికశాస్త్రాలు - అసమగ్ర శాస్త్రాలే అనుకున్నప్పటికీ, వాటిని ఎవరైనా అభ్యసించవచ్చు  వాటి సహాయంతో భవిష్యత్తు చెప్పటమూ, ఆధ్యాత్మిక శక్తితో భవిష్యత్తు చెప్పటమూ ఒకటి కాదు.

మేరియా సిల్బర్ట్ అనే ఆవిడ ఆధ్యాత్మిక శక్తి గలది  కాని మీడియంగా సాధన చేసిన మనిషి కాదు.  కొద్ది సంవత్సరాల క్రితం బ్రిటిష్ కాలేజ్ ఆఫ్ సైకిక్ సైన్స్ అనే సంస్థ ఆమెను బ్రిటన్‌కు ఆహ్వానించి అనేక పరిశోధనలు జరిపారు  ఆమె తొమ్మిదేళ్ళ పిల్ల అయి ఉండగా వారి ఇంటికి ఒక పెద్ద మనిషి వచ్చాడు  ఆయనను చూస్తూనే ఆ పిల్ల బెదిరి కంగారుగా ప్రవర్తించింది ఆమె తండ్రి చిరాకుపడి ఆమెను అవతలికి పంపేశాడు  ఆమె ఆ పెద్దమనిషిని చూసి కంగారుపడటానికి కారణమేమంటే, ఆ వచ్చిన పెద్దమనిషి మంచులో పడి తన్నుకుంటున్నట్టూ, అయన మెడ మీదుగా బరువైన కాడి ఉన్నట్టూ ఆమెకు 'కనిపించింది'  ఆమె తన తల్లి వద్దకు వెళ్ళి తాను 'చూసిన' సంగతి చెప్పింది  తొమ్మిది రోజుల అనంతరం ఆ పెద్దమనిషి ఆ పిల్లచూసిన విధంగానే మరణించాడు.

మేరియా సిల్బర్ట్ ఇదే విధంగా ఇంకా అనేకసార్లు ముందు జరగబోయే విషయాలు తెలుసుకున్నది

మా బంధువులలో ఒకామె అకస్మాత్తుగా ఆధ్యాత్మిక శక్తి కనబరిచింది  ఒకసారి ఆవిడ తన మనుమడు మర్నాడు పోతాడని చెప్పేసింది  ఆవిడ అన్నట్టే జరిగింది కూడా.  ఆవిడ ఆ మాట అన్న సమయానికి ఆ పిల్లవాడికి కొద్దిగా జ్వరం తగిలింది గాని వేరే అవలక్షణాలు లేవు ఆమె ఆ పిల్లవాణ్ణి ఆ సమయాన చూడలేదు కూడా

ఈ సంఘటనను గురించి నేనావిడను ప్రశ్నించాను.  తన నోట ఆ మాట ఎవరో అనిపించినట్టయిందనీ, తాను అలా మాట్లాడటం తనకే ఆశ్చర్యం కలిగించిందనీ ఆమె నాతో అన్నది

పని పెట్టుకుని అన్వేషించినట్టయితే ఈ విధంగా భవిష్యత్తు చెప్పినవారి సంఖ్య అంతులేకుండా లభించవచ్చు

(భవిష్యత్తంతా ముందే నిర్ణయమై ఉందా ? ఉంటే మన కర్మకు అర్థమేమిటి? ఇటువంటి ప్రశ్నలు కలుగుతాయి ఈ ప్రశ్నలకు తత్వవేత్తలు సమాధానం చెప్పాలి సి జి. యూంగ్ ప్రపంచ ఖ్యాతిగల మనశ్శాస్త్రవేత్త. ఆయన ఆధ్యాత్మికవాది కాదు అయినా ఆయన భవిష్యత్తు ముందే నిర్ణయమై ఉన్నదనీ, కాల స్థల భావాలు మనస్సు యొక్క చైతన్యం వల్ల ఉత్పన్నమవుతాయనీ అంటున్నాడు )

ఆధ్యాత్మిక శక్తి వ్యక్తం కావటానికి అసంఖ్యాకమైన మార్గాలున్నట్లు కనబడుతుంది.

విన్సెంట్ టర్వీ అనే ఆయన టెలిఫోన్‌లో ఎవరితోనైనా మాట్లాడినప్పుడు అవతలి మనిషి స్థితినీ, పరిసరాలనూ చూడగలిగేవాడు తన మాట ఎవరూ నమ్మరని ఆయన తాను టెలిఫోన్ ద్వారా "చూసిన" విషయాలన్నీ వాస్తవమేనని ఆ యా వ్యక్తుల చేత రాయించి సంతకాలు చేయించి పుచ్చుకున్నాడు ఈయన 1909లో తన అనుభవాలను ఒక పుస్తకంగా అచ్చువేశాడు.

హార్ట్ లీ అనే ఆయన ఒకనాడు తన ఇంటినుంచి టర్వీకి టెలిఫోన్ చేశాడు టర్వీ టెలిఫోన్‌లో మాట్లాడుతూ "మీ ఇంటి పై అంతస్తులో మీ అమ్మాయి నాకు కనిపిస్తుంది. ఆవిడ అనేక కాగితాలు ముందు వేసుకుని రాత పనిలో నిమగ్నురాలై ఉన్నది" అన్నాడు. హార్ట్‌లీ టెలిఫోన్ పెట్టేసి పై అంతస్థుకు వెళ్ళి చూడగా ఆయన కుమార్తె టర్వీ చెప్పినట్టే ఉన్నది.

టర్వీ ఒకనాడు ఒక స్త్రీతో టెలిఫోన్‌లో మాట్లాడుతూ ఆమె ముందున్న బల్లనూ, పక్కన ఉన్న కిటికీనీ, ఇంకా వివరాలనూ వర్ణించాడు మరొకసారి ఒక పెద్ద మనిషికి టెలిఫోన్ చేస్తూ, ఆ పెద్దమనిషి వెనకవున్న నడవనూ, దానిమీద పరిచిన రంగు రాళ్ళనూ, అవతలగా మిరాయిని జాడీలలో పెడుతున్న స్త్రీ చేతులనూ 'చూశాడు'.

టెలిఫోన్ నిమిత్త మాత్రం. టర్వీ టెలిఫోన్ లేకుండా కూడా ఎక్కడో ఉన్న దృశ్యాలను చూశాడు టర్వీకి వైట్ అనే ఆయన కొన్ని కేటలాగులు అరువిచ్చి విశ్రాంతి కోసం దూర ప్రాంతం వెళ్ళిపోయాడు. ఆయన తిరిగి వచ్చేలోగా టర్వీ ఆ కేటలాగులను చూసి వైట్ భాగస్వామికి పంపేశాడు. కొన్ని మాసాల అనంతరం వైట్ నుంచి టర్వీకి, అరువిచ్చిన కేటలాగులు తిప్పి పంపమంటూ ఉత్తరం వచ్చింది. "ఆ కేటలాగులను అదివరకే తిప్పి పంపాను. అవి ఫలానా గదిలో, ఫలానా బీరువాలో, సొరుగు వెనుక భాగంలో ఉన్నాయి" అని టర్వీ సమాధానం పంపాడు. ఆయన చెప్పిన చోట చూడగా ఆ కేటలాగులు కనిపించాయి.

ఇంకొక సందర్భంలో ఆయన కొంతమంది రాకకోసం ఎదురుచూస్తూ ఇంట్లో ఉన్నాడు ఆ సమయంలో ఆయనకు తాను ఎదురుచూస్తున్న వారిలో ముగ్గురు మూడు ప్రాంతాల "కనిపించారు". ఆయన వెంటనే కాగితం తీసుకుని వారు ఆ సమయానికి ఎక్కడెక్కడ ఉన్నారో, ఏ మేం చేస్తున్నారో రాసిపెట్టి వారు వచ్చాక చూపించి ఆయన చూసినది యావత్తూ నిజమేనని ఒప్పించాడు

మనం పురాణాలలో చదివి నమ్మలేకపోయే దివ్యదృష్టికీ, టర్వీ ప్రదర్శించిన శక్తికీ అట్టే తేడా ఉన్నట్టు కనబడదు ఇటువంటి దివ్యదృష్టితో కొందరు భూగర్భంలో నీటిని పసి కడతారు కొందరికి నీటి అలలు కనిపించినట్టుగా భావన కలుగుతుంది. మరికొందరు ఒక పుల్ల చేతిలో పట్టుకుని నేలమీద నడుస్తుంటే అడుగున నీరున్నప్పుడు వారి చెయ్యి గుంజుతుంది

జలవేదులు అన్ని దేశాలలోనూ వున్నారు ఏ శక్తితో వారు నీరున్నచోటు కనిపెడతారో శాస్త్రవేత్తలు చెప్పలేరు. మొదటి ప్రపంచ యుద్ధమప్పుడు గాలీ పోలీలో సైన్యాలు దాహంతోచచ్చిపోనున్న తరుణంలో జలవేదుల సహాయంతో నీరు కనిపెట్టిన విషయం చారిత్రకమైన సంఘటన

సర్ హెన్రీ అనే భూస్వామి ఉండేవాడు ఆయన పొలాలకు నీటి కొరత ఏర్పడింది అందుచేత ఆయన తన వ్యవసాయ క్షేత్రంలో ఒక బావి తవ్వించాడు 20 అడుగుల లోతున కొద్దిగా నీరు పడింది. దానివల్ల ప్రయోజనం లేక, ఈ బావికి 200 అడుగుల దూరాన ఇంకొక బావి తవ్వించాడు. ఈ బావి కూడా నిరుపయోగమయింది జాన్ ములిన్స్ అనే ఐరిష్‌వాడికి "జల దృష్టి" ఉన్నదనీ, అతని సలహా తీసుకోమనీ సర్ హెన్రీకి మిత్రులు సలహా ఇచ్చారు కాని ఆయనకు 'దివ్య దృష్టి'లో బొత్తిగా నమ్మకంలేక ఒక ప్రసిద్ధ భూతత్వవేత్తను పిలిపించాడు. ఆ శాస్త్రజ్ఞుడు మూడో బావి తవ్వాడు. నీరు లేదు ఆ బావి అడుగు నుంచి సొరంగాలు తవ్వారు వెయ్యి పౌనులు ఖర్చయింది. నీరు లేదు. అప్పుడు ములిన్స్‌కు కబురు చేశారు ఆయన వచ్చి ఒక దిబ్బ ప్రదేశంలో రెండు చోట్ల చూపి అక్కడ తవ్వితే పదిహేను అడుగుల లోతున నీరు పడుతుందనీ, ఆ రెండు ప్రదేశాల మధ్య నీరు పడదనీ చెప్పాడు ఆ ప్రదేశంలో నీరు పడదని భూ తత్వశాస్త్రజ్ఞుడు చెప్పి ఉన్నాడు. అయినప్పటికీ ములిన్స్ చెప్పిన రెండు చోట్లా బావులు తవ్వారు. ఇంచుమించు ఆయన చెప్పిన లోతునే రెండు బావులలోనూ నీరు పడింది. ఈ సంఘటనతో ములిన్స్ ఖ్యాతి వ్యాపించింది ఆయన చేత ఇంకా అనేక మంది బావులు తవ్వించుకున్నారు త్వరలోనే జాన్ ములిన్స్ అండ్ సన్స్ అనే సంస్థ ఏర్పాటయ్యింది.

భూమి లోపల ఉండే నీరే గాక నిధినిక్షేపాలూ, ఖనిజాలూ కూడా కనిపెట్టగలవారున్నారు

మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో జర్మను సేనలు సమీపిస్తున్న సమయంలో ఒక ఫ్రెంచి వ్యాపారస్తుడు తన వద్ద ఉన్న విలువైన వెండి బంగారాలనూ, నగలనూ ఒక ఇనుప పెట్టెలో పెట్టి తన దొడ్లో పాతేశాడు తరువాత అయిదు లక్షల ఫ్రాంకుల విలువగల బాండ్లను ఇంకొక ఇనుప పెట్టెలో పెట్టి తన ఇంటికి దూరంగా ఉన్న పొలంలో పాతిపెట్టాడు బంగారమూ నగలూ గల ఇనుపపెట్టెను జర్మనులు వశపరచుకున్నారు యుద్ధానంతరం దాన్ని తిప్పి పంపారు కూడా కాని ఆ వ్యాపారస్తుడు బాండ్లు గల ఇనుపపెట్టె కోసం తవ్వితే అది దొరకలేదు

దాన్ని కనుక్కోవటానికి "దృష్టి" గలవాణ్ణి ఒకణ్ణి పిలిపించారు అతను ఆ ప్రాంతంలో ఎనిమిది చోట్లు చూపి ఆ చోట్ల భూమిలో ఇనుప వస్తువులున్నాయన్నాడు ఒక్కొక్క చోటే తవ్వసాగారు. ప్రతిచోటా బాంబు ముక్కలూ అవీ దొరికాయి ఈ విధంగా ఏడుచోట్లా ఏవో ఇనప వస్తువులు దొరికిన అనంతరం ఎనిమిదవ చోట తవ్వనవసరం లేదని వ్యాపారస్తుడన్నాడు ఎందుకంటే ఆయన ఇనపపెట్టెను పాతిపెట్టిన ప్రాంతానికది చాలా దూరం అయినా "దృష్టి" గలవాడు తన పరువు నిలబెట్టుకునేటందుకు అక్కడ కూడా తవ్వి తీరాలని పట్టుపట్టాడు. అక్కడ తవ్వగా బాండ్లుగల ఇనుపపెట్టె దొరికింది. పెట్టె పాతిన చోటికీ అది దొరికిన చోటికీ మధ్య 60 అడుగుల దూరం ఉన్నది ఏదో బాంబుపడి పేలిన ఫలితంగా ఆ పెట్టె మొదటి చోటునుండి లేచి కొత్త చోట పడి భూమిలో కూరుకుపోయి ఉండాలి.

పోయిన వస్తువులు కనుక్కోవటానికి అంజనం వేసే ఆచారం మనదేశంలో ఉండేది అరిచేతికి కాటుక రాసుకుని అందులోకి తదేక దృష్టిగా చూస్తే కొందరికి పోయిన వస్తువులూ, అవి దాచి ఉన్న స్థలాలూ కనిపిస్తాయని ప్రతీతి పాశ్చాత్య దేశాలలో అంజనానికి బదులు గాజు గోళాలు వాడతారు వాటిలోకి చూసి మనకు తెలియని విషయాలు చెబుతారు.

ఈనాడు మనం ఇటువంటి విద్యలను ఖాతరు చెయ్యం కాని గాజు గోళాల సహాయంతో "దివ్య దృష్టి" ప్రదర్శించటం అభూత కల్పన కాదు అలా చేయగలవాళ్ళు చాలామంది ఉన్నారనటానికి ఆధారాలున్నాయి

ఇది వాస్తవంగా జరిగిన సంఘటన

'మిస్ ఏ' అనే ఆమె గాజు గోళంలో చూసి ఒనేక విషయాలు చెప్పేది. 1899లో సర్ జోసెఫ్ బార్న్‌బీ అనే ఆయన ఆమెతో సంప్రతించాడు. ఆమె గాజు గోళంలోకి చూసి సర్ జోసెఫ్ తీసుకుని ఉన్న గదినీ, అందులో ఉన్న ఆయన భార్యనూ సరిగా వర్ణించింది అయితే ఆ గది ఆయన తీసుకున్న హోటలు గది అని గాని, ఆ స్త్రీ ఆయన భార్య అని గాని "మిస్ ఏ"కు తెలియదు "ఆ స్త్రీ ఎలాంటి దుస్తులు ధరించి ఉన్నది ?" అని సర్ జోసెఫ్ ఆమెను అడిగాడు "ఆవిడ సర్జి దుస్తులు ధరించి ఉన్నది" అని చెప్పి ఆమె ఆ దుస్తులను వర్ణించింది. ఈ మాట వినగానే సర్ జోసెఫ్‌కు నిరుత్సాహం కలిగింది "మిస్ ఏ" పొరపాటు పడి ఉండాలి. ఏమంటే, తన వెంట సర్జి దుస్తులు లేవని ఆయన భార్య ఆయన హోటలు నుంచి బయలుదేరేటప్పుడు విచారాన్ని వెలిబుచ్చింది అందుచేత ఆమె సర్జి దుస్తులు ధరించి ఉండటం అసంభవమని ఆయన అనుకున్నాడు. కాని తీరా ఆయన హోటలుకు తిరిగి వెళ్ళేసరికి ఆయన భార్య "మిస్ ఏ' ' వర్ణించినటువంటివే సర్జి దుస్తులు ధరించి ఉన్నది ఆయన అది చూసి విస్మయం చెందాడు.

పదహారు మాసాలు గడిచాయి ఒక లండన్ హాలులో ఏదో వినోద ప్రదర్శన జరుగుతుంటే అక్కడికి సర్ జోసెఫ్ భార్యా సమేతంగా వెళ్లాడు వారక్కడికి వెళ్ళేసరికి ప్రదర్శనకింకా వ్యవధి ఉంది. అందుచేత సర్ జోసెఫ్ తన భార్యను ఒకచోట కూచోపెట్టి అంతటా తిరుగుతూ ఎరిగినవారిని పలకరిస్తున్నాడు. పది నిముషాలు గడిచాక "మిస్ ఏ" అక్కడికి వచ్చింది. సర్ జోసెఫ్‌ను గుర్తించి పలకరించి మాట్లాడుతూ, అకస్మాత్తుగా మధ్యలో ఆగి, 'నేనానాడు గోళంలో చూశానే ఆ స్త్రీ అదుగో, అక్కడ నిలబడి ఉన్నది" అంటూ సర్ జోసెఫ్ భార్యను చూపింది !

ఇటువంటి దాఖలాలు అనంతంగా ఉన్నాయి. అనేకమంది మనుషులలో అనేకమైన శక్తులున్నాయి వాటిని గురించి సరి అయిన పరిశోధనలు జరగని కారణం చేత అవి "అశాస్త్రీయం' ' గానూ, మూఢ విశ్వాస జనిత భ్రమలుగానూ భావించబడుతున్నాయి

వాటిని గురించి తగినంత శాస్త్ర పరిజ్ఞానం లేని దశలో ప్రజలు వాటిని నమ్మి మోసగాళ్ళచేత వంచించబడటం కన్నా వారు వాటిని భ్రమలుగా భావించటమే మంచిదేమో ! అందుచేతనే వీటిని గురించి శాస్త్ర పరిశోధనలు జరగాలి. ఈ శాస్త్రానికి గొప్ప భవిష్యత్తున్నది ఆధ్యాత్మిక రహస్యాలు కూడా ప్రకృతి రహస్యాలే వాటిని అన్వేషించటం వల్ల ప్రజలకు మేలు కలుగుతుంది పదార్థాన్ని గురించీ, శరీర తత్వాన్ని గురించీ, వ్యాధులను గురించీ ఎన్నో విషయాలు ఈ పరిశోధనల ద్వారా తెలుసుకోవచ్చు.

× × ×

ఆధ్యాత్మిక శక్తులు మానవుడిలోనే గాక జంతువులలో కూడా ఉన్నాయనుకోవటానికి ఆధారాలున్నాయి. పెంపుడు కుక్కలు అనేకసార్లు మనకు కనిపించనివేవో తమకు కనిపించినట్టు ప్రవర్తిస్తాయి వట్టి "గాలి" కేసి చూసి గుర్రుమంటాయి. "అక్కడ లేని" దానికేసి పరిగెత్తుతాయి లేదా తోక ముడిచి భయంతో దూరం పోతాయి అకారణంగా ఏడుస్తాయి దయ్యాల ఇళ్ళలో ఉండేవారు కుక్కలు చూసిన దయ్యాలను మరి కాస్సేపటికి తామే చూసినట్టు చెప్పిన నిదర్శనాలున్నాయి

"మూఢ విశ్వాసాలకు" అలవాటు పడ్డవాళ్ళు పశుపక్ష్యాదులను చనిపోయినవారి ప్రతినిధులుగా పరిగణిస్తారు. ఉత్తర క్రియలు చేసేటప్పుడు కాకులకు పిండాలు వేస్తారు కాకులు పిండాలు తిన్నట్టయితే చనిపోయిన మనిషి తీరని కోరికలేవీ లేనివాడై సుఖంగా ఉన్నట్టు గుర్తు అయితే ఎవరికైనా ఒక సందేహం వస్తుంది. ఏది బడితే అది తినే కాకి పిండాలు తినటానికి అసాధారణమైన కారణం ఉండవలసిన అవసరమేముంది ? ఏమీ లేదు అందుచేత కాకులు పిండాలను తన్నుకుపోవటం ఏ విధమైన సాక్ష్యంగానూ పనికి రాదు

కాని యాబై కాకులు అంత దూరాన వాలి పిండాలను ముట్టకపోయినట్టయితే అందులో ఏదో ఉండాలి ఇటువంటి సంఘటనను నా మిత్రులు ఒకరు స్వయంగా చూశారు చనిపోయిన వ్యక్తికి గల సందేహమేమిటో వూహించి ఆ సందేహం వినివర్తిచేసి ఆయన కోరిక తీరుస్తామని మాట ఇచ్చిన మీదటనే కాకులు పిండాలు ముట్టుకున్నాయట విచారిస్తే ఇటువంటి సంఘటనలు చాలా దొరకవచ్చు

మనిషికి లేని అనేక శక్తులు హీన ప్రాణులలో ఉండటం మనం గమనిస్తున్నాం తేనెటీగలు తేనె పట్టులు కడతాయి. ఒక్కొక్క పక్షి చాలా అద్భుతంగా గూడు కడుతుంది అనేక ప్రాణులు చీకట్లో చూస్తాయి పావురాలు ఎంత దూరంనుంచి అయినా సూటిగా ఇళ్ళకు తిరిగి వస్తాయి. అనేక పక్షులూ, చేపలూ ఏటా ఒకే ఋతువులో కొన్ని వందల మైళ్ళ దూరాన ఉండే స్థావరాలకు వెళ్ళి అక్కడ పిల్లల్ని పెడతాయి ఈ శక్తులు ఆ యా ప్రాణులు తమ జీవిత కాలంలో అలవరుచుకునేవి కావు. వాటి శరీరాలలాగే జన్మతో సంక్రమించేవి.

ఆధ్యాత్మికశక్తి కూడా ఈ విధంగా జన్మతః సంక్రమించవచ్చు. పశు పక్ష్యాదులతోబాటు ఆదికాలపు మానవుడు కూడా ఆధ్యాత్మిక శక్తులతో పుట్టాడని కొందరు వూహిస్తున్నారు. ఆది మానవుల పూజలూ, మతాలూ చూసి మనం నవ్వుకుంటాం. వారు ప్రకృతి శక్తులకు బెదరి బర్బరమైన పూజలూ, కొలుపులూ, జాతరలూ చేశారనుకుంటున్నాం. కాని ఇలా అనుకోవటం పొరబాటు కావచ్చు. హిమయుగంలో కూడా తమ స్థావరాలను వదలక నిలబడి, జడల ఏనుగులను వేటాడినవారు 'పిరికివాళ్ళు' కాకపోవచ్చు.

రాతియుగం అనంతరం కూడా 'నాగరిక' మానవులు చాలా శతాబ్దాలపాటు చచ్చిపోయినవారితో బాటు వారి భౌతికావసరాలను పాతిపెట్టిన సంగతి మనకి తెలుసు. ఈ ఆచారం ప్రపంచమంతటా, అన్ని ప్రాంతాలలో ఉండిన నాగరికతలలోనూ కానవస్తుంది. మరణానంతరం ఆత్మలకు జీవితం ఉంటుంది అనే నమ్మకం ఆ కాలపు మానవులకు ఉండి ఉండాలి.

ఇదే నిజమై ఆదికాలపు మానవులకు సర్వసాధారణంగా ఆధ్యాత్మిక శక్తి ఉండి ఉన్నట్టయితే అది కాలక్రమాన క్షీణించిపోయింది. పరిణామంలో మానవుడు పశు పక్ష్యాదులకు శరీరాలలో ఇమిడి ఉన్న అనేక శక్తులను తన వెలుపలకు తెచ్చుకుని, అవి చేసే పనులను యాంత్రిక పరికరాలతో చేయిస్తున్నాడు. పావురాల లాగే మన విమానాలు కూడా సూటిగా గమ్యాలను చేరుతున్నాయి. అయితే అందుకు దిక్సూచి ఉపయోగపడుతున్నది. చీకటిలో చూడటానికి రాడార్ ఉపయోగపడుతున్నది. మనిషి కూడా అద్భుతమైన కట్టడాలు కడుతున్నాడు. అయితే అందుకుగాను అతడు వాస్తుశాస్త్రం తయారుచేసుకున్నాడు

మానవుడు ఈ విధంగా కొన్ని శక్తులను బహిర్గతం చేసుకోవడం వల్ల సామాజిక పరిణామం సాధ్యమయింది గడిచిన పదివేల ఏళ్ళ కాలంలో పశుపక్ష్యాదుల జీవితాలలో చెప్పుకోదగిన పరిణామం లేదనుకోవచ్చు కాని మానవుడు సామాజికంగా సాధించిన పరిణామం అత్యద్భుతమైనది ఈ పరిణామంలో మానవుడు తనలో స్వతసిద్ధంగా ఉంటూ వచ్చిన ఆధ్యాత్మిక శక్తులను కోల్పోయి ఉంటే, అది శోచనీయం కాదు ఎందుకంటే మానవుడు ఇతర శాస్త్రాలతోబాటు ఆధ్యాత్మిక శాస్త్రం కూడా తయారుచేసి, ఆధ్యాత్మిక శక్తులను కూడా పెంపొందించుకోవచ్చు అప్పుడాశక్తులు కూడా సామాజిక పరిణామానికి దోహదం చెయ్యగలుగుతాయి.

**(ఆంధ్రప్రభ, వారపత్రిక, 29-1-1958)**

# 12. ఆత్మ - శరీరాలు

మనసు అన్నది శరీరానికి అతీతమైనదనుకున్నట్టయితే డార్విన్ ప్రభృతులు ప్రతిపాదించిన పరిణామవాదం ఏమయేటట్టు ? పరిణామవాదం ప్రకారం ప్రాణుల శరీరాలతోబాటు మనసు (బుద్ధి) కూడా పరిణామం చెందుతూ వచ్చింది జావా మనిషి ఆధునిక మానవుడంత "తెలివి గలవాడు" కాడు. అతని పుర్రెనుబట్టి అతను మనంత తెలివిగలవాడు కాడని స్పష్టమవుతున్నది

అయితే, ఆధ్యాత్మికవాదులు పరిణామవాదాన్ని కాదనరు. వారు ఏ శాస్త్ర ప్రమాణాలనూ కాదనరు వారనేదల్లా మామూలు శాస్త్ర పరిశోధనల ద్వారా తేలని అనేక సృష్టి రహస్యాలూ, ప్రకృతి రహస్యాలూ ఆధ్యాత్మిక పరిశోధనల ద్వారా స్పష్టమవుతాయని మాత్రమే

పరిణామవాదం ఆత్మ శరీరాలకు కూడా వర్తిస్తుందనుకోవాలి. మానవ పిండం ఏకకణ జీవిగా జీవితం ప్రారంభించి గర్భ కోశంలో పరిణామ దశలన్నీ గడుస్తుందన్నది పరిణామ వాదులు ఆక్షేపణారహితంగా ఋజువు చేశారు మానవ రూపంలో మనం తల్లి గర్భం నుంచి విభజన పొందక మునుపు మనకు మొప్పలున్నాయి, తోకలున్నాయి - ఇంకా అనేక లక్షణాలున్నాయి.

శరీరాలతోబాటు ఆత్మశరీరాలు కూడా పరిణామ దశలు దాటుతాయి. చిన్న పిల్లవాడి ఆత్మశరీరం చిన్న పిల్లవాడి శరీరాన్ని పోలి ఉంటుంది. స్త్రీ యొక్క ఆత్మ శరీరం స్త్రీనీ, జంతువుల ఆత్మ శరీరాలు జంతువులనూ పోలి ఉంటాయి. ఈ విషయాలు పదే పదే రుజువయ్యాయి. మరణం అనంతరం ఆత్మ శరీరం మరికొన్ని మార్పులు చెందుతుందని ఆధ్యాత్మికవాదులు అంటున్నారు

చనిపోయినవారి ఆత్మలు ఒక్కొక్కప్పుడు మీడియంలకు కనిపిస్తాయి. వారు ఆ చనిపోయినవారిని వర్ణిస్తుంటే వారిని ఎరిగినవారు సులువుగా గుర్తించగలుగుతారు.

కొన్ని సందర్భాలలో ఆధ్యాత్మిక ప్రదర్శనలు జరిగే చోట ఆత్మలు ఎక్టోప్లాజం ధరించి "ప్రత్యక్ష"మవుతాయి అప్పుడు వారిని ఎవరైనా చూసి గుర్తించవచ్చు.

జంతువుల ఆత్మలు జంతువులను పోలి ఉంటాయన్నది సర్ ఆలివర్ లాడ్జి రచించిన "రేమాండ్" గ్రంథంలో చూడవచ్చు లాడ్జి కుమారుడికి ఒక కుక్క ఉండేది. ఆ కుక్క చనిపోయినాక తన వెంట ఉంటున్నదని రేమాండ్ తన తండ్రికి తెలియబరిచాడు. ఆ కుక్కను మీడియం (లేక ఆమెను ఆవహించిన ఇంకొక ఆత్మ) వర్ణించి చెప్పింది.

అలాగే ఒక స్త్రీ తన చిన్నతనంలో ఒక "దయ్యపు" పిల్లిని చూసింది - ఆమెకు అంతకుముందు గాని, ఆ తరువాత గాని ఆధ్యాత్మిక అనుభవాలేవీ కలగలేదు. ఆమె తన అనుభవాన్ని ఈ విధంగా వివరించినట్టు చార్ల్స్ జె. సేమూర్ రాస్తున్నాడు ఆమె పదేళ్ళ పిల్ల అయి ఉండగా కొద్ది రోజుల పాటు ఉండి రావటానికి ఎరిగున్నవారి వూరు వెళ్ళిందట.

"మొదటి నాటి రాత్రి నేను నిద్రపోయిన కాసేపటికి నా పక్కమీదికి ఒక పిల్లి దూకి మెలకువ వచ్చింది. అది నా మోకాళ్ళ మీదుగా పడుకున్నది నాకు పిల్లులంటే చాలా ఇష్టం. కాని, అది బరువుగా ఉండటం చేత దాన్ని వెళ్ళగొట్ట నిశ్చయించి, ముందుగా ఒకసారి దాని శరీరం నిమురుదామని చెయ్యి చాచాను కాని, చేతికి ఏమీ తగలలేదు. అక్కడ ఏమీ లేదు. మోకాళ్ళ మీది బరువు మాత్రం అలాగే ఉంది మంచం వెడల్పునా అనేకసార్లు చేత్తో తడిమాను. నా చేతికి గాలి తప్ప ఏమీ తగలలేదు. నన్ను నేనే నమ్మలేకపోయాను. కంగారు పుట్టింది . . పిల్లి లేచి నడుచుకుంటూ వచ్చి నా రొమ్ము మీద పడుకున్నది నా చెవికి కొద్ది అంగుళాల దూరంలో

దాని గురక వినిపిస్తున్నది అది నడిచి వచ్చేటప్పుడు అది కాళ్ళు తీసివెయ్యటం నాకు స్పష్టంగా తెలిసింది. నాకు హడలెత్తిపోతున్నది. గుండె దడదడలాడుతూనే దాని తలా వీపూ నిమరటానికి యత్నించాను. కాని, పిల్లి అంటూ ఉంటే గద కాని అంతసేపూ దాని బరువు నాకు తెలుస్తూనే ఉంది. ఏం చెయ్యాలో తోచలేదు ఎవరినన్నా కేకవేద్దామని పక్కకు వత్తిగిలాను పిల్లి పక్క మీది నుంచి కిందికి గెంతి నడుచుకుంటూ వెళ్ళిపోయింది మెత్తగా దాని పాదాలు చేసే చప్పుడు నాకు వినిపించింది" అని ఆమె అన్నది. ఎవరూ నమ్మరనీ, తనను వెర్రిది అనుకుని పోతారేమోననీ ఆమె ఈ చిత్రమైన అనుభవాన్ని ఇంటివారికి చెప్పలేదు సేమూర్‌లాంటి పరిశోధకులకు ఇటువంటి సంఘటనలలో ఆసక్తి ఉండటం తెలిసి ఆమె తన అనుభవాన్ని వివరించింది

1917లో నాకొక వింత అనుభవం అయింది నేను ఎనిమిదేళ్ళవాణ్ణి. తెనాలి హైస్కూల్లో చదువుతున్నాను మా డిసెంబరు పరీక్షలు జరుగుతున్నాయి. ఉదయం లెక్కల పరీక్ష అయింది. మళ్ళీ మధ్యాన్నం నుంచీ ఇంకేదో పరీక్ష ఉన్నది లెక్కలలో నూటికి నూరు మార్కులు తెచ్చుకున్న ఆనందంలో నేను ఇంటికి పోలేదు నేనూ, ఇంకొక మిత్రుడూ కలిసి స్కూలులో కట్టుతున్న కొత్త హాలు (జార్జి కారొనేషన్ హాలు) చూడబోయాం.

నేనక్కడ ఉన్న సమయంలో హాలు గోడమీద ఎత్తి ఉన్న దూలాలలో ఒకటి ఒరిగి పడింది. ఆ ప్రమాదంలో నేను గాయపడ్డాను అయితే, నా కావిషయాలేవీ తెలియవు ఏ కారణం చేతనో ఈనాటికీ ఊహించలేను. దూలం ఒరిగిందనిగాని, దాని మూలంగా నేను గాయపడ్డానని గాని నాకు తెలియక పూర్వమే నాకు స్పృహ తప్పింది.

తరువాత నాకు స్పృహ తెలిసినప్పుడు నేనా ప్రదేశంలోనే ఉన్నాను. నాకెదురుగా మా హెడ్మాస్టరుగారు పీసపాటి వెంకటకృష్ణయ్యగారు నిలబడి, ఎంతో ఆందోళనతో "ఎవరీ పని చేసింది ?" అని అడుగుతున్నారు. నేను "నాకు తెలియదండీ !" అన్నాను గాని నా మాటలు నాకు వినిపించలేదు మా హెడ్మాస్టరుగారు నాకంత దగ్గరగా నిలబడి ఉండటమే గాక చుట్టూ ఎంతోమంది విద్యార్థులు గుమిగూడి ఉండటం నన్ను కంగారు పరచింది ఆ యేడే స్కూలులో చేరడం వల్ల నాకు వారెవరూ తెలియదు అదృష్టవశాత్తూ వారికేసి చూస్తుండగా కొంచెం వెనుక వరుసలో నా పెత్తల్లి కుమారుడు, నెత్తిన ఎర్రదారంతో అల్లిన టోపీ పెట్టుకుని కనిపించాడు. నాకు ధైర్యం వచ్చింది. కాని అంతలోనే నాకు మళ్ళీ స్పృహ తప్పింది నేను మళ్ళీ కళ్ళు తెరిచేసరికి ఎండ వాలిపోయినట్టుగా ఉంది. నేను హెడ్మాస్టరుగారి గదిలో ఒక బల్ల మీద పడుకుని ఉన్నాను.

ఈ నా అనుభవంలో విడ్డూరమైన విషయం ఉందని చాలా ఏళ్ళకుగాని నాకు తెలియలేదు. దూలం మీదపడి స్పృహతప్పి పడిపోయాక నేను లేచి నిలబడలేదు సరికదా కనీసం కళ్ళు కూడా తెరవలేదని మా పెత్తల్లి కొడుకు చెప్పాడు "నువ్వు మళ్ళా కళ్ళు తెరిచింది హెడ్మాస్టరుగారి గదిలోనే !" అని ఖండితంగా చెప్పాడు ఈ సంగతి తరువాత స్పష్టంగా రుజువైంది. కాని నేను ఆ హాలులో హెడ్మాస్టరుగారినీ, నా చుట్టూ గుమిగూడిన పిల్లలనూ, ప్రత్యేకించి మా పెత్తల్లి కొడుకును ఎర్ర టోపీతో సహా చూచాను. హెడ్మాస్టరుగారి ప్రశ్న విని సమాధానం కూడా చెప్పాను అన్నిటికన్న చిత్రమేమంటే నేను గాయపడ్డానని నాకప్పటికి తెలియదు.

ఈ అనుభవం నా ఆత్మ శరీరానిదనటానికి నాకెటువంటి సందేహమూ లేదు

'సజీవుల ఆత్మలు' అన్న పేరుతో 1886లో ఒక పుస్తకం వెలువడింది దీనిలోని విషయాలు సేకరించినవారు ముగ్గురు కేంబ్రిడ్జి 'ఎమ్మే'లు ఇది రెండు వేల పేజీల గ్రంథం. ఎక్కడో ఉన్నవారిని వారి బంధుమిత్రాదులు ప్రత్యక్షంగా చూసినట్టు తమకు తెలియవచ్చిన కేసులూ, ఇతరత్రా నమోదయిన కేసులు పోగుచేసి ఈ గ్రంథం తయారు చేశారు ఆ తరువాత సాల్టర్ అనే

ఆయన ఇలాంటి కేసులను గురించి మరొక గ్రంథం రాశాడు అందుచేత బతికున్నవారి ఆత్మలు దూర ప్రాంతాలలో ప్రత్యక్షం కావటం గురించి సాక్ష్యానికి తక్కువ ఏమీ లేదు.

విలియం గెర్‌హార్డీ ప్రఖ్యాత రచయిత ఆయన తన 'ఆత్మానుభవం' ఈ విధంగా వివరించాడు ఆయన నిద్రలో ఉండగా అకస్మాత్తుగా మెలకువ వచ్చింది లైటు వేద్దామని స్విచ్ కోసం చెయ్యి చాస్తే చేతికి ఏమీ తగలలేదు తాను గాలిలో, పుస్తకాల బీరువా ఎత్తున తేలి ఉన్నట్టు ఆయనకు తోచింది తన చుట్టూ ఒక అస్పష్టమైన వెలుతురున్నది తానిప్పుడు పూర్తిగా మేలుకుని ఉన్నాడు. తనను ఏదో ఇనుప హస్తం బలంగా పట్టుకుని ఉన్నట్టున్నది. అకస్మాత్తుగా ఆయనను ఎవరో గుండ్రంగా తిప్పి ముందుకు తోసి కాళ్ళ మీద నిలబెట్టారు తన బరువు తెలియలేదు తప్ప ఆయన మామూలు మనిషిలాగే ఉన్నాడు ఆయన తూలుతూ తలుపు వద్దకు వెళ్ళి గడియ తీయటానికి యత్నించాడు కాని అది సాధ్యం కాలేదు.

ఈ సమయంలో ఆయన వెనక్కి తిరిగాడు. అప్పుడాయనకొక వింత కనిపించింది. తన వెనక ఒక 'వెలుతురు చుట్ట' ఒకటి అంటుకుని ఉన్నది. అది తోటలకు నీరుపోసే రబ్బరు గొట్టాన్ని స్ఫురింపజేస్తున్నది. సినిమా ప్రొజెక్టరు నుంచి వెలువడే కాంతి "చువ్వ"లాగా ఉన్నది. దాని వెలుతురులో ఆయనకు పక్కమీద ఉన్న ముఖం కనిపించి అంతులేని విస్మయం కలిగింది. ఆ ముఖం తనదే ! ఆ ముఖం నిద్రపోతూ తాపీగా ఊపిరి తీస్తున్నది. తన వెనుక ఉన్న వెలుతురు చుట్ట ఆ ముఖం యొక్క నుదుటికి అంటుకుని ఉన్నది.

తనను తానే చూసుకుని ఆయన ఆశ్చర్యమూ, భయమూ చెందాడు ఇంతలో ఆయనను తలుపుగుండా ఎవరో తోసినట్టయింది ఆయన ఆ మూసి ఉన్న తలుపుగుండా సులువుగా వెళ్ళాడు ఆయన శరీరానికి ఆత్మశరీరానికి మధ్య ఆ వెలుగుతాడు బొడ్డుతాడులాగా ఉండనే ఉన్నది

ఆ స్థితిలో ఆయన తన ఇంటి గదులన్నీ తిరిగాడు. స్నానాల గది అద్దంలో తన ప్రతిబింబాన్ని కూడా చూసుకున్నాడు అది తాను పడుకోబోయే ముందు ఉన్నట్టే ఉన్నది. ఆయన ఒక వస్తువును కూడా పట్టుకోలేకపోయాడు, కదల్చలేకపోయాడు.

తరువాత ఆయన ఇల్లు దాటి ఒక స్నేహితుడింటికి వెళ్ళాడు. చిట్టచివరకు ఆయన ఆత్మశరీరం అసలు శరీరంలోకి దించబడింది

"ప్రపంచమంతా ఏకమై, ఇదంతా నువ్వు కలగన్నావు అని చెప్పినా నేను నమ్మను" అంటాడు గెర్ హార్డీ.

ఇంకొక వింత కేసు.

విదోనియాలో ఒక ఆడపిల్లల బడిలో ఒక పంతులమ్మ ఉండేది. ఆమె ఉద్యోగానికి కుదిరిన కొద్ది వారాలలో ఆమెను గురించి వింత పుకారు బయలుదేరింది. ఆమెను ఒకేసారి స్కూలు భవనంలో రెండుచోట్ల విద్యార్థినులు చూడటం జరిగింది. పదేపదే ఇలా జరిగిన మీదట విద్యార్థినులు పెద్ద పంతులమ్మతో తాము చూసిన విషయాలు చెప్పారు

తరువాత ఒకనాడు అన్నిటికన్న పెద్ద విడ్డూరం జరిగింది ఆమె క్లాసులో పాఠం చెబుతూ బ్లాక్‌బోర్డుమీద రాస్తున్నది క్లాసులో పదముగ్గురు పిల్లలున్నారు బ్లాక్‌బోర్డు వద్ద ఇద్దరు పంతులమ్మలు పక్కపక్కనే కవల పిల్లల్లాగా ఉండటం చూసి పిల్లలు గాభరా పడ్డారు. మొదటి పంతులమ్మ బోర్డుమీద రాస్తుంటే రెండో పంతులమ్మ ఆవిడను అనుకరిస్తున్నది. ఈ వింతను పదముగ్గురు పిల్లలూ చూశారు

మరికొన్ని రోజుల అనంతరం ఇంకొక వింత జరిగింది. తోటను ఆనుకుని ఉన్న

గదిలో 42 మంది పిల్లలు ఎంబ్రాయిడరీ చేస్తున్నారు. పంతులమ్మ తోటలో పూలు కోస్తున్నది పిల్లలున్న గదిలో కుర్చీలో కూర్చుని ఉండిన ఇంకొక పంతులమ్మ లేచి వెళ్ళిపోయింది మరి కాస్త సేపటికి ఆ కుర్చీలో అసలు ఆవిడను చూశారు. బయటికి చూస్తే ఆవిడ ఇంకా తోటలోనే ఉన్నది. కొందరు పిల్లలు సాహసించి కుర్చీలో కూచుని ఉన్న ఆకారాన్ని సమీపించి ఆమెను తాకటానికి యత్నించారు. కాని వారి చేతికి క్రేప్‌లాటిదేదో అడ్డం తగిలింది. కొద్ది క్షణాలలో ఆ పంతులమ్మ ఆకారం అదృశ్యమయింది. తోటలో అంతసేపూ పరధ్యానంగా నిలబడి ఉన్న పంతులమ్మ మళ్ళీ పూలు కోయసాగింది.

చివరకు ఆమెను స్కూలు అధికారులు పంపివేయవలసి వచ్చింది. తాను రెండుగా అందరికీ కనిపిస్తానని ఆమెకు తెలుసునట. ఈ కారణంగా ఆమె లోగడ కూడా తన ఉద్యోగాలు పోగొట్టుకున్నదట

అన్వేషణకు పూనుకుంటే ఇటువంటి సంఘటనలు చాలా బయటపడవచ్చు. వీటిని సేకరించి పుస్తకాలు ప్రకటించినవారు చాలామంది ఉన్నారు

కొందరు మీడియములు చనిపోయినవారిని తాము మాత్రమే చూసి వర్ణించగలరు. సాధారణంగా ప్రతి మీడియముకూ సహాయం చేసే ఆత్మజీవి ఒకరు (లేక ఒకతె) ఉండటం ఆచారం ఇతర ఆత్మలను చూసి వర్ణించేది ఈ సహాయాత్మ (కంట్రోల్) కావచ్చు అయితే మరికొందరు మీడియములు చనిపోయినవారిని ప్రత్యక్షం చేస్తారు. అప్పుడు వారిని అందరూ చూడవచ్చు ఇటువంటి ప్రదర్శనాలు జరిగే చోట ఒక చిన్న ఆవరణను (కాబినట్) ప్రత్యేకించి, దానికి తెరలు (నల్ల తెరలనుకుంటాను) అడ్డం కడతారు.

"మొట్టమొదట కాబినెట్ ముందు నేలమీద తెల్లటి మరకలాగా కనిపించింది. అది క్రమంగా విస్తరించి, ప్రాణం పలచని గుడ్డలాగా ప్రవర్తించింది కొద్దిసేపటిలో అది కొద్ది అంగుళాల మందాన, రెండడుగుల వెడల్పూ మూడడుగుల నిడివీ పెరిగింది తరవాత దాని మధ్య భాగం పైకి లేవసాగింది. దానికింద మనిషి తల ఉన్నట్టుగా కనిపించింది పల్చని తెల్లటి పదార్థం వలిపెంలాగా ముడతలు ముడతలుగా పైకిలేచే ఆకారం నుంచి కిందికి పడసాగింది. అది రెండడుగుల చిల్లర ఎత్తు లేచేసరికి దానికింద ఎవరో పిల్ల ఉన్నట్టుగా ఉన్నది. ఆ 'పిల్ల' తన చేతులను అన్నివైపులా కదిలిస్తున్నది ఆ ఆకారం ఇంకా లేస్తూ మధ్య మధ్య తగ్గిపోయి తరువాత ఇంకా ఎత్తులేస్తూ, అయిదడుగుల ఎత్తుకు వచ్చింది ఇప్పుడా ఆకారం పలచని పదార్థం పొరలను తన చుట్టూ అమర్చుకుంటూ ఉండటం స్పష్టంగా కనిపించింది చిట్టచివరకు చేతులు తలకంటే ఎత్తుగా పైకి లేచాయి యోలాండ్ అందంగా, నాజూకుగా అయిదడుగుల ఎత్తున నిలబడి కనిపించింది. నల్లగా నిడుపైన ఆమె జుట్టు భుజాలమీదా, వీపునా వేళ్ళాడుతున్నది యోలాండ్ శరీరం మళ్ళీ రూపరహితం కావటానికి రెండు లగాయతు అయిదు నిమిషాలు పట్టింది తెల్లటి పదార్థం అంతర్థానం కావటానికి అరనిమిషం లగాయతు రెండు నిమిషాలు పట్టింది."

ఇది ఒక ప్రేక్షకురాలి వర్ణన మరొక వర్ణన ·

"సాక్షాత్కారానికి ముందుగా, మీడియం ధరించిన నల్ల దుస్తులలో నుంచి పలచని పదార్థం కాంతివంతమైన ఉండల రూపంలో ద్యోతకమయ్యేది ఈ ఉండలు బటాని గింజ మొదలుకొని అయిదు ఫ్రాంకుల నాణెం ప్రమాణంలో జాస్తిగా మీడియం ఎడమ పార్శ్వాన కనిపించేది సాధారణంగా మరొక ముప్పావు గంట, గంట లోపుగా ఇంకా అద్భుతాలు కనిపించేవి . . ఆ పదార్థం మీడియం శరీరమంతటి నుంచీ ప్రవిస్తుంది కాని ఎక్కువగా శరీర రంధ్రాల నుంచీ, అవయవాల నుంచీ, నడి నెత్తినుంచీ స్తనాలనుంచీ, చేతివేళ్ళ కొననుంచీ ప్రవిస్తుంది నోట్లోనుంచి అది

వెలువడటం సులువుగా చూడవచ్చు దవడ లోపలివైపునుంచీ, ఇగుళ్ళనుంచీ, అంగుడునుంచీ పదార్థం వెలువడటం చూస్తాం ఈ పదార్థం తెల్లగా గాని, నల్లగాగాని, బూడిద వర్ణంగా గాని వుంటుంది ఈ పదార్థం ఒకసారి స్పష్టంగా కనిపిస్తుంది. ఒకసారి అస్పష్టంగా ఉంటుంది దీని కదలిక, ఒక్కొక్కసారి అద్భుతంగా వుంటుంది. ఒక్కొక్కప్పుడది మెరుపులాగా మాయమవుతుంది. ఒక్కొక్కసారి ఈ పదార్థం పగటి వెలుతురులో కూడా దృశ్యంగా నిలిచి వుంటుంది. ఫ్లాష్ లైట్ ఫోటోలు తీయవచ్చు (ఈ పదార్థం సహాయంతో) సాక్షాత్కారం పొందిన అవయవాలు అన్నివిధాలా సజీవమైన అవయవాల లాగే వుంటాయి సాక్షాత్కారం పొందిన రూపం ఏదైనప్పటికీ అది మీడియముకు ఎడంగా కనిపించటం తరుచు జరుగుతుంది. ఈ ఆకారాలకు వ్యక్తిత్వం ఉన్నట్లు స్పష్టంగా తెలుస్తుంది. ఒక్కొక్కసారి ఈ ఆకారాల వెనకభాగం సరిగా ఏర్పడక అక్కడ నిర్దిష్టమైన రూపంలేని పదార్థం మటుకే ఉంటుంది. మధ్య మధ్య తొర్రలు కూడా ఉంటాయి ...... ఇవి చాలామంది పరిశీలకులను నిర్ఘాంతపరిచాయి"

మూడో వర్ణన :

"తెల్లటి కాంతివంతమైన పదార్థపు ఉండ, అస్పష్టమైన ఆకృతితో, నేలకు కొంచెం ఎత్తున తేలుతూ కనిపించింది. ఈ కాంతి ఉండలోనుంచి ఆకస్మికంగా బైన్‌బోనా (ఒక పేరు) ఆకారం బయలు వెడలింది. అతని శరీరం చుట్టూ బట్ట దిగజారి ఉన్నది నడుముకు బెల్టు ఉన్నది. ... అతను అకస్మాత్తుగా నేలగూలి అదృశ్యమై పోయాడు మరి మూడు నాలుగు నిమిషాల అనంతరం కాంతిగోళం మళ్ళీ కనిపించి, దానినుంచి ఒక మనిషి ఆకారం చివాలున లేచి అంతలోనే మళ్ళీ నేలకూలింది "

ఈ వివరాలు గమనించినవారు ఆధ్యాత్మిక ప్రచారకులు, పరిశోధకులు, శాస్త్రజ్ఞులు

ఈ సాక్షాత్కారాలు ఎలా జరుగుతాయి ? ఆ సంగతి తెలుసుకునేటందుకు మనకు అవకాశం లేదు అయితే, విలియం రాబర్ట్‌సన్ అనే మీడియంకు సహాయపడే ఆత్మ (చాంగ్ అనే పేరుగల "కంట్రోల్") సాక్షాత్కారాలను తాను ఎలా సాధించేదీ ఈ విధంగా చెప్పాడు

"నేను తెరవెనక్కు వెళ్ళి, నా బుద్ధి బలంతో గదిలో తేలుతూ ఉండే పదార్థాన్నంతా లాగేసుకుంటాను. నా చేతికి వచ్చాక అదంతా ఘనీభవిస్తుంది దానితో చేతులు చాస్తాను వాటిని మీరు తాకవచ్చు అవి మీకు కనిపిస్తాయి "

ఈ పదార్థం మీడియంనుంచి వచ్చి తిరిగి మీడియం శరీరంలోకి పోతుందనటానికి తగిన ఆధారాలున్నాయి సాక్షాత్కరించిన రూపానికొస్తే మీడియంకు బాధ కలుగుతుంది. దానిపైన రంగు చల్లితే అది అదృశ్యమయ్యాక మీడియం శరీరంపై రంగు మరకలు కనిపిస్తాయి మామూలు శరీరాలకూ, సాక్షాత్కారం పొందిన రూపాలకూ ఉండే తేడా కేవలం పదార్థ ప్రమాణంలో మాత్రమే. ఆ శరీరాలలో మామూలు శరీరాలలో ఉండే దానికంటే తక్కువ రక్తం ఉంటుంది. వాటి బరువు కూడా తక్కువే.

సాక్షాత్కారానికి సహాయపడే ఈ పదార్థం సాధారణంగా పై వాళ్ళకు లభ్యం కాదు. అయినా, ఎంతోకాలం ఉండదు కాని, ఫ్రాంక్ జార్మన్ అనే ఆయన ఒక పలచని పొరలాటి ముక్క సంపాదించి రెండు అద్దపు పలకల మధ్య బిగించి ఏళ్ళ తరబడి తనవద్ద ఉంచుకున్నాడు

హారీ ప్రైస్ అనే ఆయన యాభై ఏళ్ళకు పైగా "నాస్తిక" దృక్పథంతో ఆధ్యాత్మిక పరిశోధనలు సాగించాడు ఆధ్యాత్మిక విషయాలలో నమ్మకంలేనివాళ్ళూ, అలాటి ప్రదర్శనలు మోసాలని రుజువు చెయ్యటానికి కంకణం కట్టుకున్నవాళ్ళూ ఆయనను తమ సోదర పరిశోధకుడుగా పరిగణించారు. ఆయనకు కలిగిన ఈ అనుభవాన్ని సేమూర్ తన గ్రంథం "దీస్ తింగ్స్ హాపెన్' 'లో ఉదహరించాడు

రోజాలీ అనే పిల్ల 1921 లో డిప్తీరియాతో మరణించింది ఆమె తండ్రి 1916 లో యుద్ధంలో చనిపోయాడు. 1925 ఆరంభంలో ఒకనాటి రాత్రి రోజాలీ తల్లి నిద్రపోతూండగా, రోజాలీ "అమ్మా" అని పిలిచినట్టు వినిపించి ఆమె మేలుకున్నది ఇలా అనేకసార్లు జరిగినమీదట ఆమె రాత్రివేళ మేలుకుని ఉండి తన కూతురు పిలుపుకోసం ఆలకించసాగింది తరువాత క్రమంగా చీకట్లో ఆమెకు అస్పష్టంగా రోజాలీ ఆకారమూ, అడుగుల చప్పుడూ స్ఫురించాయి చివరకామె తన చెయ్యి చాచింది. ఆమె చేతికి తన కుమార్తె చేయి దొరికింది.

ఇంట్లో ఆధ్యాత్మిక సమావేశాలు ఏర్పాటు చేయమని ఎవరో సూచించారు ఆరుమాసాలపాటు ఈ సమావేశాలు ఫలించలేదు

1929 లో వేసవి ఆరంభంలో రోజాలీ చీకట్లో సాక్షాత్కరించి, తాను వచ్చినట్టు తెలపటానికి తల్లి చెయ్యి పట్టుకున్నది

ఆ రోజు మొదలు ఆ పిల్ల నిత్యమూ వచ్చింది. కొన్ని రోజుల తరువాత నోరు తెరిచి మాట్లాడసాగింది సాధారణమైన ప్రశ్నలకు ఒంటి మాటలతో సమాధానలివ్వసాగింది

1937 డిసెంబరు 8 వ హార్‌ప్రైస్‌కు రోజాలీ సాక్షాత్కారాలను గురించి ఎవరో చెప్పి, ఆధ్యాత్మిక సమావేశాలకు ఆహ్వానించారు డిసెంబరు 15న ఆయన వెళ్ళాడు

అందరూ అంధకారంలో కూచున్నారు గడియారం పదికొట్టిన కొద్ది నిమిషాలకు రోజాలీ తల్లి కూతురిని సంబోధించటం వినిపించింది హార్‌ప్రైస్‌కి ఏమీ కనిపించలేదు గాని, అంతకు మునుపు లేని వాసన ఒకటి కొత్తగా రావటం తెలిసింది. తల్లి తన కూతురిని దగ్గిరికి తీసుకుని ముద్దు చేస్తున్నట్టు తోచింది

అందరూ నిశ్శబ్దంగా ఉన్నారు కొంతసేపటికి కాళ్ళ చప్పుడు వినిపించింది మోకాలిమీద పెట్టుకుని ఉన్న హార్‌ప్రైస్ చేతికి ఏదో అనుకున్నది - వెచ్చగా, మృదువుగా ఆయన దాన్ని తడివిచూడక, కదలకుండా కూచున్నాడు

రోజాలీ తల్లి ఉద్రేకం కొంత ఉపశమించింది. ఆమె కూతురితో ఏదో రహస్యంగా మాట్లాడుతున్నది తరువాత కొద్ది నిమిషాలకు హార్‌ప్రైస్ ఆ పిల్లను ముట్టుకోవచ్చునన్నారు ఆయన తన ఎడమచెయ్యి చాచి ఆరేళ్ళ పిల్ల శరీరాన్ని తాకి విస్మయం చెందాడు ఆ పిల్ల శరీరంమీద బట్టలేవీ ఉన్నట్టు లేవు. ఆయన ఆ పిల్ల రొమ్మూ, గడ్డమూ, చెంపలు నిమిరాడు శరీరం వెచ్చగానే ఉన్నది గాని మామూలు శరీరాలుండదగినంత వెచ్చగా లేదేమోనని ఆయనకు అనిపించింది ఆమె చెంపమీద చెయ్యి పెట్టిచూస్తే మృదువుగా, వెచ్చగా ఉన్నది. ఆ పిల్ల శ్వాస పీల్చటం స్పష్టంగా వినిపిస్తున్నది

పిల్లను దగ్గిరికి తీసుకోవచ్చునా అని హార్‌ప్రైస్ అడిగాడు కుర్చీ దగ్గిరికి జరుపుకోమన్నారు. ఆయనకి ఇప్పుడామె రెండు చేతులూ కనిపిస్తున్నాయి. ఆమె శరీరమంతా తడివి, "ఇది ఆత్మ అయితే, బతికివున్న శరీరాలకూ దీనికీ తేడా లేదు" అనుకున్నాడు. ఆయన తన కుడిచేతి వేళ్ళతో రోజాలీ నాడి పరీక్షించాడు ఆమె రొమ్మున చెవిపెట్టి విన్నాడు గుండె కొట్టుకుంటున్నది

హార్‌ప్రైస్ వద్ద ఫ్లోరెసెంట్ పలక లున్నాయి వాటినుంచి కొద్ది వెలుతురు వస్తుంది సమావేశం అనుమతితో వాటిని పైకితీసి వాటి వెలుగులో రోజాలీని పరీక్షించాడు ఆమె అన్నివిధాల ఆరేళ్ళ పిల్లలాగే ఉన్నది (బతికివుంటే ఆమెకు 18 ఏళ్ళు !) ఆమె శరీరం నున్నగా, ఎక్కడా ఒక్క మచ్చ కూడా లేకుండా వున్నది ఆమె ముఖం చాలా అందంగా ఉన్నది ముదురునీలం రంగు కళ్ళు, తెలివితో ప్రకాశిస్తున్నాయి ఆ పిల్లను ప్రశ్నలు వేస్తానన్నాడు. అందుకు అనుమతి వచ్చింది.

"రోజాలీ, నువ్వెక్కడ ఉంటూంటావు ?" అన్నాడు. జవాబు లేదు.

"అక్కడ ఏం చేస్తూంటావు ?"
జవాబు లేదు
"ఇతర పిల్లలతో ఆడుకుంటావా ?"
జవాబు లేదు
ఎన్నో ప్రశ్నలు వేశాడు వేటికీ జవాబు లేదు
చివరకు, "మీ అమ్మంటే నీకు ఆపేక్షేనా ?"
ఆమె ముఖంలో మార్పు వచ్చింది కళ్ళు మెరిశాయి "అవును" అన్నదామె రహస్యంగా.
మరి పదిహేను నిమిషాలలో రోజాలీ నిష్క్రమించింది

ఆత్మల సాక్షాత్కారాలు నేరుగా చూడలేనివారికి వాటి తాలూకు ఫోటోలున్నాయి సైకిక్ పవర్ అనేది ఫొటోలు తీసేవారిలో ఉన్నప్పుడు వారు తీసే ఫొటోలలో దాని ఫలితాలు కనిపించడం పరిపాటి

మిగిలిన ఆధ్యాత్మిక ప్రదర్శనలలోనే ఇటువంటి సైకిక్ ఫొటోలలో కూడా ఆత్మల తాలూకు సాక్ష్యం ఉన్నవీ, ఉన్నట్టు నమ్మటానికి లేనివీ కూడా ఉన్నాయి. ఉదాహరణకు ఒక ఎమెచూర్ ఫొటోగ్రాఫర్ అయిదుగురు మనుష్యులకు ఫ్లాష్ ఫొటో తీస్తే నెగెటివ్‌లో వారెవ్వరూ లేరు వారి వెనకవున్న గోడా కిటికీలూ లేవు వాటికి బదులుగా వీధికి అవతలివేపు దృశ్యం అస్పష్టంగా ఫొటోగ్రాఫయింది !

ఈ ఫొటోగ్రాఫర్ తీసిన తరువాతి ఫొటో ఇంకా చిత్రమైనది. ఆయన ఒక తోటలో నలుగురిని ఫొటో తీశాడు వచ్చిన ఫొటోలో ముగ్గురు లేనేలేరు - వారి వెనకున్న చెట్లు కనిపిస్తున్నాయి నలుగురికిగానూ ఒక్క స్త్రీ మాత్రమే. ఆమె కూడా తాను ధరించి ఉన్న దుస్తులతో ఫొటోగ్రాఫ్ కాలేదు, తన ఇంటిగదిలో ఆ సమయాన వ్రేళ్ళాడుతున్న గౌను ధరించి ఫొటోగ్రాఫయింది !

ఆత్మల సాక్షాత్కారాలను ఫొటో తీసేటప్పుడు కూడా అయోమయాలు జరుగుతాయి ఒకసారి ఒక నర్తకి సాక్షాత్కరించింది ఆమె తెల్లని జారుడు వస్త్రాలు ధరించి నృత్యం చేస్తూండగా ఫొటోగ్రాఫర్ "ఫ్లాష్" ఇచ్చాడు కాని తీరా ఫొటోలో చూస్తే నల్లని దుస్తులతో సహా మీడియం నృత్యం చేస్తూ కనిపించింది ! సాక్షాత్కారం వట్టి మోసమని రుజువు చెయ్యటానికి ఎంతో ఉపయోగపడే ఫొటో ! అయితే ఆ ఫొటో తీసినవారి ఉద్దేశం తమ్ము తాము "బయట పెట్టు కోవటం" కాదు

ఒక అధ్యాత్మిక సంఘం జరిపే సమావేశాలలో ఒక ఆత్మ తరుచు వచ్చేది. ఈ ఆత్మ వేరు వేరు ఫొటోగ్రాఫర్లు ఇతరులను తీసే ఫొటోలలో రాసాగింది ఆ ఫొటోగ్రాఫర్లు ఒకరినొకరెరగరు చిట్టచివరకొక వింత విషయం బయటపడింది ఇన్ని ఫొటోలలోనూ కనిపించిన ఆత్మ, "రాత్రి" అనే జర్మన్ చిత్తరువుకు సరియైన నకలు ! అందరు ఫొటోగ్రాఫర్లూ అనుమానించదగినవారే. "మోసం" తెలిసిపోయింది కాని ఈ ఫొటోగ్రాఫర్లు ఎప్పుడు ఎలా కూడబలుక్కుని ఎందుకు గాను ఈ మోసం చేశారన్నవారికి సమాధానం లేదు. ఇంతమందీ ఒకరికి తెలియకుండా ఎక్కడో ఉన్న చిత్తరువును ఇంగ్లండులో ఉండి ఫొటోగ్రాఫు చెయ్యగలిగారన్నది మాత్రం రూఢీ అయింది.

ఒక పరిశోధకుడు కామెరా అవసరం లేకుండా, "ప్లేట్"లను తన వేళ్ళతో తాకుతూ ఒక సీసానో, చేతి కర్రనో భావించుకొని వాటి తాలూకు ఫొటోలు సృష్టించాడు. మనుషులను వూహించుకుని వారి ముఖాలు తెప్పించాడు ఇతరులు అలా చేయటానికి యత్నిస్తే వారు మనస్సులో అనుకున్నవారి ముఖాలు కాక ఇంకెవరి ముఖాలో ప్రత్యక్షమయ్యాయి

పుకురాయ్ అనే జపానీ శాస్త్రవేత్త సైకిక్ ఫొటోగ్రాఫీలో చాలా పరిశోధనలు చేశాడు మిగిలిన పరిశోధకులు ప్లేట్లను "ఫోనోవర్ ఎక్స్‌పోజ్" చేస్తున్నట్టు ఆయన నిశ్చయించాడు ఆధ్యాత్మిక శక్తి (సైకిక్ పవర్) కలవారిని వీధికి ఒకపక్క నిలబెట్టి రెండవ పక్క తాను ప్లేట్లను కాగితాలు విప్పకుండా పట్టుకుని ఫొటోలు తీశాడు వీధి అవతల ఉన్నవారు తలుచుకున్న బొమ్మలు ప్లేట్లమీద వచ్చాయి

ఇలాటి ఫొటోలు తెప్పించటానికి కెమెరా అవసరమే లేనట్టు కనిపిస్తుంది పాకెట్‌లోనుంచి పైకి తీయని ప్లేట్లపైన ఫొటోలు వచ్చాయి

"డబుల్ ఎక్స్‌పోజర్" ద్వారా మోసాలు జరగకుండా ఉండటానికి పరిశోధకులు తమ ప్లేట్లను కొనుక్కుని అవి డెవలప్ చేసినదాకా ఇంకొకరికి ఇచ్చేవారు కారు

"యూనివర్సిటీ ఆఫ్ స్పిరిచువలిజం" అనే గ్రంథాన్ని రచించిన హారీ బాడింగ్టన్ ఫొటోగ్రఫీలో కూడా అనుభవం గలవాడు. ఆయన ఈ కింది సంఘటనను తన పుస్తకంలో వర్ణించాడు!

ఆయన ఒకసారి విలియం హోప్ అనే మీడియంతో ఒక ప్రయోగం చేశాడు ఇందుకుగాను అయన ఒక పాకెట్ ప్లేట్లు కొని హోప్ ఉండే క్రూ అనే గ్రామానికి వెళ్లాడు. ఆ పాకెట్ (ఇంపీరియల్ రాపిడ్ ప్లేట్లు) ఆయన తనవద్దనే ఉంచుకుని, స్వయంగా స్లైడ్సులో పెట్టాడు తరువాత హోప్ వెంట కూచునేటప్పుడు కామెరాను తాను కూర్చునే కుర్చీకి ఫోకస్ చేశాడు హోప్‌కు సహాయపడే ఆత్మ (కంట్రోల్) అయిదు, ఆరు నంబర్లు గల స్లయిడ్సులో ఉండే ప్లేట్లను "డెవలప్" చెయ్యమని సూచించింది డెవలప్ చెయ్యటమూ, ఫిక్స్ చెయ్యటమూ కూడా బాడింగ్టన్ స్వయంగా చేశాడు రెండు ప్లేట్లలోనూ ఒకదానిమీది బొమ్మ అస్పష్టంగా ఉంది రెండవదానిలో మాత్రం బాడింగ్టన్ సోదరి ఆకారం అదనంగా కనిపించింది (ఈమె అంతకు పూర్వం నాలుగేళ్ళ క్రితం చని పోయింది)ఆమె బాడింగ్టన్‌కూ, కామెరాకూ మధ్యగా నిలబడి ఉన్నది

ఇలాటి అనుభవాలు జరిగినవాళ్ళు వందల సంఖ్యలో ఉన్నారని బాడింగ్టన్ చెబుతున్నాడు. ఇందులో వంచనకు ఆస్కారం లేదు దీనికి డబ్బు ప్రమేయం లేదు

1893 లో "బ్రిటీష్ జర్నల్ ఆఫ్ ఫొటోగ్రఫీ"కి సంపాదకుడుగా ఉన్న ఆయన (పేరు తెలియదు) ఆనాటికి ఫొటోగ్రఫీలో చాలా ఆరితేరినవాడు. ఈయన ఆత్మల ఫొటోలను గురించి చిత్రమైన పరిశోధనలు చేశాడు. ఆయన స్టీరియోస్కోపిక్ (3-డి) కామెరా సహాయంతో ఇటువంటి ఫొటోలు తీసి "ఆత్మ" తాలూకు బింబం "కుడి" ఫొటోలో ఉన్నచోట "ఎడమ" ఫొటోలో లేదని చూపాడు

"ఆత్మల" ఫొటోలు ప్రదర్శించదలచినవాళ్ళు మోసం చెయ్యదలిస్తే అవకాశాలు లేకపోవు ఈ ఫొటోలు "ప్రమాదవశాత్తూ" ఆధ్యాత్మిక విషయాలలో విశ్వాసం లేనివాళ్ళకు సంభవించినప్పుడు ప్రబలమైన సాక్ష్యంగా ఉపయోగపడతాయి ఒక గృహనిర్మాత తాను మరమ్మతు చేయబోతున్న ఖాళీ ఇంటికి ఫొటో తీశాడు ఆ ఫొటోలో ఉన్న ఇంటి కిటికీవద్ద లోగడ ఆ ఇంట కాపురం ఉండిన పెద్దమనిషి ముఖం కనబడింది. ఒక స్త్రీకి కొందరు మిత్రులు ఫొటో తీశారు ఫొటోలో ఆమె నిలబడి ఉన్నచోటికి వెనకగా ఉన్న తలుపుమీద ఇంకొక ముఖం ప్రత్యక్షమయింది

ఎరల్ హేగ్ చనిపోయినప్పుడు ఆయన శరీరాన్ని తీసుకుపోతుండగా "డెయిలీ మెయిల్" ఫొటో గ్రాఫరు శవపేటికను ఫొటో తీశాడు. ఆ ఫొటోలో శవపేటికకు ఎగువగా గాలిలో తేలుతూ ఎరల్ హేగ్ ముఖం స్పష్టంగా కనబడింది. ఆ ఫొటోను "డెయిలీ మెయిల్" పత్రిక ప్రచురించింది.

యుద్ధంలో మరణించిన వారి స్మారక చిహ్నం ఆవిష్కరించే సందర్భంలో ఒక లండన్ పత్రిక తాలూకు ఫొటోగ్రాఫర్లు ఫొటోలు తీస్తే నెగెటివ్‌లో డజన్లకొద్దీ ముఖాలూ, గాలిలో దీపాలూ,

"ప్రకాశం" కాంతిపుంజాలూ వచ్చాయి ఇటువంటి ఫొటోలే ఆధ్యాత్మికవాదులు ప్రదర్శించినప్పుడు పత్రికలు వారి "మోసాన్ని" తీవ్రంగా అధిక్షేపించాయి.

కొన్ని ఫొటోలలో రాసిన వాక్యాలు వచ్చాయి మాక్ ఆలిస్టర్ అనేవాడు హోప్ (మీడియం) సమక్షంలో ఫొటో తీయించుకున్నాడు ఫొటో అంచుల వెంబడి ఈ వాక్యాలు కనబడ్డాయి. ఈ వాక్యాలు రాసినవాడు తానొక ఆత్మననీ, మరొకరు తీయించుకున్న ఫొటోలోకి తాను వస్తే తననెవరూ గుర్తించలేదనీ తెలిపాడు ఇంకా అనేక వివరాలు తెలిపాడు వాటి ఆధారంతో అసలు మనిషి ఆరా తీయటానికి వీలుచిక్కింది ఈ ఆత్మకు ఉత్తరక్రియలు జరిగిన రోజూ, శవాన్ని పాతిపెట్టిన చోటూ సరిగా సూచించబడ్డట్టు రుజువైంది

సజీవులుగా వున్నవారి ఆత్మలు ఫొటోలలోకి రావటం అన్నిటికన్న గొప్ప వింత కాని ఈ వింత కూడా అనేక పర్యాయాలు జరిగినట్టు తెలుస్తుంది మమ్లర్ అనే ఫొటోగ్రాఫరు తీసిన ఫొటోలలో కూర్చున్నవారి రూపాలు అనేక పర్యాయాలు వచ్చాయి మోసం చేస్తున్నాడని అతనిపై అభియోగం తెస్తే అది నిలవలేదు కాని ఒకసారి అతని ఫొటోలో కనిపించిన వ్యక్తి సజీవుడేనని రుజువయింది అతని మిత్రులకు అతనిలోని విశ్వాసం కాస్తాపోయింది. అతను దారిద్ర్యంలో తన జీవితం ముగించాడు

అసనో అనే జపానీయుడికి ఒక అనుభవం అయింది. అతను ముందుగా అనుకోకుండా, ఎట్టి ఏర్పాటూ చేయకుండా ఒక మీడియం ఫొటోగ్రాఫరు వద్దకు ప్లేట్లు తీసుకుని వెళ్ళి ఫొటోలు తీయించుకున్నాడు ఒక నెగెటివులో అసనోతోపాటు మరొక స్త్రీ కూడా కనిపించింది ఈమె అతని బంధువురాలు, అదివరకే చనిపోయింది ఆ ఫొటోలో మోసం ఉండే అవకాశం ఏమీ లేదు. ఎందుచేతనంటే, చాలా ఏళ్ళక్రితం జపానులో చనిపోయిన పిల్ల - జపాను వదిలి ఎక్కడికీ వెళ్లని మనిషి - గురించి బ్రిటనులో ఉండే ఎవరో ఫొటోగ్రాఫరుకు తెలిసే అవకాశం లేదు కాని ఇంతకన్న కూడా విడ్డూరం జరిగింది అసనో వెంటవున్న ఒక మిత్రుడూ, అతని కొడుకులూ (జపానీయులే) తీయించుకున్న ఫొటోలో వారి తలలమీదుగా ఆ మిత్రుడి కుమార్తె ముఖం వచ్చింది ఆమె సజీవురాలు ఫొటోతీసే సమయాన 12 వేల మైళ్ళ దూరాన టోక్యోలో ఉన్నది !

(ఆత్మ జీవులు అంతులేని సంఖ్యలో సాక్షాత్కారం కావటం భారతంలో ఒకచోట వర్ణించబడింది. భారత యుద్ధం ముగిసిన అనేక సంవత్సరాల అనంతరం ధృతరాష్ట్రుడూ, గాంధారీ, విదురుడూ ఆశ్రమవాసం చేస్తున్న కాలంలో పాండవులు వారిని చూడవస్తారు. అక్కడికి వ్యాసుడు కూడా వస్తాడు. ధృతరాష్ట్రుడు తన కొడుకులను ఒకసారి చూడాలని తహతహలాడిపోతాడు ఆ సందర్భంలో వ్యాసుడు తన యోగశక్తివల్ల యుద్ధంలో ఉభయపక్షాల చనిపోయిన వీరులందరినీ గంగా తీరాన సాక్షాత్కరింపజేస్తాడు వారు సూర్యాస్తమయం కాగానే ప్రత్యక్షమై తిరిగి తెల్లవారినదాకా బతికున్నవాళ్ళతో ఉంటారు అందరూ చనిపోయేనాటి ఆకారాలతో, దుస్తులతో, కవచాలతో, ఆయుధాలతో ఉంటారు వారి మధ్య ఇప్పుడు పాత వైషమ్యాలేవీ లేవు. చచ్చిపోయిన మనుషులే కాక వారివెంట ఉండిన గుర్రాలు మొదలైనవి సాక్షాత్కరించటం వర్ణించబడింది )

ఈ ఘట్టం చాలావరకు "యథార్థంగా" ఉన్నట్టు కనిపిస్తుంది. సాక్షాత్కారం పొందిన ఆత్మలు సజీవులను ఎలా ఆలింగనం చేసుకుంటాయో, పాత విషయాలు ఏ విధంగా ప్రసంగిస్తాయో నేను ఆధునిక గ్రంథాలలో చదివి ఉన్నాను. ఇదంతా భారత వర్ణనలో కనిపిస్తుంది ఈ ఘట్టాన్ని ప్రవేశపెట్టడంలో భారత రచయితకు ప్రత్యేక ప్రయోజనం ఉండే అవకాశం లేదు

అనేక ఆత్మలు ఒక్కసారి సాక్షాత్కారం కావటాన్ని "మాస్ మెటీరియ-లైజేషన్" అంటారు ఆధునిక పరిశోధనలలో ఒక్కసారిగా నలభై ఆత్మలు సాక్షాత్కరించటం గురించి కోనన్ డాయిల్ చెప్పాడు కాని భారతంలో లాగా వందల సంఖ్యలో, వేలసంఖ్యలో ఆత్మలు సాక్షాత్కరించటం ఆధునిక యుగంలో జరిగినట్టు లేదు. భారత వర్ణనలో అతిశయోక్తి ఏమైనా ఉంటే సంఖ్యలో ఉండవచ్చు.

# 13. 'ఆధ్యాత్మిక శక్తులను' భ్రమ అని త్రోసివేయటం సరికాదు

"పెనుమత్స మహాయోగిని - నిర్వికల్ప సమాధి" అనే శీర్షికతో డాక్టర్ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు విశాలాంధ్ర (16, మార్చి) సంచికలో ప్రచురించిన వ్యాసం ఒక విధంగా ప్రజలకు మేలు చేస్తున్నదనీ, ఇంకొక విధంగా ఆ మేలు జరగకుండా చేస్తున్నదనీ నాకు తోస్తున్నది.

ఈ వ్యాసంలో నేను పెనుమత్స యోగిని గురించి డాక్టరుగారు చెప్పిన విషయాలను బలపరచటంగాని ఖండించటంగాని చెయ్యబోవటం లేదు ఎందుకంటే నాకా యోగిని గురించి ఏమీ తెలియదు. నేనావిడను గురించి తెలుసుకున్నదల్లా డాక్టరుగారి వ్యాసం ద్వారానే అదీగాక వైద్యశాస్త్ర దృష్ట్యా ఆయన చెప్పినది అవుననటానికి గాని, కాదనటానికి గాని నేను తగిన విజ్ఞానం లేనివాణ్ణి

"జ్ఞానేంద్రియముల రోగముల యందును, కొన్ని విషపదార్థములు సేవించుట వలనను" అని ప్రారంభమైన పేరాలో వున్న సత్యాన్ని అందరూ గుర్తించి తీరాలి మనదేశం శాస్త్ర విజ్ఞానంలో చాలా వెనకబడి వున్న దేశం అజ్ఞానం మూఢ విశ్వాసాలకు దారితీస్తుంది కొత్తలో కలకత్తా - మద్రాసు రైలుపడ్డప్పుడు తెనాలిలో కొందరు రైలువచ్చే వేళకు స్టేషనుకి వెళ్ళి ఇంజనుకు కొబ్బరికాయలు కొట్టేవారట ! ఈనాడు మన సంఘంలో ఎన్నిరకాల వృత్తులవారు ప్రజల మూఢ నమ్మకాలమీద బ్రతుకుతున్నారో పరిశీలిస్తే ఆశ్చర్యం వేస్తుంది ప్రజల ఓట్లతో పదవులు సంపాదించేవాళ్ళూ, ప్రజల రోగాలమీదా, తగాదాలమీదా డబ్బు గడించే డాక్టర్లూ, ప్లీడర్లూ ఇప్పటికీ అనేకమంది దృష్టిలో దేవతలలాగా చలామణీ కావటానికి కూడా ఇటువంటి కారణమే ఉందనుకోవాలి గౌరవించదగిన మంత్రులూ, డాక్టర్లూ, ప్లీడర్లూ లేరనికాదు కాని మూఢ విశ్వాసానికి పాత్రా పాత్ర విచక్షణా జ్ఞానం ఉండదు

దేశంలో ప్రజలను ప్రబలంగా ఆకర్షించే స్వాములార్లూ, యోగం తెలియని యోగులూ, తపస్సు చెయ్యని మహర్షులూ అక్కడక్కడా ఉండటాన్నిబట్టి ఆధ్యాత్మిక విషయాలు కూడా మూఢ విశ్వాసాలకు హేతుభూతాలే అనాలి అటువంటి మూఢ విశ్వాసాలనుంచి ప్రజలను కాపాడటం విజ్ఞానులు చేయదగిన పనే. అయితే ఈ పనికి పూనుకునేవారిలో నూటికి 99 మంది ఆధ్యాత్మిక విషయాలను భ్రమక్రింద కట్టేస్తున్నారు. ఇది చాలా పెద్ద పొరపాటని నాధృఢ విశ్వాసం

మూఢనమ్మకాలున్నట్టే మూఢ అపనమ్మకాలున్నాయి ఇవి అజ్ఞానంలో పుట్టవు అసమగ్ర జ్ఞానంలో పుడతాయి ఈనాడు సర్వసాధారణంగా శాస్త్రవేత్తలు ఆమోదించే అనేక విషయాలు ఆదిలో ఆనాటి శాస్త్రవేత్తల మూఢ అపనమ్మకాలకు గురి అయాయి శాస్త్రవిజ్ఞాన చరిత్ర తడివిచూస్తే ఇటువంటి నిదర్శనలు వందల సంఖ్యలో కనిపిస్తాయి. దానికి కారణమేమంటే మనం జ్ఞానం అనుకున్నదే మనకు తెలియకుండా విశ్వాసం రూపంలో మన మనసులో తిష్ఠవేసి కూచుంటుంది నిజమైన శాస్త్ర దృష్టి గలవాడు తగిన కారణం లభిస్తే తన జ్ఞానాన్ని సంస్కరించుకోగలడు, కాని విశ్వాస రూపంలో పాతుకుపోయిన జ్ఞానంగలవాడు, అందులో ఈషత్తయినా మార్పు జరగటానికి ఒప్పుకోడు. కొత్త జ్ఞానాన్ని తీవ్రంగా ప్రతిఘటిస్తాడు. టెలిఫోను, గ్రామఫోను రికార్డు మొదలైనవి మొదలుకుని ఐన్‌స్టయిన్ ప్రతిపాదించిన సిద్ధాంతం వరకూ శాస్త్రవేత్తల అపనమ్మకాలను ఎదుర్కొన్నాయి.

ఆధ్యాత్మిక జ్ఞానం ఒకవంక మూఢనమ్మకాలనూ, ఇంకొక వంక మూఢ అపనమ్మకాలనూ ప్రేరిపిస్తున్నట్టు కనబడుతుంది. దురదృష్టవశాత్తూ ఆధ్యాత్మిక దృగ్విషయాలు (Psycic phenomena) ఎప్పుడో ఒకప్పుడు ఇంచుమించు ప్రతి వ్యక్తికీ అనుభవంలోకి వస్తాయి ఎవరికోవచ్చిన

కల నిజమవుతుంది, ఎవరో సోదె - అడిగితే చనిపోయిన మనుషులు వచ్చి 'గురి'గా తమ వ్యక్తిత్వం రుజువు చేసుకుంటారు తలవని తలంపుగా ఒక ఎరగని వ్యక్తి వచ్చి పోయిన వస్తువులను వర్ణించి, అవి ఎక్కడ ఉన్నదీ సరిగా చెబుతాడు వైద్యులు చికిత్స చెయ్యలేని వ్యాధిని ఏ గోసాయివాడో వచ్చి ఒక తాయెత్తు కట్టి పావలాడబ్బులు తీసుకుని నయం చేసిపోతాడు "ఇవి జరగవు, జరగటానికి వీల్లేదు !" అని కళ్ళు గట్టిగా మూసుకోదలచినవాళ్లు ఏమీ సాధించలేరు, అవన్నీ దేవుడి చర్యలన్నీ భావించి దణ్ణాలు పెట్టుకుని, చెంపలు వేసుకున్నవాళ్లు కూడా, కొద్ది మనశ్శాంతిని తప్ప ఏమీ సాధించలేరు. "ఇవి జరుగుతాయన్నమాట నిజమా ? జరిగితే ఎలా జరుగుతున్నాయి ?" అన్న శాస్త్రదృష్టితో అన్వేషణ సాగించేవాళ్ళు ఏదైనా సాధిస్తే సాధించవచ్చు.

ఆధ్యాత్మిక విషయాలు అనుభవంలోకి వచ్చినప్పుడు కూడా అందరూ ఒక రకంగా ప్రవర్తించరు. ఈ ఆధ్యాత్మిక విషయంపట్ల నేను చాలాకాలం మూఢ అపనమ్మకమే అవలంబించాను. (మార్క్సిజం పట్ల కూడా చాలాకాలం ఈ వైఖరే అవలంబించాను) నా అనుభవాలను కూడా నేను పక్కకు నెట్టేశాను కాని నాలో కొంత శాస్త్రదృష్టి ఏర్పడినాక మూఢ అపనమ్మకాలను హద్దులో ఉంచే శక్తి కూడా పెరిగింది

ఆధ్యాత్మికవాదం అవలంబించిన పాశ్చాత్యులు సయితం కృత్రిమంగా ఒక వైరుధ్యం సృష్టించారు. ఆధ్యాత్మికవాదం భౌతికవాదాన్ని ఖండిస్తున్నదని వారు నిర్ధారణ చేసుకున్నారు ఇంకొక అడుగు ముందుకు వెళ్ళి మార్క్సిజంని పచ్చి భౌతికవాదం కింద నిందించారు ఇది నాకు సమంజసంగా కనబడలేదు ప్రత్యక్ష దృగ్విషయాలలో కొన్నిటిని అబద్ధమనటం భౌతికవాదమైతే, ఆ భౌతిక వాదంలో నాకు నమ్మకం లేదు కాని ఆధ్యాత్మిక దృగ్విషయాలను గురించి తెలుసుకోదలచినవాడికి భౌతికవాదం అడ్డురావలసిన అవసరం ఎంత మాత్రమూ లేదు. క్రూక్స్, లాడ్జ్, వాలస్ మొదలైన శాస్త్రవేత్తలు ఆధ్యాత్మిక పరిశోధనలలో పాల్గొన్నారు. వారు భౌతికవాదులు కాకపోలేదు కాకపోతే శాస్త్ర పరిశోధనలను మానేసి ఉండేవారే.

"పదార్థం", "ప్రకృతి" , "సహజం" అనే మాటలను మనం వాడుతూనే ఉన్నాం గాని వాటి తత్వం మనకు తెలియదు. తెలుసుకోవటానికి తగినంత జ్ఞానం మనకింకా రాలేదు (పరమాణువు కన్న చిన్న కణాలను గురించి మనం ఇప్పుడిప్పుడే తెలుసుకుంటున్నాం) మనం 'అతీత' శక్తులనుకునేవి అసాధారణ శక్తులు మాత్రమే కావచ్చు. ప్రకృతిని గురించీ, సృష్టిని గురించీ, జగత్తును గురించీ మనకు కొన్ని విషయాలు బొత్తిగా తెలియకపోయి వుండవచ్చు

ఒకప్పుడు మెస్మరిజం, హిప్నాటిజం గురించి శాస్త్రవేత్తలు నమ్మలేదు. ఇవాళ వైద్యానికి హిప్నాటిజాన్ని వాడుక చేస్తున్నారు అంతమాత్రాన హిప్నాటిజాన్ని గురించి, మనం పూర్తిగా తెలుసుకున్నామని నేననుకోను టెలిపతీ గురించి ఇంకా చాలామంది శాస్త్రవేత్తలు నమ్మటంలేదు. కాని ఇతర శాస్త్ర విషయాలు రుజువైనంత నమ్మకంగా టెలిపతీ కూడా రుజువయిందనటానికి సందేహం లేదు.

శాస్త్రంలో రెండు విషయాలున్నాయి ఒకటి - ప్రకృతిని పరిశీలించటం, రెండు పరిశీలనా ఫలితాలను బట్టి ఒక సిద్ధాంతం ప్రతిపాదించటం ఒక్కొక్కప్పుడు పరిశీలిత విషయాలు సరిగానే ఉంటాయి, సిద్ధాంతాలు తప్పవుతాయి. ఏ శాస్త్ర సిద్ధాంతమూ శాశ్వతం కాదు, ప్రతి సిద్ధాంతమూ అవసరాన్ని బట్టి మారుతుంది ఆధ్యాత్మిక పరిశోధకుల సిద్ధాంతాలు కూడా అలాటివే. కాని వారు పరిశీలించిన విషయాలు అబద్ధమనటానికి ఎవరికీ అధికారం లేదు వారి సిద్ధాంతాలు తప్పని తోస్తే అంతకన్నా మంచి సిద్ధాంతాలు ప్రతిపాదించవచ్చు.

ఆధ్యాత్మిక విషయాలు భ్రమ అని ప్రజలను నమ్మించటం కంటె అవి నిజమేననీ,

వాటిని అస్వాభావికంగా భావించవలసిన అవసరంలేదనీ చెప్పటం వల్ల ప్రజలలో మూఢ విశ్వాసాలు తగ్గుతాయని నా నమ్మకం. ఆధ్యాత్మిక శక్తుల ప్రదర్శనాలు రోగజనితాలనీ, భ్రమ జనితాలనీ, నిరూపించటానికి ప్రయత్నించి అదివరకే చాలామంది విఫలులైనారని మనం తెలుసుకోవటం మంచిది.

అలాటి ప్రయత్నాలు జరగటానికి కారణాలు లేకపోలేదు. హిస్టీరియా వ్యాధితో బాధపడేవాళ్ళకూ, సైకిక్ పవర్ కలవాళ్ళకూ కొద్ది పోలికలు ఉన్నాయి. అలాగే జ్ఞానేంద్రియాలకు కలిగే భ్రమలకూ, ఆధ్యాత్మిక ద్రష్టలు చూసేవాటికీ కొన్ని పోలికలున్నాయి వీటిని గురించి ఆధ్యాత్మిక పరిశోధకులు చాలా వివరంగా చర్చించారు పెనుమత్స మహాయోగిని దేవలోకంలోని వ్యక్తులను చూసినట్టు ఒక గ్రంథంలో రాసిందని డాక్టరు వెంకటేశ్వరరావుగారి వ్యాసంలో చదివాను. ఆవిడ వాస్తవంగా ఆ వ్యక్తులను చూసిందని నమ్మటానికి నేను కూడా సిద్ధంగా లేను ఆవిడ తాను చూశాననే వ్యక్తులను గురించి ఎరిగి వున్న మనిషి అందుచేత ఆమె సులువుగా భ్రమపడి ఉండవచ్చు ఇలాంటి భ్రమనే ఒకదాన్ని ఆధ్యాత్మిక పరిశోధకులు అన్వేషించారు మిసెస్ విలెట్ అనే ఆమె 1913 డిసెంబరు 17న పూనిన స్థితిలో ఒక దృశ్యాన్ని తన కళ్ళ ఎదుట చూస్తున్నట్టు వర్ణించింది. ఆ దృశ్యంలో వ్యక్తులున్నారు, వారు అనే మాటలూ, చేసే పనులూ ఆమె వివరించింది. వారందరూ ఆమెకు వాస్తవ వ్యక్తులలాగే కనబడ్డారు అయితే ఈమె చూసిన దృశ్యమంతా ప్లాటో అనే గ్రీకు తాత్వికుడు 'సింపోజియం'లో రచించిందే. "సింపోజియం" తెలుసా ?" అని తరువాత మిసెస్ విలెట్‌ని అడిగితే "అది ఏమిటి ?" అని అడిగింది ఈవిడ చూసినది కూడా భ్రమ జనితమైన దృశ్యమే కాని ఈ 'భ్రమ'కు ప్రాతిపదిక ఏది అన్న విషయం ఒక మిస్టరీగా ఉన్నది దాన్ని శాస్త్రదృష్టి కలవారు అన్వేషించవచ్చు. ఎందుకంటే పెనుమత్స మహాయోగిని లాగా మిసెస్ విలెట్ తనకు తెలిసిన విషయాలను గురించిన వాటిని 'చూడ'లేదు

ఆధ్యాత్మిక దృగ్విషయాలన్నీ భ్రమ సంజనితాలేనని ముందుగానే నిర్ణయించుకుని, ఆ విషయం బయటపెట్టటానికే పరిశోధించేవారు ఒక రకం ఉన్నారు. డాక్టరు వెంకటేశ్వరరావుగారు ఈ వైఖరితో పెనుమత్స మహాయోగిని గురించి అన్వేషించారని నేను తప్పుపట్టనుగాని, వారి వ్యాసంలో ఈ యోగినికి గల అసాధారణత్వం ఏమిటో, దానికి సరియైన భౌతిక వివరణ ఏమిటో నాకు స్పష్టంగా బోధపడటం లేదు. అంతర్ద్రవ గ్రంథులూ, బహిర్ద్రవ గ్రంథులూ పనిచేయక, ఆకలిదప్పులు 'పూర్తిగా నశించి', మలమూత్ర విసర్జనలు లేని స్థితిలో 'సమాధి'లో ఉన్న మనిషి ఎంతకాలం బతికి ఉంటుందో డాక్టరుగారికి తెలిసివుండాలి. ఈ మహాయోగిని ఎంతకాలంగా ఈ స్థితిలో ఉన్నది ? ఇప్పుడున్న స్థితిలో ఆమె బహుశా ఎంతకాలం జీవిస్తుంది ?

ఈ ప్రశ్నలు ఎందుకు వేస్తున్నానంటే ఆధ్యాత్మిక శక్తులు ఆవేశించిన వ్యక్తులు అసాధారణ శరీర స్థితులను సాధిస్తారు. అవి రుగ్మతను స్ఫురింపజేస్తాయి గాని నిజమైన రోగాలుకావు గాలిలో తేలేవాళ్ళూ, నీళ్ళమీద కూచుని ఈదేవాళ్ళూ, మాట్లాడుతూనే నాడి ఆపి చూపేవాళ్ళూ ఉన్నారు నీళ్ళమీద తేలటమూ, నాడి ఆగిపోవటమూ, శవలక్షణాలని లాభంలేదు ఎందుకంటే ఈ పనులు చేసేవాళ్ళు చేతన లక్షణాలన్నీ ప్రదర్శించారు. ఒక స్త్రీ పూనకం రాబోయేముందు దాదాపు ఇరవైసార్లు దీర్ఘంగా ఉచ్ఛ్వాసలు తీసుకోవటమూ, పూనకం దిగిపోయినాక మళ్ళీ ఇరవై నిశ్వాసాలతో ఆ గాలినంతా వదిలివెయ్యటమూ నేను కళ్ళారా చూశాను (ఇంకొకరు చూశామని చెబితే నేను సంపూర్ణ విశ్వాసం ప్రకటించి ఉండనని ఒప్పుకుంటున్నాను ) పూనకం స్థితిలో ఆవిడ చెప్పిన మాటలు నన్నాకర్షించనే లేదు. కాని ఆవిడ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు పరిశోధించదగినవిగా నాకు తోచాయి పూనకానికి ముందు ఆవిడ ఒక రకమైన దేహబాధ - ఒళ్ళు మంటలు -

కలుగుతున్నట్టుగా కూడా చెప్పింది. నేను అప్పటికి చాలా చిన్నవాణ్ణి కావటం చేతను, వైద్యశాస్త్రం తెలియనివాణ్ణి కావటంచేతను ఆమె ప్రదర్శించినది ఏ వ్యాధి లక్షణాలో చెప్పలేను కాని అది వ్యాధే అయితే పూనకం దిగిపోగానే పోయింది

అనేకమంది తమ జీవితంలో ఏ ఒకసారో ఆధ్యాత్మిక శక్తి ప్రదర్శిస్తారు అది మూఢ ప్రజలకంట పడుతోంది అంతటితో వారు ఆ వ్యక్తికి దేవత్వం అంటగట్టి చిక్కు పరిస్థితి కల్పిస్తారు. ఇది జరిగిన కొన్ని ఏళ్ళకు ఎవరో వెళ్ళి పరిశోధనలు చేస్తే దగా, మోసమూ, మూఢత్వమూ, ఒక్కొక్కప్పుడు రుగ్మతా మాత్రమే కనబడుతోంది. అందుచేత ఆధ్యాత్మిక పరిశోధన చేయదలచిన వారు, మొదటి పుకారు వింటూనే పరిశోధించటం మంచిది.

ఏది ఏమైనా ఆధ్యాత్మిక శక్తులు అసహజమని గాని, మానవాతీతమనిగాని, ప్రకృతి విరుద్ధమనిగాని నమ్మటం మంచిదిగాదు ఈ నమ్మకమే ప్రజల మూఢ విశ్వాసాలకు దారితీస్తున్నది ఆధ్యాత్మిక అనుభవాలు కలగనివారు కూడా వాటి విషయంలో 'ఓపెన్‌మైండ్'తో ఉండటం మంచిది

**(విశాలాంధ్ర దినపత్రిక, 30-3-1958**

# 14. మరణానంతర జీవితం

(ఈ వ్యాసంలోని అంశాలు సర్ ఆలివర్ లాడ్జి కుమారుడైన రేమాండ్ ఆత్మమీడియం ద్వారా తెలిసినవి. వీటిని ఎవరూ నమ్మవలసిన అవసరం లేదు వీటికి ప్రత్యక్ష తార్కాణాలు లభించటం కష్టం. అయితే ఈ విషయాలు కల్పితాలను కోవటానికి కూడా అవకాశం లేదు ఎందుచేతనంటే ఈ విషయాలు చెప్పిన మీడియం (మిసెస్ లియోనార్డ్) రుజువు చేయదగిన విషయాలనేకం సర్ ఆలివర్ కుటుంబంలోనివారికి తెలియబరిచి ఉండింది. అందుచేత ఈ విషయాలు పాఠకులకు తెలియటం వల్ల అట్టే నష్టం ఉండదనీ, కనీసం కల్పనా సాహిత్యం చదివే దృష్టిలోనైనా చదవదగినవనీ ఎంచి ఇక్కడ వివరిస్తున్నాను )

అతను (రేమాండ్) ఉండేచోటు. . మొదట్లో అతను చాలా కంగారుపడ్డాడు - మన ప్రపంచం మనకు వాస్తవంగా కనబడినదానికన్నా కూడా అతనుండే ప్రపంచం అతనికి మరింత వాస్తవంగా కనబడుతుంది మేలుకోగానే తాను "పోయా" డన్నది స్ఫురించింది ఒకటి రెండు క్షణాలపాటు మాత్రం అంతా అస్పష్టంగా, పొగమంచులాగా కనబడింది

అతన్ని మొదట కలుసుకున్నవాడు తాత

తరువాత మిగిలినవాళ్ళు వచ్చారు వారిలో కొందరిని గురించి అతను విని మాత్రం వున్నాడు అందరూ "నిజం" మనుష్యుల్లాగే ఉన్నారు తాను "పోయిన" సంగతి నమ్మశక్యం కాకపోయింది

అతను ఒక ఇంట్లో నివసిస్తున్నాడు. ఇటుకలతో కట్టిన ఇంట్లో "ఇక్కడ" చెట్లూ, పూలూ వున్నాయి నేల కూడా ఉన్నది నేలమీద కూచుంటే బట్టలు మట్టి అయినట్టు కనబడతాయి కూడా. చిత్రమేమంటే రాత్రీ, పగలూ ఒకదాని తరువాత ఒకటి రావు భూమిమీద వచ్చినట్టుగా. అయితే అతనికి కావాలన్నప్పుడు చీకటి పడుతుంది తరువాత మళ్ళీ వెలుగు వస్తుంది కాని ఒకసారి వచ్చినంత తొందరగా ఇంకొకసారి రాదు

ఇదంతా ఎలా చేశారో, ఏ పదార్థంతో చేశారో తెలుసుకోవటానికి యత్నిస్తున్నాను నేనింకా కనుక్కోలేదు గాని నా మనసులో ఒక థియరీ (సిద్ధాంతం) ఉన్నది అది నా సొంతం కాదు అక్కడక్కడా విన్న మాటలు నాకు ఉపయోగించాయి

ఈ ప్రపంచంలో భావనతో సృష్టి అయిందనుకునే వాళ్ళది పొరబాటు ఈ ఇళ్ళూ, చెట్లూ, పూలూ, ఈ నేలా నా ఊహవల్ల కలిగాయని కొద్దికాలం నేనూ అనుకున్నాను కాని అది కానేకాదు.

భూమినుంచి ఏదో పైకి వస్తూంటుంది. రసాయన సంబంధమైనది అది మాలోకంలోకి వచ్చి గట్టిపడి పేరుకుంటుంది అంటే నేనిప్పుడున్నచోటు (లోకం) గురించి మాత్రమే చెబుతున్నాను.

(ఈ సందేశంలో కొంతసేపు రేమాండ్ "అతను"గా ఉంటాడు, ఉన్నట్టుండి "నేను" అవుతాడు )

భూమినుంచి పైకివచ్చే ఏదో పదార్థంతో చెట్లూ, పూలూ అవుతాయని అతని అనుమానం. ఇంతకంటె అతనికింకేమీ తెలియదు దాన్ని గురించి తెలుసుకుంటున్నాడు ఇంకా చాలాకాలం పడుతుంది. (ఈ సందేశం వచ్చే రోజుకు రేమాండ్ చనిపోయి మూడుమాసాలే అయింది )

భూమిమీద వారిని కలుసుకోవాలంటే అన్నప్పుడల్లా సాధ్యంకాదు.

అతను చూడాలనుకున్నవారినీ, చూడదగినవారినీ మాత్రం అనుకునే లోపలే చూడగలుగుతాడు

నాకు దేనిమీదా కోరిక ఉన్నట్లు కనబడదు

ఎవరినైనా అతని వద్దకు తెస్తే చూడటమే గాని తానై ఎవరినీ చూడబోదలచలేదు.

(ఈ వాక్యం ఆ లోకంలోని ఆత్మజీవులను గురించి చెప్పినట్లు కనిపిస్తుంది )

నేను ఎవరిని కావలిస్తే వారిని ఎప్పుడు బడితే అప్పుడు చూడవచ్చునని చెప్పారు, ఏమీ అభ్యంతరం లేదన్నారు. అందుచేతనే ఈ చోటు నాకు చాలా సరదాగా వుంది.

ఇతరులకు సహాయపడటం అతని విధులలో ఒకటి అయితే ఈ పనిచేసేవారింకా చాలామంది ఉన్నారు అతనికి హెచ్చుపని యుద్ధరంగంలో (ఇది 1915 లో మొదటి ప్రపంచయుద్ధం సగం కూడా కాని సమయంలో)

నేను ఇంటికి వచ్చాను - ఇంటికి వచ్చే ఉంటాను - కాని నా అసలు పని యుద్ధంలో

అతనికి వాళ్ళ నాన్నతో కొంతపని వుంది కాని యుద్ధంలో గుండు దెబ్బతో వచ్చి ఈ లోకంలో పడిన అభాగ్యులకు అతను సహాయపడవలసి వుంది

జరగబోయేది ఒక్కొక్కసారి తెలిసినట్టుంటుంది. కాని చెప్పటం సాధ్యంకాదు

నాకు భూమిమీద ఉండగా తెలిసినదానికంటె ఇప్పుడెక్కువ తెలుసనుకోను

× × ×

(ఇక్కడ బట్టలు) తయారుచేస్తారు

నేను తెల్లబట్టలు కట్టుకుంటున్నానంటే మీరు నమ్మగలరా ! నిజానికి మొదట నాకు వాటిపైన మనసు పోలేదు. నేను వాటిని భరించలేను. చలిదేశం నుంచి వేడి దేశానికి వెళ్ళిన వాడిలాగే కొద్దిరోజుల పాటు తన మామూలు బట్టలే వేసుకుంటాడు తరువాత అక్కడి వాళ్ళ దుస్తులు ధరించనారంభిస్తాడు కొంతకాలంపాటు భూమిమీది దుస్తులే ధరించనిచ్చారు. ఒత్తిడి చెయ్యలేదు.

× × ×

ఇక్కడ చాలా సరదాగా వుంది - భూమిమీద కన్న ఎంతో బాగుంది నిన్నూ (సర్ ఆలివర్ లాడ్జిని), అమ్మనూ, మిగిలినవాళ్ళందరినీ వదిలిపెట్టటం నాకిష్టంలేదు గాని, ఇక్కడమటుకు చాలా బాగుంది నువ్వు ఒకరోజు పాటు ఇక్కడికి వస్తే బాగుండును నిజానికి నువ్వు అప్పుడప్పుడు ఇక్కడికి వస్తావు, కాని నీకు జ్ఞాపకం ఉండదు రాత్రివేళ నువ్వూ, మిగిలినవాళ్ళూ ఇక్కడికి వచ్చారు కాని మాకా సంగతి జ్ఞాపకం లేకపోవటం అతనికి కష్టంగా వుంది అదంతా మీరు జ్ఞాపకం ఉంచుకోగలిగితే రెండు ప్రపంచాల స్మరణల భారాన్ని మెదడు భరించలేదుట అతను తెలుసుకున్నాడు, మీరు నిత్య వ్యవహారాలు సాగించటానికి పనికిరాకుండా పోతారుట. అందుచేత మీకు జ్ఞాపకం లేకుండా చేస్తారు అతను విన్న సంగతి అదీ.

× × ×

నా ఇప్పటి శరీరం అచ్చగా పూర్వపు శరీరం లాటిదే ఇది నిజమైన శరీరమేనా అని చూసుకోవటానికి గిల్లి చూసుకుంటాను నిజమైన శరీరమే, కాని అదివరకు శరీరమంతగా నొప్పి పుట్టదు లో అవయవాలు (గుండె, ఊపిరితిత్తులు మొదలైనవి) వెనకటి పద్ధతిలో ఉన్నట్టు లేవు అవి అచ్చంగా పాతవాటి లాంటివి కాకపోవచ్చు కాని పైకి చూడటానికి వెనకటిలాగే వున్నది నేను పూర్వం కంటే ఎక్కువ స్వేచ్ఛగా కదలగలను ఒకటుంది, ఇక్కడ ఎవరికీ రక్తం కారగా నేను చూడలేదు

(ఏదైనా పెట్టి పొడుచుకుంటే రక్తం కారుతుందేమో) అతనింకా చూడలేదు అతను ఇంతవరకు ఇక్కడ రక్తమే చూడలేదు.

అతని చెవులూ, కళ్ళూ, కనుబొమలూ, నాలుకా, దంతాలూ, అన్నీ ఎప్పటిలాగే ఉన్నాయి అతని పాత పుప్పి పన్ను స్థానంలో ఇప్పుడు కొత్త పన్ను ఉన్నది ఇది మంచి పన్ను, ఊడిన పన్ను స్థానంలో కూడా ఇప్పుడు మంచి పన్నున్నది.

అతనెరిగిన ఒక మనిషికి ఒక చెయ్యి వుండేది కాదు. ఆ మనిషికిప్పుడు మళ్ళీ చెయ్యి వచ్చింది. అవును, ఇప్పుడతనికి రెండు చేతులూ ఉన్నాయి. మొట్టమొదట ఇక్కడికి వచ్చినప్పుడు ఒక అంగం లేనట్టుగా, అసంపూర్తిగా కనిపించాడు. కాని త్వరలోనే ఆ లోటు పూడింది. కొత్త అంగం వచ్చింది...

(సర్ ఆలివర్ ప్రశ్న యుద్ధంలో అవయవాలు పోయినవారి మాట ఏమిటి ?)

అవయవం పోయి ఎంతోకాలం కాకపోతే ఏమీ ఇబ్బంది లేదు. అటువంటి వాళ్ళిక్కడికి చేరేసరికి నిండుగానే ఉంటారు. అయితే నేను విన్నదేమంటే.... మనిషి ముక్కలు ముక్కలుగా పేలిపోయినప్పుడు అతని ఆత్మ శరీరాన్ని మార్చటం కొంత ప్రయాస అవుతుంది అది పూర్తి కావటానికి కొంతకాలం పడుతుంది. అటువంటి శరీరంలోనుంచి దివ్యపదార్థం చెల్లాచెదురైపోతుంది. దాన్ని మళ్ళీ కూడదీయాలి చెల్లాచెదురైపోయేది ఆత్మ అని కాదు. అది పేలిపోవటమంటూ వుండదు. కాని ఆ శరీరంపై పేలుడు ప్రభావం వుంటుంది ఇదంతా అతను (రేమాండ్) చూడలేదు తెలుసుకుందామనే ఉద్దేశంతో అడిగి కనుక్కున్నాడు.

(ప్రశ్న . కాలిపోయిన శరీరాల మాటేమిటి ?)

ప్రమాదవశాత్తూ తగలబడిపోయినవారి విషయంలో, ఇక్కడి వారికి తెలిస్తే ఆత్మ వైద్యుణ్ణి ఒక్కణ్ణి పంపి, ఆత్మను వేరుచేయిస్తారు అయితే పని పెట్టుకుని శరీరాలను తగలబెట్టరాదు తొందరపడి దహనం చేసిన వారిని గురించి ఇక్కడ చాలా చిక్కులు కలుగుతుంటాయి. తగిన వ్యవధి తీసుకుని తప్ప శవాలను దహనం చెయ్యరాదు అది ఘోరం. దాన్ని గురించి నేను చాలా విచారించాను. మనుషులు చాలా నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తారు చచ్చిపోయినవాడి గురించి ఆలోచించేదేమిటి ? వెంటనే పీడ విరగడ చేసుకుందాం అన్న ధోరణి అవలంబిస్తారు ఏడు రోజుల పాటు శవాన్ని దహనం చేయరాదు

(ప్రశ్న శవాలు చెడిపోనారంభిస్తే ?)

శవం చెడిపోనారంభిస్తే ఆత్మ వేరుపడి పోయిందని అర్థం. ఆత్మ ఏపాటి (చాలా కొంచెం) మిగిలినా శరీరం చెడదు ఆత్మ యొక్క ప్రభావం వల్ల అది చెడకుండా వుంటుంది. ప్రాణం లేచిపోవటమన్న మాటకు ఆత్మ వెళ్ళిపోవటానికి సిద్ధమై, శరీరం నుంచి బయట పడుతున్నదని, ఈ మధ్య అతను (రేమండ్) ఒక విషయం చూశాడు. ఒక మనిషి పోయినట్టు డాక్టరు చెప్పిన రెండు రోజులకు శవాన్ని దహనం చేయటానికి ఏర్పాట్లు చేశారు ఈ సంగతి ఇక్కడి అతని బంధువులకు తెలిసి వెళ్ళి చూస్తే ఆత్మ ఇంకా శరీరం నుంచి వెలువడలేదు. అందుచేత వారా ఆత్మను మాగ్నటైజ్ చేసి వేరు చేశారు. అప్పటికీ రెండు శరీరాలకూ మధ్య ఉన్న తాడు తెగలేదు. దాన్ని తొందరపడి కత్తిరించవలసి వచ్చింది. ఆత్మ శరీరానికి షాక్ తగిలింది - శస్త్రచికిత్సలోలాగా, ప్రతి మనిషికీ ఇది చేసి తీరాలని అతని (రేమాండ్) నమ్మకం. మామూలు శరీరంలో మంచి ఆత్మ శరీరం వెలువడుతుందని అతని ఉద్దేశం కాదు. మామూలు శరీరంలో నుంచి ఏదో పదార్థం వెలువడుతుంది - స్రవిస్తుంది అది రెండో శరీరంలోకి - సిద్ధంచేసి వున్న శరీరంలోకి పోతుంది .

ఇక్కడ స్త్రీలూ, పురుషులూ ఉన్నారు. కాని ఇక్కడ వారికి గల సంబంధం భూమి మీద లాంటిది కాదు కాని పరస్పరం వారికుండే భావాలు భూమిమీదలాగే వుంటాయి. వాటిని

వ్యక్తం చేసే పద్ధతి వేరు ఇక్కడ పిల్లలు పుడుతున్నట్టు కనబడదు కాని స్త్రీ పురుషుల మధ్య ప్రేమ ఉన్నది. ఇద్దరు పురుషులకు మధ్య గాని, స్త్రీల మధ్యగాని ఉండే ప్రేమకూ ఈ ప్రేమకూ తేడా వున్నది. తల్లీ కొడుకులకూ, తండ్రీ కూతుళ్ళకూ గల సంబంధానికీ భార్యా భర్తలకు గల సంబంధానికీ తేడా వున్నది అతను (రేమాండ్) తనకిప్పుడు భోజనం చెయ్యాలనే కోరిక లేదంటున్నాడు అయితే అతను ఇక్కడ భోజనం చేసే వారిని చూశాడు. అన్నం తినగోరిన వారికి భూమి మీద ఉండే ఆహారంలాగా కనబడేదే ఇవ్వాలి ఇక్కడివాళ్ళు కావలసినవన్నీ అందించటానికి ప్రయత్నిస్తారు. ఈ మధ్య ఒకడు వచ్చాడు. తనకు విధిగా చుట్ట కావాలన్నాడు "వీళ్ళ పుటం అరింది" అనుకున్నాడతను (రేమాండ్). అంటే వీళ్ళు ఆ మనిషికి చుట్టలు తెచ్చి ఇవ్వలేరనుకున్నాడు అయితే ఇక్కడ లెబొరేటరీలున్నాయి. వాటిలో రకరకాల వస్తువులు తయారుచేస్తారు మీ లోకంలోలాగ ఘనపదార్థంతో తయారుచెయ్యరు .. ఆ మనిషికి పొగాకు చుట్టలాంటిది ఇచ్చారు. ఆ మనిషి ఎగిరి గంతేశాడు కాని ఆ చుట్టను కాల్చటం మొదలుపెడితే అతనికి అంత తృప్తి కలగలేదు మొత్తం నాలుగు చుట్టలు కాల్చాడు ఇప్పుడు చుట్టల కోసం అడగడు తమ అలవాట్లు తృప్తిచెందటం లేని కారణం చేత క్రమంగా వాటిని మానేస్తారు. అయితే కొత్తగా వచ్చినవాళ్ళు అది కావాలనీ, ఇది కావాలనీ అడుగుతారు కొందరు తినటానికి మాంసాహారం అడుగుతారు. కొందరు ఘాటైన తాగుడు అడుగుతారు విస్కీ, సోడా అడుగుతారు నేను కొయ్యటం లేదు ఇక్కడ అవి కూడా తయారవుతాయి ఒకటి రెండుసార్లు తాగాక మోజు తగ్గి పోతుంది నేనున్న ప్రాంతంలో వాళ్ళ మాట చెబుతున్నాను కొందరు తాగుబోతులు ఇక్కడ కూడా నెలల తరబడీ, ఏళ్ళ తరబడీ తాగుడు కోరుతారట కాని నేను అటువంటి వాళ్ళను చూడలేదు నేను చూసినవారికిప్పుడు తాగుడు అక్కర్లేదు .

భూమి మీద (జీవితం) ఎంత సహజంగా ఉంటుందో ఇక్కడా అంత సహజంగా ఉంటుందని మనుషులు తెలుసుకోవాలని అతని (రేమాండ్) కోరిక.

(ప్రశ్న · రేమాండ్, నువ్వుండే ఇల్లు ఇటుకలతో కట్టిందన్నావు. అది ఎలా సాధ్యం ? ఆ ఇటుకలు దేంతో చేస్తారు ?)

అదే అతనింకా తెలుసుకోలేదు. భూమి నుంచి వచ్చే ఒక విధమైన ప్రసారంతో వాటిని చేస్తారని నమ్మదగిన వారొకరు చెప్పారు. ఏదో కిందినుంచి ఏమో రూపంలో పైకి వస్తూంటుంది. కొందరు దాన్నిబట్టి దానితో వస్తువులు చేస్తారు. భూమిపైన నశించే పదార్థమంతా వృథాపోదు అదంతా ఎరువుగానూ, ధూళిగానూ మారదు. శిథిలమైపోయే ధాతువు కొంతకాలానికి ఎరువయ్యేమాట నిజమే, కాని దానినుంచి సూక్ష్మపదార్థం పైకిలేచి వాసనలాటిదిగా మారుతుంది. సరిగా గమనించినట్టయితే చచ్చే ప్రతిపదార్థం వెంబడీ ఏదో వాసన ఉంటుంది ఈ వాసనవల్ల ప్రయోజనం ఉంటుందని నాకిప్పుడు తెలుసు. ఈ వాసననుంచే చనిపోయిన పదార్థాల తాలూకు నకళ్ళు తయారుచేయ గలుగుతారు . .

ఇక్కడ కొందరికి ఈ విషయాలు కూడా తలకెక్కవు, వాటన్నిటికీ భౌతికమైన కారణాలున్నాయని గ్రహించారు కాంతి కిరణాలతో చేసిన ఆధ్యాత్మిక దుస్తులను గురించి, భూమిపై ఉండేవాళ్ళ భావాలతో నిర్మించిన వాటినిగురించి మాట్లాడతారు. తాము భూమిమీద ఆధ్యాత్మికంగా జీవించటం వల్ల లభించిన భావ వస్త్రాలను తామిప్పుడు ధరిస్తున్నా మనుకుంటారు అవి పదార్థంతో తయారైనవేనని మేము వారికి చెప్ప ప్రయత్నిస్తే నమ్మరు "లేదు, లేదు. ఈ దుస్తులను కాంతితోనూ, నా భావాలతోనూ నేను తయారుచేసుకున్నాను" అంటారు. అందుచేత మేము అంతటితో వారిని వదిలేస్తాం. అయితే కింద ఆధ్యాత్మిక జీవితం గడిపినవారికి వస్త్రాలు మరింత సులువుగా

లభించేమాట నిజమేననుకుంటాను. అందుచేతనే వారు తమ జీవిత విధానం వల్ల బట్టలను తయారుచేసుకున్నామనుకోవటం జరుగుతుంది

పూలు ఎంత సులువుగా వాడిపోతాయో మీకూ తెలుసు మా కిక్కడ పూలున్నాయి మీ లోకంలో వాడిన పువ్వు లిక్కడ మళ్ళా వికసిస్తాయి. ఎంతో అందమైన పూలు .

(ప్రశ్న · భూమి ఆకాశంలో అతి వేగంగా నడుస్తున్నది గదా, మీరు దాన్ని ఎట్లా వెంబడించగలుగుతున్నారు ?)

అతనికి అలా కనపడలేదు

(ప్రశ్న నీకు నక్షత్రాలు కనిపిస్తాయా ?)

కనిపిస్తాయి. అదివరకు లాగే కనిపిస్తాయి కాని కొంచెం దగ్గరిగా కనిపిస్తాయి నిజంగా దగ్గరిగా కాదని అతను (రేమాండ్) అంటున్నాడు.

(ప్రశ్న రాసుల స్వభావం ఇక్కడిలాగే ఉంటుందా ? సప్త మహర్షులను చూశావా ?)

అతను (రేమాండ్) సప్తమహర్షులను చూశాడు

రథాన్ని కూడా చూశాడు. ఒకటే అతనికి అయోమయంగా ఉంది. రాత్రీ పగలూ భూమి మీదలాగా క్రమానుసారంగా ఒకదాని తరువాత ఒకటి రావు .

అతనికి (రేమాండ్‌కు) సూర్యుడు కనిపిస్తాడు కాని వేడి హెచ్చుటమూ తగ్గటమూ లేనట్లు కనబడుతుంది సూర్యుడి వేడి తగ్గిందనికాదు, వెనకటి శరీరం లేనందువల్ల, భూమి మీదికి వెళ్ళినప్పుడూ, (ఆధ్యాత్మిక) ప్రదర్శనల్లో పాల్గొనేటప్పుడూ వేడీ, చలీ కొద్దిగా తెలుస్తుంది - మీడియం సమక్షంలో కూడా

× × ×

అతను (రేమాండ్) వాళ్ళ నాన్నతో ఏదో నది గురించి చెప్పాడు అతనింతవరకిక్కడ సముద్రాన్ని చూడలేదు నీరు చూశాడు సముద్రం కనిపిస్తుందో లేదో చెప్పలేకుండా ఉన్నాడు రోజూ కొత్త విషయాలు తెలుసుకుంటున్నాడు ఎన్నో కొత్త విషయాలున్నవి కొంత కాలంగా ఇక్కడ ఉన్నవాళ్ళకవి అంత కొత్త కాకపోవచ్చు.

అతను విలియమ్ తాతతోనూ, రిచర్డ్ అనే ఇంకొకరితోనూ లైబ్రరీకి వెళ్ళాడు. అక్కడ మీరు చదివేలాంటి పుస్తకాలే ఉన్నాయంటున్నాడు

ఇది అద్భుతం ! భూమిలో ఇంకా ప్రచురణకాని పుస్తకాలిక్కడ ఉన్నాయి ఇది నిజమో కాదో గాని, ఆ పుస్తకాలు ముందు ముందు భూమిమీద ప్రచురణ అవుతాయని ఎవరో అతనికి చెప్పారు అందులో ఉండే విషయాలు ఎవరో రచయిత అయినవాడి మనస్సుకు అందజేయ బడుతుందిట

ఇక్కడ ఉండే వారందరినీ ఆ పుస్తకాలు చదవనివ్వరని అతను అంటున్నాడు వాటిని అంటే ఇంకా ప్రచురణ కాని పుస్తకాలను చదవటం వల్ల హాని కలగవచ్చుట నాన్న ఒక పుస్తకం రాయబోతున్నాడు ఇప్పుడు రాస్తున్నది కాదు ఇంకొకటి

× × ×

ఇక్కడ నీకిష్టమైన వాళ్ళున్న చోటికి వచ్చి పడతావు నీ కంత ఇష్టంలేనివాళ్ళు వీధిలో కనిపిస్తే వాళ్ళను పలకరించను కూడా పలకరించవు .

అవును ఇక్కడ వీధులూ, ఇళ్ళూ ఉన్నాయి

ఇవన్నీ ఊహా జనితాలని ఒకప్పుడనుకున్నాను నీకు అర్హమైన చోటికి నీ అంతట నువ్వే వచ్చి పడతావు ఇక్కడ న్యాయాధికారులూ, ఆఫీసర్లూ లేరు నీ తత్వాన్ని బట్టి నువ్వే చేరవలసిన చోటికి చేరుకుంటావు.

(ఈ "సంభాషణ" రేమాండ్ తన తల్లితో జరిపినది.)

దురలవాట్లూ, దుర్బుద్ధులూ గల కుర్రాళ్ళు పక్కగా పోతుండగా చూశాను. వాళ్ళు వెళ్ళేచోటికి నేను పోలేదు నయం అది నరకం మటుకు కాదు, మనుషులను బాగుచేసే చోటులాంటిది అక్కడ బాగుపడటానికి అవకాశాలిస్తారు ఇంకా మంచిచోటికి వెళ్ళగోరేవారిని వెళ్ళనిస్తారు. ఇటువంటి వాళ్ళంతా ఒకచోట చేరతారు గాని, ఒకరి మీద ఒకరికి త్వరలోనే అసంతృప్తి బయలుదేరుతుంది నీకు నువ్వు సహాయం చేసుకోవటం నేర్చుకోగానే నీకు సహాయం దొరుకుతుంది మీ ప్రపంచంలోలాగే, కాకపోతే ఏమిటంటే అన్యాయమూ, అక్రమమూ ఉండవు అందరికీ ఒకటే నియమం

(ప్రశ్న అందరిదీ ఒకటే తరగతా ?)

తరగతి ప్రధానం కాదు పుణ్యం ప్రధానం. పుణ్యాత్ములు ఉత్తమ తరగతి. పుణ్యాత్ములు కూడా అనుభవం కోసం కింది తరగతులలో వుండాలి. అందరూ మొట్టమొదట కొద్దికాలం పాటు "అస్ట్రల్"కు పోతారు

అక్కడికి వెళ్ళటం అతనికి (రేమాండుకు) జ్ఞాపకం లేదు అతను ఇప్పుడుంటున్నది మూడవ లోకం అనుకుంటున్నాడు. అది మధ్యస్థంగా సుఖంగా వుంటుంది. అన్నిటికన్నా ఎత్తయిన లోకం వారుకూడా చూడవస్తారు. అది భూమికి తగినంత దగ్గరగా వుండి, అక్కడి వారిని కలుసుకోటానికి అనుకూలంగా వున్నది .. అమ్మా ! ఈ మధ్య నేను ఒక అద్భుతమైన చోటికి వెళ్ళాను. . (అది ఎక్కడ వున్నదో) ఈశ్వరుడికే తెలియాలి.

అన్నిటికన్నా ఎత్తయిన లోకాన్ని చూసి రావటానికి నాకు అనుమతి దొరికింది. అక్కడివాళ్ళు సాధారణంగా మా వద్దకు వస్తుంటారు.

అది ఎలా వుంటుందో నీకు చెప్పగలనా అని నాకు సందేహంగా వుంది... నేను పవిత్రుడైనట్టు తోచింది. నేను మోకరించాను. నిలబడటం నాకు సాధ్యం కాలేదు. మోకాళ్ళ మీదనే వుండ బుద్ధయింది. .. అమ్మా ! నేను నఖశిఖ పర్యంతం పులకించాను ఆయన (?) నా దగ్గరికి రాలేదు. నాకు కూడా ఆయనకు దగ్గిరగా వెళ్ళాలనిపించలేదు. వెళ్ళవచ్చునని తోచలేదు. ఆయన ఎలాంటి దుస్తులు వేసుకున్నదీ చెప్పలేను అంతా రంగుల కిరణాల కలయికలాగా వున్నది.

... ఆ కిరణాలను ఆయన నాపై ప్రసరింపజేయగానే నాకెలా అనిపించిందో ఊహించగలవా ? ఏమి (పుణ్యం) చేసుకోవటం చేత నాకీ అద్భుతమైన అనుభవం కలిగిందో నాకు తెలీదు. ఎన్నో ఏళ్ళ తరవాత తప్ప యిటువంటిది నాకు లభ్యమవు తుందని అనుకోలేదు. నాకు కలిగిన భావాన్ని ఒకరు వర్ణించలేరు, నేనూ వివరించలేను.

నేను నడవలేదు, నన్ను నా లోకానికి మోసుకు వెళ్ళారు నాకు జరిగినదేమిటో నేను ఎరుగను.. నాకు స్పృహ వున్న ఒకటి రెండు క్షణాల కాలంలో నేనింకా నిర్మలంగా జీవించి వుంటే ఎంత బాగుండేదనిపించింది . నేను మళ్ళా తిరిగి వచ్చాక నాలో ఏదో కొత్త శక్తి ప్రవేశించినట్టని పించింది నదులను అడ్డగించగలను, కొండలను కదలించగలను అన్నట్టుగా ఎంతో ఆనందం కలిగింది.

ఇష్టంలేని వాళ్ళ మీద యిష్టం తెచ్చి పెట్టుకోవటానికి యత్నించవద్దని అతను (రేమండ్) అంటున్నాడు అది వ్యర్థం ప్రేమను కావాలనే వారికే ఇవ్వండి. అక్కర్లేని వారిమీద వ్యర్థపరచవద్దు ఆకలితో మాడేవాళ్ళు పక్కన వుండగా అతిగా తిన్నవారికి పెట్టినట్టు ... కావాలంటే చక్కని సంగీతం వినటానికి ఇక్కడ కొన్ని ప్రదేశాలున్నాయి. ఇక్కడ కూడా సంగీతం మీద ఆసక్తి లేనివాళ్ళున్నారు

. ఉత్తమ లోకాలకు వెళ్ళేవాళ్ళు మత ప్రబోధకులు మాత్రమే కాదు  పైకి అనేది ముఖ్యం కాదు, ఆచరించినదే  మరణానంతర జీవితంలో విశ్వాసం లేకపోయినా, సాధ్యమైనంత వరకు ఆచరించి, కల్మషం లేకుండా జీవించి, అర్థంకాని విషయం జోలికి పోకుండా వుంటే, అంతకన్నా యింకేమీ అవసరం లేదు  ఇది ఎంత సులభం !  ఎవరు పడితే వారు ఇలా జీవించవచ్చుననిపిస్తుంది  కాని చాలా కొద్దిమంది మాత్రమే ఇలా వుంటారు

ఇక్కడ మేము కొద్ది సంవత్సరాలలో భూమిపైన వుండేవారి జీవిత పరిస్థితులలో పెద్ద మార్పు వస్తుందనుకుంటున్నాము . నీ శరీరం వున్న ప్రదేశం నీకు నచ్చిందా అని నన్ను కొందరు అడుగుతారు  నా శరీరం గురించి నాకిప్పుడే విచారమూ లేదు  పాత బట్టలాగా నేను దాన్ని విడిచేశాను  ("నా సాంసి జీర్ణాని యధావిహాయ నవానిగహ్ణాతి నరోపరాణి, తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహి" - భగవద్గీత)

× × ×

ఒక సిద్ధాంతానికి వచ్చాడు.  రేమాండ్ అంటున్నాడు మనిషి తన భౌతిక విధానం ద్వారానూ, స్వార్థం ద్వారానూ భూమిపై జీవితాన్ని ఎంత దుర్భరంగా చేసేవాడంటే, మానవుడు దానికి ప్రాయశ్చిత్తంగా యువకులను మరొకసారి బలి చేయవలసి వుంటుంది  ఆ బలి ద్వారా మానవులు భూమిపైన మరింత అధ్యాత్మికమైన జీవితాన్ని నెలకొల్పుకుంటారు  భౌతిక విధానం నిర్మూలమవుతుంది  చెప్పవలసినది అలా కాదని అతను (రేమాండ్) అంటున్నాడు

(ఈ పై వాక్యాలపైన నేను నా సొంత పూచీపైన వ్యాఖ్యానించదలిచాను. మొట్టమొదట "మెటీరియలిజం" అన్న ఇంగ్లీషు పదాన్ని "భౌతికవాదం" అని తర్జుమా చెయ్యటానికి బదులు, రెండుమార్లూ కూడా "భౌతికవిధానం" అనే తర్జుమా చేశాను  నా తర్జుమా సరి అయినదని నా దృఢవిశ్వాసం  రెండు, ఇక్కడ రేమాండ్ ద్వితీయ ప్రపంచ యుద్ధాన్ని గురించీ, దాని అనంతరం వ్యాపించిన సామ్యవాద వ్యవస్థను గురించి సరిగా జోస్యం చెప్పాడని నా నమ్మకం.  మార్క్సు సిద్ధాంతాలు భౌతికవాదంతో కూడుకున్నవని ప్రపంచానికంతా తెలుసు  అటువంటి సందర్భంలో అధ్యాత్మిక జీవితవ్యాప్తి అన్నదాన్ని 'సోషలిజం' (లేక కమ్యూనిజం) వ్యాప్తి  అని వ్యాఖ్యానించి నేను కమ్యూనిస్టులకూ, అధ్యాత్మిక వాదులకు కూడా ఆగ్రహం తెప్పించినవాణ్ణి కావచ్చు. కాని నా అల్పబుద్ధికి పెట్టుబడిదారీ వ్యవస్థలకన్న సామ్యవాద వ్యవస్థలో ఆధ్యాత్మిక జీవిత విధానానికి ఎక్కువ పునాది లభించేటట్టు కనిపిస్తుంది. మనుషుల ఘనతకు చేతలు గీటురాళ్ళు కావటం, మనుషులు డబ్బుకు అమ్ముడుపోయే అవకాశాలు లేకపోవటం, జీవయాత్ర గడపటానికి కొందరు వ్యక్తులు విధిగా దొంగతనాలూ, మోసాలూ, హత్యలూ చేయవలసిన పరిస్థితి అడుగంటటం - ఇవన్నీ ఉన్నతమైన ఆధ్యాత్మిక జీవితానికి అనుకూలం కాకపోతే ఇంకేమిటో నాకు బోధపడటం లేదు. "పాపం" అన్నది సోషలిస్టు వ్యవస్థలో తప్పక క్షీణిస్తుంది  నేను స్వయంగా మత విశ్వాసాలు కలవాణ్ణి కాకపోయినప్పటికీ, హ్యూలెట్ జాన్సన్‌లాటి "పుణ్యపురుషుడు" కమ్యూనిజమును బలపరిచాడంటే నేను అర్థం చేసుకోగలను - కొ కు )

అతను (రేమాండ్) మళ్ళా ఆ లోకానికి (అత్యున్నత లోకానికి) వెళ్ళలేదు, కాని దానికింద ఉండేదానికి వెళ్ళాడు  అక్కడ "విజ్ఞాన కేంద్రాలు" ఉన్నాయి  అతను ఉపన్యాసాలు వింటున్నాడు  కింది లోకాలలో ఉంటూనే పై లోకాలకు వెళ్ళే అర్హత సంపాదించుకోవచ్చు  అతను మూడో లోకంలో వుంటున్నప్పటికీ, కావలిస్తే నాలుగోదానికి వెళ్లిపోవచ్చు  అతను ఇప్పుడున్నచోటే వుండి జ్ఞానం సంపాదించుకుంటాడు

అతనీమధ్య వెళ్ళి వచ్చిన ఒకచోటు గురించి వింటారా ?... ఆ అనుభవం ఎంతో అద్భుతంగా వుండి, అతను మరిచిపోలేకుండా వున్నాడు

అయిదో లోకంలో వున్న ఒకచోటికి వెళ్ళాడు..... అది ఒక ఆలయంలాగా వున్నది చాలా పెద్దది అందులోకి జనం మందలు మందలుగా పోతున్నారు "ఇక్కడ ఏం చూస్తాను !" అని అతను ఆశ్చర్యపడ్డాడు ఆ ఆలయంలోకి వెళ్ళే గుంపులో చేరగానే . . అతనికి షాంపేన్ జాస్తీ తాగినట్టుగా అయింది. తేలి తేలిపోతున్న భావం కలిగింది. అతను లోపలికి వెళ్ళాడు. భవనం తెల్లగా వున్నప్పటికి అక్కడ రంగు రంగుల కాంతులున్నాయి కొన్నిచోట్ల ఎర్రగా, నీలంగా, మధ్య కాషాయరంగుగా వున్నది ఈ రంగులు ఎక్కడినుంచి వస్తున్నాయా అని చూస్తే పెద్ద పెద్ద కిటికీలూ, వాటికి అమర్చిన రంగు అద్దాలూ కనిపించాయి కొందరు వెళ్ళి ఎర్రకాంతిలో నిలబడ్డారు. కొందరు నీలంకాంతిలో, మరికొందరు పచ్చకాంతిలో నిలబడ్డారు. "వారెందుకలా చేస్తున్నారు ?' 'అనుకున్నాడు ఎరుపు ప్రేమవర్ధమనీ, నీలంకాంతి ఆధ్యాత్మిక చికిత్సలు చేస్తుందనీ, పచ్చకాంతి బుద్ధివికాసాన్ని కలిగిస్తుందనీ ఎవరో అతనికి చెప్పారు ఏది కావలసినవారు ఆ కాంతిలో నిలబడతారు దీని ప్రాముఖ్యం భూమిమీద వారికి తెలియదుట. ముందు ముందు రంగుకాంతుల ప్రభావం గురించి పరిశోధన జరుగుతుందిట.

ఎర్రకాంతిలో నిలబడ్డవారు తెలివిగలవాళ్ళుగా, మేధావులుగా కనిపించారు, అయితే వారు ప్రేమను అంతగా సాధన చెయ్యలేదు పచ్చనికాంతి కిందికి వెళ్ళినవారు సాధువులుగా, సుఖపడేవారుగా కనిపించారు కాని అంత తెలివిగలవారు కారు. అతనికి (రేమాండ్‌కు) ఎర్రకాంతి కిందికి పోవాలనిపించింది కాని ఎవరో అతనితో, "వద్దు, నీకది అనవసరం", అన్నారు. అతను ఆ కాంతి కిందినుంచి కదిలి మిగిలిన రెంటికిందికీ వెళ్ళాడు అతనికి నీలంకాంతి హెచ్చుగా నచ్చింది. నీలమే నాకు (రేమాండ్‌కు) హెచ్చుగా అవసరమనిపించింది దానికింద కొంతసేపు నిలబడ్డమీదట ఆధ్యాత్మిక జీవితానికి తయారుపొందటం తప్ప ఇంకేమీ అంత ముఖ్యం కాదనిపించింది . ..

ఆత్మలుండే లోకాలు భూమిచుట్టూ నిర్మాణమై వున్నాయనీ, భూమితోబాటు తిరుగుతున్నాయనీ అతనికి (రేమాండ్‌కు) అనిపిస్తున్నది. అందుచేత సహజంగా పై లోకాలకు వెళ్లినకొద్దీ తిరిగే (కదిలే) వేగం హెచ్చుతుంది. (చక్రం ఇరుసుకన్న అంచు వేగంగా కదిలినట్టు)

ఎంతోమంది ఇక్కడి ప్రపంచమంతా ఊహ అనుకుంటారు కాని వచ్చి చూస్తే మీకే తెలుస్తుంది ఇదంతా నిజమే, వాస్తవమే.

ఇక్కడ అంతులేని పూలున్నాయి. . మేము వాటిని కొయ్యము. అవి వాడిపోయి, కొత్తవి రావటం జరగదు అ పూలే మళ్ళీ మళ్ళీ నూతన జీవం సంపాదించుకుంటాయి. ఇక్కడివాళ్ళు కూడా అంతే. ఎప్పుడూ ఇక్కడే వుండి ఎప్పటికప్పుడు నూతన జీవం సంపాదించుకుంటూ వుంటారు. పై లోకాలకు వెళ్ళినకొద్దీ అక్కడి శరీరాలు మరింత కాంతివంతంగా వుంటాయి. నల్లటి జుట్టుండటం మంచి లక్షణం

**(పారిజాతమ్, మాసపత్రిక, జూన్ 1958, సెప్టెంబరు 1958 (రెండు సంచికలు))**

# 15. గుడ్డి నమ్మకాలనుకునేవారివే గుడ్డి నమ్మకాలు !

గుడ్డి నమ్మకాలు మనుషుల జీవితాలనూ, రాజకీయాలనూ కూడా ఎలా ఆవహించి ఉన్నదీ చూస్తే ఆశ్చర్యం వేస్తుంది తూట్లుపడినా పడనట్లు ప్రయాణం చేసేవాళ్ళలాగా అధిక సంఖ్యాకులు గుడ్డినమ్మకాల ఆధారంతో జీవయాత్ర సాగిస్తున్నారు. తనను ఏ గుడ్డి నమ్మకమూ ఆవహించి నడిపించటం లేదని ఎవడూ బల్లగుద్ది చెప్పటానికి లేదు అయినప్పటికీ, ఒడ్డున నిలబడి చూసేవాడిలాగా ప్రతివాడూ ఇతరులను పట్టుకున్న గుడ్డి నమ్మకాలను గురించి ఆలోచించటం వల్ల ఎంతో లాభం ఉంటుంది

ఎన్నికలలో ఓట్లు వేసేవాళ్ళను తీసుకోండి వాళ్ళలో కొందరు, "ఫలానావాడికి ఓటు చేస్తున్నావుగా ?" అని అడిగితే, "ఆయన గెలవడంటున్నారే ?" అంటారు ఎవరు గెలవాలో నిర్ణయించుకుని వాడికి ఓటు వెయ్యటం గాదు, ఎవడు గెలుస్తాడో ముందే నిర్ణయించుకుని వాడికే ఓటు వెయ్యడం ! ఈ రకం వాళ్ళకు కావలసింది ఒక అభ్యర్థి విజయం కాదు, తమ ఓటుయొక్క విజయం ! ఈ రకం మనస్తత్వం ఉన్నవాళ్ళు చాలా హెచ్చు సంఖ్యలో ఉన్నారనటానికి సందేహం లేదు కాస్త ఆలోచిస్తే తమ వైఖరి ఎంత గుడ్డిదో వాళ్ళకే తెలుస్తుంది

చాలాకాలం కిందట ఎన్నికలు జరగబోతున్న తరుణంలో కాంగ్రెసు అభిమానియైన ఒక పత్రికా నిర్వాహకుడు నాతో "కాంగ్రెసువాళ్ళు ఈ ఎన్నికలలో దెబ్బతినవచ్చు. కమ్యూనిస్టులు భూములు లేని వాళ్ళకు భూములిస్తామంటారు పరిశ్రమలు జాతీయం చేస్తామంటారు అందరికీ పనులు చూపిస్తామంటారు. తాము మంత్రులైతే కొద్ది జీతాలే తీసుకుంటామంటారు. . అటువంటి పనులు నిజంగా చేస్తారు కూడా !" అన్నాడు

కమ్యూనిస్టులు చేస్తామనే ఈ పనులు చెడ్డవని ఆయన ఉద్దేశం కాదు ఆ పనులు కమ్యూనిస్టుల ద్వారా జరగరాదని మాత్రమే. కమ్యూనిస్టులు ఎన్నికల్లో గెలవటం వల్ల కలిగే అసలు ప్రమాదమేమిటో నాకాయన చెప్పనే లేదు చెప్పటానికి లేదేమో కూడా కమ్యూనిస్టులు గెలవటమే ఒక ఉపద్రవమని ఆయన గుడ్డి నమ్మకం అయి వుండాలి !

అన్నిరకాల గుడ్డి నమ్మకాలూ వుపద్రవకరమైనవని అనటానికి వీలులేదు వ్యక్తియొక్క పరిస్థితులనూ, శక్తిహీనతనూ బట్టి కొన్ని గుడ్డి నమ్మకాలు వాటంతట అవే ఏర్పడతాయి తమకు వచ్చే చిక్కులనుంచి బయటపడేదారి బొత్తిగా లేనివాడు తన 'ఖర్మ' అనుకున్నా, తనను దేవుడే కష్టాలనుంచి బయటపడవెయ్యాలనుకున్నా వాణ్ణి తప్పు బట్టలేం. కాని లంచాలుపట్టి, లోకులను దోచి, లక్షలు గడించినవాడు దేవుడే తనకు డబ్బు ఇప్పించాడనుకుని ఏ వెంకటేశ్వరస్వామి హుండీలోనో నోట్ల కట్టలు పడేస్తేవాణ్ణి గుడ్డి గబ్బిలాయి అనుకోకుండా ఉండలేం

అదే విధంగా, మనదేశం శతాబ్దాల తరబడి పారతంత్ర్యంలో ఉండి, మనం తెల్లవాళ్ళ పరిపాలనపోతే అడ్డమైన గడ్డి కరుస్తామన్న మూఢ విశ్వాసానికి గురి అయినప్పటి దారివేరు, ఇవాళ ప్రజాప్రతినిధులనిపించుకునేవాళ్ళు బహిరంగంగా పార్లమెంటులో నిలబడి మనదేశం వలస విధానాలు అవలంబించే దేశాల పక్షాన నిలబడి, సోషలిస్టు దేశాలతో యుద్ధం తెచ్చిపెట్టుకోవాలని ఉద్ఘాటించే దారివేరు వీళ్ళు జీవితాలకే ద్రోహులు నెహ్రూ వాళ్ళను 'పర్వర్టెడ్' అని వర్ణించటంలో పూర్తి న్యాయం చెయ్యటంలేదు చెప్పవచ్చిందేమంటే, వీళ్ళవి గుడ్డి నమ్మకాలు కావు. వీళ్ళ వైఖరి కూడా ఒక విధమైన ప్రజాస్వామ్య వైఖరే ననుకునేవాళ్ళది గుడ్డి నమ్మకం దక్షిణ అమెరికాలో, వియత్నాంలో, లావోస్‌లో, కాంగోలో, ఆఫ్రికా ఇతర ప్రాంతాలలో, ఇంకా ఐక్యరాజ్య సమితిలోనూ అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్ దేశాలు ఆడుతున్న నాటకం రోజూ పత్రికల్లో జనం చదువుతున్నారు

పోర్చుగల్‌లో వున్న ప్రజాస్వామ్యం లోకానికంతకూ తెలుసు మనం వారి వలస విధానాలను రోజూ చవిచూస్తున్నాం. అయినా మనం ఈ దేశాలను అనుసరించి వెళ్ళాలనే వాదనలో కూడా కొంత 'వివేకం' ఉందనుకునే గుడ్డివాళ్ళు దేశంలో ఉండటం అతి విచిత్రం

ప్రభుత్వాలకు కూడా గుడ్డి నమ్మకాలుంటై ప్రభుత్వ యంత్రాంగాన్ని నడిపే అధికార్లు దమ్మిడీ లంచం పట్టుకోకుండా తమ చచ్చు జీవితాలపైననే జీవిస్తారనుకోవటం సిసలైన గుడ్డి నమ్మకం. నామినేషన్ల కోసం పోటీలు పడేవాళ్ళు వేరే దురాశ లేమీ లేకుండా ప్రజాసేవలో మేమంటే మేమని పోటీ పడుతున్నారనుకోవటం ఎటువంటి గుడ్డినమ్మకమనుకోవాలి ! ధనికులను అచ్చుపోసి వదిలేసి, దరిద్రులపై పరోక్ష పన్నులభారం నానాటికి పెంచి సోషలిజం కేసి పోతున్నామనుకోవటం ఎటువంటి గుడ్డి నమ్మకమనుకోవాలి !

ఎవడు కూడా గుడ్డినమ్మకాలను పెట్టుకుని ఇతరుల కళ్ళు కప్పలేడు మనం మతరహిత లౌకిక ప్రజాతంత్రం ఏర్పరిచి, వర్గరహితమైన సోషలిస్టు వ్యవస్థకేసి పురోగమిస్తున్నామని గట్టిగా అరవొచ్చు కాని భిలాయ్‌లో పనిచేసిన సోవియట్ ప్రవీణులూ, ఇతరచోట్ల సహాయం చేయవచ్చిన ఇతర దేశాల ప్రవీణులూ, రూర్కెలాలో చిరస్మరణీయమైన అద్భుత నిర్మాణం వెలయింపజేసిన పశ్చిమ జర్మను ప్రవీణులతో సహా అందరూ మనంకొట్టే కొబ్బరికాయలనూ, ప్రతి యంత్రం దగ్గరా మనం చదివించిన మంత్రాలనూ, ఏ పని చెయ్యటానికైనా మనం పెట్టించుకునే ముహూర్తాలనూ స్వయంగా తెలుసుకుంటూనే ఉన్నారు

మనదేశంలో అధిక సంఖ్యాకులు నిత్యమూ మోస్తున్నన్ని గుడ్డి నమ్మకాలు నాగరిక ప్రపంచంలో మరెక్కడా ఎవరూ మోయడం లేదేమో అయితే మనం ఆత్మవంచన చేసుకునేటందుకు ఉపాయం లేకపోలేదు - మనవి గుడ్డినమ్మకాలనే వారివే గుడ్డి నమ్మకాలనుకుంటే సరి !

- విశాలాంధ్ర దినపత్రిక, 19-12-1961

# 16. కళలో భౌతిక వాదానికీ చోటున్నది

కళ లౌకిక వ్యాపారాలలో ఒకటి. లౌకిక వ్యాపారాలన్నీ భౌతికవాదాన్ని ఆశ్రయించి ఉన్నటువంటివి. పరిపాలన లగాయతు ప్రయాణాలవరకూ కేవలం భౌతిక దృష్టితోనే జరుగుతాయి. వానలు కురవకపోవటం లౌకిక పరిభాషలో దైవికమే అయినప్పటికీ తరుచు క్షామాలు వచ్చే ప్రాంతాలవారికి పాలకులు, "మీ తలరాత అలా ఉంది, అనుభవించండి" అని చెప్పరు; ప్రాజెక్టు నిర్మించి, కాలువలు తవ్వి క్షామ ప్రాంతాలకు నీటికరువు లేకుండా చేస్తారు

ఈనాటి ప్రజా పరిపాలనలో ఈ అనవాయితీ ఏర్పాటు కాలేదు పురాణయుగంలో కూడా ప్రకృతి సిద్ధంగా వచ్చే పీడలన్నిటికీ రాజును బాధ్యుడుగా భావించేవారు. ఒక బ్రాహ్మడి కొడుకు అకాల మరణం చెందితే ఆ బ్రాహ్మడు తన కొడుకు శవాన్ని రాజుముందు పడేసి "ఈ ఘోరానికి ఏం సంజాయిషీ ఇస్తావ'ని అడిగాట్ట.

అలాగే సంఘంలో "అక్రమాలు" చేసినవారిని సంఘశక్తులు దండిస్తాయి ఇందుకొరకు శాసనాలూ, చట్టాలూ ఉంటాయి. "వాడి పాపాన వాడే పోతాడులే !" అని హంతకులనూ, ఇతర సంఘ నేరస్థులనూ ఏనాటి సమాజమూ ఉపేక్షించి ఊరుకోలేదు

పురాణకాలంలో వారికి "విధి" అన్నదానిలో విశ్వాసం లేకనా ? స్వర్గ నరకాలలోనూ, పునర్జన్మలలోనూ, సంచిత కర్మ అనేదానిలోనూ విశ్వాసం లేకనా ? ఎంత మాత్రమూ కాదు లౌకిక వ్యాపారాలు అలౌకిక విశ్వాసాల సహాయంతో నడవవు, ఏనాడూ నడవలేదు. మన పురాణాలలో ఉండే పాత్రలన్నిటిలో కూడా ఒక్క విషయం స్పష్టంగా కనిపిస్తుంది. మంచి పాత్రలు ధర్మంచేత ప్రేరితములైనవి. దుష్టపాత్రలు స్వార్థప్రేరితాలు ధర్మమూ, స్వార్థమూ కూడా భౌతికవాదానికి కట్టుబడినవే. తమ కర్తవ్యాన్ని నెరవేర్చుకునేటప్పుడు, కర్తవ్యనిర్వహణలు దుఃఖకరమైన పరిణామాలు కలిగినప్పుడు ఆ పాత్రలు తత్వబోధ ఆలకిస్తాయి. అభిమన్యుడు పోయి, ఏడ్చే అర్జునుడికి జీవితం అశాశ్వతమని చెబుతారు. ఆ కసితో వెళ్ళి కౌరవసేనలను కార్చిచ్చులాగా దహించే అర్జునుడికి ఎవరూ తత్వబోధ చెయ్యరు. లోకవృత్తం సాగినంతసేపూ తత్వబోధతో ఏమీ పనిలేదు !

ఈనాడు కూడా కళలు లోక వ్యవహారానికి సంబంధించినవే. అప్పటికీ ఇప్పటికీ తేడా ఏమంటే, ఈనాటి కళలలో తత్వబోధ కూడా అవసరం లేదు మనుషులు ఏదో ఒక తాత్విక చింత లేకుండా జీవిస్తారని కాదు. కాని తాత్విక భావాలను కళలద్వారా ప్రచారం చెయ్యవలసిన అవసరం ఈనాడు ఏమీలేదు.

ఒక్క ఉదాహరణ ఇస్తాను. చాలాకాలం క్రితం నేనొక కథ చదివాను - అది అచ్చు కావటానికే నా దగ్గరికి వచ్చిందో, అచ్చయినాక చదివానో నాకిప్పుడు జ్ఞాపకం రావటం లేదు ఆ కథలోని ప్రధాన విషయమేమంటే ఒక పాత్రకు మనిషికి వచ్చే కష్టాలన్ని ఒక్కసారిగా వస్తాయి, ఉద్యోగం పోవటం, భార్య చావుబతుకుల్లో ఉండటం, పిల్లో, పిల్లవాడో హఠాత్తుగా ఏ కారుకిందనో పడి మరణించటం వగైరా, వగైరా ఈ కరుణామయమైన కథలో అన్నీ దైవికంగా వచ్చిన కష్టాలే కళాదృష్టిలో ఇంతకన్నా తుక్కు కథ ఉండబోదు. ఆకథలో వాస్తవికత లోపించిందని కూడా కాదు. దైవికంగా కష్టపరంపరకు గురి అయినవాళ్ళను చాలామందిని చూశాను అయితే వాస్తవ సంఘటనలు కళకు పూర్తిగా నిరుపయోగం. భౌతికవాద దృష్టితో వాస్తవ జీవితానికి రూపం ఇవ్వటంలోనే కళాకారుడి సృజనాశక్తి వ్యక్తమవుతుంది అటువంటి కళకే సాంఘిక ప్రయోజనం ఉంటుంది.

ఇంకొకసారి ఏదో సినిమా కథను గురించి చర్చించటంలో నేను కథకుడితో ఒక సంఘటన

అవాస్తవికంగా ఉందన్నాను ఆ సంఘటన నిజంగా జరిగినట్టు ఆయన చెప్పాడు. వాస్తవం కూడా కళలో అవాస్తవికంగా తయారుకావచ్చునని ప్రతి కళాకారుడూ గ్రహించాలి.

వాస్తవ జీవితంలో మనలో ప్రతి ఒక్కళ్ళమూ విస్పష్టమైన మనః ప్రవృత్తి లేనట్టుగా ప్రవర్తిస్తాం. మనం చేసే అన్ని పనులూ జాబితావేసి చూసినట్టయితే అవి ఒక్క మనిషి చేసిన పనులలాగా ఉండవు ఈ పద్ధతిమీద ఎవరన్నా పాత్రలను సృష్టిస్తే నమ్మకంగా, వాడికి పాత్రపోషణ చాతకాదనేస్తాం. అందులో తప్పేమీ లేదు.

భౌతికవాదం చాలా పరిమితమనీ, అంతకంటే ఆధ్యాత్మికవాదం జీవితం తాలూకు అనుభవాన్ని మరింత బాగా అర్థమయేలాగు చేస్తుందనీ అనేకమంది నమ్ముతారు. ఈ వాదాలను వలయాలకింద చిత్రించి, ఏ వలయంలో పడి తిరిగినా ఏమీ ప్రయోజనం లేదని గోపీచంద్‌గారు హెచ్చరిస్తున్నారు. ఒక సిద్ధాంతానికి మరొకటి విరుద్ధమైనదిగా భావించేవారిని ఖండించటం విషయంలో నేను గోపీచంద్‌గారితో పూర్తిగా ఏకీభవిస్తాను. ఈ సిద్ధాంతాలను సమన్వయించాలన్న వారి ఉద్దేశం మటుకు నాకు అర్థం కాలేదు ఏ సిద్ధాంతమైనా అసమగ్రంగానే వుంటుంది రెండు సిద్ధాంతాలు ఒకదానికొకటి వ్యతిరేకంగా వుంటే అందులో ఒకటే సరైనది అయి వుంటుంది. రెండు సిద్ధాంతాలు ఒకదానికొకటి సంబంధం లేకుండా ఉంటే ఆ రెంటికిందా వచ్చే అంశాలను కలగలిపేది మూడో సిద్ధాంతంగా ఉండే అవకాశం వున్నది

ఎవరు ఏ సిద్ధాంతాన్ని పరిగ్రహించినా దాని ప్రయోజనానికీ, ప్రవర్తనకూ పరిధులు తెలిసివుండాలి. సూర్యుడు భూమిచుట్టూ తిరుగుతున్నట్టు గ్రహించటం ప్రత్యక్ష జ్ఞానం. భూమి తనచుట్టూ తాను తిరుగుతున్నదన్నది విజ్ఞానం కాని ఎంత పొద్దెక్కిందో, ఎంత పొద్దుపోయిందో తెలుసుకోవటానికి రెండు జ్ఞానాలూ సమంగానే ఉపయోగపడతాయి

కొందరు పాతకాలపు వైద్యులు మందుకోసం వెళితే పంచాంగం చూసి "ఇంత విషపు ఘడియలో వచ్చావు రోగం ఎలా నయమవుతుంది ? నేను మందివ్వను" అంటారు జ్యోతిషంతో పని వుండదు. వైద్యుడు జ్యోతిష్కుడల్లే పనిచేస్తుంటే మంట ఎత్తుకొస్తుంది !

నా మటుకు నేను భౌతికవాదిని. అయినా నాకు దాదాపుగా 35 ఏళ్ళుగా ఆధ్యాత్మిక విషయాల అనుభవమూ, జ్ఞానమూ ఉన్నవి అంతమాత్రాన నేను భౌతికవాదాన్ని విసర్జించలేదు కేవలం శాస్త్ర పరిజ్ఞానంతో ఈ ఆధ్యాత్మిక అనుభవాలకు అర్థం చెప్పటం చాలా కష్టం దానికి అసలైన కారణం ఏమంటే జగత్తు గురించీ, ప్రాణం గురించీ, పదార్థం గురించీ శాస్త్రవేత్తలకు తెలిసినది కొంచెమే. కాని ఈ జ్ఞానం నానాటికీ పెరుగుతున్నది. ఇది ఎప్పటికైనా సమగ్రమవుతుందా అన్న విషయం ఎవరూ చెప్పలేరు. హిప్నోటిక్ సజెషన్ ద్వారా మానసిక, శారీరక వ్యాధులను నివారించటం ఒక ఆధ్యాత్మిక ప్రక్రియ కిందరాసిన పుస్తకం నేను చదివాను. కాని అటువంటి చికిత్సలు ఈనాడు భౌతిక విజ్ఞానం కిందకు వచ్చేశాయి అలాగే యోగశక్తులన్నింటిని గురించి రేపు భౌతిక విజ్ఞానం ఏర్పడవచ్చు. ఇలాటి అవకాశం ఉండబట్టే భౌతిక శాస్త్రవేత్తలు సైకిక్ రీసెర్చి చేస్తూ, ప్రయోగాలు కూడా చెయ్య యత్నిస్తున్నారు

చెప్పవచ్చిందేమంటే, భౌతికవాదానికి కొన్ని జీవితానుభవాలు అతీతంగా ఈనాడు కనిపించినంతమాత్రం చేత బుద్ధిమంతులైనవారు భౌతికవాదాన్ని పనికిమాలిన దానికింద కొట్టేసి ఇతర తత్వాలను ఆశ్రయించనవసరం లేదు

నిత్యజీవితంలో వివిధ తాత్విక సిద్ధాంతాలను వేరు వేరు సిద్ధాంతాల కింద పరిగణించ వలసిన అవసరం ఉన్నదే అనుకున్నప్పటికీ కళలో ఇటువంటి అవసరం ఎంత మాత్రమూ కనబడదు. కళాకారుడు తనకు గల తాత్విక దృష్టిని జీవితాన్ని అర్థం చేసుకోవటానికి వినియోగిస్తాడు

కాని, తన తాత్విక దృష్టిని ప్రచారం చెయ్యటానికి కళలు సృష్టించడు - కావాలనుకుంటే తాత్విక గ్రంధాలే రానుకుంటాడు.

ఫ్రాయిడ్ సిద్ధాంతాన్నీ, బిహేవియరిజమునో నిరూపించటానికి కథలు వ్రాయటం, ఒక మిత్రుడన్నట్టు శుష్కదండగ పాత్రల మనస్తత్వాన్ని చిత్రించటానికి అజ్ఞానం ఉపయోగపడితే అది వేరే విషయం రచయితలలో మార్క్సిస్టు తత్వం తెలిసినవాళ్ళు చాలామంది వున్నారు కాని మార్క్సిస్టు దృక్పధాన్ని ప్రచారం చెయ్యటానికే కళలు సృష్టిస్తే అవి కళలు అనిపించుకోవు. ఆ మార్క్సిస్టు తాత్విక దృష్టి పాత్రల వర్గ ప్రవృత్తిని మరింత వాస్తవికంగా చిత్రించటానికి వినియోగిస్తే మార్క్సిజం తెలియనివాడికి కూడా ఆ కళలో మరింత జీవం ఉన్నట్టు తెలుస్తుంది.

కళలు భౌతికవాదాన్నే అవలంబించి తీరాలన్నది నిజమైతే భక్తినో, ఒక మత ధర్మాన్నో, నిరుపయోగమైన సనాతనాచారాలనో సమర్థించడానికి సృష్టించిన కళలు కళలే కావనవలసి వస్తుంది. అవి కళలు కావనే నా వాదం కూడా.

**(విశాలాంధ్ర, దినపత్రిక 18-3-1962)**

# 17. నాకు వచ్చిన కల

కలలు కల్లలంటారు. కలలో కూడా పగటి కలలు మరీ అబద్ధమైనవిగా చెబుతారు. ఈ రెంటిని గురించి నా అనుమానాలు నాకున్నాయి.

నేను తరచుగా కలలు కనే శరీర మనస్తత్వం గలవాణ్ణి. కొందరికి ఎన్నడూ కలలు రావుట. ఆరోగ్యవంతులు ! నాకైనా వచ్చే కలలన్నీ గుర్తుండవు నిద్రలేచిన మరుక్షణం మంచులాగా విచ్చిపోయే కలలు చాలా కంటాను వాటిని గురించి చెప్పడం సాధ్యంకాదు కాని కొన్ని కలలు నలభై యాభై ఏళ్ళ తరువాత కూడా గుర్తున్నాయి ఇవి "వివిడ్ డ్రీమ్స్" విస్పష్టమైన కలలు. వాటిని జ్ఞాపకం పెట్టుకొనడానికి వివిధ కారణాలు కూడా ఉన్నాయి అవి మీకే తెలుస్తాయి.

నేను కలలను గురించి శాస్త్రజ్ఞులు ఏమంటారో చదివినవాణ్ణి కాదు. పరిశోధనలు చేసినవాణ్ణి అసలే కాదు కాని నా కలలు పరిశోధకులకు ఉపయోగపడితే పడవచ్చు

మొదటి సంగతి, నా విషయంలో కలలకూ సినిమా చిత్రాలకూ కొన్ని సంబంధాలున్నాయి నాకు వచ్చే కలలలో ఎక్కువ భాగం తెలుపు - నలుపువి. కొద్దిగా టెక్నికలర్ కలలు. అంతేకాదు కలలలో అకస్మాత్తుగా దృశ్యం మారిపోతుంది కల అంతమై మేలుకునే ముందు నా కలలన్నీ "స్లో ఫేడౌట్" అవుతాయి క్రమంగా చీకటి కమ్ముకువచ్చి, చీకట్లో తడుముకుంటూ నిద్రలేస్తాను.

స్థూలంగా నాకు వచ్చే కలలలో తరుచుగా వచ్చేవి గాలిలో తేలికగా, పక్షిలాగా పైకి లేవడమూ, ఎన్నడూ ఎరగని ప్రదేశాలు మళ్ళీ మళ్ళీ కలలో రావడమూ లాటివి ఉంటాయి. ఎరిగినవాళ్ళు కలలో రావడం మామూలే ఒక్కొక్కప్పుడు కలలా కనిపించే మనిషికి నేను ఎరిగిన పేరు పెడతాను. కాని ఆ మనిషి నేననుకునేవాడు కాదని నాకు తెలుస్తూనే ఉంటుంది. ఉదాహరణకు ఒకసారి నేను కలలో దీనానాథ్ మంగేష్కర్ (లత తండ్రి) ని చూశాను. చూశాననుకొని సంగీతం గురించి మాట్లాడాను. కాని దీనానాథ్ ఫొటోలు డజన్లకొద్దీ చూసి వున్నాను. నేను కలలో చూసిన మనిషి అతను కానేకాడు. ఇలా తరుచుగా జరుగుతూనే వుంటుంది

దీనికి భిన్నంగా నేను కలలో జవహర్‌లాల్ నెహ్రూను, చార్లీచాప్లిన్‌నూ చూశాను చార్లీ చాప్లిన్‌ను రెండుసార్లు చూశాను. రెండోసారి పూర్తి కలర్‌లో చార్లీ రంగుల ఫొటో చూసిన జ్ఞాపకం లేదుగాని కలలో కనిపించిన చాప్లిన్ ముఖం గులాబీ రంగులూ, ముడతలన్నీ స్పష్టంగా కనిపించేటట్టుగా ఉన్నది నేను చాప్లిన్‌ను వాస్తవంగా చూడడం అవుతుందన్నంత నమ్మకం నాకున్నది

కలలలో కాలం వెనక్కు నడుస్తుందన్నది, అందరికీ అనుభవంలోదే కావచ్చు చాలా దీర్ఘమైన కలవచ్చి, చివరలో ఏ గుట్టో ఎక్కి అక్కడి నుంచి ఏ కారణం చేతనో పడిపోతాము. దానికి అనుగుణంగా మన చెయ్యిగాని తలగాని దిండుమీద నుంచి పక్కమీద పడి పోతుంది ఈ చిన్న సంఘటన కోసం కొండవీటి చాంతాండంత కల వస్తుంది ! ఈ రకం కలలలో అతి విచిత్రమైనది ఒకటి నాకు నలభై ఏళ్ల క్రితం నేను తెనాలిలో ఉండగా వచ్చింది కలలో నేను నిర్జన ప్రదేశంలో నిలబడి ఉన్నానుట. ఆ ప్రదేశమంతా నల్లగా ఉన్నది. ఒక చెట్టుగాని, గడ్డిపరకగాని లేదు "ఇదేదో శ్మశానం అయి ఉండాలి" అనుకున్నాను ఈ మాట అనుకున్న తరువాత నాకు ఆ ప్రదేశంలో అక్కడక్కడా కాలిన ఎముకల పోగులు చిన్న చిన్నవి కనిపించాయి "ఇది శ్మశానమే కాని నక్కలు కూయవేం ?" అనుకున్నాను వెంటనే నక్కల కూతలు వినిపించాయి. నిద్రలేచి ఆలకిస్తే ఫ్యాక్టరీలు

కూస్తున్నాయి. ఫ్యాక్టరీ కూతలు విని వాటిని నక్కల కూతలని భ్రమపడడానికి చాలా ముందుగానే నా మనసు శ్మశానాన్నీ, ఎముకల పోగులనూ సృష్టించడం నన్ను చాలా ఆశ్చర్యపరిచింది

కలలు మనస్తత్వంతో ముడిపెట్టడం కొన్ని సందర్భాలలో ఉచితమే కావచ్చు. కాని అన్ని కలలకూ అది కుదరదు. నాకు ఒకసారి ఒక కలవచ్చింది. నేను ఒక ఇంటి తలవాకిలివద్ద నిలిచి ఉన్నాను. ఇల్లునాకు ఎడుమ ప్రక్కన ఉన్నది నాకు ఎదురుగా గచ్చు చేసిన ఖాళీ జాగా, ఒక గోడ ఉన్నాయి గోడవారగా తొట్లల్లో క్రోటనూ పూలమొక్కలూ ఉన్నాయి. ఇది రంగుల కల. ఆ ఇల్లు, ఆ చెట్లూ కనిపిస్తే గుర్తుపట్టగలను. కల ఇంతే ఇంకేమీ జరగలేదు. ఇలాంటి కలను మనస్తత్వంతో ముడిపెట్టడం సాధ్యంకాదు.

యుద్ధకాలంలో బాంబులు పడడమూ, మంటలు లేవడమూ, మంటలార్పే ప్రయత్నాలూ మూడు నాలుగుసార్లు వచ్చాయి ఆ రోజుల్లో అవే వార్తలు గనక అలాంటి కలలు రావడంలో వింతలేదు. కాని ఆ కలలో నిజంగా వింత అయిన ఏమిటంటే నేను కలలో "డైవ్ బాంబింగ్" చూశాను. నాకీ కల వచ్చిన నాటికి దాని పేరుగాని పద్ధతిగానీ పత్రికలలో వచ్చి వుండలేదు.

ఇలాగే నేను ఎన్నడూ చూడని వాళ్ళు నాకు కలలో స్పష్టంగా కనిపించడమూ, వారు వీధిలో కనిపిస్తే గుర్తించగలిగిన స్థితిలో నేను ఉండటమూ కొన్నిసార్లు జరిగింది కలలో కనిపించిన ఒక మనిషిని చాలా ఏళ్ళ అనంతరం వాస్తవంగా చూశానని కూడా అనుకుంటున్నాను

సాధారణంగా నిద్ర అనటానికి వీలు లేని మగతలాంటి స్థితిలో నాకు అప్పుడప్పుడు విస్పష్టమైన దృశ్యాలు కనిపిస్తాయి అవి చాలా సంగ్రహంగా ఉంటాయి కాని కలలలాగా మరపురావు ఒక్కొక్కసారి ఈ దృశ్యాలు కనిపించినప్పుడు నాకు బయట జరిగే చప్పుళ్ళూ అవీ వినబడుతూనే ఉంటాయి వీటిని కలలు అనాలో, అనకూడదో కూడా నాకు తెలీదు.

అన్నిటికన్నా వింత అయిన కల నాకు రెండుసార్లు వచ్చింది. రెండుసార్లూ అది పగటికలే. దాని విశేషమేమంటే, అది నేను మేలుకోబోతుండగానే వచ్చింది అందులో నేను మేలుకుని కళ్ళు తెరవకముందే నేను పడుకుని ఉన్న గది కళ్ళు తెరిచి చూసినంత స్పష్టంగా కనిపించింది. ఇందులో మొదటిది ముప్ఫై ఏళ్ళక్రితం వచ్చింది. ఇంకోటి ఏ పదిహేనేళ్ళ క్రితమో ఇప్పుడు నేనుండే ఇంట్లోనే వచ్చింది.

ఇంతకన్నా కూడా విచిత్రమేమంటే, మంచంమీద పడుకుని నిద్రపోతున్న నన్ను నేనే చూశాను. ఇది ఒకే ఒకసారి జరిగింది. ఇది చాలా అరుదైన కల అనుకుంటాను ఇటువంటి కల వచ్చినవారు కనీసం ఇంకొక్కరైనా ఉంటే దీన్ని గురించి శాస్త్రవేత్తలు తలలు పగలకొట్టుకోవచ్చు

**(ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 26-10-1973)**

# 18. అతీత శక్తులు

హస్తలాఘవం, కనుకట్టు, యోగవిద్య ఇవన్నీ మనకు సంప్రదాయకంగా వస్తున్నవే. అయితే, ఇవన్నీ అతీత శక్తులకిందరావు. ఇంద్రజాలం లేక గారడీ హస్తలాఘవంతో కూడినది. గారడీవాళ్ళు, మాజిక్కులు చేసేవాళ్ళూ తమకు అతీత శక్తులున్నాయని చెప్పుకోరు.

విప్రవినోదులు చేసే పనులు గారడీలనూ మాజిక్కులనూ మించి వుంటాయి అందులో భేషజం యేమీ వుండదు వాళ్ళు దాన్ని కనుకట్టు అంటారు కానీ అది 'హిప్నాటిజం' కావచ్చు. హిప్నోటిజం కూడా ఈనాడు అతీతశక్తిగా పరిగణించబడదు. దాన్ని ఆస్పత్రులలో చికిత్సలకు కూడా ఉపయోగిస్తున్నారు.

అసలు 'అతీత శక్తి' అనేదాన్ని నిర్వచించడం తేలికకాదు. ఆదిమ మానవుడు సృష్టిలో కల ప్రతి శక్తినీ, తనకు బాహిరమైనదైనప్పుడు, అతీత శక్తిగానే పరిగణించి వుంటాడు. తుఫానుగాలీ, మెరుపులూ, పిడుగులూ, భూకంపాలూ, అగ్నిపర్వతాల పేలుళ్ళూ ఇవన్నీ వాడికి అతీతమైనవీ, అర్థం కానివీనూ. అగ్ని మొదలు అనేక ప్రకృతి శక్తులను నిగ్రహించటమూ, కృత్రిమంగా సృష్టించటమూ, తన అవసరాలకు వినియోగించటమూ నేర్చుకుని మానవుడు చాలా పురోగమించాడు విజ్ఞానం మానవుడి పురోగమనానికి తోడ్పడటమేగాక, ఈ పురోగమనం ఆధారంగా పెరిగింది కూడాను.

అయినా, 'అతీత శక్తులు' అనేవి యెప్పటికప్పుడు కొత్తగా దర్శనమిస్తూనే వున్నాయి. మెస్మరిజం వచ్చింది అతీత శక్తివాదులు దాన్ని అతీతశక్తి అన్నారు. శాస్త్రవిజ్ఞానం సమగ్రమయిందని అపోహపడిన శాస్త్రజ్ఞులు 'టాంగ్' అన్నారు రెండు అభిప్రాయాలూ అబద్ధమే అయ్యాయి. మెస్మరిజం 'టాంగ్' కాదు. అతీతశక్తి కూడా కాదు.

దాదాపు నూరు సంవత్సరాల క్రితం దయ్యాలూ, భూతాలూ, చచ్చిపోయిన వాళ్ళతో సంభాషణలూ ప్రారంభమయ్యాయి అవి కొత్తగా పుట్టుకొచ్చాయని కాదు. అవెప్పుడూ వుంటూనే వున్నాయి కానీ సభ్య ప్రపంచమూ, శాస్త్రీయ దృష్టిలాటివి చీకటి గుహల్లోంచి బయటికి రాలేదు. అలాంటివి కల్పనలని కూడా ఆరోపించింది.

దయ్యాల కొంపలు నిజమా ? కాదా ? కొందరికి చచ్చిపోయినవాళ్ళు కనిపిస్తారన్నది నిజమా, అబద్ధమా ? కొందరికి ఇతరుల మనసుల్లో భావాలు తెలుస్తాయా ? తెలియవా ? కొందరు 'సైకిక్ మీడియమ్'లు దూరాన వున్న వస్తువులను కదిలించారన్నది వాస్తవమా ? పుకారా ?

ఇలాంటి సంఘటనలను కొట్టిపారవేసేందుకు సాధ్యంకాని పరిస్థితి యేర్పడింది ప్రఖ్యాత రచయిత థామస్‌మాన్ మేధస్సు ఖరీదైన గడియారమంత సున్నితమైనది. ఆయన ఒక seance కు వెళ్ళి అక్కడ జరిగిన సంఘటనలు చూసి కంగారుపడిపోయాడు.

ఆయన చూసినది పచ్చిమోసమూ గారడీ అయి వుండవచ్చు. కానీ, గట్టి భౌతికదృష్టీ, శాస్త్రీయ దృక్పథమూ గల ఆయనకు తాను చూసింది అతీతశక్తుల ప్రదర్శనేనన్న నమ్మకం కలిగింది అదంతా ఆయనకు మింగుడు పడలేదు

అతీతశక్తులనకుండా ఉండడానికి వీల్లేనివి జరుగుతున్నట్టు సాక్ష్యం బాగా పెరిగిన స్థితిలో శాస్త్రవేత్తలు వాటిని గురించి పరిశోధించడానికి ముందుకు వచ్చారు. అలా ముందుకు వచ్చిన వారిలో సర్ విలియమ్ క్రూక్స్, సర్ ఆలివర్ లాడ్జిలాంటి జగద్విఖ్యాత శాస్త్రవేత్తలున్నారు 'సైకిక్ రీసెర్చి' అనేక ప్రాచ్య, పాశ్చాత్య దేశాలలో సాగింది శాస్త్రజ్ఞులకు ఈ పరిశోధనలలో అనేకమంది మోసగాళ్ళు తటస్థపడ్డారు, దొరికిపోయారు. అయినా, పరిశోధనలు ఆగలేదు.

ఒక మనిషి మనసులో ఆలోచన ఇంకొక మనిషికి అందుతుందన్నది రుజువైంది దాన్ని 'టెలిపతీ' అంటారు. జరగబోయేది కొందరికి ముందుగానే తెలుస్తుందన్నది కూడా రుజువయింది. దీన్ని 'ప్రికాగ్నిషన్' అంటారు పరిశోధనలు చేస్తే, కొందరు మనుషులలో విచిత్రమైన శక్తులేవో వున్నట్టు పూర్తిగా రుజువయింది అయితే, పాశ్చాత్య దేశాలవారికి ఈ శక్తుల స్వభావమూ, వీటికి గల ఆధారాలూ తెలియవు వాటిని గురించి అన్వేషణలు జరుగుతున్నాయి

ఈనాడు దేన్ని కానీ అతీతశక్తి అనడం అశాస్త్రీయమని నా ఉద్దేశం మనిషికి లోపలా, వెలుపలా అనేక అజ్ఞాతశక్తులున్నాయి ఉదాహరణకు మనం ఆటవికులతో, వారిచుట్టూ వున్న వాతావరణంలో కొన్ని కోట్ల రేడియో తరంగాలు ప్రసారమవుతున్నాయంటే వాళ్ళు నమ్మరు రేడియోలో వాటిని పట్టి వినిపించినా, వారికి వాటి స్వభావం అర్థం కావడం కష్టం

కొన్ని కొన్ని శక్తుల విషయంలో మనమూ అదే పరిస్థితిలో వున్నాం. వాటిని గురించి ప్రత్యక్ష సాక్ష్యం దొరికినప్పుడు వాటిని అతీతశక్తులంటున్నాం. కానీ, అవి నిజానికి అజ్ఞాతశక్తులు వాటికి సంబంధించిన అనంతరం వాటిని అతీత శక్తులుగా భావించడం మానేస్తాం ఆదిమ ప్రజలు రైలు ఇంజన్‌ను దేవత అనీ, డ్రైవర్‌ను పూజారి అనీ అనుకొని కొబ్బరికాయలు కొట్టి, ఒక చిప్ప డ్రైవర్‌కిచ్చి రెండోది ప్రసాదం కింద కళ్ళకద్దుకొని ఆ తర్వాత మానేసినట్టు ప్రస్తుతం యూరీగెల్లర్ (Urigeller) అనేవాడు అమెరికాలో కొన్ని అద్భుతశక్తులను ప్రదర్శించి, ఇప్పుడు ఇంగ్లండులో కూడా ప్రదర్శిస్తున్నాడు. అతడు చూస్తుండగానే చెంచాలూ, తాళపు చెవులూ వొంగిపోతాయి. అతని వద్దకు యెవరో విరవడం అసాధ్యమైన స్క్రూడ్రైవర్లను ఒక పెట్టెలో పెట్టి తెచ్చి, "వీటిని యేం చేయగలవో చూడు" అన్నారు పెట్టె తెరచి చూస్తే అవన్నీ విరిగి వున్నాయి వాటిని పరీక్షించడానికి కేంబ్రిడ్జ్‌లోని లోహశాఖకు పంపి పరీక్ష చేయిస్తే, అవి యెలా విరిగిందీ అంతు చిక్కడం లేదన్నారు స్టాన్‌ఫర్డ్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ వాళ్ళు అతన్ని అనేకరకాల పరీక్షలకు గురిచేసి మోసం కనిపెట్టలేకపోయారు ఎవరో, ఎక్కడో గీస్తున్న బొమ్మను మనసుతో చూసి అతను అచ్చంగా అదే బొమ్మను గీశాడు

ఆఖరుకు ద్రాక్షపళ్ళ గుత్తిలో ద్రాక్షపళ్ళ సంఖ్య కూడా చెబితే, పొరపాటు రాలేదట ఇది 'టెలిపతీ' కావచ్చు కానీ, అతను 'కంప్యూటర్'లో తయారై యెవరికంటా పడని రేఖాచిత్రాన్ని కూడా దించేశాడు. దూరాన వున్న చిన్న చిన్న బరువులను కదిలించాడు ఒక ఆడ రిపోర్టర్ అతని సమీపంలో వుండగా, ఆమె ధరించిన బ్రూచ్ టప్పున విరిగింది దాన్ని నగలు చేసేవాళ్ళకు చూపిస్తే ఎలా విరిగిందీ తెలియడం లేదనీ, దాన్ని అతకడం అసాధ్యమనీ చెప్పారు అతను తాకకుండా 'స్టాప్‌వాచీ'లను ఆడిస్తాడు, ఆపేస్తాడు !

ఇదంతా కొత్తగా యేమీ రుజువు చేయదు. గిల్లర్ ప్రదర్శిస్తున్నవి అనంతకోటి అజ్ఞాత శక్తులలో కొన్ని మాత్రమే. మనకు ఇందులో నీతియేమిటంటే, ఇలాంటి శక్తులు కొన్ని ప్రదర్శిస్తున్నవాళ్ళను మనం బాబాలను చేసి పరమ మూఢులమై పోతున్నాం అందులో గారడీ వున్నదేమో చూసే నాధుడు కూడా లేడు ఇది మన సంప్రదాయం అని ఒక్కనాటికీ అనుకోవద్దు. మన పూర్వులకు యోగం తెలుసును యోగం ద్వారా ఇలాంటి శక్తులను కొన్నిటిని సాధించవచ్చు.

పాశ్చాత్య దేశాలలో లాగే ఇది ప్రకృతికి విరుద్ధంగా కలగనవసరం లేదు కానీ, మన పూర్వులు యోగాన్ని ఖాతరు చేయలేదు విప్రవినోదులు లాంటివాళ్ళను మనవాళ్ళు అడుక్కు తిననిచ్చారు కానీ కలియుగ దేవుళ్ళను చేసి ఊరేగించలేదు. కాలం మారింది మనుషుల తలలు పుచ్చిపోయాయి ఏ అజ్ఞాతశక్తి ఏపాటి వున్నవాడైనా బాబా అయి కూర్చుంటున్నాడు వాళ్ళమీద

వ్యాసాలూ, పుస్తకాలూ వెలువడుతున్నాయి. చదువుకొన్నవాళ్ళూ, మేధావులూ వారికి భజంత్రీలు అవుతున్నారు

నిజం యేమిటంటే, అక్కడక్కడా వ్యక్తులు ప్రదర్శించే ఈ అజ్ఞాతశక్తులు సామాజిక ప్రయోజనం కలవికావు. ఎవరైనా ఈ శక్తులతో కరువు కాటకాలు రాకుండానూ, రోగాలన్నీ నయమయేట్టు చేస్తే అప్పుడు వాటివల్ల కొంత సామాజిక ప్రయోజనం కలుగుతుంది. అంతేకానీ, తాకకుండా చెంచాలు వంచీ, స్క్రూ డ్రైవర్లు విరిచీ, ఎంత అపూర్వ శక్తి చూపినా అందువల్ల సాంఘిక ప్రయోజనమేముంది ? అదీకాక మనిషి అధీనంలో వున్న శక్తుల్లాంటివి కావు ఈ అజ్ఞాతశక్తులు అవి కావాలన్నప్పుడల్లా పనిచేయవు. గిల్లర్ ఒక స్త్రీ చేతిలో వున్న తాళంచెవిని వంచలేకపోయాడు, కానీ, మరొకడి జేబులో వున్న తాళం చెవి వంగిపోయింది. తనకు ఈ శక్తులు ఎలా వచ్చాయో గిల్లర్‌కు తెలీదట ఈ పనులు చేసే శక్తి తనకు బయట యెక్కడనుంచో వస్తున్నదంటాడు. రేపు అతనికి ఈ శక్తి అకస్మాత్తుగా పోవచ్చు.

అందుచేత ఇటువంటి శక్తులను శాస్త్రవేత్తలు పరిశోధించాలి. వాటికి సంబంధించిన విజ్ఞానం లభిస్తే, అలా లభించడం సాధ్యమయితే, అప్పుడు దాన్ని క్రమబద్ధం చేసి, సామాజిక ప్రయోజనాలకు ఉపయోగించే అవకాశం వుంటుంది అంతేకానీ ఇటువంటి శక్తులను సాధారణ ప్రజలు ఆరాధించడం మొదలుపెడితే అకారణంగా దేవుళ్ళ సంఖ్య పెరగడమూ, సంఘం అధోగతికి పోవడమూ తప్ప ఇంకేమీ వుండదు

*(ఆంధ్రజ్యోతి వారపత్రిక, 28-12-1973)*

# 19. ఆదిమ మానవుల సంపూర్ణ భౌతికవాదం

మనిషి పాశవిక దశనుంచి, అనాగరిక దశకు, తరువాత నాగరిక దశకు మార్పు చెందడానికి సంబంధించిన చరిత్రకు ఆధారాలు - ఆ కాలాల జీవితావసర విశేషాలు ఆనాటి వారి బుద్ధిలో భౌతికమైన మార్పులను కూడా అన్వేషించడంలో ప్రయోజనం వుండవచ్చు.

అయితే ఇది ఒకంతట సాధ్యం కాదు. పాశవిక దశకు చెందిన మానవులు లేఖనం ఎరుగరు త్రవ్వకాలలో వారి పరికరాల అవశేషాలూ, వారు వేటాడిన మృగాల అవశేషాలు దొరుకుతాయిగాని వారి భావాల, నమ్మకాల అవశేషాలు దొరకవు కాని పాశవిక దశలోనే ఇంకా మిగిలిపోయి వుండిన మానవ సంఘాలు ప్రపంచంలో అక్కడక్కడ చెదురుమదురుగా కనిపిస్తాయి పదివేల ఏళ్ళకు పైబడి వారి భావాలు ఏమీ మారలేదని చెప్పడానికి వీలుండదుగాని మానవుడు గతాన్ని ఒకంతట వదిలిపెట్టడు గనుక, వారి ఈనాటి ఆలోచనలలోను, నమ్మకాలలోను వాటి పురాతన దశను కనిపెట్టవచ్చు

మానవుల నాగరిక (బర్బర) దశకు చెందిన రికార్డు బొమ్మల రూపంలోను చిత్తరువుల రూపంలోను కొంత దొరుకుతుంది నాగరికత ఆరంభమైనప్పటి నుంచి అనేకచోట్ల లేఖనం కూడా వున్నది సుమేరియా, ఈజిప్టు (నైల్), సింధు నాగరికతలకు లిపి వున్నది వైదిక సాహిత్యం యథాతథంగా నోట ప్రచారమయింది.

**రెడ్ ఇండియన్ల అమాయకత్వం**

ఉన్న ఆధారాలను బట్టి ఆదికాలపు మానవ సంస్కృతి ఈనాటి మనకు మహా భయంకరంగా కనబడుతుంది వేదాలలో వున్న విషయాలను గురించి శాస్త్రీయంగా రచించిన ఏ పుస్తకమైనా చదివినవాడు వేదాలలో ఏమాత్రం ఆసక్తి కనపరచడు ఆ కాలపు మనుషులు, దేవతలు, వారి జీవిత విధానం, దానికి సంబంధించిన అసందర్భాలు, తిండి గురించి వారి తపన, విధ్వంసనం చేయటంలో వారి దేవతలకు గల ఊహాతీత శక్తుల ప్రశంసలు, వారి హోమాలు, బలులు - ఇంద్రుడు నూరు దున్నలను కాల్చుకుతినేవాట్ట ! - ఇదంతా జుగుప్స కలిగిస్తుంది. కాని, ఎవరో అన్నట్టు అదంతా మన గతమే ! ఈనాడు నాగరికతా సంస్కారాలున్నట్టు చెప్పుకునే ప్రతి వ్యక్తి అలాంటి మనస్థితి నుంచి పరిణమించి ముందుకు వచ్చినవాడే, మన పూర్వుల పూర్వులకు తోకలుండేవంటే బాధపడటం లాగే వుంటుంది వేదకాలపు మనుషుల భావనలను, నమ్మకాలను చూసి జుగుప్స చెందడం మన బుద్ధికి, ఆదికాలపు వ్యక్తుల బుద్ధికి తేడా తెలుసుకుంటే బుద్ధి పరిణామం బోధపడుతుంది వాళ్ళ నమ్మకాలు మనకు నిరర్థకమైనంత మాత్రాన అప్పటి వాళ్ళకు నిరర్థకమనుకోనవసరం లేదు అమెరికాలో ఎర్ర ఇండియన్లు - విత్తులు చల్లడానికి చాలా తంతు జరిపేవాళ్ళు తెల్లవాళ్ళు ఏ మంత్ర తంత్రాలు లేకుండా విత్తులు నాటడం చూసి "ఈ పైరు రాకేం" అనుకున్నారు తీరా పంట పుష్కలంగా దిగేసరికి, ఎర్ర ఇండియన్లకు ప్రపంచమే తలకిందులైనట్టు తోచింది తెల్లవాడికి గల జ్ఞానంలేని పరిస్థితిలో ఎర్రవాడు ఎంతో తతంగం ఏర్పాటు చేసుకుని, ఆనవాయితీగా అమలుచేస్తూ వచ్చాడు. వాడి దృష్టినుంచి తెల్లవాడి బుద్ధిలో కలిగిన పరిణామం విప్లవ పరిణామం

తొలి కాలపు మనుషుల బుద్ధిని బలంగా శాసించినవి ఆత్మ పోషణావశ్యకత, ఆత్మరక్షణ గురించిన భయం ఆత్మపోషణ కోసం మనుషులను మనుషులే పీక్కుతినడం ప్రపంచంలో అన్నిమూలలా ఒక దశలో జరిగింది మనిషిని గతం ఒకంతట వదలదు గనక ఇంకా అక్కడక్కడ, నాగరిక ప్రాంతాలలో రహస్యంగా జరుగుతూనే వున్నది మనుషుల తండాల మధ్య అస్తమానం

సంఘర్షణలు జరిగేవి పశువులు గల తండాల మధ్య ఆ పశువులకోసం యుద్ధాలు జరిగేవి వారిభాష, భావాలు, పదజాలం వారి భౌతికావసరాలను పురస్కరించుకుని వుండేవి.

ఆదిమానవులు జీవితాలను భయం దాదాపు పూర్తిగా శాసించింది. పరిణత బుద్ధికి ప్రకృతే అన్ని భయాలు కలిగిస్తుంది కార్చిచ్చుల రూపంలోను, అగ్ని పర్వతాలు పేలినప్పుడు అగ్ని భయంకరంగా కనబడుతుంది అనేక ఆపదలకు ఆకరాలుగా ఉండే అరణ్యాలు భయపెడతాయి. ఆకాశాన కమ్మిన కారుమబ్బులు, వాటిలో వచ్చే మెరుపులు, వాటి వెనుకగా భయంకర గర్జనలు, భూకంపాలు, వరదలు, పిడుగులు, వ్యాధులు, ఆకస్మిక మరణం - ఇవన్నీ భయపెట్టేవే అయితే, ఆత్మరక్షణకు అనుకూలంగా వుండే నిప్పు, వాన, ఆహారాన్ని అందించే అరణ్యాలు, తినడానికి మాంసాన్ని, కట్టుకునేందుకు చర్మాలను అందజేసే క్రూరమృగాలు ఆత్మ పోషణకు కూడా ఆధారాలు ఈ వైరుధ్యం మధ్య మానవుడు కొన్ని విశ్వాసాలను అలవరుచుకున్నాడు వాళ్ళకు దేముడు లేడుగాని ఎక్కడబడితే అక్కడ దేవతలున్నారు. ప్రయోజనకరమైన శక్తులు, ప్రమాదకరమైన శక్తులు కూడ ఆ దేవతలకే అంటగట్టి ఆదిమానవులు ఈ వైరుధ్యాన్ని పరిష్కరించుకున్నారు ఇది సాధ్యం కానప్పుడు కొన్ని శక్తులను దేవతాశక్తులుగాను మరికొన్నిటిని రాక్షసశక్తులుగాను విభజించారు (అడవిదున్న మహిషాసురుడు, అడవి ఏనుగు గజాసురుడు - ఇలా)

చిత్రమేమిటంటే ఇవాళ మనకు ఆ కాలపు మనుషులు భౌతికదృష్టి లేని వాళ్ళలాగా కనిపిస్తారు. కాని నిజానికి వాళ్ళది పచ్చి భౌతికదృష్టి మనం వాళ్ళను గురించి అపోహపడటానికి కారణం వారి అపరిణత బుద్ధి ఇందులో క్రమంగా మార్పులు రావటం కూడా మనకు కనిపిస్తుంది పశువులను పెంపొందించినవాళ్ళు, గెలిచి తెచ్చినవాళ్ళు దేవతలు, వాన తెప్పించామన్నవాళ్ళు, నదులు ప్రవహింపజేశామన్నవాళ్ళు దేవతలు రానురాను జ్యోతిశ్శాస్త్రం తెలుసుకుని వాన వస్తుందని చెప్పి మంత్రాలు చదివినవాళ్ళు ప్రకృతిని శాసించిన మహాపురుషులు భయం పుట్టించే శక్తులను ఉపయుక్తంగా మార్చేదంతా ప్రగతి, దానివెనుక బుద్ధి వికాసం కూడా వున్నది. ఆ కాలపు మంత్రశాస్త్రం ఈనాటి మన శాస్త్ర విజ్ఞానం పాత్ర నిర్వహించింది. మన సమస్యలు తీరడానికి మనం శాస్త్రజ్ఞులమీద, టెక్నీషియన్ల మీద ఆధారపడితే, ఆనాటివాళ్ళు మంత్రవేత్తల మీద ఆధారపడ్డారు మంత్రవేత్తలపై నుంచి శాస్త్రవేత్తలకు పరిణమించడం సామాజిక పురోగమనాన్ని సూచించే విధంగానే బుద్ధి పురోగమనాన్ని సూచిస్తుంది అయితే, మనం ఆదిమానవుల పచ్చి భౌతికవాదాన్ని కొంతవరకు కోల్పోయాం

**తొలి కాలపు భౌతికవాదం**

ముందు చెప్పినట్టు ఆదిమనుషుల దృక్పథం మనకు భౌతికవాదం వలె కనిపించదు మనం ఊహకింద జమకట్టేవి అనేకం వారికి వాస్తవ విషయాలు. బుద్ధివారికి పదార్థం లాంటిది బుద్ధిచేత మాత్రమే గ్రహించగలది యావత్తూ వారికి దేవత్వంతో కూడుకొన్నది. (అందులోనే రాక్షసత్వం కూడా ఇమిడి వున్నది 'అసుర' శబ్దానికి దుష్టార్థం కాలక్రమానగాని రాలేదు. వరుణుడు, అగ్ని, మిత్రుడు ఇంకా అనేక దేవతలు 'అసురు'లే ఒక దశలో) ప్రకృతిలో వారికి ఎక్కడబడితే అక్కడ దేవత్వం కనిపించింది, సామాజిక క్షేమానికి, అభివృద్ధికి తోడ్పడిన వారందరూ దేవతలే అయ్యారు. ఈ దేవత్వం అభౌతికమైనది అనుకోవడానికి వీలులేదు. రోజంతా జీవితమంతా ఆహార సమస్యతో బాధపడే జాతులకు అన్నం దేవతే మనం అన్నాన్ని కళ్ళకు అద్దుకోమంటే అది మన కృషితో సంబంధం లేకుండా ఎవరి కృషి ఫలితమో మనకు తెలియనైనా తెలియకుండా లభిస్తున్నది. అందులో మనకు ఏ దైవత్వం కనిపించే అవకాశం లేదు పేదవాడైన కష్టజీవి తాను తాగే నూకల

జావపైన ఎంత ప్రేమాభిమానాలు చూపుతాడో అనుభవం ద్వారాగాని మనకు తెలియదు ఈ యుగంలో డబ్బుకు కొంత దైవత్వం అబ్బింది. అందుకే నిరుపేదలు డబ్బును కళ్ళకు అద్దుకోవటం మనకు కనిపిస్తుంది.

భౌతికవాదం దెబ్బతిన్నది వర్గసమాజాల అవతరణతోను, దానివెంట బయలుదేరిన ఆదర్శవాదంతోను. బుద్ధి పరిణమించినకొద్దీ సామాజిక ఉత్పత్తి శాఖోపశాఖలు కావడం, వర్గ విభజన, అదనపు ఉత్పత్తి దోచుకోవడం, పీడితవర్గాల బుద్ధి వికాసానికి ఆదర్శవాదాన్ని సంకెళ్ళుగా ఉపయోగించడం తప్పనిసరిగా జరిగాయి కులాలను జాతులకింద పరిగణించి, ఏ కులంలో పుట్టినవాడు ఆ జాతికే చెందుతాడన్న మూఢవిశ్వాసంలాంటివి పాశవికులు కూడా ఎరిగి వుండరు బుద్ధివికాసానికి, సామాజిక పురోగమనానికీ గల విడరాని బంధంతో ముడులలాగా అడుగడుగునా వైరుధ్యాలు పుట్టుకొచ్చాయి ఈ వైరుధ్యాలను తొలగించడం చేత జాతుల బుద్ధివికాసం, పురోగమనం కూడా స్తంభించి పోయాయి. వర్తమాన వర్గ స్వార్థంతో బుద్ధి వికాసానికి అత్యవసరమైన జ్ఞానాన్ని పీడిత వర్గాలకు నిషేధించి సామాజిక ప్రతిష్ఠంభనను కోరి తెచ్చుకోవడం జరిగింది

మనదేశంలో సంచిత జ్ఞానాన్ని బ్రాహ్మణులు తమలో దాచుకున్నట్టే ఇతర నాగరికత వాళ్ళు ఆరంభ దశలో రాతకోతలు ఒక వర్గానికి పరిమితం చేశారు ఆ వర్గం పాలకవర్గానికి అండగా నిలిచింది పాలకులు ఉత్తమ బుద్ధిబలంతో కూడుకున్న వారు కానవసరం లేదు క్షత్రియులు బ్రాహ్మణులకు ఉపదేశాలు చేసే దశ ఉపనిషత్తులలో కనబడుతుంది కాని చరిత్ర యుగంలో బ్రాహ్మణులే సామాజిక పురోగమనం కోసం వర్గ వ్యవస్థను ప్రతిపాదించినా వాళ్ళు రాజులకోసం ఆ పనిచేసి పాలకులకు తైనాతీలుగా వ్యవహరించారు. వారి తెలివితేటలన్నీ జ్ఞానాన్ని అస్తవ్యస్తం చెయ్యటానికే ఉపయోగపడ్డాయి. సామాజిక వైరుధ్యాలను పరిష్కరించకుండా దాటవేసే ప్రయత్నంలో బుద్ధి వెర్రితలలు వేస్తుందనటానికి మన పురాణాలు, వైదిక సాహిత్యంలో చాలాభాగం చక్కని వుదాహరణలనిస్తాయి అన్నిటికి తలమానికం అనదగినది భగవద్గీత. అది దాటవేసినన్ని సందర్భాలను అంత సులువుగాను, అంత కొద్ది జాగాలోనూ మరే గ్రంథం దాటవేసి వుండదు దాన్ని పరమపవిత్ర గ్రంథంగా పరిగణించే జాతి "బుద్ధి" కొలతలో ఎక్కడో పూర్తిగా దారి తప్పిందనడానికి ఎంతమాత్రం సందేహం లేదు

**(ఆంధ్రజ్యోతి, దినపత్రిక, 5-10-1975)**

# 20. "బుద్ధి" పరిణతకి అవరోధంగా నిలిచిన మతం

వేదకాలంలో పునర్జన్మ ప్రసక్తి లేదని చెబుతారు అమరత్వం ఉన్నది కొందరు వేదకాలపు దేవతలు మొట్టమొదట మర్త్యులుగా వుండి తరువాత అమరులయ్యారు సోమపానం అమరత్వాన్ని ప్రసాదిస్తుందని అప్పటివారు నమ్మారు. వేదకాలపు దేవతలలోకెల్లా అగ్రగణ్యుడయిన ఇంద్రుడు అందరిని మించిన త్రాగుబోతు అతడు సోమాన్ని దొంగిలించి తాగాడట. సోమం కోసం తన తండ్రినే చంపాడట తెగ తాగి రోగం తెచ్చుకొని చికిత్స కూడా పొందాడట. అందుకే అతడు అమరులలోకెల్లా పెద్ద అయి వుంటాడు. ఏమైనా వేదకాలపు వాళ్ళు వాస్తవ జగత్తును మూడు భాగాలుగా చేసి, దేవతలకు ఉన్నత విభాగాన్ని కేటాయించారు. అదే ఊర్ధ్వ లోకాలయింది ఈ ఊర్ధ్వ లోకాలను ఆధునిక విజ్ఞానం ఆమోదించదు.

కాని జగత్తు అనేది వేదకాలపు వ్యక్తులకు వాస్తవమైనదే దాని మూడు విభాగాలు వాస్తవమైనవే చచ్చిపోయినవారు అంతరించరు. వాళ్ళు శరీరాలను వదలి, ఊర్ధ్వ లోకాలకు పోతారు మరణానంతరం జీవితం వారి దృష్టిలో వాస్తవమైనది. ఋగ్వేదంలో పునర్జన్మల ప్రసక్తి లేదు. నరకం లేదు నరకప్రసక్తి అథర్వవేదం, కఠోపనిషత్తు, శతపథ బ్రాహ్మణం వగైరాలలోను అనంతరం కనబడుతుంది

ఆధునిక దృష్టిలో అసలు మనిషి ఈ శరీరంతో వున్నవాడే కాని వేదకాలపు దృష్టిలో ఈ శరీరం అంతా ప్రధానం కాదు ఈనాడు మరణానంతరం జీవితంలో విశ్వాసం గలవారు ప్రపంచమంతటా శరీరం నుంచి వెలువడేదాన్ని "ఆత్మ" అంటున్నారు. తాత్వికులు ఆ ఆత్మను పరమాత్మ అంశంగా భావిస్తున్నారు. ఇలాంటి "ఆదర్శ" దృష్టి వేదకాలపు వాళ్ళకున్నట్టు కనబడదు వాళ్ళ పరిభాషలో "ఆత్మ" అంటే పీల్చేగాలి "ప్రాణం" అంటే ఉచ్ఛ్వాస నిశ్వాసాలు అన్నిటికన్నా చిత్రం ఏమంటే చచ్చినపుడు శరీరం నుంచి బయటికి వచ్చేది "మనస్సు", మనస్సు వున్నంతసేపు మనిషి జీవించి వుంటాడు అది దాటిపోయాక మనిషి చచ్చినవాడే అది శరీరానికి నీడ లాంటిది, వాస్తవమైనది. మరణానంతర జీవితం (మన పరిభాషలో) భౌతికమైనది, మనిషి బతికివున్నప్పుడు కూడా అపస్మారక స్థితిలా అది శరీరాన్ని విడువగలదు మరణానంతరం సజీవిగా వుండగలదు

వేదాలలో వుండే ఈ భావాలను పాశ్చాత్య దేశాలలో వుండే "స్పిరిచ్యువలిస్టులు" ఇంచుమించు ఇదే విధంగా చెబుతున్నారు. వేదాలకు పూర్వం కూడా అనాగరిక జాతులవాళ్ళ ఆచారాలనుబట్టి వారికి ఇలాంటి విశ్వాసాలే వున్నట్టు కనబడుతుంది. వాళ్ళు చచ్చిపోయినవాళ్ళను పాతేటప్పుడు వాళ్ళ నగలనూ, ఆయుధాలనూ, వాళ్ళకు సేవచేసే వాళ్ళనూ, వారి భార్యలను వాళ్ళతోపాటు పాతేసేవారు. మరణానంతరం వాళ్ళకు వీటి అన్నిటితోనూ అవసరం వుంటుందన్న నమ్మకాన్ని వేదాలు ఇంకా అర్థం చేసుకోగలిగి వున్నాయి ఏ రాతియుగంలోనో ఆరంభమైన ఈ ఆచారంలో వుండిన సతీసహగమనం ఒక దురాచారంగా చరిత్ర యుగంలో కూడా చలామణీ అవుతూ వచ్చింది.

**మరణానంతర జీవితంలో విశ్వాసం**

మరణానంతరం జీవితం గురించి పుస్తకం రాస్తూ ఒక పాశ్చాత్య రచయిత "అనేకమంది మరణంతో మనిషి సమాప్తం కాడని ఎందుకు నమ్ముతారంటే, వాళ్ళకు నమ్మటం ఇష్టంగనుక" అన్నది ఒక కారణంగా చెప్పాడు. ఇందులో చాలా నిజం వున్నది జీవితశక్తులమీద అదుపు బొత్తిగాలేని వారందరికి మరణానంతర జీవితం కలలుకనే సాధనంగా ఉపకరిస్తుంది. సామాజిక దోపిడీలో మునిగి తేలేవాళ్ళకు లోకాంతరాలను గురించి ప్రచారం చేయడం లాభిస్తుంది

అయితే, అనేక వేల సంవత్సరాలపాటు అనాగరిక మానవులు మరణానంతర జీవితాలు నమ్మకం ప్రదర్శించడానికి ఇది ఒక్కటే కారణం కావడం సరిగా కనబడదు ఈనాడు నాగరిక ప్రపంచంలో సైతం కొన్ని అసాధారణ సంఘటనలు అప్పుడప్పుడూ జరుగుతూ వుంటాయి దారితప్పి అలాంటి సంఘటన ఒకటి చచ్చిపోయిన వ్యక్తులతో విడరాని సంబంధం కలదిగా కనిపించినప్పుడు మరణానంతర జీవితంమీద నమ్మకం కొత్తగా ఏర్పడటమో, లేక వున్న నమ్మకం ధ్రువపడటమో జరుగుతుంది. ఇలాంటి సంఘటనలు పత్రికలలో వచ్చేవాటికంటె చాలా రెట్లు నోటిప్రచారం అవుతాయి. ఎవరో పోయారు. శ్రాద్ధం పెట్టి పిండం వేస్తే కాకులు ముట్టలేదు. పోయినవాడి పిల్లలు చిన్నవాళ్ళు "వాళ్ళ మంచిచెడ్డలు నేను చూస్తాను" అని ఎవరో మాట ఇవ్వగానే దూరంగా వున్న కాకులు వచ్చి పిండాన్ని ఎత్తుకుపోయాయి. ఈ సంఘటనను కళ్ళారా చూశామన్నవాడు మరణానంతర జీవితాన్ని గురించి ప్రత్యేకంగా ఆసక్తి కలవాడు కాదు ఇలాంటివి సవాలక్ష తగులుతాయి కొన్ని ఇళ్ళు దెయ్యాల కొంపలుగా మారుతాయి కొంతమందికి దెయ్యాలు పడతాయి కొంతమంది సోది చెప్పేవారు చచ్చినవాళ్ళు చెప్పగల వివరాలు ఎన్నో చెబుతారు మనసులో వున్నదే సోదెలో వస్తుందన్న మాట కూడా ఎప్పుడూ నిజమనుకోవడానికి వీలు లేదు. ఎవరో ఎందుకో సోదె అడిగితే ఊహించని మనుషులు వచ్చి ఇంకేవేవో విషయాలు చెబుతారు.

పక్కా శాస్త్రీయ దృక్పథంతో చూస్తే ఇలాంటివాటికి పచ్చి లౌకిక కారణాలు ఉండవచ్చు- కొరివిదెయ్యాలు కల్పన కాకపోయినా, మార్ష్‌గాస్ అని తేలినట్టు. మరణానంతర జీవితం ఉన్నదనడానికి ఏ యే సంఘటనలు ఆధారంగా వుంటున్నాయో వాటిని గురించి శాస్త్రవేత్తలు సరియైన పరిశోధనలు చెయ్యలేకపోతున్నారు. వారి పరిశోధనలు సాధారణంగా విఫలం కావడానికి కారణం వాళ్ళ విధానం స్థలకాల పరిశోధనలకు అనుకూలించేదేగాని, "బుద్ధి"కి అనుకూలించేదికాదు- ఇది నా అనుమానం మాత్రమే

మరణానంతరం మనిషి ఏదో రూపంలో వుంటాడని నాకు గట్టి నమ్మకం నాకున్న శాస్త్రీయ దృక్పథంలో నాకు తగిన ఆధారాలే వున్నాయి నా లెక్కన మనం ఇంకో మనిషితో వున్నమాట ఖాయం. ఆ మనిషి జగత్తు తాలూకు ఏ కొలతలో వుంటాడో చెప్పటం సాధ్యంకాదు ఈ శరీరానికి, ఆ రెండవ శరీరానికీ గల సంబంధం కేవలం బుద్ధి "కొలత"లో మాత్రమేనని నా ఊహ బుద్ధికి సంబంధించినంతవరకు ఆదిమానవులు మనకన్న ఎక్కువ తెలుసుకోగలిగారని కూడా నేను అనుకుంటున్నాను

అనాగరిక జాతులవారు చచ్చిపోయిన వ్యక్తి ఏదోరకం నిద్రలో వున్నాడనుకొని వాడికోసం భోజనం వగైరాలు వుంచి వుంటారన్నది నాకు సమంజసంగా తోచదు అలాంటి ఆశ గలవాళ్ళు చచ్చినవాళ్ళను ఖననం చెయ్యరు వాడివెంట వాడి నగలు, వాడి ఆయుధాలు, పారెయ్యరు వాడికి తోడుగా పెళ్ళాన్ని, దాసదాసీలను చంపి వెంటపంపరు. ఒకసారి చెయ్యవచ్చు - రెండుసార్లు చెయ్యవచ్చు. ప్రపంచమంతటా అనేకచోట్ల పదే పదే అలా చెయ్యటం జరిగిందంటే చచ్చినవాళ్ళు ఏదో రూపంలో ఇంచుమించు బతికున్నప్పటి మనస్తత్వంతోనే జీవించి ఉంటాడని నమ్మడానికి వారికి తగిన ఆధారాలు వుండి వుండాలి.

ఇంత బలమైన ఆధారాలు ఈనాడు మనకెందుకు లేవు ? మనలో హేతువాదం పెరగడంచేతనా ? మనం మరింత బుద్ధి వికాసం సాధించటం చేతనా ? నాకు ఏమి తోస్తుందంటే, మన పురోగమనం హెచ్చుగా స్థల, కాలమానాలలో ముందుకుపోవటం ద్వారా సాధ్యమయ్యింది. బుద్ధి "కొలత"ను నిరాకరించి మనం నాగరికతను పెంపొందించుకున్నాం. ఎప్పుడన్నా స్థల, కాలాలకు అతీతమైన సంఘటన జరిగితే అది మన విశ్వాసాలన్నిటికీ అడ్డుపుల్లగా తయారవుతుంది.

పాశ్చాత్య నాగరికతకు ప్రత్యక్షరూప మనదగిన ప్రసిద్ధ రచయిత స్నేహితుల ప్రోద్బలం మీద ఒక "సియన్స్"కు తాను చూసినది మింగాలేక, కక్కాలేక ఒక సుదీర్ఘ వ్యాసం రాశాడు. సర్ ఆలివర్ లాడ్జ్, సర్ విలయం క్రూక్స్, వాట్సన్‌లాంటి గొప్ప శాస్త్రవేత్తలు ఇలాంటి అనుభవాలకే గురిఅయ్యి ఈనాటికీ "హేతువాదుల" చేత ఈసడించబడుతున్నారు.

ఇంతవరకు నాగరికత అభివృద్ధి అవుతూ వచ్చిన తీరునిబట్టి చూస్తే మన నాగరికతలో దోపిడి - ముఖ్యంగా జ్ఞానవృద్ధిని వ్యాప్తికాకుండా నిరోధించే విధానం - అంతరించే బుద్ధి గురించిన జ్ఞానం పెంపొందేట్టు కనబడదు ఉన్న పరిస్థితులలో దానివల్ల మనకు ఒరిగేది కూడా కనబడదు. గోడలమధ్య జీవితం సరిదిద్దుకోవడానికి సతమతమయ్యేవాడికి గోడ అవతల ఏముంటేనేమి ?

ఆ మాట అని శాస్త్రవేత్తలు చేతులు కట్టుకొని కూర్చోనూ లేదు బుద్ధికి సంబంధించిన కొన్ని "ఫినామినా" నిజంగా వున్నాయా లేదా అని పరిశోధనలు చేస్తున్నారు. ఉన్నట్టు స్పష్టంగా తెలిసినప్పుడు వాటిని గురించి ప్రయోగాలు చేసి వాటికిగల మూలకారణాలను మెదడులోను, నరాలలోను వెతుకుతున్నారు. కొందరి మనసులలో ఆలోచనలు కొందరి మనసులకు ఏ విధంగా అందుతాయి ? కొందరు హిప్నటైజ్ అయినప్పుడు వింతశక్తులు (కుదరని రోగాలు సైతం నయంకావటం లాంటివి) ఎలా సాధిస్తారు ? కొన్ని డ్రగ్గులు మనసుకు విచిత్ర లక్షణాలు కలిగిస్తాయి వాటి ప్రభావానికి మూలం ఏమిటి ? కొందరు మనుషులు 'లేని' దృశ్యాలు ఎలా చూడగలుగుతారు ? లేక భ్రమలు ఎలా కలుగుతాయి ? ఎక్కడో చచ్చిపోయిన కుర్రవాడి చొక్కా గుండీ చేతపట్టుకుని ఇంగ్లండులో వుండే ఒక మీడియం వాడినుంచి సందేశం సంపాదించటమేగాక, వాడిని చూసినట్టుగా ఎలా చెప్పగలుగుతుంది ?

మనం "ఆత్మ" అనటం పరిపాటిగా గలదాన్ని వేదకాలపు పురుషులు మనస్సు అనటం, అదే అసలైన శక్తిగా భావించటం నాకు చాలా విచిత్రంగాను, సరిగాను తోస్తుంది. దాన్ని మనవాళ్ళు పరమాత్మతో కలపడమో, దానికి మరో జన్మ ఇవ్వటమో చేస్తున్నారు ఇస్లాం మతం ఆత్మలను అల్లా దగ్గరికి పంపేస్తున్నది బౌద్ధులు ఆత్మలకు జన్మ పరంపరలు నిర్ణయించారు. అన్ని మతాలు ఆత్మలతో రకరకాల ఆటలు ఆడుకొన్నాయి జగత్తులో బుద్ధి ఒక "కొలత" అని, అందులోను పరిణామం సాగుతున్నదని, ఇది భౌతికవాదానికి సంబంధించిన విషయమని స్పష్టమైన అవగాహన ఎక్కడా కనిపించదు

కాని, అలాటి అవగాహనతో అవసరం వున్నది ఈ అవగాహనతో మనం ఇప్పుడు నాగరికత, పురోగమనం అనుకుంటున్నవి శీఘ్రంగా పరిపక్వ దశకు వచ్చి, మానవుడి జ్ఞానం కొత్తదారులు తొక్కటానికి అవకాశం ఏర్పడవచ్చు సామాజిక విప్లవ పరిణామానికి అడ్డుగావున్న పీడకులే బుద్ధి వికాసానికి అంతరాయంగా వున్నారనడానికి నాకు ఎలాంటి సంకోచం లేదు. తెలిసో, తెలియకో కొందరు శాస్త్రజ్ఞులు ఈ పీడకుల ఊడిగం చేస్తున్నారు ఇలా చేస్తున్నవారిలో కొందరు పచ్చి "భక్తులు" మరికొందరు తమకు అర్థంగానిదంతా "డామ్ నాన్సెన్స్" అని కొట్టిపారేసేవాళ్ళు

మనస్తత్వం గురించి అపారంగా శాస్త్రజ్ఞానం వెలువడుతున్నది కాని, ఈ జ్ఞానం కొన్ని సిద్ధాంతాల రూపంలో వుంటుంది తమ సిద్ధాంతాలను బలపరిచే ఉదాహరణలనే శాస్త్రవేత్తలు ఎన్నుకుంటారు ఇందులో వేరు వేరు స్కూళ్ళు బయలుదేరుతాయి. వాటిమధ్య రంధి సాగుతుంది ఆసక్తి గల 'ప్రేక్షకులు' ఏదో ఒక పక్షంచేరి తృప్తిపడతారు - అవతలివారు శుంఠలని; జ్ఞానం పురోగమించే పద్ధతి ఇది కాదు.

సమస్త జ్ఞానానికి మూలాధారం అనుభవం, సాధనం, అవగాహన - సిద్ధాంతాల నుంచి జ్ఞానం పెంపొందదు, అవగాహన మాత్రమే పెంపొందుతుంది. అన్ని సిద్ధాంతాలను అవసరమైన

విధంగా సంస్కరించే హక్కు అనుభవానికి మాత్రమే వున్నది సిద్ధాంతాల చట్రంలో ఇమడని అనుభవాన్ని నిరాకరించడం మతాల లక్షణంగాని, విజ్ఞాన లక్షణం కాదు మన బుద్ధి మట్టికొట్టుకుపోవడానికి మతాలు చేసిన కృషి అంతా ఇంతా కాదు అతి నాగరికులు మతం ఎరుగని కారణం చేతనేమో మనకున్న బుద్ధిని మరింత బాగా ఉపయోగించగలిగారు వాళ్ళకు వినిపించినది స్థల, కాల పరిజ్ఞానం మాత్రమే

నేను ఈ శీర్షికలో ప్రస్తావించిన విషయాలను గురించి నాకన్నా చాలా హెచ్చు పరిజ్ఞానం గలవారు అనేకులుంటారు కొన్ని విషయాలకు సందర్భశుద్ధి కూడా లోపించి వుండవచ్చు అసలు "బుద్ధి" అన్నది జగత్తులో ఒక ప్రత్యేక విభాగమన్న ప్రతిపాదనలోనే మౌలికంగా దోషం వుండివుండవచ్చు అతి సూక్ష్మ పదార్థం మొదలు జగత్తులో గల అత్యంత మేధావి జాతివరకు ప్రతి ఒక్క మార్పు, ప్రతి ఒక్క పరిణామం స్థల, కాలాలతోపాటు "బుద్ధి"తో కూడా జరిగిందని నా ప్రతిపాదన దీన్ని వివరించటం నాకు సాధ్యమయ్యేది కాదు. అది జరగటమంటూ వుంటే మందిమీద, సమాజపరంగానే జరగాలి

*(ఆంధ్రజ్యోతి, దినపత్రిక, 12-10-1975)*

# 21. అతీంద్రియ జ్ఞానం - మరణానంతర జీవితం

మానవజాతి ఎంత ప్రాచీనమైనదన్న విషయం చర్చించడానికి కాదు ఈ రచన అందుకు సమర్థులైన శాస్త్ర పరిశోధకులున్నారు. వాళ్ళు ఆధునిక మానవుడు ముప్పై లక్షల ఏళ్ళక్రితమే వున్నాడన్న సంశయంలో పడివున్నారు

మానవుడి ప్రాచీనతను కొలవడానికి అతడి అలవాట్లు, విశ్వాసాలు ఈనాడు కూడా పనికి వస్తున్నాయి "ఎక్కడో సత్యకాలం మనిషి !... ఇక్ష్వాకులనాటివాడు ! .. నాయనమ్మల నాటి నమ్మకాలు !" ఇలాంటి మాటలు మనం వింటూనే ఉంటాం ఒక్కొక్క "యుగానికి" కొలబద్దగా కొన్ని కొన్ని చిక్కులుంటాయి లోతుగా చూస్తే పరిణామవాదంలో అందరికి విశ్వాసం వున్నది కనీసం, కాలంతో మార్పులు తప్పనిసరిగా వస్తాయని అందరు ఒప్పుకుంటారు. "ఈ చోద్యాలు మా కాలంలో ఎరగనమ్మా !" అని బుగ్గలు నొక్కుకునే ముసలమ్మలకు మార్పు ఇష్టం లేకపోయినా అది వస్తున్నమాట నిజమని ఒప్పుకుంటారు

అతి ప్రాచీనుల ఆచార వ్యవహారాలను తెలుసుకొనటం ఒకంతట సాధ్యంకాదు పురాతత్వవేత్తలు ఆ అతి ప్రాచీనుల అవశేషాలను తవ్వితీసి, కొంతవరకు వారి ఆచారాలను లోకానికి తెలియజేస్తారు అప్పటికి కూడా ఆ ఆచారాలను అర్థం చేసుకోవడానికి ఊహాశక్తిని వినియోగించవలసిందే కాని రుజువులు దొరకవు అక్కడిదాకా వచ్చినాక ఎవరి ఊహాశక్తి వారిది పాతే చాలాగొప్పది అనుకునే "సనాతనిష్టులు" ఆ ఆచారాల వెనక ఎంతలేసి గంభీర భావాలనన్నా చూడగలరు మన ఆధునిక సనాతనిస్టుల మనస్తత్వాన్ని గిరీశం వ్యక్తం చేస్తూ "ధియాసఫిస్టులు చెప్పినట్టు మన ఒల్డు కస్టమ్స్ అన్నిటికీ ఏదో ఒక ప్రయోజనం ఆలోచించే మనవాళ్ళు ఏర్పరిచారు" అన్నాడు

కాని హేతువాదానికి కట్టుబడదలచినవాళ్ళు ప్రాచీనుల ఆచార వ్యవహారాల వెనకవుండే మనస్తత్వాన్ని, ప్రేరణలను గురించి ఊహించే పనిని సమర్థులైన శాస్త్రజ్ఞులకే వదిలి వారి అభిప్రాయాలను స్వీకరిస్తారు.

అయినా ఊహాగానాలు ఊహాగానాలే. రుజువైన సత్యాలకు ఉండే విలువ ఊహలకు - శాస్త్రీయమైన ఊహాలకు సైతం వుండదు నాకు అనుమానాస్పదంగా తోచిన కొన్ని శాస్త్రీయమైన ఊహలను గురించి ఇక్కడ చెప్పదలచుకున్నాను

రమారమి 50,000 ఏళ్ళక్రితం, యూరప్ ప్రాంతంలో జాతిగా చెప్పబడే మానవుల లాంటివాళ్ళు విరివిగా సంచరించారు గడచిన "హిమానీయుగం" ఆరంభం కాబోతున్నది చలి విపరీతంగా ఉండేది అందుచేత ఈ మూస్టీరియన్ 'మానవులు' గుహలలో నివసించేవాళ్ళు. ఆ కారణంగా 'తవ్వకాల' ద్వారా వారి జీవిత విశేషాలు శాస్త్రజ్ఞులకు కొంచెం విరివిగా లభించడం సాధ్యపడింది ఈ మూస్టీరియన్‌లు ఈనాటి "పూర్ణ" మానవులను పోలినవారు కారు. వాళ్ళ దేహ నిర్మాణం "నియాండర్తల్" మానవులను పోలి వుండేది (ఈ నియండర్తల్ జాతి ఏనాడో నశించింది) వాళ్ళు కాళ్ళు ఈడుస్తూ నడిచేవాళ్ళు తలలు ముందుకు వాలివుండేవి కింది దవడలకు గడ్డము, నుదురు ఉండేదికాదు కళ్ళమీదుగా ఎముక ఎత్తుగా లేచి, వాళ్ళముఖాలు జంతువుల ముఖాలలాగా వుండేవి మాట్లాడే శక్తి చాలా మితంగా ఉండేది

అయితే వాళ్ళకు రాతి పరికరాలు చెయ్యడం కొంతవరకు తెలుసు. వాళ్ళు వేటలో నేర్పరులు అదే వారి జీవనోపాధి బ్రహ్మాండమైన ధ్రువ ప్రాంతపు ఏనుగులను, జడల ఖడ్గమృగాలను మాటువేసి పట్టి వాటి కళేబరాలను తాము నివసించే గుహలవద్దకు ఈడ్చుకు వచ్చేవారు అలాటి

పెద్ద జంతువులను వేటాడడం విడి కుటుంబాలకు సాధ్యంకాదు గనక అనేక కుటుంబాల మధ్య సహకారం విధిగా ఉండి ఉండాలి

వీరు పాటించిన ఒక ఆచారం శాస్త్రజ్ఞుల దృష్టిని ఆకర్షించింది అదేమిటంటే చచ్చిపోయిన తమ వారి శవాలను భద్రపరచటంలో వారు పాటించిన అత్యంత శ్రద్ధ తాము నివసించే గుహలలోనే చచ్చినవారిని పాతిపెట్టేవారు. అది పూడ్చెయ్యటం కాదు రాళ్ళతో ఒక అరలాటిది చేసి శవానికి తలకింద ఒకరాయి దిండులాగ అమర్చి శవాలకు సమీపంగా వాళ్ళ పరికరాలు, మాంస ఖండాలు ఉంచేవారు. శవాలను పాతేచోటు 'అగ్గిపొయ్యి'కి సమీపంగా ఉండేది.

ఇవి పరిశోధనలో రుజువైన విషయాలు వాళ్ళు ఇలా ఎందుకు చేశారన్నది కేవలం ఊహ్యం. శాస్త్రజ్ఞులు ఎలా ఊహించారో ముందు చూతాం.

ఇంత శ్రద్ధగా చచ్చినవారిని ఖననం చెయ్యడం "ఆర్థిక" చర్య అనిపించుకోదు. అందుచేత ఏమిటంటే చావు అనే భయ విభ్రాంతికరమైనది సంభవించగానే "మూస్టీరియన్" ఊహలు ఉరకలు, పరుగులు తీసేవి ఐహిక జీవితం విశ్వాసం వారికి కలిగేదికాదు, చచ్చినవాళ్ళకు కూడా భౌతిక అవసరాలు - పరికరాలు, ఆహారాల లాటివి - ఉంటాయనిపించేవి. వారి సమాధులు "అగ్గిపొయ్యిల" సమీపంలో దేనికంటే శవాల నుంచి వెళ్ళిపోయిన వేడిని కృత్రిమంగా కలిగిస్తే చచ్చినవాళ్ళకు సుఖంగా ఉంటుందని ! ఇందులో "మ్యాజిక్" ఇమిడి ఉన్నది. ఇదంతా ఊహాగానమని శాస్త్రజ్ఞులు ఒప్పుకుంటారు కాని దాన్ని హేతుబద్ధమైన ఊహాగానంగా చెబుతారు

కాని ఈ ఊహలు నా బుద్ధికి అంత హేతుబద్ధంగా కనబడటం లేదు 1) పశుప్రాయులైన మానవులకు చావు అన్నది భయ విభ్రాంతి కలిగించనవసరం లేదు నాగరిక మానవులలో కంటె మూసీరియనులలో బాలదుర్మారణాలు చాలా ఎక్కువై ఉండాలి జడల ఏనుగులనూ, జడల ఖడ్గమృగాలనూ వేటాడటం పంటచేను కొయ్యడం కాదు వారి మనుగడే వేటమీద ఆధారపడి ఉండటం చేత వారికి చావు వింత విషయం కాదు. కసాయివాడికి రక్తం చూస్తే కళ్ళు బైర్లు కమ్ముతాయా ?

2) 50,000 ఏళ్ళక్రితం మూస్టీరియన్‌లు శవాల విషయంలో పాటించిన ఆచారం భ్రమాజనితమని రుజువు కావడానికి శతాబ్దాలూ, సహస్రాబ్దాలు పట్టనవసరం లేదు అలాటప్పుడు 5,000 ఏళ్ళక్రితం కూడా ఈజిప్షియనులు ఇదే ఆచారాన్ని ఎందుకుగాను పాటిస్తూ వచ్చారు ? పిరమిడ్ల కాలపు ఈజిప్షియనులు మూస్టీరియనులు కారు. ఆధునిక మానవులే మీదు మిక్కిలి నాగరిక మానవులు - పూర్వ శిలాయుగం వాళ్ళుకారు. ఈ "నిరర్ధకమైన" ఆచారం 40,000 ఏళ్ళలో కూడా ఎందుకు అదృశ్యం కాలేదు ?

3) దానికి ఒకటి చెప్పవచ్చు . 'మ్యాజిక్' నుంచి ఏర్పడిన ఆచారం గుడ్డిగా ఎంతకాలమైనా అమలు జరగవచ్చు ఇంకా తద్దినాలు పెడుతున్నారు పొగముందు పెళ్ళిళ్ళు చేస్తూనే ఉన్నారు అయితే దశ సహస్రాబ్దాలమీద మారని ఆచారం మరొకటి ఎక్కడున్నా చరిత్రలోగాని, చరిత్ర పూర్వదశలలో గాని ఉన్నదా ? సమాధులు కట్టడం మారిపోయిన ఆచారం కాదా ? పిరమిడ్ సమాధులకూ, తాజమహల్ సమాధికీ 6, 7 వేల ఏళ్ళలో పెద్ద తేడా రాలేదా ?

4) ఆదిమానవులు మ్యాజిక్‌ను తమ సమష్టి స్వార్థానికి వినియోగించుకున్నారు గాని పరార్థానికి వినియోగించుకున్నట్టు కనబడదు.

ఈ విధంగా శాస్త్రజ్ఞుల ఊహాగానాలకు అభ్యంతరం చెప్పినమీదట నా ఊహాగానం ఏమిటి ? మరణానంతర జీవితంలోను, పశుప్రాయులలో అధికంగా వుండే "సైకిక్" శక్తిలోను నమ్మకం ఉండేవాళ్ళకు ఈ ఆచారం పూర్తిగా హేతుబద్ధంగా కనిపిస్తుంది.

చచ్చిపోయినవారికి "ఇదొక జీవితం ముగిసిందన్న విశ్వాసం వారికి కలిగేదికాదు" అనే బదులు చావుతో వారికి ఐహిక జీవితం ముగియదని మూస్టీరియనులకు తెలుసుననుకోవచ్చు చచ్చినవాళ్ళు కూడా బతికున్నవాళ్ళ మనస్తత్వం గలవాళ్ళు కావడంచేత వాళ్ళ ప్రేతాత్మ ఆ గుహలనే ఆశ్రయిస్తాయి. వాటికి తమ భౌతిక కాయాలమీద, తమ "అగ్గిపొయ్యిల"మీద, తాము తినే ఆహారంమీద భ్రమ వెంటనే పోదు. ఈ సంగతి "తెలిసిన" మూస్టీరియనులు అలాంటి ఖననాలను చెయ్యడం పూర్తిగా సబబే భౌతిక జీవితానికి సమీపంలో సంచరించే ప్రేతాత్మలకు చలి "తెలుస్తుందని" సర్ అలివర్ లాడ్జ్ కొడుకు రేమాండ్ ప్రేతాత్మ ఒక "మీడియం" ద్వారా చెప్పింది అందుచేత కూడా "అగ్గిపొయ్యి" ల సమీపంలో శవాలను ఖననం చెయ్యడంలో కొంత అర్థం ఉండవచ్చు. మూస్టీరియనులు నివసించినది అతి శీతలయుగంలో.

ఈ ఊహాగానంలో వివాదాస్పదమైనది "మరణానంతర జీవితం", బతికి వున్నవారిలో కొందరికి గల "అసాధారణ (సైకిక్) శక్తీ"నూ. ఈ రెండూ శాస్త్ర పరిశోధనలలో పుష్కలంగా రుజువైనవే కాని అనేకమందికి ఈ రుజువులు తెలీని కారణంచేత వాటిని నమ్మరు. అంతకన్న ముఖ్యమైన సంగతి ఏమంటే వాటిని నమ్మడంచేత భౌతిక జీవితానికి కలిగే మేలు ఏమీ వున్నట్టు కనిపించదు.

భౌతిక జగత్తులో మనసుకు మాత్రమే అందే వాస్తవాలున్నాయి. అవి జ్ఞానేంద్రియాలకు అతీతమైనవి. శాస్త్రజ్ఞులకు అలాటి సత్యాలు చాలా తెలుసు. మామూలు మనసుకు అందనివి కూడా అనేక జంతువులకు, పశుప్రాయ దశలో మానవులకు తెలిసి వుండడం అసూహ్యం కాదు వాటిని తెలుసుకునే శక్తినే శాస్త్రవేత్తలు రుజువు చేయడానికి కొంతకాలంగా ప్రయత్నిస్తున్నారు

ఈనాటి మానవులలో ఈ శక్తి చాలా సకృతుగా కనిపిస్తుంది. దానికి కారణం మానవుడు ఐహిక పరిణతి సాధించడానికై ఆ శక్తికి దాదాపు ఉద్వాసన చెప్పాడు మానవ నాగరికత ఒక్కొక్క దశ దాటినకొద్దీ, మెదడు పరిణామం జ్ఞానేంద్రియాల ప్రాముఖ్యం పెంచింది మనం ఈనాడు భౌతిక దృష్టి అనుకునేది పరిమిత భౌతికదృష్టి, ఈ దృష్టితో మనం పురాతన మానవుల జీవితాన్ని సరిగా అంచనా కట్టలేం

కాని ఒక పని చేయగలం - చెయ్యాలి కూడా. మనలో ఈనాడున్న ఆధారాలలో ఎంత ప్రాచీనత వున్నదీ అంచనా కట్టడానికి దానివెనుక వున్న భౌతిక దృష్టిని కొలబద్దగా వాడవచ్చు పరికరాలతోనూ, భోజనంతోనూ శవాలను ఖననం చేయడమైనా అర్థమవుతోంది గాని ఏటా పెట్టే తద్దినాలు అర్థం కావు చచ్చిపోయినవాళ్ళ ప్రేతాత్మలు ఏళ్ళ తరబడి తవ ఐహిక ప్రపంచానికి కట్టుబడి వుండవు.

చేతబడులు, మంత్రాలు, ప్రయోగాలు, శాపాలు, వాటి ప్రభావాలు ఆటవిక దశకు చెందిన సంస్కృతిని ప్రతిబింబిస్తాయి ఆ దశలో శాపం తగిలి ధామ్మని చచ్చిపోయే మనస్తత్వం ఆటవికులకు ఉండేది ఇలాటివన్నీ ఈనాడు సాధ్యమని నమ్మదలచుకున్నవాడు ఆటవిక దశలో నివసించదలచినవాడే. లేదా శాపంపెట్టే శక్తి ఒకప్పుడు "మహాత్ములకు" ఉండేదనుకునేవాడు నాగరికత గమనాన్ని ఏమాత్రమూ అర్థం చేసికోనివాడే

ఈ విధంగా మనం ఈనాడు కూడా అమలులో వున్న ఆచారాలన్నిటినీ ఏ ప్రాచీన దశకు చెందినవో అంచనా కట్టడానికి మానవ సామాజిక పరిణామ చరిత్రను బాగా చదివి, మనం నాగరికతలోనే జీవించదలిచామో, లేక ఏ అనాగరిక దశకో తిరిగి పోదలిచామో తెలుసుకుంటే బాగుంటుంది.

**(ఆంధ్రజ్యోతి, దినపత్రిక, 7-3-1976)**

# 22. మతం అంటే ?

శిలాయుగంలో మానవులు చనిపోయినవారిని ఎంతో శ్రద్ధగా భూగర్భంలో ఖననంచేసి, మరణానంతరం జీవితానికి అవసరమైన ఆహారాన్నీ, పరికరాలను శవాలవెంట ఉంచటం దగ్గిర మతం ప్రారంభమైందని కొందరి విశ్వాసం, పాశవిక దశలోని మానవుడికి మరణానంతర జీవితంలో గల విశ్వాసమే మతానికి బీజం అనుకోవాలి

ఇది నిజమైతే వర్గసమాజమూ, సామాజికదోపిడీ, వర్గపోరాటాలూ ఏర్పడకముందే మతం అవతరించిందనుకోవాలి

జాతిజీవనం (Tribal life) ఆహారోత్పత్తి దశను అందుకోక పూర్వం వేటమీద, ఆహారం ఏరుకోవటంమీద మనుషుల మనుగడ ఆధారపడిన దశలోనే వేరు వేరు తెగలలో మాంత్రికులు ఉండేవారు. వారు తెగయొక్క యోగక్షేమాలు చూసేవారు సాధారణంగా వీరే తెగకు నాయకులుగా కూడా ఉండేవారు (సమాజాలు పరిణామం చెంది వీరి స్థానంలో రాజులు వచ్చినాక కూడా ప్రజాక్షేమానికి రాజులదే పూర్తి బాధ్యతగా భావించబడుతూ రావటం మనకు తెలును ఒక బ్రాహ్మడి కొడుకు అకాల మరణం పాలయితే ఆ బ్రాహ్మడు రాజును సంజాయిషీ అడుగుతాడు ! నెలకు మూడు వర్షాలు పడకపోతే రాజ్యపాలన ధర్మంగా లేదన్నమాట !) ఈ ఆదిమ తెగల నాయకులు తరువాత వచ్చిన మత గురువులకు తొలి నమూనాలన్నమాట.

ఇది నిజమైతే మతం అన్నది బీజరూపంలో ఉండగానే దాని ప్రధాన ప్రయోజనం ప్రజాక్షేమం అని తెలుస్తున్నది.

పైన చెప్పిన రెండు రకాల మతంలోనూ భౌతికదృష్టి పూర్తిగా వున్నది మరణానంతర జీవితం ఉన్నదనేది భ్రమ అని నమ్మేవాళ్ళు సైతం చచ్చినవాడితో బాటు వాడి పనిముట్లనూ, కుండలనూ, ఆహారాన్ని పాతిపెట్టటంలో "ఆధ్యాత్మిక" దృష్టి ఉన్నదనలేము

ఆదిమానవుడు పరిణత మేధస్సు గలవాడే అయినా విజ్ఞానం విషయంలో నరవానరాల దశనుంచే జీవితం ప్రారంభించేడు తన అనుభవాలను విశ్లేషించే శక్తి లేదు. ప్రతి అనుభవమూ యాదృచ్ఛిక మేననుకుంటే తప్ప అనుభవాల మధ్య కార్యకారణ సంబంధం ఉన్నదనుకోవటం తప్పనిసరి ఈ సంబంధాలు శాస్త్రీయంగా నిరూపించటానికి అవకాశం లేనిదశలో కొన్ని విశ్వాసాలమీద ఆధారపడటం తప్పనిసరి సహజీవనం సాగించే కొంతమంది వ్యక్తులు ఏర్పరచుకున్న విశ్వాసాలు ఉపయోగకరంగా వున్నట్టు కనపడినంత కాలమూ వాటికి చలామణీ వ్యాప్తి కూడా ఉండవచ్చు వాటివల్ల ఏనాడు ప్రయోజనం లేదనితోస్తే ఆనాడు వాటిని మానవ స్వార్థం విడిచిపుచ్చుతుంది అనుభవం పదునెక్కిన కొద్దీ కొన్ని విశ్వాసాలను సంస్కరించటం అవసరం కావచ్చు (శాస్త్రజ్ఞానం ఈ మార్గమే అవలంబిస్తుంది)

వర్గ వ్యవస్థ రాకమునుపు మత విశ్వాసాలు ఈనాటి శాస్త్రసిద్ధాంతాల లాగే ఉండేవనుకోవటానికి ఆస్కారం వున్నది ఎందుచేతనంటే, పూర్వశిలాయుగంలో కూడా విజ్ఞానమూ, సాంకేతిక ప్రావీణ్యమూ అంతకంతకూ హెచ్చువేగంతో అభివృద్ధి చెందుతూ నాగరికతకు పునాదులుగా మనం భావించే వ్యవసాయమూ, పశుపోషణా, భాషా, లోహాల ఉపయోగమూ మనిషి అధీనమయాయి (ఈనాడు మనం "మతం" అని చెప్పుకొనేది ఏదీ వీటిలో ఒకటి కూడా సాధించలేదని వేరే చెప్పనవసరం లేదు.)

"రుజువుకురాని విశ్వాసాలు" మత విశ్వాసాలనీ, రుజువు అయ్యేవన్నీ శాస్త్రీయమైన విశ్వాసాలన్నీ కొందరి నమ్మకం ఆచరణలో కొన్ని రుజువైన విశ్వాసాలుగా విశ్వసించబడుతున్నాయి

! కాంతివేగం సెకండుకు 3 లక్షల కిలోమీటర్లు ! సూర్యుడు భూమికి సుమారుగా 9 కోట్ల 30 లక్షల మైళ్ళ దూరంలో ఉన్నాడు ! ఇటువంటివి శాస్త్రీయమైన విశ్వాసాలుగా లోకం అమోదిస్తుంది కాని ఇలాంటి విషయాలు పదిమంది శాస్త్రజ్ఞులూ చెబితే మనం నమ్ముతున్నామేగాని మనం స్వయాన రుజువు చేసుకొనేవి కావు శాస్త్రజ్ఞానం ఎంతో అభివృద్ధి అయిన ఈ కాలంలోనే మనం నూటికి 99 విశ్వాసాలను రుజువు చేసుకోకుండా అమోదిస్తూ వుంటే, అనాగరిక దశలో మానవుడు విశ్వాసాలమీద ఎంతగా ఆధారపడేవాడో ఊహించవచ్చు.

అందుకే, హేతువాదులమనీ, భౌతికవాదులమనీ, గతితార్కికులమనీ చెప్పుకునేవాళ్ళు విశ్వాసాలను వర్గీకరించవలసిందిగా వాటికి గల రుజువులను బట్టికాదు సామాజిక ప్రయోజనాన్ని బట్టి ప్రొఫెసర్ గోర్డన్ చైల్డ్ విధానం ఇదే ఇతను ఇలా అంటాడు రోగాలు క్రిములవల్ల కలుగుతున్నవాదం గాలిచేష్ట - చేతబడివాదం కన్నా ఎందుకు గొప్పది ? హెచ్చుమంది రోగక్రిములను కళ్ళారాచూశారని కాదు దెయ్యాలనూ, భూతాలనూ చూచినవాళ్ళ సంఖ్యే చాలా ఎక్కువ కావచ్చు కాని ప్రజారోగ్యాన్నీ మనిషి ఆయుః ప్రమాణాన్నీ పెంచటానికి క్రిమిసిద్ధాంతం ఎంతో తోడ్పడింది చేతబడి సిద్ధాంతం ఎంతమాత్రమూ తోడ్పడలేదు అసలైన క్రిమిసిద్ధాంతం ఆధిక్యత అదే

మనం హిందూ మతస్థులమనుకుందాం, వేదాలూ, బ్రాహ్మణ్యాలూ, అరణ్యకాలూ, ఉపనిషత్తులూ, ఆఖరుకు నిన్న మొన్న సృష్టి అయిన పురాణాలూ, మతగ్రంధాల క్రింద జమకట్టుతున్నాం. ఇది స్పష్టంగా తప్పు మన వేదాలు హిందూ మత గ్రంధాలయితే అందులో వున్న వరుణుడూ, మిత్రుడూ, ఇంద్రుడూ వేదకాలానికి చాలా పూర్వమే మితాన్నీఆర్యులు ఆరాధించిన దేవతలు, భారతదేశానికి వలస వచ్చిన దేవతలు హిందూమతం ఈ గడ్డకు సంబంధించినది సింధుశబ్దోద్భవం అందుచేత మితాన్నీలు హిందువులేకారు

ఇక పురాణాల మాటకువస్తే వేదకాలపు దేవతలకందరికీ పురాణాలు ఉద్వాసన చెప్పి కొత్త దేవుళ్ళను పైకెత్తాయి వేదాలు మన మతగ్రంధాలయితే పురాణాలు కావు, పురాణాలు మన మతగ్రంథాలయితే వేదాలుకావు యజ్ఞాలు హిందూమాతాచారమైతే భగవద్గీత హిందూమత గ్రంధం కాదు బుద్ధుడు విష్ణువు అవతారం కాదు. ఇలా వెతుక్కుంటూపోతే మతం ఎక్కడ అంతమవుతుందో, మతిలేని తనం ఎక్కడ ఆరంభమవుతుందో చెప్పటం సాధ్యంకాదు

వర్గసమాజం ఏర్పడక పూర్వం మానవుడు ఎంత అర్థంలేని విశ్వాసాలు కలిగివుండినా వాటిని మనం మతంగా నిర్వచించనవసరం లేదని నా అభిప్రాయం ఆ విశ్వాసాలు అజ్ఞానం నుంచి పుట్టినవేగాని, బుద్ధిపూర్వకంగా సాటి మానవులను అజ్ఞానంలో ఉంచటానికి "దోపిడిగాళ్ళు' ' సృష్టించినవికావు.

వర్గసమాజం ఏర్పడిన దగ్గరనుంచీ మతం అనేదానిలోనూ, విశ్వాసం అనేదానిలోనూ మౌలికమైన మార్పులు కలిగాయి మత విశ్వాసాలను అనుభవం ఆధారంతో సంస్కరించే హక్కు అందరికీ లేదు వాటిలో మార్పులు చెయ్యటానికీ, చెయ్యకుండా ఉండటానికీ హక్కుగల వర్గం ఒకటి వేరే అవతరించింది అలాగే విశ్వాసం అనే దాని నిర్వచనం మారింది. విశ్వాసం అంటే నీ బుద్ధి అబద్ధమని చెబుతున్నదాన్ని నువ్వు నిజమని నమ్మటం ! అదే అసలైన విశ్వాసం చచ్చినవాడు బతికున్నప్పుడు జీవించిన విధంగానే ఇంకా జీవిస్తూపోతాడనుకోవటం "విశ్వాసం" కాదు; వాడు వైతరణిదాటటానికి అవుతోక సహాయంగా ఉండగలందులకు బ్రాహ్మడికి గోవును దానం చెయ్యాలన్నది నిజమైన విశ్వాసం ! (మొదటి విశ్వాసంలో సామాజిక దోపిడీ లేదు, రెండో దానిలో ఉన్నది )

మార్క్సిస్టులు మత విశ్వాసాలనూ, తాత్విక భావాలనూ ఆర్థిక పునాదిమీద ఉపరినిర్మాణా

లలో చేర్పుతారు. ఈ నిర్మాణాలలో చేర్చదగిన చట్టాలూ, సామాజిక నియమాలూ వగైరాలకూ మత విశ్వాస ఆచారాలకూ ముఖ్యమైన తేడా ఒకటి ఉన్నది వర్గ సమాజంలో రాజ్యాంగమూ, చట్టాలూ, విద్యావిధానాలూ, శిక్షాస్మృతులూ, న్యాయనియమాలూ మొదలైనవి అమలులో వుండే సామాజిక దోపిడీకి అనుకూలంగా ఉంటాయి వాటికి భౌతికమైన పునాది వుంటుంది. మతాచారాలకూ, మత విశ్వాసాలకూ అలాంటిదేమీ వున్నట్టు కనబడదు మానవ సమాజ పరిణామానికి సంబంధించిన సవాలక్ష దశలలో ప్రజల అజ్ఞానంవల్లనైతేనేం, పీడకవర్గాల అవసరం వల్ల అయితేనేం అమలులోకి వచ్చిన అనేక మత విశ్వాసాలు, వాటి ప్రయోజనం ఎవరికీ లేకపోయినా, మిగిలివుండటం చూస్తున్నాం. ఉదాహరణకు గంగిరెద్దు శివుడికన్న పూర్వం ఆరాధించబడినది. ఇవాళ శివుడూ ఉన్నాడు, (నందివాహనంతో సహా). గంగిరెద్దూ (స్వతంత్రంగా) ఉన్నది త్రిమూర్తులకు ముందు అర్పించబడిన ఆదిశక్తి ఒకప్పుడు శివుడ్ని తన కాళ్ళక్రింద మట్టగించి చూపింది (మహిషాసురుడు = మ్హసోబా = శివుడు) అదే ఆదిశక్తి కాలక్రమాన శివుడికి తల్లి (అంబ, అంబిక, అంబాలిక, శివుడు = త్ర్యంబకుడు) అయింది. ఇంకొంతకాలానికి శివుడు ఆదిశక్తికి మొగుడై కూర్చున్నాడు!

ఆ కాలంలో ప్రజలచేత ఈ అసందర్భాలను నమ్మించటానికి బ్రాహ్మలు చేసిన కల్పనలు సినిమా కథలకన్న కూడా చెత్తగా వుంటాయి ఉదాహరణకు : ఎవడో రాక్షసుణ్ణి చంపటానికి దేవసేనకు నాయకుడు కావలసి వచ్చాడు మధ్యాహ్నం వంటకు ఉదయం నారుమడి వేసిన చందంగా, శివుడుచేత పార్వతికి కడుపుచేయించటానికి దేవతలు మన్మథుణ్ణి బూడిద చేయించారు చాలా తతంగం జరిగింది. చిట్టచివరకు కుమారస్వామి పుట్టాడుగాని - పార్వతికి కాదు ఈనాడు ఎనిమిదో క్లాసు కుర్రాడు కూడా ఇంత చెత్తకథ రాయడు అయితేనేం ? కుమారస్వామి ఘనమైన దేవుడు. అతడి పురాణం గొప్ప మతగ్రంథం !

ఇంతటి అవివేకం రాతియుగం మనుషులు ఎరగరని చిత్తశుద్ధితో నమ్ముతున్నాను

అన్నియుగాల విశ్వాసాలు ఈ దేశంలో ఇంకా అమలుజరుగుతున్నాయంటే వాటికి ఆధారాలుగా వుండే ఆర్థిక సంబంధాలు ఇంకా అమలులో ఉండటమే అయివుంటుందని డాక్టర్ కోసాంబీ అన్నాడు. కానీ బెంగాలులో శక్తిపూజకూ, మహారాష్ట్రలో తిలక్‌గారు పునరుద్ధరించిన వినాయక పూజకూ ఏ భౌతిక - ఆర్థిక ఆధారాలు ఉండగలవో నాకు అంతుబట్టలేదు

అందుచేత ఏ నిర్ణయానికి వచ్చానంటే వర్గసమాజంలో మత విశ్వాసాలుగా చలామణీ అయ్యేవాటికి ఎలాంటి భౌతికమైన సపోర్టూ అవసరంలేదనీ, వాటి ప్రభావం సామాజిక భౌతిక జీవితంమీద మాత్రం చాలా బలంగా ఉంటుందనీ నమ్ముతున్నాను

ఇటువంటి "అసలైన" మూఢవిశ్వాసాలను గురించి ఏమిటి చెయ్యటం ? హేతువాదం ద్వారా వాటిని ప్రతిఘటించటం ఇంచుమించు గోడకేసి తలకొట్టుకోవడమే. హేతువు లేకుండా నమ్మేదే వర్గసమాజంలో మత విశ్వాసం అన్న విషయం మరవకండి. అలాంటి మత విశ్వాసాన్ని హేతువాదం స్పృశించనయినా లేదు అందుచేత సమాజ పరిణామం కోసం కృషిచేసే విప్లవవాదులు మతంగురించి తలపగలగొట్టుకోనవసరం లేదు. ప్రజల జీవితంలోనుంచి దోపిడీని తొలగించటమే మతాన్ని ఎండగట్టటానికి ఒకే ఒక మార్గం. మన విప్లవవాదులూ, మార్క్సిస్టులూ, మూఢవిశ్వాసాలేవి అనేది నిర్ణయించటంలోనూ, వాటికి విరుద్ధంగా ప్రచారం చెయ్యటానికి శ్రమించటంలోనూ ఎక్కువ ప్రయోజనం కనబడదు. జీవితాన్ని మార్చాలి. వ్యక్తుల మనస్సులను ఒక్కొక్క మూఢవిశ్వాసం నుంచీ తొలగించుతూ కూర్చుంటే పుణ్యకాలం వెళ్ళిపోతుంది ప్రజల రక్తాన్ని తాగేస్తున్న వర్గంవాళ్ళకు ఏ మూఢవిశ్వాసంతోనూ పనిలేదన్నది మనం మరిచిపోగూడదు

**- హేతువాద వ్యాసావళి పుస్తకం, కావలి, 1979**

# మాయదారి దేవుడు (ఎ)

## 1. ఆస్తికులూ, నాస్తికులూ

కమ్యూనిస్టుల మీద శ్రోత్రియుల ఆక్షేపణ ఏమిటంటే, వాళ్ళు నాస్తికులు. నాస్తికుడు అనే మాటకు నిర్వచనం రకరకాలుగా ఉండి, ఆ మాట ఉపయోగించేవాణ్ణి బట్టి మారుతుంది దేవుడున్నాడని నమ్మని వాళ్ళంతా నాస్తికులేనని అనేకమంది అభిప్రాయం. కాని ఇది ప్రామాణికమైన నిర్వచనం కాదు, శతకోటి నిర్వచనాలలో అది ఒకటి మాత్రమే.

దేవుడిలో విశ్వాసం ఉన్నప్పటికీ, ముసల్మానులూ, క్రైస్తవులూ హిందువుల దృష్టిలో నాస్తికులే వాళ్ళ దృష్టిలో వీళ్ళూ నాస్తికులే

వేద ప్రమాణాన్ని ఆమోదించనివాళ్ళు ఒకప్పుడు నాస్తికులుగా భావించబడేవాళ్ళు బౌద్ధులూ, జైనులూ రెట్టింపు నాస్తికులు కావాలి, కాని వాళ్ళు సాదా నాస్తికులే ఎందుచేత ? వేదప్రమాణాన్ని ఆమోదించలేదు గనుక ! మీమాంసకులు దేవుడు లేడు పొమ్మన్నప్పటికి వాళ్ళు నాస్తికులు కారు అదెందుచేతా ? వాళ్ళు వేద ప్రమాణాన్ని పూర్తిగా ఆమోదించారు గనుక ! ఈ లెక్క ప్రకారం నాస్తికత్వానికి, ఆస్తికత్వానికీ గీటురాయి వేదాలలో నమ్మకంలాగా కనబడుతుంది.

అయితే ఇది కూడా నిజం కాదు. వేద ప్రమాణాలు ఏనాడో పోయాయి అన్నిటికీ వేదాలే ప్రమాణం అన్న శంకరాచార్యులు గారి తత్వాన్ని 'ప్రచ్ఛన్న బౌద్ధం' అనేశారు. అంటే నాస్తికత్వమే గదా ?

వేదాలతో నిమిత్తం లేకుండా అనేక ధర్మశాస్త్రాలు వచ్చాయి వాటిని ఉల్లంఘించిన వాళ్ళు నాస్తికులు.

పిలకకత్తిరించి క్రాఫ్ పెట్టుకున్న కొడుకును తండ్రి "ఓరి, నాస్తికపు వెధవా !" అనటం జరిగింది జాతీయ మత సంస్కృతుల కంతకూ గుత్తాధికారం సంపాదించిన బ్రాహ్మలు 'నాస్తికుడు' అనే మాటను స్వేచ్ఛానుసారం ఉపయోగించే అధికారాన్ని కూడా పుచ్చుకున్నారు

స్థూలంగా భౌతికవాదులమని చెప్పుకునేవారు నాస్తికులు. సామాజిక పరిస్థితులను మార్చాలన్న వారందరూ నాస్తికులు ఈశ్వరుడిలో విశ్వాసం ఉన్నప్పటికీ, వీరేశలింగం గారు విధవా వివాహాలు చేస్తామనీ, అవినీతిని తూర్పారబట్టుతామనీ అన్నందుకు ఆయనను స్వాములవార్లు నాస్తికుణ్ణి చేసి, చావగొట్టించడానికి ప్రయత్నించారు. (ఆస్తికత్వంలో అవినీతికి కూడా చోటు ఉంటుందా ? అని ఎవరూ ఆశ్చర్యపడనవసరం లేదు. వేదకాలపు జీవితంలో ఆవులను కోసుకు తినటం ఆనవాయితీగా ఉండినట్టు స్వాములవార్ల సంస్కృతిలో వారి రాసక్రీడలకు కూడా చోటు ఉంటుంది. అలా ఉండరాదన్న వాళ్ళు తిరుగుబాటు చేసి 'నాస్తికులు' అని పిలిపించుకుంటారు అందులో విడ్డూరం ఏమీ లేదు )

ఎన్ని మతాలూ, ఆచారాలూ, సంస్కృతులూ నిష్క్రమించినా, నాస్తికత్వం మాత్రం చిరంజీవిగా ఉంటున్నది.

శ్రీ వినోబాభావేగారు ఒకచోట ఆతిధ్యం స్వీకరించటం నా మిత్రులొకరు స్వయంగా చూశారు. ఆయన 'ఫలహారం' కింద 28 రూపాయలు ఖర్చు అయిందిట. అందులో ఒక అయిటం 12 రూపాయల ఆపిల్ పళ్ళరసం ! నా మిత్రులు ఇదంతా చూసి ఆచార్యగారిని "అయ్యా, తమరు ప్రజలకోసం జీవిస్తూ ఆహారం కింద ఇలా ఖర్చుచేస్తున్నారే ! మామూలు ప్రజలు ఒక్క ఆపిల్ పండు కూడా కొనలేరు గదా ! మీలాగా శేర్లకు శేర్లు వాళ్ళు ఎలా తాగగలరు .." అని వినయంగానే అడిగారట.

ఆచార్య భావేగారు ఆయనకేసి కోపంగా చూసి, "తుమ్ నాస్తిక్‌హో !" అన్నారట తాను ఆపిల్ పళ్ళరసం తాగినదీ, పెరుగు పిడతలే లెక్కన తిన్నదీ అబద్ధం కాదు గనక, ఆచార్యజీ నా మిత్రుణ్ణి 'నాస్తిక్' అనటానికి కారణం ఆయన ప్రజలను వెనకేసుకురావటం అయి ఉంటుంది

ప్రజలను వెనకేసుకు వచ్చిన వాళ్ళు నాస్తికులనటానికి సందేహం లేదు కమ్యూనిస్టులూ, విప్లవకారులూ, మామూలు సంస్కరణవాదులూ, పార్లమెంటులో ప్రభుత్వ పక్షానికి ప్రజలను గురించి అడపా దడపా జ్ఞాపకం చేసే వాళ్ళూ ఏదో ఒక శాతంలో నాస్తికులే. అందుకే వారిని దుమ్మెత్తి పొయ్యటం మొదలుకుని, మారణాయుధాలతో దుమ్ముచెయ్యటం దాకా మనం ఈనాడు చూస్తున్నాం

## 2. ఏ దేవుడు ?

"సర్వం సర్వం సహావ్యాపి, సర్వజీవ
జీవనాధారుడగు నొక్క దేవుడెవడో
కలడనగ విందు గాని నిక్కం బెరుంగ !
వాడదృశ్యుండు. మాకేల వానిగోల !"

వేదకాలపు దేవతల సంఖ్య 3339 అని ఋగ్వేదం (3-9-3) లో ఉన్నదట సాయణాచార్యులుగారు ఈ సంఖ్యను 33 కు కుదించారు. మిగిలిన 3306 మందికీ 'కాబినెట్ రాంక్' లేకపోయి ఉండొచ్చు.

ఈ వేదకాలపు దేవతలంతా ఒక జాతివాళ్ళు కారు. వీళ్ళలో కొందరు మనుషులే ! చచ్చి దేవతలుగా రూపొందారు. ఈ మాట సాయణభాష్యంలోనే తరచుగా కనిపిస్తున్నదట మరికొందరు దేవతలు ప్రకృతి శక్తులు - సవితృ (సూర్యుడు) అగ్ని, వాయువూ, ఉషస్సూ వగైరాలు ఇంకా కొన్ని కేవలము వస్తువులు - స్రుక్‌స్రువాలూ, ఆయుధాలు, పాచికలూ లాటివి దక్షిణ దేశంలో నూట్లు వేసుకున్న వాళ్ళు కూడా ప్రతి రాయి దగ్గరా ఆగి చెప్పులు విడిచి, చెంపలు వేసుకుని, చెవులు పట్టుకుని గుంజిళ్ళు తీసినట్టుగా, వేదకాలపు ఆర్యులు ప్రతి వస్తువుకూ దణ్ణాలు పెట్టేవాళ్ళేమో మరి. కాని వాళ్ళ ఘరానా దేవుళ్ళు కూడా మనుషులు చేసే పనులు - యుద్ధాలు చెయ్యటమూ, గోవులను ఎత్తుకు రావటమూ, తాగటమూ, గప్పాలు కొట్టటమూ చేశారు. వేదకాలపు ఉత్కృష్ట దేవుడైన ఇంద్రుడు ఇవన్నీ చేశాడు వరుణుడూ, మిత్రుడూ (విడరాని జంట) ఇవన్నీ చేశారో లేదో గాని, వాళ్ళు నాయకులుగా ఉండిన కాలంలో మామూలు మనుషులను అదరగొట్టేశారు "ఎక్కడ ఏ ఇద్దరు ఏం మాట్లాడుకున్నా వరుణుడికి తెలుస్తుంది" అన్న టెర్రర్ వేదంలో కనబడుతుంది హిట్లరు కూడా ఇంత భయోత్పాతం కలిగించి ఉండడు పైపెచ్చు ఈ వరుణుడు 'అసురుడు'

ఉపనిషత్తులు వచ్చేసరికి ఈ దేవుళ్ళందరూ ఎగిరిపోయి 'బ్రహ్మ' వచ్చాడు వేదకాలపు తొలి ఆర్యులు 'బ్రహ్మ' అంటే కేవలమూ ఆహారమూ, గోసంపదా (రెండూ ఒకటే) అనుకునేవారు. అది నిజం కాదని ఉపనిషత్తులు సూచనగా అన్నాయి బ్రహ్మ అసలైన దేవుడు. వాడు నిరాకారుడు. అవాఙ్మానస గోచరుడు వాణ్ణి తెలుసుకునే మార్గం లేదు తెలుసుకోకపోతే ముక్తిలేదు 'నేనవేదేతి వేదచ!" (ఎవనికి బ్రహ్మము ఎరుంగబడలేడో వానికి అది యొరుంగబడనిది) సంపూర్ణ అజ్ఞానాన్ని చేరుకున్న ఈ సంపూర్ణ జ్ఞానం లేనివాడు చాలా నష్టపోతాడని కేనోపనిషత్తు భయపెట్టుతున్నది.

ఇలాటి దేవుడు ఉన్నాడన్నది ఎంత సత్యమో, లేడన్నదీ అంత సత్యమే ఈ దేవుణ్ణే శంకరాచార్యులవారు పరమాత్మగా పేర్కొని నాస్తికత్వం కన్న కూడా పనికిమాలిన అధి ఆస్తికత్వాన్ని ప్రవచించారు. నాస్తికత్వం కన్నా కూడా యిది పనికి మాలినదని ఎందుకన్నానంటే, నాస్తికులు

భౌతికవాదులు శాస్త్రజ్ఞానం లోనూ, ఇంద్రియజ్ఞానంలోనూ సంపూర్ణ విశ్వాసం గలవారు కాని శంకరాచార్యులుగారు ఈ అంతుచిక్కని పరమాత్మ నిజమనీ, కంటికి కనబడే ప్రపంచమంతా మిథ్య అనీ చెప్పేశారు. లౌకికదృష్టిలో శంకరమతం కన్న పచ్చి నిరీశ్వరవాదం ఉండదు. (ఇప్పుడు మనం నాస్తికత్వం వదిలిపెట్టి ఈశ్వరవాదం, నిరీశ్వరవాదం గురించి చెప్పుకోవచ్చు. నాస్తికత్వానికి మళ్ళీవస్తాం )

"పరమాత్మ అనేది ఉన్నది అదే ఈ జగత్తును సృష్టించి, పోషించి లయం చేస్తుంది. ఈశ్వరుడి ఆజ్ఞలేనిదే ఈగైనా వాలదు. మన ఆత్మలు మోక్షం పొందినప్పుడు ఆ పరమాత్మలోనే లీనమౌతాయి." అని ఎవరన్నా మనని నమ్మమంటే, అవసరమని తోస్తే నమ్ముతాం లేకపోతే మానేసి, ఏ ఇందిరాగాంధీనో, జయప్రకాశ్ నారాయణ్‌నో, మావోసెటుంగ్‌నో నమ్ముతాం. కాని ఒక దశలో కొందరు ప్రబుద్ధులు ఈ పరమాత్మను తర్కంతో నిరూపించటానికి ప్రయత్నించి, బౌద్ధుల చేతా, జైనుల చేతా, మీమాంసకుల చేతా మాడుబొచ్చు రాలగొట్టించుకున్నారు.

ఇటువంటి పొరపాటు ఇస్లాముగాని, క్రైస్తవంగాని చెయ్యలేదు. వాళ్ళు దేవుడితో పాటు సైతానును కూడా సృష్టించి, సృష్టిలో గల వైరుధ్యాలన్నీ ఆ ఇద్దరి మధ్య సంఘర్షణగా చిత్రించారు తన సృష్టిలోని అవకతవకలకూ, కుళ్ళుకూ దేవుడు జవాబుదారు కావలసిన అగత్యం తప్పింది. మన పరమాత్మకు అది తప్పలేదు అందుచేతనేమో కష్టసుఖాలు మిథ్య అనుకుని రెంటికీ అతీతంగా ఉండమని మతబోధకులు చెప్పారు. రెండింటికీ అతీతంగా ఉండదలిస్తే జీవించటం దేనికి ?

పర్యవసానం ఏమిటంటే, ఈ ఉపనిషద్బ్రహ్మ సోదిలోకి రాకుండా వెళ్ళిపోయాడు. అతగాణ్ణి తలచుకునేవాళ్ళులేరు తిరిగి మనదేశంలో వేదకాలపు దేవుళ్ళలాటి దేవుళ్ళనూ, నాస్తికత్వాన్నీ కూడా పునఃప్రతిష్ఠ చేసుకున్నాం అదే గమనించదగిన అసలు విశేషం

## 3. భౌతిక వాదం

దేవుడు అన్న భావం మధ్యలో వచ్చినది తన కనీసావసరాలకు ప్రకృతితో ఘర్షణ పడే మానవుడు దేవుణ్ణి గురించి తత్వచింతనలోకి దిగలేడు. కాని ఆ దశలో మానవుడికి భౌతికవాదాన్ని పెంపొందించుకునే సామర్థ్యం కూడా ఉండదు అందుచేత తన అనుభవంలోకి వచ్చే ప్రకృతి శక్తులన్నీ అద్భుతంగానే ఉంటాయి. మబ్బులూ, మెరుపులూ, పిడుగులూ, దానంతట అదే పుట్టుకొచ్చే కార్చిచ్చూ, వర్షాలూ, వరదలూ, నదులూ, కొండలూ, అరణ్యాలూ, సుడిగాలులూ, మారే ఋతువులూ సమస్తమూ ఆదిమానవుణ్ణి అద్భుతపరుస్తాయి. వీటిని గురించి పరిజ్ఞానం పెరిగిన కొద్దీ ప్రకృతి స్వభావాలు మనిషికి అర్థం కావటంతో బాటు వాటిని తన మనుగడకు ఉపయోగించే సామర్థ్యం లభిస్తుంది ఋతువులకు ఒక క్రమం వున్నది. వాటిని ముందుగా తెలుసుకుంటే వానాకాలం గడపటానికి తగిన నివాసమూ, ఎండాకాలం గడపటానికి తగిన నివాసమూ ఏర్పాటు చేసుకోవచ్చు. ఏ కాలంలో ఏ ఆహారం ఎక్కడ దొరికేదీ తెలుసుకోవచ్చు. ఆదివానవుడికి అధ్యయనం చెయ్యటానికి ప్రకృతి తప్ప వేరేదీ లేదు. అదే వాడి పాఠ్యపుస్తకం. జ్ఞానం సామూహికం గనక పది రకాల అనుభవాలు కలబోసుకుని జ్ఞానపు గుట్టను పెంచుకుని, సమష్టిగా వినియోగించవచ్చు ప్రకృతికి సంబంధించిన జ్ఞానం ఎంత విలువైనదో అంత లోపభూయిష్ఠం అయినప్పటికీ దాన్ని ఎంత ఆదరంతో చూడాలో ఆదివానవుడికి తెలిసినట్టుగా విజ్ఞాన సర్వస్వాలు గల అధునిక మానవుడికి తెలియక పోవచ్చు

ఇలా ప్రకృతి స్వభావాన్ని - వేద పరిభాషలో ఋతాన్ని - ఆరాధిస్తూవస్తున్న మానవుడికి ప్రకృతికి అవతల ఒక సృష్టికర్త ఉండి ఉంటాడని తట్టవలసిన అగత్యం ఏమీ లేదు. ఎందుకంటే

పదార్థం ఎలా రూపాలు మారుతున్నదీ స్పష్టంగా కనబడుతున్నది ఆహారం పుష్టినిస్తున్నది గడ్డిని బాగా తిన్న ఆవులు పాలు బాగా ఇస్తున్నాయి. వానలు తక్కువైనప్పుడు మొక్కలు ఏపుగా పెరగవు నిప్పు చలిని పారదోలుతుంది ఉన్ని వెచ్చదనాన్ని ఇస్తుంది పగలు పోయి రాత్రి వస్తుంది తిరిగి సూర్యుడు మళ్ళీ పొడుస్తాడు. ప్రాణంలేని వాటికి పుట్టటమూ, పెరగటమూ, చావటమూ ఉండదు గాని, ప్రాణులకు ఇవన్నీ ఉంటాయి. రాళ్ళను చెక్కి పరికరాలూ, ఆయుధాలూ చేసుకోవచ్చు ఆయుధం భుజబలాన్ని పెంచుతుంది.

వేటాడటానికి వలలూ, ఉచ్చులు పన్నటానికీ, పళ్ళ దుంపలూ తెచ్చుకోవటానికీ, నిప్పును ఉపయోగించుకోవటానికీ, సూర్యచంద్రుల గమనాలను వీలయినంత బాగా అంచనా కట్టటానికి ఈశ్వరుడి సహాయం ఏమీ అవసరం లేదు అయినా ఆదిమానవుడి జ్ఞానానికి అతీతంగా ఉండిపోయిన ప్రకృతి శక్తులూ, వాడి జీవనానికి అత్యవసరంగా కావలసిన వస్తువులూ వాడికి ఆరాధ్యాలయాయి వాటికి వాటిపట్ల గల భావాల్ని ఆధునికుల పరిభాషలో చెప్పటం సాధ్యం కాదు. అందులో భయమూ, గారాబమూ, ప్రేమలాటి భావాలెన్నో ఇమిడి ఉంటాయి జ్యోతిశ్శాస్త్రంతో బాటు సమస్తశాస్త్రాలకూ పునాది ప్రకృతి అధ్యయనం నుంచే లభ్యమయింది దీనికీ, 'నేనవేదేతి వేదచ' అనే స్థితికీ ఎక్కడా లంగరు అందదు

జాతి పెరుగుదలకుగాను స్త్రీ నిర్వహిస్తున్న పాత్రను అర్థం చేసుకుని, తల్లినే తప్ప తండ్రిని ఎరగని దశలో మానవుని మాతృత్వాన్ని మహామాత రూపంలో భావన చేసినా, ప్రకృతినే ఒక మహాతల్లిగా తలపోసినా ఆశ్చర్యపడనవసరం లేదు. ఆ మహామాతకు ప్రతీకలుగా గ్రామదేవతలు పుట్టుకొచ్చారు. ఈ ఆడదేవతలు నిర్వికారులు కారు ఒక్క అంతులేని శక్తి విషయంలో తప్పిస్తేవాళ్ళూ మనుషులే. వాళ్ళకూ ఆకలి ఉంటుంది. మనుషుల్లాగే జంతువులను తింటారు. వాళ్ళకూ ఆగ్రహానుగ్రహాలు వస్తాయి మనుషులను దండిస్తారు. చంపేస్తారు అంటువ్యాధులలో వైరస్‌వల్ల వచ్చే వ్యాధులన్నిటినీ అమ్మవార్లు అనేవారని డాక్టర్ బాలసుందర్రావు చెప్పేవారు ఆ వ్యాధులతో చచ్చేవార్నందరు "అమ్మవారికి ఆహారం" అనుకుని, ఆ అమ్మవార్లకు జంతుబలులిచ్చి వారి ఆకలి తగ్గించటానికి ప్రయత్నించేవారు 'నాగరిక' బ్రాహ్మణులు వేదకర్మ పేరిట చేయించిన యజ్ఞబలులు ఇంతకన్న చాలా మూఢమైనవి నా నమ్మకం

చక్కగా రూపొందుతున్న భౌతికవాద దృక్పధానికి అడ్డంగా ఆదర్శవాదమూ, నిరూపించటానికి సాధ్యంకాని ఈశ్వరుడూ కేవలమూ సామాజిక దురన్యాయాలకు ఒక పాపాల భైరవుణ్ణి సాకుగా చూపటానికి అవతరించాయి. దేవుడి పుట్టుకే మహా పాపిష్ఠిది !

కాని ఆ దేవుడు నిలిచాడా ? నిలవలేదు చివరకు నాస్తికత్వమే జయించింది

# 4. సార్వత్రిక నాస్తికత్వం

ఏ మానవ సమాజమూ దేవుడి ఆధారంతో ఏర్పడలేదు. చెప్పుకోతగిన ప్రతి సమాజమూ తన నియమాలను తాను ఏర్పరచుకున్నది నియమాలను ఏర్పరచుకొనటంలోగాని వాటిని కాలానుగుణ్యంగా మార్చుకొనటంలో గాని భౌతిక దృక్పధం తప్ప ఆధ్యాత్మిక దృక్పధం ఎన్నడూ ఏ పాత్రా వహించలేదు మనుష్యుల ప్రవర్తన తాలూకూ మంచి చెడ్డలను నిర్ణయించే పనిగాని, ఆ ప్రవర్తనకు తగిన శిక్షా పునస్కారాలను గాని దేవుడికి వదలడం ఎన్నడూ జరగలేదు మనుషులను ప్రకృతి పీడించవచ్చు సాటిమనిషి శిక్షించవచ్చు, దోచుకోవచ్చు కాని దేవుడు ఏ మనిషినిగాని ఉద్ధరించినట్టూ, అణగార్చినట్టూ దృష్టాంతం లేదు

అవాఙ్మానసగోచరమైన పరమాత్మ సిద్ధాంతం మనిషికీ, దేవుడికీ ఒకే ఒక సంబంధం మోక్ష సంబంధం అది సమాజానికి పరమశత్రువు "మాతా నాస్తి, పితా నాస్తి" అని వ్యక్తిని హెచ్చరిస్తుంది దీన్ని సామాజిక మానవుడూ, మానవతా గలవాడూ సహించడు - మానవులు దాన్ని తోసి పారేశారు.

మనుషులు విగ్రహారాధన చెయ్యటం లేదా ? పూజలు చెయ్యటం లేదా ! ముడుపు చెల్లించటం లేదా ? అన్నీ చేస్తూనే వున్నారు కాని పరమాత్మ దృష్టి నుంచి వీళ్ళు నాస్తికులు. ఈ మనుషులు పూజించే దేవుళ్ళు ఆదిమనుషుల దేవతల్లాగే మనిషికి ప్రతీకలు భట్రాజుల్లాగా తమను పొగిడితే, చిల్లరరాజుల్లాగా ఈ దేవుళ్ళు సంతోషిస్తారు ముడుపులు చెల్లిస్తే అవినీతిపరులైన అధికార్లలాగా లాభాలు చేకూర్చుతాయి పిల్లల్నీ, ఉద్యోగాలనూ, రేసుల్లో గెలిచే గుర్రాలనూ, లాటరీ ప్రైజులనూ అందుబాటులోకి తెస్తారు గండాలు తప్పిస్తారు

"న జాయతే మ్రియతేవా" అని భగవద్గీత చెప్పినప్పటికీ ఈనాడు మనదేశంలో పూజించబడే దేవుళ్ళు అనాదిగా ఉండినవాళ్ళు కారు మధ్యలో పుట్టుకొచ్చినవాళ్ళు, కొంతకాలానికి పోయేవాళ్ళు. స్వార్థంతో తప్ప ఎవడూ ఏ దేవుడికీ దణ్ణాలు పెట్టడం లేదు. వేదకాలపు ఆర్యులు లాగే మనం కూడా తాత్కాలిక దేవతలను స్వార్థం కోసం ఆరాధిస్తున్నాం ఇది నాస్తికత్వం అనటానికి సందేహం అనవసరం. అనుమానమల్లా మనం చేసే ఈ పూజలకు సమర్థన ఏమైనా ఉన్నదా అన్నదే !

ఈ అనుమానం కూడా శాస్త్రీయంగా స్టాటిస్టిక్స్‌ల ఆధారంతోనే తేలాలి మన దేవుళ్ళు ఎంతమంది కోరికలను తీర్చుతున్నారు ? తీరే కోరికలకు ఇతర భౌతిక కారణాలున్నాయా ? (డాక్టరు చేత వైద్యం చేయించుకుని రోగం నయం చేసుకుని, డాక్టరుకిచ్చిన దానికి పదింతలు తిరుపతి హుండీలో వేసే కేసులు ఒక ఉదాహరణ.)

## 5. ప్రశ్నల పరంపర

నా సిద్ధాంతం చాలా ప్రశ్నలకు తావిస్తున్నదని నాకు తెలుసు

మనిషి నిజంగానే వస్తుతః నాస్తికుడా ? అయితే ఈ భక్తి ఉప్పెనలు ఏమిటి ? మనం వేదకాలానికి నిజంగా తిరిగి వచ్చామా ? ఇలా అయితే సనాతనులు ఈ విషయం ఎందుకు తెలుసుకోలేకుండా ఉన్నారు ?

వీటికి నేనిచ్చే సమాధానాలు మరికొన్ని ప్రశ్నలను రేపవచ్చు. అయినా సమాధానాలు చెప్పక తప్పదు.

చరిత్రయుగంలోగాని, చరిత్ర పూర్వయుగంలోగాని మనిషి దేవుడున్నాడన్నట్టుగా ప్రవర్తించిన దాఖలాలు లేవు ఇలాంటి మనిషి ఏవేవో ఆడ దేవతలనూ, మగ దేవతలనూ, జంతువులనూ, చెట్లనూ, పుట్టలనూ ఈనాటికీ కూడా పూజించడం ఎలా సంభవిస్తున్నది ?

దీనికి కారణం భౌతికవాద దృక్పథం లేకపోవటం. నాస్తికత్వం తప్పనిసరిగా భౌతికవాదం అయిపోదు భౌతికవాదులలో ఆస్తికులున్నారు. (ఉదాహరణకు . మన ప్రఖ్యాత శాస్త్రవేత్తలు కొందరు) నాస్తికులలో భౌతికవాదులు కానివారూ అనేకమంది ఉన్నారు వీళ్ళంతా [illegible] రప్పలకూ స్వార్థం కోసం దణ్ణాలు పెడుతున్నారు నాస్తికత్వాన్నీ, భౌతికవాదాన్నీ [illegible]వారు మార్క్సిస్టు లెనినిస్టు మావోయిస్టులుగా అవుతున్నారు

మగవాడు ఆడవేషం వేసినట్టుగా, నాస్తికులను కృత్రిమ ఆస్తికులుగా [illegible]లో ఘనమైన పాత్ర వహించినివి మతాలు. మానవ సమాజాలలో వర్గాలూ / [illegible], దోపిడిలాంటివి

ప్రారంభమయ్యాక ఈ దురన్యాయాలను సూటిగా గ్రహించగల భౌతికవాదం మీద ముసుగు కప్పటానికి మతాలు అవతరించాయి. దోపిడీ చేసే వర్గాలనూ, దోపిడీకి గురి అయ్యే వర్గాలనూ కలిసికట్టుగా ఉంచటానికి మతాలు మా బాగా తోడ్పడ్డాయి సామాజిక దోపిడీ ద్వారా మానవ జాతి పురోగమనం సాధ్యమయిందన్నది నిజమైన మేరకు మతాలు మేలు చేశాయి

అయితే సామాజిక పరిణామం ఒక వలయం. తిరిగి మళ్ళీ వేదకాల పరిస్థితి మనుషులు తమ సమకాలికులలోనే తమ దేవుళ్ళను చూసుకుని, వాళ్ళు చేసే 'గానం' సహాయంతో తమ భౌతిక వాంఛలు తీర్చుకోవాలన్న ఆరాటం ప్రకటించే దశ వచ్చేసింది విప్లవం ఈ కాలపు మహాయజ్ఞం యజ్ఞం సమష్టిగా జరుగుతుంది యజ్ఞ ఫలితాన్ని అందరూ సమంగా పంచుకుంటారు ("సమాన భాగం")

వేదకాలం మళ్ళీ వచ్చేసిందని సనాతనులు ఎందుకు తెలుసుకోలేకుండా ఉన్నారు ? వీళ్ళు నిజమైన సనాతనులు కారు వీరిలో నూటికి తొంభైమంది బుర్రలు క్రీస్తుశకంలోనే ఉన్నాయి. కొందరి బుర్రలు పందొమ్మిదో శతాబ్దంలోకి కూడా గట్టిగా తొంగి చూడలేకుండా ఉన్నాయి. రాంభజన చేసేవాళ్ళు రామాయణం చదవాల్సిన పని లేనట్టే, సనాతుణ్ణని చెప్పుకునేవాడు వేదకాలం గురించి తెలుసుకోనవసరం లేదు. చారిత్రక దృష్టీ, భౌతిక దృష్టీ, నాస్తికత్వంమంటే భయమూ ఉంటే చాలు సనాతనిష్ఠ కావటానికి. ఇటాంటి మూఢ విశ్వాసానికి - ఇంకా ఇలాంటి అనేక మూఢ విశ్వాసాలకు - సామాజిక దోపిడీ ఆశ్రయమిస్తుంది

ఈ సనాతనిజమును ధ్వంసం చేసినట్టయితే నాస్తికత్వానికి భౌతికవాదం తోడై భూలోకస్వర్గం ఏర్పడే అవకాశం ఉంటుంది.

**(ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 20-6-1975)**

# మాయదారి దేవుడు (బి)

## 1. ఆస్తికులూ, నాస్తికులూ

కనిపించే ఈ చరాచర ప్రపంచాన్ని ఎవరు సృష్టించారు ? ఎవరు నడిపిస్తున్నారు ? ఎవరు లయ చేస్తున్నారు ? ఈ ప్రశ్నలకు సమాధానంగా ఒక సృష్టిస్థితి లయకారుణ్ణి మన పూర్వులు సృష్టించారు

కాని ఇది సూటిగా పుట్టుకొచ్చిన సిద్ధాంతం కాదు దీనికి ముందు ఇంకా అనేక ఊహలున్నాయి పంచ భూతాత్మకమైనది జగత్తు, పంచభూతాలు శాశ్వతమైనవి వాటి సంయోగం వల్ల వస్తుజాలం ఏర్పడింది అన్నది ఒక సిద్ధాంతం పంచభూతాలు పరమాణువులతో కూడుకున్నవి. పరమాణువులు వాటి కలయికల్లో మాత్రమే మార్పు - అవి మారవు

ఈ లెక్కన సృష్టి లేదు, లయమూ లేదు సృష్టి అంటే ఒక నూతన పరమాణు సంయోగం. లయమంటే వాటి వియోగం సృష్టి స్థితి లయలు పాక్షికంగా అనుక్షణమూ జరుగుతూనే ఉంటాయి మరి దేవుడెందుకు ?

పంచభూతాలు జ్ఞానవిరహితమైనవి కాని మనం చూస్తున్న సృష్టి వెనుక ఒక 'బుర్ర' ఉన్నట్టు కనిపిస్తుంది ప్రపంచంలో ఏదీ యాదృచ్ఛికంగా జరగటం లేదు క్రమం ప్రకారమూ, నియమం ప్రకారమూ జరుగుతున్నది అందుచేత "జ్ఞాన స్వరూపుడైన" దేవుడొకడు ఉండి ప్రపంచాన్ని నడుపుతూ ఉండాలి "బుద్ధిలేని" బంకమట్టితో కుమ్మరి కుండలు చేస్తాడు వాడి బుద్ధి కుండను సృష్టిస్తున్నది అట్లాగే ఇళ్ళు కట్టేవాడి బుద్ధి ఇళ్ళ సృష్టికి కారణమవుతుంది

ఈ వాదంలో ఒక లోపం ఉన్నది ఇలా బుద్ధితో 'సృష్టి' చేసేవాళ్ళు ఒక ప్రయోజనంతో సృష్టి చేస్తారు దేవుడు ఏ ప్రయోజనంతో జగత్తును సృష్టించాడన్న ప్రశ్న వస్తుంది "నిర్వికారుడూ, నిరంజనుడూ" అయినవాడు ప్రయోజనాలు కలవాడుగా ఉంటాడా ? దేవుడికి ప్రయోజనాల నంటగట్టటం తెలివైన పనికాదు.

ఇది ఇలా ఉండగా, మన కళ్ళ ఎదుట ఇంకో రకం సృష్టి జరుగుతున్నది విత్తులు మొలకెత్తి చెట్లు పుడుతున్నాయి పగడపు పురుగులు సముద్ర మధ్యంలో తమ "బుద్ధి" ఉపయోగించకుండానే ద్వీపాలను లేపుతున్నాయి. 'బుద్ధి' లేని అగ్ని పర్వతాలు ఏ ప్రయోజనమూ పాటించకుండా పేలి, అంతులేని లయం కలిగిస్తున్నాయి. కొత్త పర్వతాలను సృష్టిస్తున్నాయి పాత వాటిని పెంచుతున్నాయి

మనకు ఈనాడు ఉన్నంత శాస్త్ర పరిజ్ఞానం లేకపోయినా బుద్ధిమంతులైన మన పూర్వులు కొందరు 'స్వభావవాదం' ప్రతిపాదించారు దాన్ని మనం ఏ క్షణాన అయినా రుజువు చెయ్యవచ్చు. సృష్టి పరిణామమూ, లయమూ ప్రకృతి స్వభావాన్ని బట్టి జరుగుతాయి. మర్రి విత్తు నుంచి మర్రిచెట్టు పుడుతుంది అది దాని స్వభావం మామిడి చెట్టు నిమ్మకాయలు కాయదు, అలా కాయటం దాని స్వభావం కాదు. (తలచుకుంటే మనిషే ఆ స్వభావాన్ని మార్చి మామిడి చెట్టున నిమ్మకాయలు కాయించవచ్చునేమో ! కాని భగవంతుడు ప్రకృతి స్వభావాన్ని ప్రతిఘటించ గలడనటానికి నిదర్శనం లేదు )

ప్రకృతి నియమాలను అర్థం చేసుకోవటమే జ్ఞానమనీ, వాటిని మానవ ప్రయోజనాలకు అనుకూలంగా మార్చుకోవటమూ, వినియోగించుకోవటమూ ప్రగతి అని మానవ చరిత్ర రుజువు చేస్తున్నది "అలా కాదు, ఈ కనబడేదంతా మిథ్య, ఈశ్వరుడే సత్యం అనుకోవటమే అసలైన

జ్ఞానం" అని ప్రతిపాదించే దుస్థితికి మచ్చారు ఈశ్వరవాదులు ఏమైనా ఈశ్వరవాదులు మానవ జీవిత పురోగమనానికి ఏ విధంగానూ తోడ్పడలేదన్నది స్పష్టం

దేవుడి 'బుర్ర'లో ఈనాడు మనకున్న విజ్ఞానంతో, ఏ మాత్రమూ నమ్మకం ఉంచలేమన్నది వేరే చెప్పనవసరం లేదు ఎందుకంటే మనం ఉంటున్న ఈ భూమి సృష్టి అయినప్పుడు దానిమీద ఏ ప్రాణీ లేదు ఈ విషయం త్రవ్వకాలలో తేలిపోతున్నది తొలి ప్రాణులు బుద్ధిగలవి కావు వాటికి అవయవ సంపద కూడా లేదు పరిణామంలో అంతకంతకూ మేధ పెరుగుతూ ప్రాణులు అవతరించాయి. 'సర్వజ్ఞుడైన' దేవుడు రెండు శాతం జ్ఞానం గల మనిషిని ఏకంగా సృష్టించక, ఒక్క శాతం బుర్రగల కోతుల నుంచి ఎందుకు సృష్టించాడో ఊహించటం సాధ్యం కాదు అనేక ప్రాణ జాతులను - రాక్షసి బల్లుల, జడల ఏనుగులు, గండభేరుండ పక్షులు లాంటి వాటిని సృష్టించి ఎందుకు దక్కనిచ్చాడుకాడో ఊహించడం మరీ కష్టం సృష్టిలో అవకతవకలు ఏవీ లేవని భ్రమగల అజ్ఞానులే ఈ జగత్తును దేవుడు సృష్టించాడని చెప్పగలరు.

స్వభావవాదం సృష్టిలో ప్రతిదాన్నీ విశ్లేషించడానికి ప్రయత్నం చెయ్యగలదు ఈశ్వరవాదం ఆ పని చెయ్యలేదు.

ఇంకో సిద్ధాంతం ఉన్నది. ఆరంభంలో నీరు తప్ప ఏమీ లేదట ఆ నీటి మీద ఒక రావి ఆకు మీద (రావిచెట్టు యింకా పుట్టలేదు) నారాయణుడు (నీటిలో ఉండేవాడు) కాలి బొటనవేలు చీకుతూ పడుకున్నాట్ట ఆ నారాయణుడి బొడ్డులో నుంచి ఒక తామరపువ్వు పుట్టిందట. అందులో నుంచి చతుర్ముఖుడు (ఒక్కోప్పుడు పంచముఖుడు) అయిన బ్రహ్మ పుట్టుకొచ్చాట్ట. ఆ బ్రహ్మ చరాచర జగత్తును - అమ్మయ్య - సృష్టించాట్ట ! కాని అప్పటికే సృష్టి చాలా జరిగింది నీరూ, రావి ఆకూ, బొటనవేలు చీకే నారాయణుడూ, వాడి బొడ్డునుంచి ఒక కమలమూ, అందులో బ్రహ్మ సృష్టి అయారు ఈ సృష్టికి కర్త ఎవరు ? ఇదంతా యాదృచ్ఛికంగా జరిగిందా ?

ఈ కట్టు కథను విశ్వసనీయంగా చెయ్యటానికి మరో మూలవిరాట్టును - ఒక పరబ్రహ్మాన్ని, లేదా ఒక మహావిష్ణువును - సృష్టించవలసి వచ్చిందేమో ! కాని ఈ ఆదిదేవుడు సృష్టిస్థితి లయకారుడని రుజువు కాదు. ఈ సంగతి ముందే తెలుసుకున్నాం.

## 2. ధర్మప్రవర్తకుడు

మనిషి మిగిలిన జంతువుల్లాటివాడు కాడు. వీడి జీవితాన్ని శాసించటానికి ధర్మ ఒకటి అవసరం. ఇతర ప్రాణులు తమ స్వభావానికి అనుగుణంగా జీవించటానికి ప్రయత్నిస్తాయి. మనిషి స్వభావానికీ, వాడి ప్రవర్తనకు మధ్య కొన్ని అడ్డుగోడలు ఏర్పడ్డాయి జంతువులాగా జీవించినంత కాలమూ మనిషిని ధర్మం అన్నది బాధించలేదు. సమష్టి జీవనం ఆరంభ దశలో కూడా మానవులు తమ సమష్టి ధర్మాలను సులువుగానే తెలుసుకున్నారు వాటిని పాటించటంచేత వాళ్ళకు శ్రేయస్సు కలిగింది కాని వర్గసమాజం వచ్చేసరికి మనిషి శ్రేయస్సుకూ, పాటించవలసిన ధర్మానికీ మధ్య గండి ఏర్పడింది. ఒక వర్గం చెయ్యీ, కాలూ కదిలించకుండా సుఖసౌఖ్యాలలో మునిగి తేలటం కోసం అసంఖ్యాకుల దుర్భర జీవితం గడపటం ఒక ధర్మమయ్యింది

ధర్మాలు హేతువాదాన్ని అధిగమించి విశ్వాసాల రూపంలో చలామణీ అయాయి. తాము పుట్టుకతోనే అంటరాని వాళ్ళమని కొందరు నమ్మాలి తాము బ్రాహ్మల కన్నా తక్కువ పుట్టుక పుట్టామని మిగిలిన వర్ణాలవాళ్ళు నమ్మాలి ఇది ధర్మం దానికి రుజువూ, సాక్ష్యమూ లేదు.

సాక్ష్యం లేదనటానిక్కూడా లేదు ధర్మాలలాగే ఆ సాక్ష్యం కూడా మనిషి సృష్టించినదే ఒక ఆరోగ్యవంతుడికి వారం రోజులు తిండి పెట్టకుండా మాడ్చి, "బక్క వెధవ" అని

నిరూపించవచ్చు ఒక వర్గానికి చదువుకునే హక్కూ, ఆస్తి సంపాదించుకునే హక్కూ లేకుండా చేసి, "శుంఠలు ! దరిద్రులు" అనవచ్చు వెనకటికి ఒక కథలో రాజు కూతుర్ని దొంగలు పట్టుకుని బానిసగా అమ్మేసి, "బానిస ముండ"ని చేసేసారు కళ్ళకు ప్రత్యక్షంగా కనిపించే ఈ సాక్ష్యం ధర్మమా ధర్మం అంటూ ఏర్పడ్డదే. అధర్మం మనిషి సృష్టి. కాని అది దేవుడి సృష్టి అని ధర్మపీడితుల చేత నమ్మించడానికి ధర్మ ప్రతిష్ఠను కూడా దేవుడికే అంటగట్టారు (అధర్మం నాలుగు పాదాల నడుస్తుంటే దేవుడికి వళ్ళంతా మంటలు పుట్టేట్టు).

"ధర్మం నశించి, అధర్మం ప్రబలినప్పుడల్లా నన్ను నేను మానవ రూపంలో సృష్టించుకుంటూ ఉంటాను" అని ఒక అవతార పురుషుడిచేత గట్టిగా చెప్పించారు ఈ మాటతో మనకు రెండు పేచీలున్నాయి ఒకటి నిరాకారుడుగా ఉండి జగత్తునంతా సృష్టించగలవాడు అధర్మాన్ని అణగదొక్కటానికి మామూలు మనిషి జన్మ ఎత్తటం దేనికి ? రెండు అప్పుడప్పుడూ ప్రపంచంలో పెచ్చుపెరిగే అధర్మానికి బాధ్యులు ఎవరు ? ఈ ప్రశ్నలకు సమాధానం ఉన్నట్టు కనబడదు

ధర్మం అన్నది మానవుడితోనే ఏర్పడిందనీ, అది కూడా ఒక దశలో మాత్రమే వచ్చిందనీ, ఆ వచ్చిన ధర్మం కాలానుగుణంగా మారుతుందనీ స్పష్టమైనాక ఈ ధర్మంతో దేవుణ్ణి ముడిపెట్టటం సాధ్యం కాదు. ఇది సాధ్యం కావటానికి దేవుణ్ణి కాలస్వరూపుణ్ణి చేశారు (అహంకారోస్మి")

ఇందులో కూడా పేచీ ఉన్నది కాలానుగుణంగా ధర్మం మారితే కాలం కూడా మారుతున్నదన్న మాటేగదా ! దేవుడు మారుతున్నాడని ఒప్పుకోవాలి అధర్మాన్ని ముందు ప్రచలింపజేసి, తరువాత దాన్ని హతమార్చే శక్తి దేవుడికి ఉన్నదని ఒప్పుకోవాలి. ఏదో రాక్షసుడు తమని నానాబాధలూ పెడుతున్నాడని దేవతలు మొరపెట్టుకుంటే శేషతల్పం మీద పవళించిన శ్రీమన్నారాయణమూర్తివారు "వాడికింకా కాలం తీరలేదు అది తీరగానే నేను వాణ్ణి సంహరిస్తాను' ' అని సెలవిచ్చి, కాలం అన్నది తనకు అతీతమని ఒప్పుకున్నారు కాలమే రాక్షసులను కడముట్టిస్తే మధ్యలో శ్రీమన్నారాయణమూర్తివారు దేనికో స్పష్టం కావటం లేదు దేవుడి ప్రమేయం లేకుండా కాలం నక్షత్రాలను పేల్చిపారెయ్యటం మొదలుకుని క్రిమికీటకాలను ధ్వంసం చెయ్యటం దాకా సమస్తమూ తానే చూసుకుంటున్నది గద !

భగవంతుడే మనిషిని సృష్టించి ఉంటే వాణ్ణి నిర్దుష్టంగా సృష్టించక అధర్మ మార్గాన వెళ్ళేటట్టుగా సృష్టించటం దేనికి అన్న ప్రశ్న కలుగుతుంది. దానికి సమాధానం లేదు.

## 3. కర్మ సిద్ధాంతం

అందుకని జీవితం తాలూకు మంచి చెడ్డలను దేవుడి నుంచి విడదీసి కర్మ సిద్ధాంతం ప్రతిపాదించారు.

నిజానికి కర్మ సిద్ధాంతంలో వస్తుతః ఆక్షేపణీయమైనది ఏమీ లేదు ! చేసే పనిని బట్టి ఫలితం ఉంటుంది. చేసుకున్న వారికి చేసుకున్నంత. మంచినీళ్లు తాగితే దాహం తీరుతుంది శ్రమచేస్తే అలుపువస్తుంది ఆరోగ్యసూత్రాలు పాటిస్తే రోగాలు రావు కర్మ సిద్ధాంతం మీద మనం పూర్తిగా ఆధారపడి అడుగడుగునా నడుచుకుంటున్నాం మనం చేసే కర్మకు మనం కోరే ఫలితం ఉండగలందులకు సాధ్యమైనంత విజ్ఞానాన్ని సంపాదించి, జీవితానికి వినియోగిస్తున్నాం.

అయితే మనవాళ్ళు చెప్పిన కర్మ సిద్ధాంతం ఇంత సుగమమైనది కాదు అరగని వస్తువులు తింటే కడుపు ఉబ్బరించటమూ, ఏదో మందు వేసుకుంటే అది ఉపశమించటమూ -

ఇంతతేలికైనది కాదు జీవితం. సామాజిక జీవితంలో కష్టసుఖాలు సామూహికంగా ఉంటాయి పారంపర్యంగా కూడా వస్తాయి. కొందరు కలవారి ఇళ్ళల్లో పుడతారు కొందరు కడజాతి వాళ్ళకు పుడతారు. కొందరికి తల్లిదండ్రుల రోగాలు సంక్రమిస్తాయి ఒక కొంప తగలబడితే చుట్టుప్రక్కల పది కొంపలు తగలబడతాయి అమెరికా వాళ్ళు చేసిన కర్మకు జపానులో రెండు నగరాలు ధ్వంసమై, కొన్ని లక్షల మంది చచ్చారు. ప్రపంచం ఏకమవుతున్న కొద్దీ ఏ దేశంలోనో జరిగే కర్మ ఫలితం మరో దేశంలో కనబడుతున్నది రష్యాలో సోషలిస్టు వ్యవస్థ ఏర్పడిన ఫలితంగా ఇంకా అనేక దేశాలలో అదే వ్యవస్థ ఏర్పడింది అమెరికా గూడాచారి సంస్థ చేసే కర్మ ఫలితంగా ప్రపంచంలో ఏ మూల పంచమహాపాతకుడి పరిపాలన అయినా నాలుగు కాలాలపాటు నిలబడటమూ, సోషలిస్టు దేశాల సహకారంతో అలాటి పరిపాలనల నిర్మూలం కావటమూ జరుగుతున్నది ఈ పరిస్థితిలో నిప్పు తొక్కితే కాలుతుందన్న సూత్రం మీద కర్మ సిద్ధాంతాన్ని ప్రతిపాదించటం సాధ్యం కాదు

అందుచేత ఏం చేశారంటే పూర్వజన్మలూ, అపరజన్మలూ, అందులో చేసిన కర్మలు, జన్మాంతరాలలో ఫలితాలివ్వటమూ ప్రతిపాదించారు (అదేం ప్రారబ్ధమో, మనపూర్వులు చేసిన ఏ ప్రతిపాదనకూ రుజువు సాధ్యం కాదు) నువ్వు హీనకులంలో ఎందుకు పుట్టావూ ? కిందటి జన్మలో పాపం చేసుకున్నావు గనుక ! వాడు భాగ్యవంతుల ఇంట్లో ఎందుకు పుట్టాడూ ? కిందటి జన్మలో పుణ్యం చేసుకున్నాడు గనుక ! అసలు కులాలు ఎందుకు వచ్చాయి ? ధనిక దరిద్ర తేడాలు ఎందుకు వచ్చాయని అడగొద్దు చెప్పేవాళ్ళుండరు ఇవి మొదటినుంచీ ఉన్నవి కావు ఇప్పటికీ వీటిని ఎరగనివాళ్ళు ప్రపంచంలో ఉన్నారు వాళ్ళు ఆటవికులు వాళ్ళు చాలా పుణ్యాత్ములై ఉండాలి వాళ్ళలాగా బతుకుదామా ! ఇంకా నయం ! పోనీ సోషలిస్టు దేశాలలో దారిద్ర్యం మన కళ్ళ ఎదుట ఎలా తొలగింది ? మనం కూడా అలాంటి సమాజం ఏర్పాటు చేసుకుందామా ? అదీ కుదిరేది కాదు ! విప్లవాలు రానీ ! దరిద్రులను జయించనీ, అప్పుడు చూద్దాం దారిద్ర్యమనే పాపం తొలగటానిక్కూడా రక్తపాతం జరిగి తీరాల్సిందే ! అలా అని మన కర్మ సిద్ధాంతులు చెప్పక చెబుతున్నారు

కష్టసుఖాల వెంట పుణ్యపాపాలూ, స్వర్గనరకాలూ విధిగా సృష్టించవలసి వచ్చింది ఏది పుణ్యం ? ధర్మం ఆచరించడం పుణ్యం దొంగతనం చెయ్యకు ! దానధర్మాలు చెయ్యి ! సొంత ఆస్తిలేని దశ ఉండేది ప్రత్యేకించి దరిద్రులంటూ లేని దశా వుండేది అందుచేత సొంత ఆస్తులూ, దారిద్ర్యమూ తెచ్చి పెట్టిన శక్తులే ఈ ధర్మాల్ని సృష్టించి ఉండాలి రష్యా, చైనా వగైరా దేశాలలో దాన ధర్మాలు చేసి పుణ్యం సంపాదించుకునే అవకాశం బొత్తిగా లేదు పాపాలు చేసినవాళ్ళు ఆదేశాలలో గర్భదరిద్రులుగా పుట్టే అవకాశమూ లేదు

ఒకప్పుడు - కృతయుగంలో - అందరూ పుణ్యాత్ములేనట ఎవరూ పాపాలు చెయ్యలేదు. మరి ఆ యుగం మారేసరికి ధర్మం నాలుగు కాళ్ళలో ఒకటి ఎలా విరిగింది ? చెప్పటం సాధ్యం కాదు

అన్ని జన్మలలోకి నరజన్మ ఉత్తమమనీ, ఎంతో పుణ్యం చేసుకుంటేగాని ఆ జన్మ రాదనీ అన్నారు మరి జనసంఖ్య పెరుగుతున్నదే. పుణ్యం చేసుకున్న వాళ్ళ సంఖ్య పాపంలాగా పెరిగిపోతున్నదా ? ఒకప్పుడు భూమిపైన మానవజాతే లేదు ఏ మృగాలు పుణ్యం చేసుకుని మానవజన్మ ఎత్తాయి ? చెప్పటం సాధ్యం కాదు

అన్ని ప్రాణులకన్నా మానవుడు అత్యధిక పరిణతి పొందిన జీవి అన్న విషయం హేతువాదం కూడా ఒప్పుకుంటుంది ఈ పరిణామం మానవుడి మెదడులో కలిగిన అభివృద్ధి ద్వారా సాధ్యమయిందని శాస్త్రజ్ఞానం చెబుతున్నది (ఇంద్రియ జ్ఞానంలో మానవుణ్ని మించిన

ప్రాణులు అనేకం ఉన్నాయి) కేవలమూ బుద్ధి వికాసంతోనే మానవుడు ప్రయత్నపూర్వకంగా ప్రకృతిని తన అవసరాలకు తగినట్టు మార్చుకున్నాడు ఈ మేధావిత్వాన్నీ, హేతువాదాన్ని ఎంతో లోతుగా పాతేసి, అసంగతమైన అవకతవక సిద్ధాంతాలు - ఒకదానికొకటి చెందకుండానూ, పొందకుండానూ లేవనెత్తి, వాటిమీద దేవుణ్ణి ప్రతిష్ఠించారు. ఎందుకు ? ఏమిటి ? ఎలా ? అని అడగకుండా నమ్ము - అప్పుడు దేవుడున్నాడు ప్రశ్నలు వెయ్యటం మొదలు పెట్టావో అరణ్య రోదనమే ! ఒక్క ప్రశ్నకూ సమాధానం రాదు

గత్యంతరంలేని పరిస్థితిలో దేన్నయినా నమ్మవచ్చు అది కొంతవరకు సమర్థనీయమే. ఎంతకాలానికీ పిల్లలు పుట్టకపోతే ఏ రాయికైనా మొక్కటం సహజం కాని అవతల అన్ని ప్రశ్నలకూ సమాధానాలియ్యగల విజ్ఞానమూ, ప్రకృతి స్వభావవాదమూ ఉండగా, దాన్ని కొట్టిపారేసి దేవుణ్ని తెచ్చి పెట్టటం ఎలా ఉంటుందంటే, పది మంది పిల్లలున్న వాళ్ళు సంతానం కోసం అష్టకష్టాలుపడి తీర్థయాత్రలు చేసినట్టుంటుంది

మన హేతువాదానికీ, జ్ఞానానికీ అందని విషయాలను కొంతకాలంపాటు నమ్మకం రూపంలో స్వీకరించి, మన నమ్మకాలు రుజువైనప్పుడు రూఢిజ్ఞానం చేసుకోవచ్చు; రుజువు కానప్పుడు తోసిపుచ్చవచ్చు విజ్ఞానంలో కూడా ఇలాటి తాత్కాలిక విశ్వాసాలకు తావున్నది దేవుడిలో నమ్మకం ఇలాటిది కాదు. అది ఎప్పటికీ రుజువయే అవకాశం లేకుండానే దేవుణ్ణి నిర్వచించేశారు.

ఇలాంటి అర్థంలేని పనులు అకారణంగా జరగవు దీని వెనక వంచనా, దోపిడీ వర్గ స్వార్థమూ, అమానుషమైన జీవిత దృక్పథమూ ఉన్నాయి దేవుడు మానవ సమాజంలోని దుష్టమృగాల జెండా !

**ఆంధ్రజ్యోతి వారపత్రిక, 4-7-1975**

# మాయదారి దేవుడు (సి)

## 1. వ్యక్తుల ఆత్మహత్యలు

ఈనాడు మనవాళ్ళు దేవుళ్ళుగా పూజించి, ఆరాధించి, వేడుకుని, వరాలు పుచ్చుకునే దేవుళ్ళు దేవుడి అవతారాలుగా భావించబడిన మనుషులు (రాముడూ, కృష్ణుడూ, వెంకటేశ్వరుడూ, సాయిబాబాల తండా వగైరా) లేదా ప్రకృతి రూపాలు (నాగదేవతా, రావిచెట్టూ, మరిడెమ్మా, మారెమ్మా వగైరా). ఈ దేవుళ్ళను పూజించే వాళ్ళను మనం నాస్తికుల కిందనే జమకట్టవచ్చు ఎందుకంటే ఈ దేవుళ్ళు చేసే పనులు మనుషులు చెయ్యగలవే (ఉద్యోగాలు ఇప్పించటమూ, రోగాలు నయం చెయ్యటమూ, రేసుల్లో గుర్రాలను గెలిపించటమూ, సినిమా చిత్రాలను విజయవంతం చెయ్యటమూ, లంచాలు పుచ్చుకుని వసూలు చేసి పెట్టటమూ, భట్రాజు పొగడ్తలకు పొంగిపోవటమూ వగైరా )

మన పురాణాలలో తపస్సు చేసి ఏ బ్రహ్మదేవుణ్ణో మెప్పించి, ఏ మనిషి ఇయ్యలేని వరాలు సాధించిన వాళ్ళలో చాలా మంది పరమనాస్తికులు ఉదాహరణకు హిరణ్యకశిపుడు తాను నాస్తికుణ్ణని ఢంకా బజాయించి చెబితే, ఈనాటి మన తిరపతి గుండులకు తామూ నాస్తికులమన్న విషయం కూడా తెలియదు.

అందుచేత మనం "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" గురించి మాత్రమే మాటాడుకోవాలి ఈ బ్రహ్మ పరమాత్మ ప్రాణులలో ఉండే ఆత్మలు ఆ పరమాత్మ అంశగలవి, వెయ్యి కుండల నీళ్ళలో విడివిడిగా కనిపించే సూర్యుడి ప్రతిబింబాల లాంటివి అనుకోవచ్చు లేదా పరమాత్మ శకలాలు అనుకోవచ్చు

ఇంతకుముందే నేను మనవి చేసినట్లు ఈ పరమాత్మ సామాజిక దేవుడు కాడు స్ట్రిక్టుగా వ్యక్తికి సంబంధించినవాడు. చతుర్విధ పురుషార్థాలలో ఒక్క మోక్షంతోనే ప్రమేయం గలవాడు. ధర్మార్థ కామాలు కూడా వాడికి అంటగట్టడానికి మనం కావాలంటే పిల్లి మొగ్గలు వెయ్యొచ్చు. కాని నడుం విరగ్గొట్టుకుంటాం ఆ పని మనం చెయ్యవద్దు.

ఈ మోక్షం అన్నది కోటికోట్ల కోట్లమందిలో ఒకడికిగాని సిద్ధించదని భగవద్గీతలో చెప్పి ఉన్నట్లు జ్ఞాపకం. అందుచేత మోక్షం వ్యక్తి ప్రమేయం గలది అయినా ఎన్ని వేల ఏళ్ళకో ఒకడికి మాత్రమే దక్కేది అలాంటి పరిస్థితిలో నిజమైన ఆస్తికులు ప్రపంచంలో లేరంటే మనం ఆశ్చర్యపడరాదు

అయితే చిత్రమేమిటంటే, ఇదే మోక్షంలో ప్రతి నాస్తికుడికి విశ్వాసం ఉన్నది మోక్షం అంటే అస్తిత్వం పూర్తిగా పోయినస్థితే గద నేను ఉండను, నా వ్యక్తిత్వం ఉండదు, చచ్చినాక అందరికీ అదే జరుగుతుందని నాస్తికుల వాదం పంచభూతాలు పంచభూతాలలో చేరిపోతాయి ఏమీ మిగలదు పరిపూర్ణమైన మోక్షం. ఏ పిల్లిమొగ్గలూ వెయ్యనవసరం లేదు బ్రహ్మజ్ఞానంతో బుర్రపాడుచేసుకోనవసరం లేదు (మోక్షమంటే ఉండటమూ కాదు, బొత్తిగా పోవటమూ కాదు. మూడో స్థితి అని కొందరు బౌద్ధులు వాదించారనుకోండి. ఆ స్థితి మనలాంటి పామరులకు అర్థం కాదు )

## 2. వ్యక్తిత్వం అంటే ఏమిటి ?

ఆస్తికుల తరఫున వాళ్ళు ఎన్నడూ లేవనెత్తని వాదం ఒకటి నేను లేవనెత్తుతున్నాను వాళ్ళు నన్ను థాంక్ చెయ్యనక్కర్లేదు ! అందులో ఉండే లోపాన్ని కూడా నేను బయటపెడతాను

ఒక మనిషి శరీరంలో కోట్లాది జీవకణాలున్నాయి వాటి బతుకువాటికున్నది అవి పుట్టుతున్నాయి, పెరుగుతున్నాయి, పనిచేస్తున్నాయి, రోగగ్రస్తమవుతున్నాయి ఒక్కొక్కసారి ఆరోగ్యం పొందుతున్నాయి జీవిత సంఘర్షణలన్నీ అనుభవిస్తున్నాయి. చివరకు చస్తున్నాయి ఇవి తాము జీవించే ప్రపంచం అసలు స్వరూపం ఏమిటో తెలుసుకునే అవకాశం ఉన్నదా ? కొన్ని జీవకణాలు తమ జీవితపోరాటంలో ఓటమి పొందుతున్నప్పుడు ఏదో సూదిమందు వాటికి విజయం సాధించి పెడుతుంది ఆ సహాయం వాటికి దైవికంగా లభించినదే గదా ?

ఇంకా, రక్తంలో ఉండే జీవకణాన్ని తీసుకోండి అది తిరిగి మళ్ళీ పాతచోటికే వస్తుంది అప్పుడు అది ఏమనుకుంటుంది ? "space is limited but unbounded" అనుకుంటుంది

మనకూ, మనలో ఉండే జీవకణాలకూ గల తారతమ్యం కన్న మనకూ పరమాత్మకూ ఉండేది తక్కువైనది కాదు గదా ! జీవకణాలకు మనం ఉన్నట్టే మనకు ఒక దేవుడున్నాడనుకుంటే తప్పేం ? ఏమీ లేదే !

అయితే ఈ ఉపమానం మన ఆస్తికులకు చాలా చిక్కులు తెచ్చిపెడుతుంది ఎందుకంటే మనకు జీవకణాలను గురించి పరిజ్ఞానం ఏర్పడినాక మన వ్యక్తిత్వం సందేహంలో పడింది "ఏంతింటావో అదే నువ్వు" అని వైద్యులు చెబుతారు ఎలా ఆలోచిస్తావో అదే నువ్వు అని మనస్తత్వవేత్తలు చెబుతారు మన జీవకణాలకు కలిగే వ్యాధులు మనని బాధిస్తాయి. వాటి ఆరోగ్యం కోసం మనం మందులు తీసుకుంటాం మన జ్ఞానేంద్రియాలే గాక వాటికి సంబంధించి వున్న మెదడు కేంద్రాలు దెబ్బతింటే మనం గుడ్డివాళ్ళమూ, మూగవాళ్ళమూ, పిచ్చివాళ్ళమూ, అయిపోతాం వ్యక్తి మిధ్యా, జీవకణం సత్యమూ అన్న సిద్ధాంతాన్ని మనం తేలికగా రుజువు చేయవచ్చు మన వ్యక్తిత్వంలో నరాల పాత్ర ఎంతైనా ఉన్నది. కొన్ని రకాల జబ్బులు (మొలలు లాంటివి) ఎంత శాంత స్వభావుణ్ణి కూడా పరమ కోపిష్టిగా తయారు చేస్తాయి లివర్ చెడితే మానసికంగా కుంగిపోతాడు.

ఇలాంటి కారణాలను బట్టి మనకూ, జీవకణాలకూ గల సంబంధం పరమాత్మ జీవాత్మల మధ్య ఉండే సంబంధంలాగా కనపడదు. కేవలమూ జీవాత్మల మీదనే పరమాత్మ ఉనికి ఆధారపడినట్టు కనపడుతుంది. మనం మన వ్యక్తిత్వమనుకునేది కేవలమూ జీవకణాల సామూహిక వ్యక్తిత్వం మీద ఆవిర్భవించినదని స్పష్టమవుతున్నది. దేవుడనేది సృష్టిలో గల ప్రాణికోట్ల సామూహిక స్థితి నుంచి ఉద్భవించేదైతే అలాటి దేవుణ్ణి తాను నమ్మగలనని ప్రొఫెసర్ జే.బి.యస్. హాల్డేన్ ఒకప్పుడు అన్నాడు.

వ్యక్తి నుంచి జీవాత్మకువద్దాం. జీవాత్మ శరీరి శరీరంచావగానే దాన్ని విడిచిపెట్టి మరో శరీరాన్ని వెతుక్కుంటూ పోతుంది ("శరీరాని విహాయ జీర్ణాన్యన్యాన్ని సంయాతినవానిదేహీ") చావును నిర్ణయించటం కూడా అంత తేలికగా కనబడదు చచ్చిపోయినట్టు భావించబడే శరీర ధాతువులను శాస్త్రవేత్తలు చాలా కాలం సజీవంగా ఉంచుతున్నారు. తల నరికేసినాక కప్ప చచ్చిపోయిందనే అనుకోవాలి. కాని, ఆ చచ్చిపోయిన కప్ప రొమ్ము మీద ఒక చుక్క ఆమ్లం వేస్తే అది దాన్ని కాలితో తుడిచేసుకుంటుందిట ఆ కప్ప చచ్చి ఉన్నట్టా ? ఇంకా బతికి వున్నట్టా ? జీవాత్మ ఆ కప్ప శరీరాన్ని ఇంకా అంటి పెట్టుకున్నట్టా ? ఇంకో శరీరాన్ని వెతుక్కుంటూ పోయినట్టా ? అట్లాగే, శాస్త్రజ్ఞులు ఏళ్ళ తరబడి సజీవంగా ఉంచుతున్న ధాతువులలో వస్తే ఒక మనిషి శరీరంలో ఎన్ని కోట్ల జీవాత్మలున్నాయి ? మనిషి చచ్చాడన్నాక - రిగర్ మార్టిస్ ఏర్పడ్డాక కూడా శరీరంలో కొన్ని భాగాలు ఇంకా చావవు అన్ని జీవాత్మలూ ఎగిరిపోవటం దహనం అయినాకనే !

శాస్త్రజ్ఞులు ఏ క్షణాన అయినా రుజువు చేయగల ఈ విషయాలన్నీ మన పూర్వులు చెప్పిన దేవుడి ప్రతిపాదనలకు బద్ధ విరుద్ధమైనవి.

# 3. ఈ కాలపు ఆస్తికత్వం

ఈనాడు మనం చూసే ఆస్తికత్వం పరమాత్మ సిద్ధాంతానికి ఏమీ సంబంధం లేనిది దీనికి ఆధారంగా ఉండేవన్నీ ప్రగతికి ప్రతిబంధకాలే. ఎందుకంటే, ఈ ఆస్తికత్వం అసహాయతనుంచీ, భయంనుంచీ, దురాశనుంచీ, వ్యక్తుల సామాజిక దృక్పథం పూర్తిగా లేకపోవటం నుంచీ, స్వార్థం నుంచీ, పాపభీతినుంచీ, భయంకరమైన అజ్ఞాన అవివేకాల నుంచీ పుట్టింది ఈ అవలక్షణాలు ప్రగతికి సాయపడకపోగా, తీవ్రమయిన హాని కలిగిస్తాయి ఒక్క ముక్కలో చెప్పాలంటే ఈ ఆస్తికత్వం జీవిత అవ్యవస్థ నుంచి పుట్టింది ఒక్క రాముడు కాదు, కృష్ణుడు కాదు, హనుమంతుడు కాదు, శివుడు కాదు, గ్రహాలూ, నక్షత్రాలూ, బల్లులూ, పిల్లులూ మనవాళ్ల ఆస్తికత్వానికి ముడిసరుకు

భౌతికవాదం నూరిపోసినంత మాత్రాన ఈ ఆస్తికత్వం నిష్క్రమించదు భౌతికవాదం జీవిత విధానాలలోకి సమగ్రంగా ప్రవేశించాలి

జీవితపు అవ్యవస్థ వెనక భౌతిక కారణాలున్నాయి మనుషుల కుట్ర ఉన్నది పరిస్థితులు చక్కబరిస్తే మనదేశపు జనాభాకు పదింతలు తినేటంత పండించవచ్చునని తెలిసినవాళ్ళు చెబుతున్నారు మనిషి మృగప్రాయ దశ నుంచి ఆధునికతను సాధించటానికి అడుగడుగునా సాయపడింది భౌతిక జ్ఞానమే గాని సాయిబాబాలు కారు. మనిషి ఆహార సేకరణ నుంచి ఆహారోత్పత్తికి మారటం ఒక బృహత్పరిణామం లోహాలూ, ప్రత్యేకించి ఇనుమూ కనిపెట్టటం మరొక బృహత్పరిణామదశ గడిచిన మూడు వందల ఏళ్లలో మానవుడు తన అదుపులోకి తెచ్చుకున్న ప్రకృతి శక్తులను మనం కళ్ళారా చూస్తున్నాం. మనం 'పురోగామి' దేశాలు అని ఒప్పుకుంటున్న శాస్త్రజ్ఞానాన్ని ఎంతగా ఉపయోగించుకుంటున్నాయో చూస్తూ కూడా మనం బాబా భజనలు చేస్తూ, మన సంస్కృతితో ప్రపంచ హిప్పీలనందరినీ ఆకర్షించటం తప్ప ఇంకేమీ సాధించలేకుండా ఉన్నాం

"ముందు చూపు" లేనివాళ్లకు మన ఈనాటి ఆస్తికత్వం ఎంత ఘోరమైన అపకారం చేస్తున్నదీ సరిగా అర్థం కాదు మనలో వ్యష్టి స్వార్థానికి దైవభక్తి వెన్నెముకలాగా ఉన్నది ఈనాడు మనని ముందుకి తీసుకురాగలది సామూహిక స్వార్థం నదుల నీళ్ళు సముద్రంలోకి పోకుండా అడ్డగలిగితే నీటి కరువు లేదు. బీళ్ళన్నీ దున్నితే తిండి కరువు లేదు కోటీశ్వరులను కుబేరులను చేసే విధానాలు మానేస్తే దేశంలో దరిద్రం లేదు.

అయితే వ్యక్తి స్వార్థంతోబాటు వర్గస్వార్థం కూడా ఉన్నది వర్గస్వార్థం దేవుళ్ళకు దణ్ణాలు పెట్టదు. శాసనాలు చేస్తుంది. పోలీసు బలాలను పెంచుతుంది అవినీతిని పెంచుతుంది. సాధారణ ప్రజల జీవితాన్ని నరకంగా మార్చుతుంది. దేవుణ్ణి వర్గ స్వార్థం కూడా అడ్డం పెట్టుకుంటుంది.

సామాన్య ప్రజలు తమ వర్గ స్వార్థం తెలుసుకునే దాకా సమష్టిస్వార్థం అన్నది అక్షరాలా అమలు జరగదు ఎందుకంటే సామాన్య ప్రజలు వంచించటానికీ, శ్రమదోపిడీ చెయ్యటానికీ ఇంకో వర్గం లేదు. వాళ్ల స్వార్థమే నిజమైన సమష్టి స్వార్థం అవుతుంది అది నిలబడిననాడు దేవుడికి ఉద్వాసన జరుగుతుంది.

**- ఆంధ్రజ్యోతి వారపత్రిక - 11.7 1975**

# మాయదారి దేవుడు (డి)

## 1. దేవుడిలో నమ్మకానికి ఆధారాలు

నేను చిన్నతనంలో కలెక్టర్‌కి పైన వుండేవాడు గవర్నరే అనుకునేవాడిని. ఈ మనస్తత్వంలో ఉండే అజ్ఞానం సర్వసాధారణమైనదిగా కనిపిస్తుంది. మన అవగాహనకు అతీతమైనదంతా దేవుడేనన్న భ్రమ అత్యధిక సంఖ్యాకులలో కనిపిస్తుంది గాంధీగారు ఒకప్పుడు మైసూరులో పర్యటన చేస్తూ గ్రామస్థులను "మిమ్మల్ని పాలించేది ఎవరు ?" అని అడిగితే వాళ్లు ఎవరో దేవుడు అని చెప్పారుట. ఈ సంగతి గాంధీగారు తాను ఇచ్చిన గ్రామఫోన్ రికార్డులో చెప్పాడు.

అదేవిధంగా మనుషులు తమకు గల తార్కిక శక్తికీ, నిత్యానుభవానికీ అందరి అనుభవం ఏది సంప్రాప్తమైనా అది దేవుడున్నాడనటానికి రుజువుగా భావిస్తారు.

అటువంటి రుజువులు జ్యోతిష్యం, హస్తసాముద్రికం, ప్రశ్న, సోదె మొదలైన వాటి ద్వారా లభిస్తాయి వీటిని మూఢవిశ్వాసాలని కొట్టి పారెయ్యవచ్చు. అలా ప్రచారం కూడా చెయ్యవచ్చు. కాని అవి నిజమైన సందర్భాలను ప్రజల మనస్సుల నుంచి ఎవరూ చెరిపెయ్యలేరు. ఈ నాలుగూ నిజం కావటం నాకు స్వయంగా తెలుసు అవి పూర్తిగా అబద్ధమనేవారిది శాస్త్రీయమైన దృక్పథం కాదు

అసలు చిక్కు, అవి అబద్ధం కావటం కాదు, అవి అసమగ్ర శాస్త్రాలు కావటం, పూర్తిగా నమ్మరానివి కాకపోవటం, చాలావరకు నిరుపయోగం కావటం

జ్యోతిష్యం పూర్తిగా నిజమేనని మాట వరసకు అనుకొందాం అంటే జరగబొయ్యేదంతా ముందే నిర్ణయమై ఉందన్నమాటే గదా ? అంతమాత్రాన ఏమైనట్టు ? జ్యోతిష్యం ఆధారం లేకుండానే రోజూ మనం అనేక విషయాలను ముందుగా తెలుసుకుంటున్నాం. రేపు మళ్లీ తెల్లవారుతుంది. పిల్లలు ఎదిగి పెద్దవాళ్లవుతారు. ముసలి వాళ్ళవుతారు. పుట్టినవాళ్ళందరూ చస్తారు. రైళ్ళల్లోనూ, బస్సుల్లోనూ ఎంతెంతమంది ప్రయాణం చేస్తారో ముందుగానే అంచనా వేయవచ్చు. ఫలాని మాసంలో వానలు వస్తాయని, ఫలాని మాసంలో పైర్లు కోస్తారనీ ముందుగానే మనకు తెలుసు కాని ఇలాంటి వాటిని బట్టి మనం దేవుడిలో నమ్మకం వుంచటం లేదు

అయితే జోస్యమూ, హస్తసాముద్రికం లాంటివి దేవుడిలో నమ్మకాన్ని ఎందుకు కలిగిస్తున్నాయి ? అవి వ్యక్తులకు సంబంధించినవి గనక ! రేపు రైళ్ళలో ఒక లక్షమంది ప్రయాణిస్తారనటం కాదు. నువ్వు రేపు ప్రయాణం చేస్తావు ! అదీ విషయం. సమష్టి దృక్పథం పోయి వ్యష్టి దృక్పథం వచ్చేసరికి దేవుడి అవసరం కలుగుతున్నట్టు కనిపిస్తుంది. అసలు దేవుడికి పునాది వేసిన మతాలన్నీ వ్యష్టి దృక్పథాన్నే బలపరిచాయి మత స్థాపకులు తాము భగవంతుడితో సూటిగా మాట్లాడే వాళ్లలాగా జనాన్ని నమ్మించారు దేవుడి ఊసెత్తని బుద్ధుడు కూడా వ్యక్తుల విముక్తినే ప్రచారం చేశాడు కృష్ణుడులాంటి వాళ్ళు శషభిషం మానేసి, "నేనే ఆ యొక్క పరమాత్మను" అని గట్టిగా చెప్పేశారు. ఈనాటి బాబాలు కృష్ణుణ్ని ఆదర్శంగా పెట్టుకున్నట్టు కనబడుతుంది

అనేక మూఢవిశ్వాసాల మీద కత్తికట్టిన వీరేశలింగంగారు దేవుడి విషయంలో తానే మూఢ విశ్వాసాన్ని ప్రదర్శించాడు అడుగడుగునా తనకు దేవుడి ప్రేరణ ఉన్నదని ఆయన నమ్మాడు.

చెప్పవచ్చిందేమంటే, జరగబోయేదంతా ముందే నిర్ణయమయినట్టు రూఢీగా తెలిసినప్పటికీ ఎవరూ మానవయత్నం నుంచి విరమించరు ఎందుకంటే, మానవ యత్నం కూడా ముందే నిర్ణయమై ఉంటుంది గనక, తమ యత్నాన్ని విరమించుకునే అర్భకులు

అడుగంటిపోతారు. అయినా ఎంత దేవుడిలోనూ, విధిలోనూ నమ్మకం ఉన్నవాళ్లు కూడా తినే యోగం ఉందో లేదో తెలుసుకునేటందుకు వంట చెయ్యకుండా కూర్చోవటం మనం చూడం భగవంతుడి అవతారాలైన బాబాలు కూడా ప్రయాణం చెయ్యాలంటే రైలో, కారో ఎక్కక తప్పదు హేతువాదాన్ని నమ్మాలన్న ప్రేరణ ప్రతివ్యక్తిలోనూ ఉంటుంది దాన్ని క్రమంగా పనిచెయ్యకుండా చెయ్యటమే దేవుడి పాత్ర.

## 2. అసాధారణ శక్తులు

మనిషిలో కొన్ని అసాధారణ శక్తులున్నాయి (జంతువులలో కూడా ఉన్నాయేమో మరి!) వీటిని "ఇన్‌ట్యూషన్", "ప్రికాగ్నిషన్", "సైకిక్ పవర్" వగైరా అని పిలుస్తారు అన్వేషిస్తే వీటికి ఉదాహరణలు కోకొల్లలుగా దొరుకుతాయి వీటిని వైజ్ఞానిక దృక్పథం నుంచి విశ్లేషించటం శాస్త్రజ్ఞులకు ఇంకా సాధ్యం కాలేదు చాలాకాలంగా శాస్త్రజ్ఞులు వీటితో కుస్తీ పడుతున్నారు "మనకు తెలియని కొన్ని శరీర శక్తుల గురించి ఇండియాలో కొందరు సాధువులకు ఎక్కువ తెలిసినట్టు కని పిస్తుంది" అన్నాడు ప్రొఫెసర్ హాల్డేన్

ఈ శక్తులను మన పూర్వులు భౌతిక స్వభావం గలవిగానే భావించారు వీటిని పెంపొం దించటానికి 'యోగం' కూడా రూపొందించారు యోగులు కుండలిని మేల్కొలిపినది ముక్తికోసం కాదనీ, అమానుషశక్తులనూ, జ్ఞానాన్ని సాధించటానికేననీ ఎ ఎల్ బాషమ్ అన్నాడు ఆయన ఇంకా ఇలా అన్నాడు. "ఆధ్యాత్మిక విషయాల మాట ఎలావున్నా, సాధనలో ఉత్తీర్ణుడైన యోగి దీర్ఘకాలం శ్వాస బంధించగలడనటానికీ, హృదయ స్పందనను ఇష్టం వచ్చినట్టు నిగ్రహించగలడనటానికీ, అమితమైన వేడికీ, చలికీ తట్టుకోగలడనటానికీ .. చాలా దీర్ఘకాలం బుద్ధిబలం తగ్గకుండా జీవించ గలడనటానికీ సందేహం లేదు "

ఈ అసాధారణ శక్తులను గురించి రకరకాల దృక్పథాలు వెలువడ్డాయి "అంతా మోసం అందులో కనికట్టో, గారడీయో ఉంటుంది. ఈ శక్తులు ప్రదర్శించిన వాళ్లను శిక్షించాలి సజీవ దహనం చేయాలి " "ఈ శక్తులు చూపేవాళ్లు దేవుడి బిడ్డలు కారు సైతాను బిడ్డలు ఇవి దుష్టశక్తులు. వీటిని భౌతిక దృష్టితో అన్వేషించాలి "

ఎక్కువ మంది దృక్పథం ఈ శక్తులు భగవంతుణ్ని రుజువు చేస్తాయనే భగవంతుడికి పెద్ద రుజువులు వారి దృష్టిలో అనవసరం రైళ్ళు కొత్తగా వచ్చినప్పుడు ఇంజను దేవుడనీ, పూజారి డ్రైవరనీ అనుకుని జనం కొబ్బరికాయలు కొట్టి, ఒక చిప్ప 'పూజారి'కిచ్చి, ఇంకో చిప్ప ప్రసాదం కింద తీసుకుని కళ్ళకద్దుకున్నారు. ఈ దృక్పథమే అన్నిటికన్నా దీర్ఘకాలం మీద ఎక్కువ అపకారం చేసింది రైలును గురించే భౌతిక దృక్పథంలో తేలికగా ఇమడని అసాధారణ శక్తులను గురించి భౌతిక దృక్పథం ఏర్పడటం ఒకటంత సాధ్యమా ? కాని అది ఏర్పడితే గాని దేవుడి బెడద పూర్తిగా వదలదు

## 3. మరణానంతర జీవితం - లోకాంతరాలూ, పునర్జన్మా

ఇవి కూడా ముందు చెప్పిన అసాధారణ శక్తుల్లాగా గుడ్డినమ్మకాలు కావు వీటిని నమ్మేవాళ్లకు చీమ తలకాయంత ఆధారాలుంటాయి వీటిని గురించి కూడా మనం వేరు వేరు దృక్పథాలు అవలంబించవచ్చు వీటిని భ్రమల కింద పరిగణించవచ్చు కూడా

ఈనమ్మకాలన్నిటికీ మూలం "సైకిక్ పవర్"-అసాధారణ శక్తి కొందరికి "పూనకాలు" వస్తాయి (పూనకాలు వచ్చినట్టు సమయోచితంగా నటించేవాళ్ల సంగతి మనకు వద్దు) చచ్చిపోయినవాళ్లు వాళ్ల ద్వారా మాట్లాడతారు ఒక్కొక్కసారి వాళ్ళ సందేశాలు దిగ్భ్రమ కలిగిస్తాయి.

ఇలాంటి అనుభవం నాకు కూడా ఒకటి రెండుసార్లు కలిగింది. నిజమైన పూనకం నేను కళ్ళారా చూశాను. పూనకం వచ్చిన మనిషి ఓ ఇరవై ఎగశ్వాసలు వరసగా గట్టిగా పీల్చింది ఒక చచ్చిపోయిన మనిషి ద్వారా ఆమె మాట్లాడింది కాని ఆ సందేశంలో చెప్పుకోదగినది ఏమీలేదు పూనకం దిగిపోగానే ఆ మనిషి శ్వాసలన్నిటినీ వరసగా విడిచేసింది. ఆ మనిషి చాలా పామరురాలు యోగాభ్యాసం చేసిన మనిషి కాదు ఆవిడకు కొంత సైకిక్ పవర్ తాత్కాలికంగా వచ్చినట్టు ఒకటి రెండు అల్ప దృష్టాంతరాలు మాత్రమే కనిపించాయి అయితే దిగ్భ్రమ కలిగించే సందేశాలు నాకు ఇతరత్రా లభించాయి. సోదె అనేది సాధారణంగా హంబక్ అనటానికి సందేహం లేదు కాని దారి తప్పి ఎప్పుడైనా ఒక సోదె దిగ్భ్రమ కలిగిస్తుంది అన్వేషకులు ఓర్పుగా సోదెవాళ్లను పరీక్షించవచ్చు. సోదె చెప్పే మనిషిలో పూనకం లక్షణాలుండటం నేనెప్పుడూ చూడలేదు పాశ్చాత్య దేశాలలో "మీడియంలు" అనే వాళ్ల అనుభవం నాకు బొత్తిగా లేదు

దయ్యాలను చూశామన్న వాళ్లుంటారు వాటికి రుజువూ, సాక్ష్యమూ లేదు దయ్యాల ఫొటోలున్నాయి. అవి మోసం కావచ్చు. ఏమైనా చచ్చిపోయిన తరువాత జీవి మరో రూపంలో ఉంటుందనటానికి మనకు గల ఆధారాలన్నీ భౌతికమైనవే. అందుచేత భౌతికంగా అన్వేషణ జరపవచ్చు. మనకు ఒక ప్రాణి నుంచి మరొక ప్రాణి బయటికి రావటం ప్రత్యక్షంగా కనిపించేది, కీటకాలలో ఆకుపురుగు చచ్చి, అందులో నుంచి రెక్కల పురుగు వస్తుంది. ఆకు పురుగు మరణానంతర జీవితం ఆధ్యాత్మికం కానేకాదు. ఆకుపురుగును బలవంతంగా చంపితే అందులోంచి రెక్కల పురుగురాదు. అలాగే కోడిగుడ్డును చంపి అందులోంచి పిల్ల రాకుండా చెయ్యవచ్చు. కాని మనం మరణానంతర జీవితం అనుకునేది మనిషిని హత్యచేసినా ఉంటుందన్న నమ్మకం ఉన్నది. (బలవన్మరణం పొందినవాళ్లు కొంతకాలం దయ్యాలుగా ఉంటారని చెప్పుకుంటారు) ఈ విషయంలో ఆకుపురుగు సామ్యం ప్రేతాలకు వర్తించటం లేదు

లోకాంతరాలున్నాయా ? సర్ ఆలివర్ లాడ్జి (ప్రఖ్యాత శాస్త్రవేత్త) మొదటి ప్రపంచ యుద్ధంలో చనిపోయిన తన కొడుకు రేమాండ్ నుంచి ఒక మీడియమ్ ద్వారా సందేశాలు సంపాదించి పుస్తకంగా వేశాడు. అందులో విషయాలకు రుజువు లేదని ఆయనే ఒప్పుకున్నాడు రేమాండ్ లెక్కన కూడా "లోకాంతరం" భూమిని చుట్టే ఉన్నట్టు కనిపిస్తుంది. నక్షత్రాలు అక్కడినుంచి కూడా భూమి మీద నుంచి కనబడే ప్రమాణంలోనే కనిపిస్తాయట. అక్కడ కూడా చీకటి వెలుగులు మారి మారి వస్తాయట (భూమితోబాటు ఆ లోకాలుకూడా తిరుగుతున్నాయా ?)

పునర్జన్మ గురించి శాస్త్రీయంగా పరిశోధనలు చేస్తామని కొందరు శాస్త్రవేత్తలు ఫ్రాడ్ చేసినట్టు తెలుస్తున్నది. నాకు తెలిసినంతలో దాన్ని గురించి సాక్ష్యం ఏమీ ఉన్నట్టు కనబడదు.

ఇంతకూ, ఇవేమీ దేవుడున్నాడని రుజువు చెయ్యవు. అది ఒక సంగతి. రెండో సంగతి వీటివల్ల మన సమష్టి జీవితంగాని, దాన్ని శాసించే భౌతిక విషయాలు గాని మారేదేమీ లేదు నిర్ధారణ అయిన ప్రకృతి నియమాలను ప్రేతాత్మలూ, లోకాంతరాలూ తలకిందులు చేస్తే దాన్ని గురించి శాస్త్రవేత్తలు అన్వేషణ చేస్తారు. మనం పాటించే సత్యాలన్నీ ఒకే రంగానికి, స్థాయికీ సంబంధించినవి కావు గోళ్ళు ఉపయోగించేవి ఉంటాయి, గొడ్డళ్ళు ఉపయోగించేవి ఉంటాయి.

## 4. భౌతిక వాదానికి అవధులు

భౌతిక వాదానికి మనకున్న సాధనాలు జ్ఞానేంద్రియాలూ, బుద్ధీ మాత్రమే. బుద్ధిబలంతో మానవుడు జ్ఞానేంద్రియాల శక్తులను అపారంగా పెంచుకున్నాడు అవి గురి అయే భ్రమలను కూడా తెలుసుకున్నాడు టెలిస్కోప్‌లు దూరాన ఉన్న వాటిని దగ్గరగా చూపిస్తాయి మైక్రోస్కోపులు సూక్ష్మంగా ఉన్నవాటిని స్థూలంగా చూపుతాయి కంటికి కనబడని సూక్ష్మక్రిములకూ, స్ఫటిక కణాలలో

ఉండే "ముగ్గు" లనూ మనం మైక్రోస్కోపులో చూడగలుగుతున్నాం. మామూలు మైక్రోస్కోపుకు అందని వైరస్‌లనూ, పరమాణువులనూ ఎలక్ట్రాన్ మైక్రోస్కోపు చూపుతున్నది అలాగే చీకటిలో చూసే సాధనాలూ, ఆకు పురుగులూ పాకుతూంటే కలిగే ధ్వనులను "ఆంప్లిన్" చేసే సాధనాలూ ఈనాడు ఉన్నాయి.

కాని పదార్థం సమగ్ర స్వరూప స్వభావాలను గ్రహించటానికి ఈ జ్ఞానేంద్రియాలూ, బుద్ధీ, అది సృష్టించిన సాధనాలూ చాలుననుకోనవసరం లేదు ఆదర్శవాదులు దేవుడికి అంటగట్టిన అయోమయం కన్న ఎక్కువ అయోమయమైనది పదార్థం పరమాణువులను గురించిన శాస్త్రజ్ఞానం ఈ సంగతి స్పష్టం చేస్తుంది

మనిషికి మరి అయిదు జ్ఞానేంద్రియాలుంటే ప్రపంచం ఇంకా ఇంకా బాగా అర్థమయేదనటానికి సందేహం లేదు మనిషి బుద్ధి (మెదడు) ఇంతకు రెండింతలు పెరిగితే కూడా పదార్థం గురించి ఇంకా ఎక్కువ తెలుసుకుంటాడనటానికి సందేహం లేదు. (పది జ్ఞానేంద్రియాలు గల ప్రాణులు సృష్టిలో ఎక్కడా లేవని చెప్పలేం మన మెదడు కొన్ని కోట్ల ఏళ్లకు ఇంతకు రెండింతలు కావటం కూడా అసంభావ్యం కాదు)

శాస్త్రజ్ఞానం లేనివాడు తన చుట్టూ అనేక ఫ్రీక్వెన్సీలలో రేడియో తరంగాలు ప్రసారమవుతున్నాయంటే నమ్మడు నమ్మటానికి వాడికి ఆధారం లేదు రేడియో ద్వారా వాటిని ధ్వనులుగా మార్చి వినిపించటం కూడా వాడి "తెలివి"కి మొదటి మెట్టు మాత్రమే ఆ తరువాత వాడు రేడియో తరంగాలను గురించీ వాటి విద్యుదయస్కాంత స్వభావం గురించీ తెలుసుకోవలసినది చాలా ఉంటుంది. ఇంతా తెలుసుకున్నా వాడి జీవితానికి ఆ జ్ఞానం ఎందుకూ పనికిరాకపోవచ్చు మనందరికీ సూర్యుడు, భూమి చుట్టూ తిరగటం లేదన్న జ్ఞానం ఎందుకూ ఉపయోగపడదు. మనకు సూర్యుడు ఉదయిస్తాడు అస్తమిస్తాడు అలాగే ఏ నక్షత్రం ఎన్ని కోట్ల కాంతి సంవత్సరాల దూరంలో ఉన్నా మన చరిత్ర గతికి ఒకటే. ప్రస్తుతం మరణానంతర జీవితమూ, లోకాంతరాలూ, పునర్జన్మా మొదలైనవి అదే స్థితిలో ఉన్నాయి. వాటికి సంబంధించిన భౌతిక నియమాలు మనకు తెలిసేదాకా వాటి తాలూకు ప్రభావం మనమీద ఉండదు రోగం నయం చేసే మొక్క దొడ్లో ఉన్నప్పటికీ దాని ఉపయోగం తెలియని వాడికి దాని ప్రయోజనం లేనట్టే

ఈ కారణం చేత మరణానంతర జీవితమూ, పునర్జన్మలూ శుద్ధ అబద్ధమని కొట్టేసేవాళ్లు మనకు ఏ విధంగానూ నష్టం కలిగించరు అవి వున్నాయనే వాళ్ళు ప్రజలను మోసం చెయ్యటానికి అవకాశం ఉన్నది, దేవుడున్నాడని వాదించేవాళ్లలాగనే ! ఈ మోసం ఎంతదాకా పోతుందంటే చచ్చినవాళ్లు ఇంకో రూపంలో బతికే ఉంటారు గనక, దేవుడు కూడా ఉన్నట్టు వంచకులు ప్రజలను నమ్మించగలరు దురదృష్టవశానగాని, చచ్చినవాళ్లు ఏదో రూపంలో ఉంటారన్నదానికి పామరులకు ఏవో అస్పష్టమైన ఆధారాలు దొరికే అవకాశం ఉంటుంది. ఈ ఆధారాలు ఏనాటివో చెప్పలేం కొన్నివేల ఏళ్ల క్రితం కూడా శవాలతోబాటు ఆహారాలూ, ఆయుధాలూ, పాత్రలూ పాతిపెట్టేవారు ఆదిమానవులకు సైకిక్ శక్తులు అధికంగా ఉండేవన్న నమ్మకం కూడా కొందరికున్నది. ఆధ్యాత్మిక వాదానికి, అర్థంలేని దేవుడికి కొన్ని రకాల సైకిక్ అనుభవాలు పునాదిగా పనికివస్తే, పనికి వచ్చి ఉండవచ్చు

ఇంతకూ, మనం మనకు లభ్యమైవున్న భౌతిక జ్ఞానాన్నీ, సమాజ జ్ఞానాన్నీ పూర్తిగా సద్వినియోగం చేసుకుంటే మానవ జీవితం చాలా బాగుపడుతుంది మనం అధోగతిలో ఉన్నది యోగులూ, బైరాగులూ, గోసాయిలూ తక్కువై కాదు జ్ఞానరహితమైన జీవితం బలంగా ఈ గడ్డమీద పాతుకుపోయి ఉండటం వల్ల

**ఆంధ్రజ్యోతి వారపత్రిక, 11-7-1975**

# 1. TIME AND SPACE

1. All things exist in the dimension of Time and Space as well as Mind So all changes occur in Mind as well as Time & Space. This applies to inanimate things too which apparently have nothing to do with Mind, because they can be transformed by processes which can only take place in the Mind Dimension The most significant examples are the earliest civilizations created by man in the deserts through which rivers (Euphrites, Tigris, the Nile, The Sindhu & its tributaries, the Yellow river) flowed The swamps, jungles, reed etc , were cleaned and revolutionary changes in man's social life were achieved by the processes that were started in the Mind Dimension by man's brains as a result of which unheard of cities rose with mixed communities of craftsmen who were fed without producing food and so on. The entire movement for these early civilisations was first in the Mind Dimension, since Time alone could do nothing for billions of years while the space was always there.

2. Until man stepped into Barbarism from savagery his progress in the Mind Dimension was very very slow. True, he picked proper stones, made them into tools and weapons and progressed at a snail's speed, but he consciously built nothing in space or Mind dimension He gathered food and hunted animals. Mother Nature sustained him and he totally lived upon her like a babe All living creatures did the same.

Then the first excavations in the Mind dimension came. Man began to domesticate animal and cultivating in crude manner. During the first phases he was producing changes unwillingly. Eg He let the better stocks breed more thus improving the quality of the stock while he simply ate up the inferior animals. Similarly he selected the better seeds for sowing without knowing since the higher yielding varieties found a layer in the seed year after year But soon man was doing it deliberately to suit his

needs. Stocks had to be raised for meat or milk or power So also seeds had to be deliberately selected to suit the soil as well as their oil content and food value

3 All the time man was building up scientific knowledge which had to be transmitted from generation to generation and defused from one area to another Language was the earliest means for perpetuated knowledge and working was the next Of course one generation could show another how to achieve the new results without recourse to language or working, but as prof. Gordon Childe points out small such knowledge could not have progressed because the generations merely imitated one the other without knowing the underlying general principles. For instance, if Bamboo was shown to make a bow there could be no bamboos. The basic principles had to be applied in changing as well entirely different environments. Even the savage man could find better and better stones for his tools after experiencing the durability of various stones The change from Paleolithic to Neolithic stone implements was amazing.

4. We know that man progressed with the help of creations of various kinds in space-forest has to be destroyed to create fields. Cities had to be built for housing the various branches of the communities; he protected the cities with bows and arrows, developed weapons for fighting off wild animals and enemies, found materials for writing and recording his experience and wisdom, so that others could benefit from it even in his absence.

Now, a lot of this process has to go on in the Mind Dimension as well as space and time. In the realm of art and ideas the contact is only in the Mind Dimension between in any person living in any place any time & say, a Shakespeare or a Kalidas or a Tyagaraju and so forth We deal with structures created by man in the Mind dimension Some of them may have been dilapidated or fossilized or totally lost But a clear understanding of the Mind relic of the past helps us to understand our present and decide about our future.

What Marxists call the Superstructure belongs entirely to the Mind d. While most real knowledge helps us to forge ahead in our social evolution and progress, Marxism turns out to be the best of all We may say it is the archaeology of the Mind d. It is the best weapon for getting an insight into the past relics of superstructures and also a guide to future.

5. The one essential feature about the edifices in the Mind d - religious ideas, social practices, arts, ideas of morality, justice, progress etc., are products of society The very speech of writing that lie at the basis of Man's Mental development were social conventions. Only as a social animal with these gifts could man start functioning actively in the Mind d. And althrough Man's existance on earth action had to have an initial basis in thought for which Mind d was the source.

Now we come to the detachment of Mind d from man's existance in Time & Space. It happens only too often. Ideas which have ceased to be of any use to man because of his progress in Time & Space are hugged by man out of sheer ignorance, they become superstitions. Some ideas are mystic, abstract & so unreal that they never had any real basis in Time & Space, these are the so-called spiritual ideas They cling to human races out of inertia are mass deception by the great exploits of mankind along the ages.

In countries which have had their history made by aliens for centuries the mind D of the populace is a varitable jungle in which whatever exists is venerated for its agelessness but not its utility. Destroying such jungles is a very ardous work and must be systematically carried out before people begin to live mentally in worthwhile Arm Chairs of the Mind. It is, anhas always been a revolution to destroy the jungles of the Mind from time to time & erect new structures of the mind confirming to and to create the New Time & New Space.

(రాతప్రతి - అముద్రితం)

# 2. MIND AND SPIRITS

Mind is as much a dimension of the universe as Space and Time. On the scale of the universe it is as presumable as complex.

Brain, human as well as animal, is only an instrument that responds the movements and changes in Mind.

Everything animate and inanimate, living and lifeless must exist in Mind even as it does in Space and Time. Only our normal senses are not equipped to see this existence of things in the Mind dimension

However human experience proves that at times humane in spirit bodies can be seen apart from their spirit bodies The separation presumably occurs everyday while we sleep (I saw myself sleeping on the cot during a diurnal nap ) In any case psychic research in no longer in doubt about the existence of spirit bodies

As death the spirit body is released from the physical body I find it is not necessary to presume that the dead go to 'another place'. They are still in the material universe, perhaps entirely in the Mind dimention.

In my opinion we would not be aware of existence of the dead, nor could some of us exhibit para-normal powers out for the fact that the spirit body uses some part of our brain which we may not precisely locate. The spirit mind is referred to as the 'unconscious' or 'sub-conscious' It is quite evidently independent of the normal mind. This can be seen when we fail to recall a name or an incident and turn our minds to some other things when suddenly our mental processes are broken and the forgotten thing is thrust into the Conscious - even as a seedling comes out of the earth When this happens without our forgetting and the idea does not come out of our memory and apparently from anywhere else and it proves to be true we call it para-normal - telepathy or precognition

That the spirit mind is independent of Time and Space is accepted  It belongs to the Mind dimension and is bound to it Mind can cut across time and space if it is dimension in its own standing. Space can cut across time and we can see stars as they were in the past and island universes as they were millions and billions of years ago.

These facts, to my mind, prove the independent existence of the Mind dimension  We can remember the past at times, we can recall vividly faces seen decades back, no doubt with the help of our spirit mind. Sometimes we reverse time in our dreams, a whole series of dream visions leading up to a fall from a cliff which corresponds to our head or hand slipping down the pillow; consciously or unconsciously prognestikating a future event (my son irritated me by saying that I should cut my 'belly' which in our language symbolises progeny and died a few days later.)  Telepathy and precognition are scientifically established even if not universally accepted

As for human personality surviving death, it can correspond to the spirit body more accurately  Also it may undergo many changes  We know how human personality keeps changing even during life from birth to childhood, adulthood, old age and so forth  Even while alive our spirit reactions are quite different from our normal reactions. When I was a boy of about 9, I returned from school, knocked on our door and wondered who would open the door since my mother is dead. My mother did die a year later and it was one of the major disasters of my life, but the thought of mother being dead did not cause me the least worry at the time.

Explanation for prodigies, geniuses, intuitions, inspirations, haunches etc , are to be sought in the Mind dimension.

The best explanation I can find for intelligent people's disbelief in the para-normal is that social evolution ignored the spirit mind, unlike the most primitive peoples who were too aware of it

and could not produce progress in Space-Time I confess that the some dozen para-normal experience I had in my life may not be taken seriously by me if somebody also reported them to me, unless I have a very high opinion about the scientific outlook of the other person. I am still a materialist and a Marxist too

I shall be very happy if these ideas of mine can throw even a ray of light on psychic research and simplify any problem to the slightest extent.

# 1. బుద్ధికొలత అనే భావన దేనికి ?

బుద్ధికొలత గురించి నా రచనలు పత్రికలో రావటం మొదలైనప్పటి నుంచీ మామూలు పాఠకులు బహిరంగంగా ఏ అభిప్రాయమూ ప్రకటించకపోయినా, కొందరు ఎరిగినవారూ, ఎరగనివారూ కూడా నాకు తమ అభిప్రాయాలనూ, అనుమానాలనూ తెలిపారు. స్థూలంగా అవి ఈ విధంగా వున్నాయి

నా బుద్ధికొలత వ్యాసాలు మూఢ విశ్వాసాలను బలపరచటం లేదా ? భౌతికవాదినీ, మార్క్సిస్టునూ అని చెప్పుకుంటూ నేను ఈ రచనలు ఎందుకు చేస్తున్నాను ? 'మార్క్సిస్టు బాధ్యతల నుంచి కుటుంబరావు తప్పుకునేటందుకు ఇలా రాస్తున్నట్లున్నది' అంటున్నారు

ఇలాటి అభిప్రాయాలు కొందరిలో రావటానికి గల కారణాలు ముందు చెప్పాలి మార్క్సిస్టులమూ, భౌతికవాదులమూ అనుకునేవారిలో చాలామందికి విస్తృతమైన అనుభవమూ, నిజమైన శాస్త్రీయ దృక్పథమూ వుండటం లేదు. వారిలో కొందరు మూఢ విశ్వాసాలను గురించి మూఢ విశ్వాసాలు కలిగివుండటం కూడా కద్దు. నాస్తికత్వమూ, పాత ఆచారాలన్నీ మూఢ విశ్వాసాలేనని నమ్మటమూ భౌతికవాదానికి గీటురాయి అని వాళ్ళు నమ్ముతారు. నాకు హోమియోపతిలో నమ్మకం ఉన్నందుకు నన్ను చూసి 'కామ్రేడ్స్' పాతికేళ్ళ క్రితం జాలిపడ్డారు వారి అవిశ్వాసాన్ని నేను కొట్టిపారెయ్యను, ప్రతిదాన్నీ గుడ్డిగా నమ్మటంకన్నా అసహజంగా కనిపించేదాన్ని నమ్మకపోవటమే మంచి లక్షణం. అందువల్ల కలిగే నష్టం చాలా తక్కువ పెద్ద పొటెన్సీలలో హోమియో మందులు ఎలా పనిచేస్తాయో రసాయనశాస్త్రం చెప్పలేదు. కాని నేను 200 పొటెన్సీ గల మందు మూడు డోసులతో 10, 12 ఏళ్ళుగా వున్న ఉబ్బసం నయం చేశాను

మార్క్సిస్టు అయినవాడు నమ్మకానికి ఇచ్చే ప్రాముఖ్యతకన్న వాస్తవ అనుభవానికి హెచ్చు ప్రాముఖ్యం ఇయ్యాలి ఎవడోవచ్చి 'నేను దయ్యాన్ని చూశాను' అంటాడు. ఆ మనిషికి తరచు భ్రమలు కలుగుతుంటాయా ? దయ్యాన్ని చూశాననటంవల్ల వాడికి లాభాలేమైనా ఉన్నాయా? దేన్ని చూసి వాడు దయ్యం అనుకొని ఉంటాడు ? ఇలాటి ప్రశ్నలు వేసేవాడు శాస్త్రీయ దృక్పథం గలవాడు, వాడు అబద్ధం ఆడుతున్నాడని కొట్టిపారేసేవాడిది శాస్త్రీయ దృక్పథం కాదు అయితే శాస్త్రీయ దృక్పథంలేని పరిస్థితులలో అపనమ్మకం ఆరోగ్యకరం నామట్టుకు నాకు దాదాపు ఇరవైదాకా అసాధారణ అనుభవాలు కలిగాయి. ఎవడోవచ్చి అలాటి అనుభవాలూ తనకు కలిగినట్టు చెబితే, ఆ మనిషికి గల నిజాయితీలో నాకు నూరుపాళ్ళూ నమ్మకం వుంటే తప్ప వాటిని నేను నమ్మను, ఇలాటి అపనమ్మకంతో నేను చాలామందికి అన్యాయంచేసి ఉండవచ్చు కూడా.

మరో విషయం ఏమిటంటే హేతువాదులమూ, భౌతికవాదులమూ, మార్క్సిస్టులమూ అనుకునేవారిలో కొందరికి సాపేక్ష సిద్ధాంతం అంచనాలూ, క్వాంటమ్ మెకానిక్స్ సంబంధించిన సిద్ధాంతాలూ మామూలు భాషలో చెబితే అబద్ధాలకిందా, మూఢభావాల కిందా జమకట్టే అవకాశం లేకపోలేదు క్రియకువస్తే ఏ ఒక్క భౌతికవాదికి గల శాస్త్ర పరిజ్ఞానమూ ప్రపంచంలో వున్న ప్రజలందరి అనుభవాలనూ విశ్లేషించటానికి చాలదు స్వయంగా నాబోటివాడికి ఉండే చిక్కేమిటంటే అనేకమైన సొంత అనుభవాలనే ఒకే సూత్రంలో గుది గుచ్చలేక, రెండు మూడు అరలలో ఉంచవలసి వస్తున్నది.

మానవుడి సహజ స్వభావం అపనమ్మకం అన్నది మనం మరచిపోరాదు. ఎంత తేలికగా "ప్రతిదీ" నమ్మేవాడు కూడా అన్నీ నమ్మడు. దానికితోడు కొన్ని నమ్మకాలు అనవాయితీగా వచ్చేవి కొన్ని అనుభవం ద్వారా బలపరచుకుని, వాటి ఆధారంమీద మనం మన ప్రవర్తనను మలచుకునేవి.

ఈ రెండో తరగతివే నిజమైన విశ్వాసాలు. 'అయ్యోరామ' అన్నవాడల్లా రాముడు దేవుడని నమ్మేవాడు కాదు. స్వర్గ నరకాలు లేవంటే నమ్మలేనివాళ్ళు అవి లేనట్టే జీవిస్తారు అలాటి వాళ్ళ నమ్మకాలను మనం సీరియస్‌గా తీసుకోనవసరం లేదు

పోతే, బుద్ధికొలత గురించి నేను రాస్తున్నది ఎందుకు ? చాలామందికి అనవసరం ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతమంత అనవసరం ఎంతోమందికి స్థలమూ, కాలమూ కొలతలన్నది కూడా పట్టదు. స్థలపు కొలతలో ఎడారులున్నాయి, అరణ్యాలున్నాయి, మంచుకొండలున్నాయి నదీ ప్రాంతాలున్నాయి సముద్ర తీరాలున్నాయి ఎలాటి స్థలంలో జీవించేవాడు అలాటి జీవితానికి అలవాటు పడతాడు. ధృవ ప్రాంతాలలో జీవించేవారిలాగా ఎడారిలో నివసించేవాళ్ళు జీవించలేరు అలాటిదే కాలం కొలత యంత్ర నాగరికతలో ముందుకుపోయిన దేశాలవారికి మధ్యయుగపు జీవితం జీవించే మననిచూసి ఆశ్చర్యం కలుగుతుంది అలాగే మనకు రాతియుగ సంస్కృతిలో జీవించేవాళ్ళ జీవితం గొడవగా కనిపిస్తుంది ప్రపంచంలో వున్నవారంతా ఒకే యుగ ధర్మాన్ని అవలంబించటం లేదు.

ఇలాటి వైవిధ్యం బుద్ధికొలతలో కూడా ఉన్నదని నేను నమ్ముతూ, నిరూపించటానికి ప్రయత్నిస్తున్నాను. ఒకే ఇంట్లో, ఒకే కాలంలో జీవించే ఒకే తల్లి బిడ్డల మెదళ్ళు బుద్ధికొలతలో వేరు వేరు పొలిమేరలలో "జీవించ"వచ్చు. ఆర్థిక భౌతిక పునాదిమీద భావ నిర్మాణం ఆధారపడి వుంటుందని మార్క్సిజం చెబుతుంది ఈ విశ్వాసాన్ని నేను ఇంకొంచెం ముందుకు తీసుకుపోయి బుద్ధి పొలిమేరలకు మరింత ప్రాముఖ్యం ఇయ్యవచ్చునని నమ్ముతున్నాను, ఎలీనేషన్ ఎలా సాధ్యం ? మధ్యతరగతి మేధావులు ప్రొలిటేరియన్‌లకు ఎలా నాయకులు కాగలుగుతున్నారు ? బుద్ధికొలతలో అవసరమైన పరివర్తన రానివాళ్ళు అపాయం ఎదురుపడగానే నైతికంగా జారిపోయిన విప్లవకారులు పోలీసులకు దొరికిపోవడానికి కారణభూతులు కావడం లేదా ? దీనికి వ్యతిరేకంగా కటికదరిద్రులు బొర్రలు పెంచి, దోపిడీ మరిగినవారు విహరించే బుద్ధి పొలిమేరలను వదలిపెట్ట లేకపోవడం జరగటం లేదా ? అస్పృశ్యులకు అస్పృశ్యు లుండటాన్ని ఏమనాలి ? మార్క్స్, ఏంగెల్స్, లెనిన్, మావోలు చెప్పినవి చీటికీమాటికీ వల్లించేవాళ్ళు వారు అంతటి మహామేధావులు అనుకుని ఏం లాభం ? చచ్చిపోయి, మార్క్సునూ, లెనిన్‌నూ కలుసుకుంటానని చౌఎన్‌లై అన్నట్టుగా మన మార్క్సిస్టు ఎవడన్నా మాట్లాడితే వెంటనే మన మహా మార్క్సిస్టులు కత్తులు దూయరా ? ఈ మార్క్సిస్టు పాండిత్యం మనని బుద్ధికొలత తాలూకు ఏ పొలిమేరలో జీవింపజేస్తున్నదని ప్రతి అభ్యుదయవాదీ స్పష్టంగా తెలుసుకోవాలని నేను నమ్ముతున్నాను. సామాజిక పరిస్థితుల ప్రోద్బలంతో ఎవడన్నా తద్దినం పెట్టినా, సత్యనారాయణవ్రతం చేసినా "ఇంకేముంది ? అయిపోయింది వీడేం మార్క్సిస్టు ?" అనే అవకాశంకోసం ఎదురు చూసేవాళ్ళూ, అవకాశం దొరికినప్పుడల్లా "దేవుడు లేడు" అని కేకలుపెట్టి, దేవుడున్నాడన్న వాళ్ళను ప్రతిఘటించటమే అభ్యుదయంగా భావించేవాళ్ళు బుద్ధికొలతలో సరైన ప్రాంతాల ఉంటున్నారా అని నా అనుమానం

మనిషి మెదడు చాలా రేషనల్‌గా పనిచేస్తున్నట్టు పైకి కనిపిస్తూ తప్పుడు దారిలో పడటానికి 'రామాయణ విషవృక్షం' ఒక ఉదాహరణగా నీకు కనిపిస్తుంది. రామాయణ విషవృక్షం రామాయణాన్ని చెత్తకుప్పలోకి పోనీయదు డాక్టర్ కోవూర్‌గారు దేవుడికి అనవసరమైన ప్రచారం ఇస్తున్నారు ఆయనకు కావలసింది తద్వారా తన ప్రచారమేమో నాకు తెలీదు. ఆయన ఎంత చెప్పినా అందులో గతి తార్కిక భౌతికవాదం నాకు కనిపించదు.

ఇదంతా నా బుద్ధికొలత సిద్ధాంతానికి కొంత ఆవశ్యకతను కలిగిస్తుంది దీన్ని నాకన్నా మేధావులూ, సునిశిత శాస్త్ర దృక్పథం గలవారూ ఇంకా ముందుకు తీసుకుపోతే, మార్క్సిస్టు దృక్పథం మరింత పదునెక్కుతుందని నా విశ్వాసం

**(ఆంధ్రజ్యోతి వారపత్రిక, 14-10-1977)**

# ౨. కాలస్వరూపం

సృష్టిలో మనం రెండురకాల వస్తువులను గుర్తించగలం - యథార్థమైనవీ, అయథార్థమైనవీనూ. సూర్యుడూ, చంద్రుడూ, కొండలూ, చెట్లూ, ఇళ్ళూ, మనుష్యులూ, చెంబులూ మొదలైనవి యథార్థ వస్తువులు రెండవరకం వస్తువులను మనం వస్తువుల కింద కూడా గణించం కాని వాటినికూడా మనం ఇంద్రియాల ద్వారా తెలుసుకోగలం పెద్దా, చిన్నా, నలుపూ, తెలుపూ, తేలికా, బరువూ, గట్టితనమూ, మార్దవమూ మొదలైనవి ఈ జాతివి వీటిని మనం తెలుసుకోగలం గాని యథార్థ వస్తువులనించి వేరుచేసి తెలుసుకోలేం ఇవి యథార్థ వస్తువులయొక్క గుణాలుగా మాత్రమే మనకు తెలియదగినవిగా వుంటున్నవి

మనం బొగ్గును ఎట్లా తెలుసుకోగలమో దాని నలుపురంగును కూడా అట్లాగే పొరపాటు లేకుండా తెలుసుకోగలం అటువంటప్పుడు బొగ్గు యథార్థ వస్తువై నల్లరంగు కాకపోవటానికేమిటి కారణం ? యథార్థ వస్తువును నిర్వచించటం ఎట్లా ? యథార్థ వస్తువుకు అధమం మూడు కొలతలు (dimensions) ఉండాలి - పొడుగూ, వెడల్పూ, ఎత్తు లేక మందమూ, ఈ మూడు కొలతలూ లేనిదే ఏదీ కూడా యథార్థ వస్తువుకాదు

లౌకికంగా మనకు ఒక కొలత మాత్రమే కలవాటితోనూ రెండు కొలతలు కలవాటితోనూ ప్రయోజనం ఉండవచ్చును వీధుల యొక్క వెడల్పూ, పొలాలయొక్క వైశాల్యమూ మన కప్పుడప్పుడూ ప్రాణోపద్రవాలైన విషయాలుగా పరిణమించటం కద్దు కాని అవి యథార్థ వస్తువులు కావు తూకం కూడా అటువంటిదే

సృష్టి మూడు కొలతలు కలదనీ, దానికున్న గుణాలన్నీ మన ఇంద్రియాలూ మనస్సూ కల్పించినవేననీ సామాన్యంగా ఎవరైనా ఊహించగలరు. తెల్లదిగా కనిపించే వస్తువు రంగు అద్దాలు పెట్టుకు చూస్తే రంగుగా కనిపిస్తుంది. ఏ వస్తువు కూడా ఎండలోనూ, వెన్నెలలోనూ ఒకే రంగుతో కనిపించదు మనకు ఎండ అనేది లేక వెన్నెలే వుండి వుంటే అనేక రంగులున్న సంగతి కూడా మనం తెలుసుకోలేకపోయి ఉందుము. ఇప్పటికీ మనం చూడలేని రంగులు చాలా ఉన్నట్టు స్పెక్ట్రం ఫొటోగ్రాఫులవల్ల స్పష్టమవుతున్నది వస్తువుల యొక్క తూకం కూడా ఒక దేశంలో ఉన్నట్టు మరొక దేశంలో ఉండదు - కొద్ది తేడాలుంటై. కనుక గుణాలన్నీ పరిస్థితులను బట్టి మారేవే కాని వాటికి యాథార్థ్యం లేదు. మూడు కొలతలు కలవే యథార్థ వస్తువులు, యథార్థ ప్రపంచం మూడు కొలతలు కలది

అంతవరకు స్పష్టం అయినట్టయితే, ఆ అభిప్రాయాన్ని కూడా సంస్కరించుకోవలసిన ఆవశ్యకతను గురించి ఆలోచింతాం. అటువంటి ఆవశ్యకత ఉన్నట్టే కనిపిస్తుంది, కొంచెం ఆలోచించినట్టయితే. నిజానికి మనం ఒక దూరాన్ని కాని, వైశాల్యాన్ని కాని యథార్థ వస్తువుకింద ఎందుకు గణించటం లేదు ? ఆ గుణాలను ఆ యా వస్తువులనించి వేరుచేసి ఊహించలేం కనక! అయితే మరి మనం మూడు కొలతలు గల వస్తువులను కాలం నించివేరుచేసి ఊహించగలుగుతామా ? మూడు కొలతలూ ఉండి, కాలంలో ఉనికిలేని పదార్థాన్ని మనం ఊహించగలమా ? క్షణమాత్రం ఉండి పొయ్యే మెరుపును మనం అర్థం చేసుకోగలం. క్షణంలో సహస్రాంశకాలం ఉండిపొయ్యేదాన్ని కూడా మనస్సు ద్వారా ఊహించగలం కాని అసలు కాలంలో ఉనికే లేనిదాన్ని మనం ఎట్లా ఊహించగలం ? ఊహించలేం. అది యథార్థ వస్తువే కాదు

అందుకని శాస్త్రజ్ఞులు కాలాన్ని సృష్టి యొక్క నాలుగో కొలతకింద గణించుతున్నారు యథార్థ ప్రపంచం నాలుగు కొలతలు (four dimensions) కలది అనుకోవటానికి సందేహం

లేదు కాలం ప్రపంచపు నాలుగో కొలత అని మనం మరొక విధంగా కూడా రూఢీ చెయ్య వచ్చును.

ఒక విషయం చూడండి ఒక కొలతలో ఏ మార్పు జరగవలసినా ఆ కొలత కాక మరొక కొలత అవసరమవుతుంది వెడల్పు ఏమీలేక పొడుగు మాత్రమే కల ఒక గీటును మనం ఊహించుకుని దానిలో మార్పు కలిగించాలన్నట్లయితే దాన్ని వంచటం తప్ప వేరే మార్గం లేదు నిలువుగీటు ఒక దిక్కు (Direction) మాత్రమే సూచిస్తుంది అది వంగినప్పుడు దాని వంపు మరొక దిక్కుగా వుంటుంది ఆ వంపు కలగటానికి రెండవ దిక్కు అవసరం రెండు దిక్కులున్నది రెండు కొలతలు గల వైశాల్యం. ఆ విధంగానే రెండు కొలతలు గల వైశాల్యంలో మార్పు రావాలంటే మూడవ కొలత అవసరం ఇప్పుడు మనం చూసే మూడు కొలతలు గల ప్రపంచం అనుక్షణమూ మార్పు చెందుతున్నది ఈ మార్పు కాలంలోనే సాధ్యమవుతున్నది. ప్రపంచంలో మార్పును మనం కాలంద్వారా గుర్తించగలగటమే కాక ఆ మార్పు క్రమమైనదైనప్పుడు దాని సహాయం వల్ల మనం కాలాన్ని కూడా కొలవగల్గుతున్నాం కాలమనేది ప్రపంచపు నాలుగో కొలత అనటానికి సందేహం ఏమీలేదు

కాని మనం దైనిక జీవితంలో కాలాన్ని ఈ దృష్టితో ఎందుకు చూడటం లేదు ? దీనికి కారణం ఉంది మనం ప్రపంచం యొక్క మూడు కొలతలలోను స్వేచ్ఛగా తిరగగలం కాని కాలంలో మనకు స్వేచ్ఛా విహారం లేదు. మనం పొరుగూరు వెళ్ళి మళ్ళీ స్వగ్రామం వచ్చినట్లు ఈ క్షణాన్ని విడిచిపెట్టి జరిగిపోయిన క్షణం దగ్గిరికి పోలేం, వచ్చే క్షణం దగ్గిరికి కూడా పోలేం దానికి కారణం ఏమంటే మన consciousness లేక ఎరుక అనేది నాలుగో కొలత అయిన కాలం వెంబడి ప్రయాణం చేస్తున్నది

మనస్థితిని ఒక ప్రవాహం గల నదిలో ఉండే ఒక చేప స్థితితో పోల్చవచ్చును, ఆ చేపనదిలో అడ్డంగా ఈదుతూ ఈ క్షణంలో నది నడుమ ఉన్నాననీ ఒడ్డుకు వచ్చాననీ అనుకుంటుంది ఒకసారి ఒడ్డుకువచ్చి మళ్ళీ మధ్యకు వెళ్ళి తిరిగి ఒడ్డుకువచ్చి, పూర్వం వచ్చిన చోటికే వచ్చాననుకోవచ్చును కాని ఈ లోపుగా ప్రవాహం దాన్ని కొంతదూరం చేరవేసింది మనమైనా అంతే ఊరికి వెళ్ళి ఇంటికి వచ్చామనుకుంటాం కాని ఆ ఇల్లూ మనం వదిలిపెట్టిన ఇల్లూ నాలుగు కొలతల ప్రపంచంలో ఒక్క స్థానంలో లేవు ఈ ఇల్లు మనం వదిలిపెట్టిన ఇంటికి 'రెండు రోజులు' ఇవతల వుంది అదే రెండు రోజులుకాక రెండు వందల సంవత్సరాలయితే ఈ లోపల మన ఇంట్లో కలిగిన మార్పుల వల్ల గుర్తించటానికి వీలు కూడా ఉండదు పైన చెప్పిన ఉదాహరణలో చేప కూడా ఇందాక నేను వచ్చినప్పుడిక్కడ ఇట్లా నాచులేదే ! ఈ కాస్తలో ఒడ్డు ఎంత మారి పోయింది ! అని ఆశ్చర్యపడవచ్చును ఇంతవరకు నేను చెప్పిన విషయాలన్నీ సరిగా అవగాహన అయినవారికి ఒక్క క్షణం కళ్ళు తెరచి ఆలోచించినట్లయితే సృష్టియావత్తూ చాలా చిత్రంగా కనిపిస్తుంది. ఏ శక్తివల్లనైనా ఈ క్షణాన నేను కాలంలో ఇరవై సంవత్సరాలు వెనక్కు వెళ్ళగలిగితే జడవేసుకుని స్కూలుకు పోతూ నేనక్కడే ఉన్నాను మా అన్నగారు ఇష్టంలేని సబ్‌ఓవర్సీరు పని చేస్తూ నిడదవోలులో ఉన్నాడు. సహస్రాబ్దాలు వెనక్కు వెళ్ళినట్లయితే ఆ కౌరవ పాండవులు కురుక్షేత్రంలో భయంకరమైన యుద్ధం చేస్తూనే వున్నారు. "నేను కాలాన్ని వీళ్ళంతా నాచేత ఇదివరకే చంపబడ్డారు." అని కృష్ణుడు చెప్పిన మాటలను అర్జునుడు దిగులుగా మననం చేస్తూ సంపూర్ణంగా విశ్వసించలేకుండా ఉన్నాడు. ఆ భీష్ముడు తన ప్రయత్నం లేకుండా చస్తే బాగుండును.

అదంతా అక్కడే ఉంది ఈ ఆలోచనతో మనకు మతి చెడవలసిన అవసరం లేదు. ఎందుచేతనంటే మనం నిత్యమూ చూసే నక్షత్రాలలో కొన్నిటినించి కాంతి మనకు చేరటానికి

అనేక కోట్ల సంవత్సరాల కాలం పడుతోందని శాస్త్రజ్ఞులు మనని నమ్మిస్తున్నారు. అందులో ఏ ఒకదాన్నించి భూమివంక ఈ క్షణాన చూసినా భూమిమీద ఉన్న జంతుజాలంలో ఎక్కడా మానవమృగం కనిపించదు. అంతదాకా పోకుండా మనకు చాల దగ్గిరలో ఉన్న సూర్యుడి దగ్గిరనించి కాంతి రావటానికే ఎనిమిది నిమిషాలు పడుతున్నది. మంచి టెలిస్కోపులో నించి సూర్యుడి వంకచూసి సూర్యుడికీ మనకూ మధ్య ఉన్న దూరాన్ని తగ్గించవచ్చును. (నేను 400 రెట్లుగా చూసే టెలిస్కోపులోనించి చూశాను అంటే చూసే వస్తువుకూ నాకూ ఉన్న దూరాన్ని ఇరవయ్యో వంతుచేసి చూశానన్నమాట.) కాని మనకూ సూర్యుడికీ మధ్య ఉన్న ఎనిమిది నిమిషాలనూ తగ్గించటం ఎవరి తరమూ కాదు. శాస్త్రీయమైన దృష్టితో ఆలోచిస్తే ప్రపంచం యావత్తూ నాలుగో కొలతలో మార్పు చెందుతున్నప్పటికీ, దాన్ని గుర్తించే ఎరుక అనేది అందరికీ ఒకటిగా లేదు మన ఎరుకలు ఒకదానికొకటి సూక్ష్మంగా వెనుకపడి ఉన్నై నూరుగజాల దూరంలో ఉన్నవాడు మనని చూసినప్పుడు ఏ క్షణానగాని మనం ఎట్లా ఉన్నామో తెలుసుకోలేడు మనం వాడికీ వాడికి మనమూ కాలంలో పరస్పరం అణుమాత్రం వెనకబడి ఉన్నాం - మధ్య ఉన్న దూరం మూలకంగా కాని ఈ తేడాను కొలవటం ఎవరి తరమూ కాదు. అది అంత సూక్ష్మమైనది. కాని మనం ఒకరికొకరం దగ్గిరకి వచ్చినప్పుడూ దూరం వెళ్ళినప్పుడూ ఆ కొలవ సాధ్యంగాని తేడా హెచ్చుతూ తగ్గుతూ వుంటుంది కాలం ప్రపంచం యొక్క ఒక కొలత అని రూఢి చేసుకున్న తరువాత మనకు గలిగే ధర్మసందేహ మేమంటే, కాలం పరిమితమైనదా, అపరిమితమై అనంతమైనదా ? మానవుడి ఊహ పరిమితమైనది కావటంచేత దాని ఊహకు చప్పున అందనివన్నీ అపరిమితమైనవనే భావిస్తుంది సముద్రానికి అవతలిగట్టు లేదనేవాళ్ళు ఎవరో రాజు కొడుకు పదివేల ఆమడ ప్రయాణం చేసి ఏదో పట్టణం చేరాడనేవారు పదివేల ఆమడ ప్రయాణం చేసినవాడు మూడుసార్లు భూప్రదక్షిణం చేసి కొంప చేరుకుంటాడు మొన్న మొన్నటిదాకా శాస్త్రజ్ఞులు బ్రహ్మాండానికీ చోటు (Space) కూ అంతులేదని విశ్వసించారు అది కూడా తీరిపోయింది చోటుకు కూడా ఇప్పుడు అంతు నిర్ణయించబడ్డది అంటే ఆకాశంలోకి ముక్కుసూటిగా పోతే కొంతదూరం వెళ్ళి ఆగిపోతామని కాదు - మళ్ళీ తిరిగి బయలుదేరిన చోటికే వస్తామని అనగా చోటు కూడా వలయంగా, భూమియొక్క పై భాగం మాదిరిగా ఉందని ఈ విశ్వాసంతో పెద్ద చిక్కొక్కటి తీరిపోయింది ప్రపంచం యొక్క మూడు కొలతలూ పరిమితమైనవి కావటమే కాకుండా వాటికి కొసలుండవలసిన అవసరం తప్పింది.

ఈ విషయంలో శాస్త్రం మన లౌకిక బుద్ధిని సమర్థించుతున్నదని చెప్పాలి. ఏమంటే యథార్థ ప్రపంచానికి అపరిమితమైన కొలత లుండటం అసంభవం భూమి వలయంగా ఉండక ఎంత దూరంపోయినా ఉంటూ వచ్చినా, అకస్మాత్తుగా అయిపోయినా, మనం వెర్రివెధవలం అయిపోయి ఉందుము ప్రపంచమైనా అంతే

మరి ప్రపంచపు నాలుగో కొలత అయిన కాలం మాటేమిటి ? అది కూడా పరిమితంగానూ స్వరూపంలో వలయంగానూ ఉందనే భావించాలి లేదా ప్రపంచం మనం ఊహించే విధంగా యథార్థం కాదని అయినా అనుకోవాలి. ఈ రెంటిలోనూ మన బుద్ధికి విశ్వసించదగిన విశ్వాసం మొదటిదే. కాలమనేది ప్రపంచపు కొలత అనీ, అది కూడా పరిమితమైనదీ వర్తులమైనదీ అని విశ్వసిస్తే ఆ విశ్వాసంమీద బయలుదేరటానికి సావకాశం వున్న ఇతర విశ్వాసాలేమిటో చూతాం.

గతమూ, అనాగతమూ అక్కడే ఉన్నవనే విశ్వాసానికి తావున్నదని అదివరకే తెలుసుకున్నాం. మన కళ్ళ ఎదుట సృష్టీ, పరిణామమూ, క్షయమూ కనిపిస్తున్నమాట నిజమే. కాని ఒక దిక్కుగా ప్రయాణం చేస్తున్నవాడి ఎరుకను నమ్మటానికి వీలులేదు మనం రైలులో పోతుంటే చెట్లూ, కొండలూ మొదలైనవి దూరానపుట్టి పెద్దవై మనని సమీపించి మననిదాటి వెళ్ళి

మళ్ళీ దూరాన అంతరించిపోతై కాని అవన్నీ అంతలో పుట్టి అంతలో పోలేదని మనం ఎరుగుదుం అదే సూర్యుడు భూమిచుట్టూ తిరగటం లేదనీ మన కదలిక వల్లనే అతని స్థితి మారుతున్నట్టు భ్రమ కలుగుతున్నదనీ తెలుసుకోవటానికి విజ్ఞానం అవసరమవుతున్నది

అందుచేత కదిలేవాడి దృష్టికి కదలికగా కనపడేదంతా కదలిక అనుకోవటానికి వీలులేదు మన ఎరుక కాలం దిక్కుగా కదలుతున్నది. అటువంటప్పుడు మనం ఎరుకకు మార్పుగా కనిపించేదంతా మార్పు కాకపోవటానికి అవకాశం వుంది. మనం చూస్తున్న మార్పూ కదలికా కాలంలో మన ఎరుక చేస్తున్న ప్రయాణం వల్లనే కావచ్చును అంటే మూడు కొలతల ప్రపంచం నాలుగో కొలతలో ప్రయాణం చేసే ఎరుకకు మార్పు చెందుతున్నట్టు కనపడినప్పటికిన్నీ నాలుగు కొలతల ప్రపంచంలో కదలిక లేదన్నమాట చేపకు నది ఒడ్డులో కనుపించే కదలికా మార్పూ భ్రమ అయినట్టు.

నాలుగు కొలతలు కల ప్రపంచం కూడా మారుతూ పరిణామం చెందుతున్నదే అనుకుందాం ఆ కదలికకు అవకాశం కలిగించటానికి అయిదో కొలత ఉండి ఉండాలి యధార్థ ప్రపంచానికి అసంఖ్యాకపు కొలతలుండవు కనుక ఏదో ఒక కొలత దగ్గిర మనకు స్థావరమై, పరిణామం ఎరగని ప్రపంచం చిక్కాలి గత్యంతరం లేదు. ఈ దృష్టితో చూసినట్టయితే ప్రపంచాన్ని దాని సమస్త కొలతలతోనూ అవగాహన చేసుకునే ఎరుక మనకుండినట్టయితే సృష్టిని గురించి మన అభిప్రాయం యావత్తూ మారిపోతుంది సృష్టిలో కదలిక లేదు, పరిణామం లేదు. అది కేవలమూ జడమైనది. అందులో "ఆకల్లాడదు"

మనం ఉత్పత్తిని సృష్టి అంటున్నాం ఈ సృష్టిలో ఉత్పత్తీ లయమూ రెండూ లేవు - కేవలమూ స్థితే. ఈ మాట అనుకోవటం కూడా మనకు కష్టసాధ్యం కాదు బ్రహ్మాండంలో ఉన్న పరమాణువులు పరిమితమైన సంఖ్య గలవేననీ వాటిలోనించి ఒకటి అంతరించటంగాని మరొకటి ఉత్పత్తి కావటంగాని అసాధ్యమనీ శాస్త్రజ్ఞులు చెబుతున్నారు కనుక మనం చూసేదంతా ఈ పరమాణు సముదాయంలో కలిగే మార్పే. తెలుసుకునేటందుకు మనకన్నీ కొండ గుర్తులే కనుక కొన్ని మార్పులను ఉత్పత్తిగానూ మరికొన్నిటిని పరిణామంగానూ మిగిలినవాటిని లయంగానూ భావిస్తున్నాం మనకు తెలిసినంతవరకూ ఈ పరమాణువులలో కలిగే ప్రతి ఒక మార్పు కాలంమీద ఆధారపడినదే కనుక సృష్టి నాలుగు కొలతలు కలదనీ, దాని నాలుగో కొలత కాలమనీ తెలుసుకొన్నవాడికి సృష్టిలో మార్పులేదని తెలిసిపోతుంది. ఈ సృష్టికి కారణభూతుడైన భగవంతుడు మనం ఊహించే, పూజించే భగవంతుడికి ఎంత భిన్నంగా ఉండవచ్చునో ? ఈ భగవంతుణ్ణి ప్రార్థించటం ఎట్లా ? దేనికని ?

మనం పైన చర్చించినదంతా యధార్థమే ననుకొన్నట్టయితే - కాదనుకోవటానికి తార్కికంగా అభ్యంతరం ఏమీ ఉండదు - విధి ఉందనే నమ్మాలి జరగబొయ్యేది కూడా జరిగే ఉంది దాన్ని తప్పించేటందుకేమీ సాధనాలు కనిపించవు.

విధి ఉందనుకోవటానికి నాకేమీ అభ్యంతరం లేదు. కాని విధిని నమ్మినవారు కొందరు అవలంబించే ప్రవర్తన మాత్రం నాకు అర్థం లేనిదిగానూ, అసహ్యంగానూ కనబడుతోంది ఒక్క సూత్రంమీద ఒక్క విశ్వాసంతో జీవితం సాగదు. నాలుగు కొలతలు గల జడసృష్టిలో మన ప్రయత్నంమీద కలిగే మార్పేమీ లేకపోయినప్పటికీ, మూడు కొలతలు గల ప్రపంచంలో కాలపరిభ్రమణం వల్ల కలిగే మార్పులను శాస్త్రీయమైన పద్ధతిలో అర్థంచేసుకుని జ్ఞానం సంపాదించి ఆ జ్ఞానాన్ని మన ఇష్టాయిష్టాలకు అనుకూలంగా ఉపయోగించుకోవటంలో తప్పేమీ లేదు.

విధిచేత భావి యావత్తూ నిర్ణయించబడే ఉందని నమ్మేవాడు తెలుసుకోవలసిందేమంటే

విధిచేత నిర్ణయించబడిన దానిలో ఉండే విధానం. విధిలో అయినప్పటికీ నిష్కారణంగా మామిడి చెట్టున తాటికాయలు కాయాలని నిర్ణయం అయి వుండదు జపానులో వచ్చే భూకంపానికి మనదేశ వాసులంతా చావరు నేను తిండితినాలని రాసిపెట్టి ఉంటే ఎందుకు తినలేకపోతాననే ఉద్దేశంతో ముసుగు పెట్టుకుని పడుకుంటే ఎవరూ వండని అన్నాన్ని నాచేత విధి తినిపించలేదు. విధిచేతి పనిముట్లలో మన భౌతిక శరీరాలు కూడా ఉన్నవని విధిలో విశ్వాసం ఉన్నవాడు మరవరాదు విధి అనేది మన కర్మకు చివరను గోచరిస్తుంది కాని మన కర్మకు బాహ్యంగా కాదు. కృష్ణుడు "కర్మాణ్యే వాధికారస్తే మా ఫలేషు కథాచన" అని ఎందుకన్నాడో విధిని నమ్మినవాడు సరిగా అర్థం చేసుకోవాలి కాని నిష్కామ కర్మ అనే ముక్క నాకు మింగుడు పడకుండా ఉంది కామం లేకపోతే కర్మలేదు కర్మ యావత్తూ కామంతో కూడుకున్నదే కాకపోతే విధి అంటూ ఒకటి ఉండటం వల్ల తేలేదేమంటే కర్మాంతానా ఫలం ఉండవచ్చు, ఉండకపోవచ్చు కర్మరాహిత్యం వల్ల మాత్రం ఫలప్రాప్తి లేదు అందుచేత కర్మచేసి తీరాలి - ఫలం కోరినప్పుడు, నిష్కాముకుడంటూ ఎవడైనా ఉంటే వాడు కర్మసన్యాసం చేయవచ్చును.

కాలం ప్రపంచపు నాలుగో కొలత అని సకారణంగా నిరూపించిన శాస్త్రజ్ఞులు మనం పైన చర్చించిన విషయాలన్నిటినీ విశ్వసించారని తెలపటం నా విధి వారు తమ విశ్వాసాన్ని సరిగా జీర్ణం చేసుకోలేదని నాకు అనుమానం. ఈ అనుమానానికి కారణాలు కొంచెం విపులంగా తెలుసుకోతగినవి

సృష్టి ఎంతకాలం కిందట జరిగి ఉంటుందనే సమస్య ఒకటి శాస్త్రజ్ఞులను చాలాకాలంగా బాధిస్తూ ఉండింది ఆ సమస్యను పరిష్కారం చెయ్యటానికి వారు కొంతకాలం కిందట ఒక చక్కని విధానం కనిపెట్టారు. "ఎంట్రోపీ ఈక్వేషన్" ద్వారా సృష్టి ఇంతకాలం క్రితం జరిగి ఉంటుందని ఆఖరుకు శాస్త్రజ్ఞులు తేల్చుకున్నారు. కాని అంతకాలం కిందట అకస్మాత్తుగా ఒక ఆదర్శప్రాయమైన జగత్తు - "ఎంట్రోపీ"కి సంబంధించినంతవరకు ఆదర్శప్రాయమైనది - ఎట్లా ఉనికి సంపాదించిందో అది ఊహించటం మాత్రం శాస్త్రజ్ఞుల తరం కావటంలేదు.

"ఎంట్రోపీ ఈక్వేషన్" లాటి గణిత సూత్రాలను శాస్త్రజ్ఞులు మహా దుర్వ్యయం చేస్తున్నారు ఆ సూత్రాలు కొంత లెక్కదాటితే పనిచెయ్యలేవు అటువంటి వాటిల్లో "గ్రావిటేషన్" కు సంబంధించిన లెక్కన పని చెయ్యవని శాస్త్రజ్ఞులు ఎన్నటికీ గ్రహించలేనట్టు కనిపిస్తారు

"ఎంట్రోపీ ఈక్వేషన్" లాంటి గణిత పత్రాలను శాస్త్రజ్ఞులు మహా దుర్వ్యయం చేస్తున్నారు ఆ సూత్రాలు కొంత లెక్క దాటితే పని చెయ్యలేవు అటువంటి వాటిల్లో "గ్రావిటేషన్"కు సంబంధించిన సూత్రం కూడా ఒకటి అవి అపారమైన లెక్కన పనిచెయ్యవని శాస్త్రజ్ఞులు ఎన్నటికీ గ్రహించలేనట్టు కనిపిస్తారు.

"ఎంట్రోపీ ఈక్వేషన్" ప్రకారం సృష్టి ఎంతకాలం కిందట జరిగిందో తేలటం అసంభవం అది శాస్త్రజ్ఞులకు తప్ప మరెవరికైనా తెలుస్తుంది. ఏమంటే, కాలాన్ని ఒక కొలతగా గల సృష్టి కాలానికి బాహ్యంగా జరిగి ఉండాలి కాని కాలంలో ఎట్లా జరిగి ఉంటుంది ? గోడలో గది ఎక్కడ ఉన్నదని అడగటంలో ఎంత అర్థం ఉంటుందో సృష్టి ఎప్పుడు జరిగిందని తర్కించటంలో అంత అర్థం ఉంటుంది. సృష్టి నాలుగు కొలతలు కలదనీ, కాలం కూడా దాని తాలూకు ఒక కొలత అనీ గుర్తించని శాస్త్రజ్ఞుడు లేడు. కాని సృష్టి కాలానికి బాహ్యంగా జరిగి ఉండవలసినదే కాని కాలంలో ఎట్లా జరిగి ఉంటుందని అడిగిన శాస్త్రజ్ఞుడు కూడా లేడు. నాకు తెలిసినంతవరకు ఈ శాస్త్రజ్ఞులంతా కలసి ఒక్క పరమాణువు సృష్టి అయ్యేటందుకు ఈక్వేషన్ (గణిత సూత్రం) చెప్పగలిగినట్టయితే,

బ్రహ్మాండంలో ఉన్న ఈ కోటానుకోట్ల పరమాణువులు సృష్టి కావటానికి ఈక్వేషన్ వెయ్యగలరు ! కాని పరమాణువులు కొత్తగా సృష్టి కావని శాస్త్రజ్ఞులే ఒప్పుకుంటున్నారు

మనం మన జీవితాలను సంవత్సరాలూ, నెలలూ, రోజులూ మొదలైన వాటిల్లో కొలుచుకోవటానికి అలవాటు పడి కాలాన్ని సృష్టి యొక్క కొలత కింద గణించటానికి సంశయించవచ్చును. తుపాకిలో నుంచి ప్రయాణం చేసే గుండు జీవితం అర్థం చేసుకున్నట్టయితే దాన్ని కాలంతో కొలవటం కంటె గజాలూ, అడుగులూ, అంగుళాలూ మొదలైన వాటిల్లో కొలవటమే యుక్తంగా తోచక తప్పదు అంత మాత్రానికే అడుగులూ, అంగుళాలూ మన ప్రాణానికి కొలతమానం కాకపోలేదు.

వర్తులమైన కాలంలో ఎన్ని కోట్ల జీవ ప్రపంచాలు ప్రయాణం చేస్తున్నవో ! మన కళ్ళ యెదుట ఉన్న జీవరాసుల ఎరుక మాత్రమే ఏకాంతంగా కాలాన ప్రయాణం చేస్తున్నదనుకోవటానికేమి అవకాశం ఉందీ ? మనకు అరక్షణం వెనుకగా మళ్ళీ ఇన్ని ఆత్మలు ప్రయాణం చేస్తున్నప్పటికీ వాటి ఎరుకను గురించి మనకు తెలుసుకునే అవకాశం లేదు. మన శరీరాల నుంచి మృత్యువు వల్ల విడిపడే ఎరుక కాలంలో ముందుకే వెళ్ళుతుందో లేక మనకు జరిగిపోయిన శతాబ్దాలలో వెళ్ళిపడుతుందో !

**(మహతి, జనవరి 1939)**

# 3. కాలం యొక్క స్వభావం

కాలం అనేదాన్ని గురించి తత్వవేత్తలు ఏమంటారో నాకు తెలీదు - నాకు తాత్విక జ్ఞానం దాదాపు ఏమీ లేదనే చెప్పవచ్చు శాస్త్రజ్ఞులు దాన్ని విశ్వం యొక్క నాలుగు కొలతలలో ఒకటిగా పరిగణిస్తున్నారు. అది సబబే కూడా. ఎందుచేతనంటే మూడు కొలతలు కలిగి వున్నా, కాలంలో ఉనికి లేని పదార్థం వాస్తవమైనది కాదు అందుచేత వాస్తవ జగత్తులోని ప్రతి వస్తువుకూ పొడుగు, వెడల్పు, మందముతో బాటు కాలంలో ఉనికి కూడా ఉండి తీరాలి

అయితే మిగిలిన కొలతలకూ, కాలపు కొలతకూ ఒక తేడా ఉన్నది కాలం కదులుతుంది మిగిలిన కొలతలలో ఎలాంటి మార్పులు కలిగినా అవి కాలాన్ని ఆశ్రయించి జరిగేవే మరొక తేడా ఏమిటంటే, మిగిలిన కొలతలలో మనం వెనక్కూ, ముందుకూ రావచ్చు ! పైకెక్కిన వాడు దిగవచ్చు. ఒక దిక్కుగా వెళ్ళినవాడు వెనక్కు తిరిగి రావచ్చు ఒకరి కాలంలో మాత్రమే మనం వెనక్కూ ముందుకూ వెళ్ళలేం ! (అలా వెళ్ళటానికి హెచ్. వెల్స్ ఒక యంత్రాన్ని - టైమ్ మెషిన్‌ను - భావన చేశాడు అయితే అది అభూతకల్పన మాత్రమే )

కాలానికీ మిగిలిన కొలతలకూ గల ఇంకొక తేడా ఏమిటంటే, మిగిలిన కొలతలలో మనం కదలగలిగిందయినా కాలపు కొలతలోనే మనం ఒక ఊరు నుంచి ఇంకొక ఊరుకు వెళ్ళి, మొదటి ఊరికి తిరిగి రావచ్చు ఆ వూరు ఏ కొలతలోనూ కదలకపోయినా కాలం కొలతలో కదిలింది మనం స్థాణువులుగా భావించేవి కూడా కాలం కొలతలో కదులుతూనే వున్నాయి. కాలానికీ కదలికకూ ఇలాంటి అవినాభావ సంబంధం ఉండటం చేతనే ఒకే వస్తువు ఒకే క్షణంలో రెండు చోట్ల ఉండలేదు.

దేవుడనేవాడు చైతన్య స్వరూపుడైతే, వాడు విధిగా కాల స్వరూపుడు కూడా కావాలి. ఏ కారణం చేతనైనా కాలం స్తంభించిపోతే మూడు కొలతల జగత్తులో జరిగే కర్మకాండ అంతా నిలిచిపోతుంది. విద్యుదయస్కాంత తరంగాలు కాంతి కిరణాలతో సహా - ప్రసారం కావు. ఆఖరుకు పరిమాణములో కేంద్రకాల చుట్టూ తిరిగే ఎలక్ట్రానుల గమనం కూడా నిలిచిపోతుంది. పదార్థం తన గురుత్వాకర్షణ శక్తులను కోల్పోతుంది. అయితే కాలం స్తంభించదు. దాన్ని స్తంభింపజేయగల శక్తి సృష్టిలో ఏదీ ఉన్నట్టు కనబడదు.

ఇలాంటి కాలాన్ని మనం భూత వర్తమాన భవిష్యత్తులుగా విభజించు కుంటున్నాం. జరిగినది, జరుగుతున్నది, జరగబోతున్నదీ - ఇవి అందరము అర్థం చేసుకోగలమనే అనుకుంటాం కాని సూక్ష్మంగా పరిశీలించినట్టయితే మనకు అవి అంత బాగా అర్థం కావని తేలుతుంది.

మహా సరళంగానో, అమిత సుగుణంగానో కనబడే ఈ కాల విభజనను కొంత అయోమయంలో పెట్టినవాళ్ళు శాస్త్రవేత్తలు. ఆకాశంలో మనం అనేక నక్షత్రాలను, నక్షత్ర కూటాలను చూస్తున్నాం కాని వాటి నుంచి కాంతి వచ్చి మనకు చేరుకొనటానికి ఏళ్ళూ, శతాబ్దాలూ, సహస్రాబ్దాలూ పడుతుంది. మనకు అన్నింటి కన్నా దగ్గరగా ఉండే నక్షత్రం నుంచి కాంతి మనని చేరడానికే నాలుగేళ్ళ చిల్లర కాలం పడుతుంది. కొన్ని నక్షత్రకూటాలు మనకు అనేక లక్షల, కోట్ల 'కాంతి సంవత్సరాల' దూరాన ఉన్నాయి. వాటిని మనం ఇవ్వాళ చూస్తున్నామంటే ఇవ్వాళ ఉన్నట్టు చూడటం లేదు. పూర్వం ఎప్పుడో ఉన్నట్టుగా చూస్తున్నాం. మాట వరసకు ఒక సాధారణ తార పేలి, తన కాంతిని కొన్ని వేల రెట్లకు పెంచుకుని మనం చూస్తుండగానే 'నవతార' అయిందనుకోండి. చూసిన పేలుడు 90 వేల ఏళ్ళ కాలం నాటిదన్నమాట. అలాగే మనం మనకు అత్యంత సన్నిహితంగా ఉండే తారా ప్రాంతాల్లో ఉండి భూమి మీది వివరాలు సూక్ష్మంగా

చూడగలిగామనుకోండి. జవహర్‌లాల్ నెహ్రూ ఇంకా జీవించే ఉంటాడు లాల్ బహదూర్ శాస్త్రి ఇంకా ప్రధానమంత్రి అయి ఉండడు

ఈ విధంగా చూసినట్టయితే "గతం" అనేది కళ్ళముందే, మన వర్తమానంలోనే గోచరం కావచ్చు. శాస్త్రవేత్తలూ, సాపేక్ష సిద్ధాంతాలు ఈ విషయాన్ని స్పష్టం చేశాయి. గతంలో జరిగిన సంఘటనలు అయి ఉండే పక్షంలో అన్ని భిన్న కాలాలలో జరిగినవైనప్పటికీ, జగత్తులో ఏదో ఒక ప్రదేశం నుంచి చూసి, ఒకే క్షణంలో జరిగినవిగా గమనించవచ్చు.

కాని భవిష్యత్తు గురించి ఇలా చెప్పటానికి లేదు. జరగని సంఘటనను విశ్వంలో ఏ మూల నుంచీ మనం గమనించలేం అంటే కాల గమనం ముందుకే గాని వెనక్కు లేదు జరగబోయేది చూడటానికి ఎలాంటి భౌతికమైన సదుపాయమూ లేదు ఇది శాస్త్రం

ఈ విషయం ఇక్కడ వదిలేసి ఒక కుశంక లేవదీస్తాను వర్తమానమనేది లేదు. దాన్ని మనం శాస్త్రీయంగా నిర్వచించలేం దాని ప్రమాణాన్ని అసలే ప్రతిపాదించలేం. వర్తమానమనేది ఒక రోజా, గంటా, నిమిషమా, లిప్తా, లిప్తలో సహస్రాంశమా ? ఎంత ? నిత్య జీవితంలో ఈ వర్తమానం యొక్క ప్రమాణం సమయోచితంగా మారుతుంది ఒకడు స్నానం చేస్తున్నాడు స్నానం ముగిసేదాక పట్టేకాలం వర్తమానం. గ్రామఫోను పాడుతున్నది, రికార్డును బట్టి అది పాడడం మూడు నిమిషాలు పట్టవచ్చు, ఆరు నిమిషాలు పట్టవచ్చు, ఇరవై నిమిషాల చిల్లర పట్టవచ్చు. ఆ జరిగే పని పూర్తి అయ్యే దాకా అది వర్తమానమే

సాధారణంగా ఒక అనుభవం 'గతం' అయితేనే గాని దాన్ని గురించి మనం తెలుసుకోలేం. సూర్యుడు ఉదయించటం ప్రారంభమయ్యాకనే మనం సూర్యుడు ఉదయిస్తున్నాడంటాం. అలాగే మిగిలిన విషయాలు కూడాను

మన జ్ఞానేంద్రియాలన్నీ కూడా జగత్తును గురించి తెలుసుకోవడానికి కొంత కాలం - కొద్దికాలమే కానివ్వండి - అవసరమవుతుంది. ఒక్క కాంతి తరంగాన్ని చూసి ఇది పసుపుపచ్చరంగు అని కన్నుగాని, ఒక ధ్వని కంపనాన్ని విని ఇది ఫలాని స్వరం అని చెవిగాని చెప్పలేదు అనుభవాలు మెదడుకు నరాల వెంబడి చేరి అక్కడ జ్ఞాన విభాగాలను చైతన్యవంతం చెయ్యటానికి కాలం పట్టుతుంది. అందుచేత మనకు ఒక ఘటన గురించిన 'జ్ఞానం' కలిగే సరికే ఆ ఘటన కొంతవరకైనా గతంలోకి వెళ్ళిపోయి ఉంటుంది.

అదేవిధంగా భవిష్యత్తు కూడా కేవలం శాస్త్రదృష్టితో చూసి భావించినంత అయోమయం కాదు. ఇంకో నూరేళ్ళ అనంతరం కలగబోయే సూర్యగ్రహణాలను కొద్ది సెకండ్ల వ్యత్యాసంతో చెప్పవచ్చు పుట్టినవాళ్ళంతా చచ్చిపోయి తీరుతారని రూఢిగా అందరికీ తెలుసు అసంఖ్యాకమైన విషయాలలో మనం భవిష్యత్తును ఇంచుమించు సరిగానే అంచనా వెయ్యగలుగుతున్నాం ఈ అంచనా పైన ఆధారపడి మన కార్యక్రమాలను నిర్ణయించుకుంటున్నాం ఈ కార్యక్రమాలలో హెచ్చుభాగం సరిగానే అమలు జరుగుతున్నాయి "భవిష్యత్తులో ఏముందో ఎవరు చెప్ప గలరు ?", "రేపు నీది కాదు, ఇవాళే అనుభవించు", ఇలాంటి మాటలు నిరాశాభావం నుంచీ, జీవితంలో ఓటమి నుంచీ పుట్టినవి మానవజాతి యొక్క పురోగమనానికి ఒక తిరుగులేని కొలతబద్ధ భవిష్యత్తును ఎంత కచ్చితంగా అంచనా కట్టగలమన్నది. అంచనాలు ఎడా పెడా తప్పుతూండడం వ్యక్తి యొక్క అసమర్థతకూ, జాతి యొక్క అసమర్థతకూ కొలత బద్దలు

భవిష్యత్తును వీలయినంత నిర్దుష్టంగా అంచనా కట్టటానికి విజ్ఞులు సర్వతోముఖ ప్రయత్నాలు చేస్తున్నారు ఇక్కడ కూడా శాస్త్ర విజ్ఞానం సహాయ పడుతున్నది వాతావరణంలో కలగబోయే మార్పులూ, ఎన్నికల అనంతరం కలగబోయే ఫలితాలూ, రాబోయే భూకంపాలూ,

అర్థిక పరిస్థితులూ, ఫలసాయాలూ ముందుగా తెలుసుకునే మార్గాలు ఆధునిక నాగరికతలో అతి ముఖ్యమైన స్థానం సంపాదించుకున్నాయి. వార ఫలితాలు ఈ నాగరికతకు పారడీ లాంటివి.

గతానికి భవిష్యత్తుకూ మధ్య వర్తమానాన్ని ఊహించుకుంటూ జీవించే మనం గతాన్ని నిర్లక్ష్యంగా చూస్తే భవిష్యత్తు లేకుండా పోగొట్టుకున్న వాళ్ళమవుతాము. భవిష్యత్తును లక్ష్య పెట్టక పోయినట్టయితే వర్తమానం మనని కుంగదీసేస్తుంది గతాన్ని మరవకుండా భవిష్యత్తును అంతో ఇంతో సరిగా అంచనా కట్టినప్పుడే వర్తమానం సార్థకమనిపిస్తుంది. జీవితానికి విలువ ఏర్పడుతుంది

× × ×

ఇటీవలి పత్రికలలో భవిష్యత్తు విషయం కొంత ఘర్షణ జరిగింది. భవిష్యత్తును గురించి తెలుసుకోవచ్చునన్నవారు శాస్త్ర జ్ఞానాన్ని ఆశ్రయించక, కొన్ని విశ్వాసాలను ఆశ్రయించారు. మన పురాణాలలో భవిష్యత్తులో జరగబోయేది తెలుసుకున్నట్టు చెప్పబడిన వాళ్ళున్నారు. "దివ్యదృష్టి" గురించి ఉన్నది. తపశ్శక్తో, యోగశక్తో వారికా శక్తి నిచ్చిందనుకోవాలి.

పురాణాలలో చెప్పిన వాటిని మనం విశ్వసించవలసిన పనిలేదు పురాణాలలో ఉన్న కారణం చేత దేనిని గాని నేను విశ్వసించడానికి సిద్ధంగా లేను కాని ఏ తపస్సూ లేకుండానే అతి సామాన్య వ్యక్తులు జరగబోయేది చెప్పటమో, "చూడటమో" చేసిన సందర్భాలు కోకొల్లలుగా ఉంటున్నాయి వీటిని కొట్టిపారెయ్యటానికి లేదు. కొందరు వ్యక్తులు ఒక్కొక్క స్థితిలో ఏ శక్తి సహాయంతోనో, జరగబోయేది ముందుగా చెప్పగలుగుతున్నారు శాస్త్రజ్ఞులీ శక్తిని గురించి తగినంత పరిశోధనలు చెయ్యటం లేదు. దీన్ని "ప్రీకాగ్నిషన్" అన్నారు అలాంటిది ఒకటి ఉన్నదని గట్టిగానే రుజువు చేశారు అయితే దానికి గల ఆధారమేమిటో తెలియటం లేదు

నేను స్వయంగా ఇంకొక విషయం గమనించాను కలలలో కాలం ఎదురు నడుస్తుంది. చాలామందికి వచ్చే కల ఒకటి ఉన్నది వాళ్ళు ఏ కొండ మీదికో కలలో వెళతారు అక్కడ ఏవేవో జరుగుతాయి. అకస్మాత్తుగా వాళ్ళు కొండ మీద నుంచి పడిపోతారు. గాభరాగా నిద్ర లేస్తారు, తీరా చూస్తే చెయ్యి దిండు మీద నుంచి పక్క మీదికి పడటమో లేక అలాంటిదే మరొకటో జరుగుతుంది. చెయ్యి పడటానికి వాళ్ళు కలలో కొండమీద నుంచి కింద పడటం సంకేతమయే పక్షంలో దానికి కలలో బోలెడంత ఉపోద్ఘాతం ఉంటుంది ఎంత పెద్ద కల అయినా క్షణంకంటే ఎక్కువ కాలం పట్టదని శాస్త్రవేత్తలు చెప్పవచ్చు కాని అప్పటికీ కలగనే వాడికి కాల ప్రమాణం మారిందని ఒప్పుకోక తప్పదు.

అనేక సంవత్సరాల క్రితం నాకు వచ్చిన కల అట్టే పెద్దది కాదు, కాని అందులోని వివరాలు కాలం వెనక్కు నడిచినట్లు స్ఫురింపజేస్తాయి. కలలో నేనొక ప్రదేశంలో నిలబడి ఉన్నాను. మట్టి నల్లగా ఉన్నది. ఎక్కడా ఒక గడ్డి పరక కూడా లేదు "ఇదేం ప్రదేశం అయి ఉంటుంది ? శ్మశానం కాదు గద ?" అనుకున్నాను. ఆ మాట అనుకున్న మీదట నాకు అక్కడక్కడా బూడిద కుప్పలు కనిపించాయి. "ఇంకేం ? ఇది శ్మశానమే ! శ్మశానమైతే ఈ చీకటి సమయంలో నక్కలు కుయ్యావేం ?" అనుకున్నాను. ఈ అనుకున్న క్షణంలోనే నాకు నక్కల కూతలు వినిపించాయి. నిద్ర లేచాను ఫాక్టరీలు కూస్తున్నాయి !

ఒక్కటి స్పష్టం - నేను ఫాక్టరీ కూతలను ముందుగానే విని, వాటిని నక్కల కూతలని భ్రమ చెంది, శ్మశానం భావన కలిగించుకుని, బూడిద కుప్పలని మానసికంగా సృష్టించి ఉండాలి. కాని ఆ బూడిద కుప్పలు కనబడక ముందే, ఫాక్టరీ కూతలు వినబడక ముందే శ్మశానం అన్న భావం నా తలలోకి వచ్చింది అందులో ఏమీ సందేహం లేదు చూడగా నేను కలలో కాల

గమనానికి ఎదురు వెళ్ళాననిపిస్తుంది  అంతకన్న మంచి ఎక్స్‌ప్లనేషన్ శాస్త్రజ్ఞులిస్తే ఇవ్వవచ్చు నా కల మాత్రం వాస్తవంగా నేను చెప్పిన క్రమంలోనే జరిగింది

ఇంతా అయ్యాక నేను చెప్పదలచిన విషయమేమంటే, ప్రపంచంలో ఒకరిద్దరు వ్యక్తులే, ఒకటి రెండు సార్లే భవిష్య ఘటనలను చూసినట్టు చెప్పినప్పటికీ భవిష్యత్తుకూ, గతానికీ తేడా లేదేమోనన్న శంక - కుశంకే అనండి - కలుగుతుంది.

రైలు ప్రయాణం చేసేవాడు కొత్త చోట్లను చూస్తూ పోతాడు  అవి వాడు చూస్తుండగా సంఘటించలేడు  అవి అక్కడే వున్నాయి  కదలిక వాటిని ప్రయాణీకుడి వర్తమానానికి తెచ్చి, గతంలోకి పంపుతున్నది  సినిమా చిత్రం చైతన్యంతో కూడి ఉన్నట్టు ప్రేక్షకుడికి కనిపిస్తుంది కాని ప్రొజెక్టరు నిలిపి ఫిల్మును బయటికి తీస్తే అన్నీ కదలని బొమ్మలే  భూత భవిష్యద్వర్తమానాలన్నీ స్థాణువులుగా ఎదుట కనిపిస్తాయి  కాలం కూడా చేతనారహితంగా పరుచుకుని ఉన్నదా ? చైతన్యం మన ఎరుకనే ఆశ్రయించి ఉండటం చేత కాలం కదులుతున్నట్టు భ్రమ కలుగుతున్నదా? ఈ సమస్యను తత్వవేత్తలే కొరకాలి

**(ఆంధ్రప్రదేశ్, మాసపత్రిక, జూలై 1966)**

# 4. స్థలకాలాలతోపాటు జగత్తుకు మరొక కొలత "బుద్ధి"

జగత్తుకు రెండు "కొలతలు" - స్థలము (Space), కాలము (Time) - వున్నట్లు శాస్త్రజ్ఞులు చెబుతున్నారు నిజానికి, ఈ రెంటిలో ఏది లేకపోయినా జగత్తు లేదు. జగత్తులోగల ప్రతి పదార్థం కొంత స్థలం ఆక్రమించి వున్నది ఒకే జాగాలో రెండు భిన్న వస్తువులు ఏకకాలంలో వుండలేవు ఆఖరుకు నీటిలో ఉప్పుగాని, చక్కెరగాని కరిగినప్పుడు కూడా నీటి అణువుల అంతరాలలో కరిగిన పదార్థపు కణాలు చేరుతాయి. రోడ్డుమీద రెండు వాహనాలు ఒకేసారి ఒకే స్థలంలోకి రావడానికి యత్నించినపుడు ఆ వార్త పత్రికలలో పడుతుంది

"స్పేస్" అనే ఇంగ్లీషు మాటకు అందరకూ తెలిసేమాట తెలుగులో ఏమిటో నాకు తెలీదు కాని, శాస్త్రవేత్తలకు అది చాలా ముఖ్యమైన మాట. దానికి సంబంధించిన జ్ఞానం ఎంతో సేకరించబడి వున్నది మనం ప్రస్తుతం దాని జోలికిపోయే పనిలేదు.

జగత్తుకు వాస్తవికత కలిగించడానికి కాలం అత్యవసరం. స్పేస్‌లో మాత్రమే ఉనికి కలిగి, కాలంలో ఉనికిలేనిది ఏదైనాసరే నిజమైన భౌతిక వస్తువు కాదు ఇటీవల కనిపెట్టిన సరికొత్త న్యూక్లియర్ పార్టికల్ కూడా సెకెండులో అనేక కోట్ల వంతు కాలం మన్నిక కలదే. లేకపోతే, అది సృష్టిలో లేనట్టే లెక్క వ్యక్తిపరంగా మనకు ఒక వస్తువు గురించి స్పృహ కలగాలన్నా దాని నుంచి మన కంటికి తరంగాలు ప్రసారం కావడానికి కొంతకాలం - ఎంత స్వల్పమైనా కానియ్యండి - అవసరం అవుతుంది అలాగే ధ్వనులు ఆలకించడానికి, చలీ, వేడీ తెలియడానికి కొంతకాలం పడుతుంది.

జగత్తులో ఏ మార్పు జరిగినా, అది స్థలంలోనూ, కాలంలోను జరుగుతున్నదనడానికి సందేహం లేదు.

జగత్తుకు ఈ రెండు కొలతలు కాక, ఇంకేమైనా వున్నవా అన్నది ఒక విధంగా తాత్విక సంబంధమైన ప్రశ్న భౌతికవాదులు అలాంటి ప్రశ్నను లక్ష్య పెట్టరు. పరమాణువులో కలిగే మార్పులు మొదలుకొని సమాజంలో జరిగే మార్పులు వరకు అన్నీ స్థలంలోను, కాలంలోను జరుగుతున్నాయనడానికి బలమైన ఆధారాలున్నాయి.

ఈ ఆధారాలు పరిపూర్ణంకావని, భౌతిక దృక్పథంలో కూడా "బుద్ధి" అనేది జగత్తుకు మరొక "కొలత"గా పనిచేస్తున్నదని నేను ప్రతిపాదించదలిచాను దీన్ని రుజువు చేయడం నా ఒక్కడివల్లా ఎలాగూ కాదు, అందుకు తగిన జ్ఞానపుష్టి నాలో లేదు. మరొక కారణం కూడా వున్నది. అది నా వాదనలోనే స్పష్టం అవుతుంది. జ్ఞానం వ్యష్టి కృషి ఫలితం కాదు

**బుద్ధి పరిణామం**

జీవుల పరిణామంతోపాటు మేధస్సు కూడా పరిణామం చెందిన సంగతి అందరికీ తెలిసినదే ఆదిలో సృష్టి అయిన జీవకణాలకు మెదడు లేదు అనేక కోట్ల ఏళ్ళ మీద మెదడు అన్నది ఏర్పడి, క్రమ పరిణామం చెంది మానవుడి దగ్గరకు వచ్చేసరికి (ప్రస్తుతానికి) పరాకాష్ఠ అందుకున్నది. ఇది ఇంకా పరిణమించదని చెప్పడానికి లేదు

ఇతర జంతువులతో పోల్చితే మానవుడు అనేక దేహశక్తులు కోల్పోయాడు మనిషి జ్ఞానేంద్రియాలకన్న చురుకుగా పనిచేసేవి, మనిషి కర్మేంద్రియాలకన్న బలవత్తరమైనవి, మనిషికన్న తక్కువ పరిణితి గల జంతువులలో చాలా వాటికి వున్నాయి. కాని మెదడు సహాయంతో అన్ని జంతువులకు గల అన్ని సామర్థ్యాలను మించిన మనిషి 'కృత్రిమంగా' సాధించాడు, అంతేకాదు, వాటిని అధిగమించి చాలా దూరం పోయాడు నిప్పు చెయ్యడం దగ్గర నుంచి అంతరిక్షంలో

ప్రయాణించడం వరకు మానవుడు చెయ్యగ కోట్లాది పనులు సృష్టిలో ఏ ఇతర ప్రాణికి సాధ్యం కావు. ఇది మానవుడు సాధించిన బుద్ధి పరిణామం

దీనితో మానవుడు కాలం మీద, స్థలం మీద చెప్పుకోదగిన ఆధిపత్యం సంపాదించాడు. మానవుడు భూమి మీద అవతరించక పూర్వం కూడా జంతువులు అప్రయత్నంగా తమ పరిసరాల నైసర్గిక స్వరూపాన్ని మార్చి వుండవచ్చు. కాని, మానవుడు ప్రయత్నపూర్వకంగాను, ప్రయోజనాత్మకం గాను ఆ పని చేశాడు ఈజిప్టులో నైల్ నది పరిసరాలు వాటంతట అవి సస్యశ్యామలం కాలేదు. మానవుడు తన బుద్ధిని ఉపయోగించి, బురద భూములను మార్చి అరణ్య ప్రాంతాలలో శుభ్రం చేసి అక్కడ దేదీప్యమానమైన నాగరికత వెలియజేశాడు కీకారణ్యాలు మొదలుకొని శాశ్వతంగా మంచు వుండే స్థలాలను, ఎడారులను, కొండ ప్రాంతాలను కూడా మానవుడు వాసయోగ్యం చేసుకోగలిగాడు. పరిణామ దశలలో అనేక రకాల ప్రాణులు వాతావరణంలో సహజంగా కలిగిన మార్పులకు తట్టుకోలేక జాతులకు జాతులే అంతరించాయి కాని మానవ ప్రాణి మాత్రం అన్నిరకాల వాతావరణానికి తట్టుకుని నిలబడ్డాడు.

ఈ బుద్ధి పరిణామానికి కాలంతో విడని సంబంధం వున్నట్టు కనిపిస్తుంది ఎందుకంటే, పరిణామదశలో వెనక్కు పోయినట్టయితే బుద్ధికి అవకాశం క్రమముగా క్షీణిస్తూపోయి ఏకకణ జీవుల వరకు పోకముందే పూర్తిగా అంతర్థానమయినట్టు తోస్తుంది. అంతవరకు పోనవసరం లేదు రాతియుగం నాటి మానవుడు లగాయతు ఆధునిక నాగరిక మానవుడి వరకు బుద్ధి వికాసం అత్యద్భుతంగా పెరిగిపోయినట్టు కనబడుతుంది

ఇలా అనిపించడానికి ఒక కారణం, మనం బుద్ధిని నేరుగా మెదడుకు ఆపాదించడం అని నా నమ్మకం. కాలక్రమంలో అభివృద్ధి అయినది మెదడు, నేరుగా బుద్ధికాదు చరిత్రలో ఏ యుగంలోనైనా సమకాలిక మానవుల మెదడు నిర్మాణంలో కన్న బుద్ధి వికాసంలో చాలా హెచ్చు వ్యత్యాసాలుంటూ వచ్చాయన్నది స్పష్టం. ఈనాడైనా అంతే పచ్చి ఆటవిక మనస్తత్వం నుంచి అత్యున్నత భావస్ఫూర్తి గలవారి వరకూ అన్ని రకాల మనుషులూ మనకు కానవస్తారు అలాంటి తేడా మనుషుల మెదడులో వుండటానికి లేదు.

బుద్ధికి మెదడు సాధనం అన్నంతవరకు బుద్ధి మీద కాలప్రభావం నిస్సందేహంగా వున్నది కాని శరీర పరిణామంలాగా అది కాలానికి పూర్తిగా కట్టుబడి వుండటం లేదు ఆదిమ వానరాల కాలంలో మానవ మేధకు అవకాశం లేదని రూఢిగా చెప్పవచ్చుగాని, ఆధునిక యుగంలో ఆదిమ వానర మనస్తత్వానికి అవకాశం లేదని చెప్పడానికి వీలులేదు. గడచిన ఇరవైవేల ఏళ్ళుగా బహుకొద్దిపాటి వికాసం మాత్రమే సాధించిన మానవ సమాజాలు ఈనాటికీ ఉన్నాయి. అలాంటివాళ్ళ మెదడు పరిణామం చెందలేదనటానికి లేదు అంతేకాదు, తోడేళ్ళ మధ్య పెరిగిన ఒక కుర్రవాణ్ణి శాస్త్రవేత్తలు పరిశీలించి వాణ్ణి "మనిషిని" చెయ్యటం అసాధ్యమని నిర్ణయించారు వాడికి మాటలు రాలేదు. అవకాశం దొరికితే "నాలుగు కాళ్ళ" మీద పరిగెత్తాడు ! వాడి మెదడు వాడికి ఏ సహాయం చేసింది ?

బుద్ధి మెదడు మీద ఆధారపడినదే అయినా కాలానికి పూర్తిగా కట్టుబడినది కాదు గతమూ, భవిష్యత్తూ అన్న భావన జంతువులకు లేదు. అవి గతాన్ని తమ ధాతువుల్లోనే జీర్ణించుకున్నాయి కాని బుద్ధితో గ్రహించలేవు మనిషి మాత్రమే నక్షత్రాలకేసి చూసి గతాన్ని చూస్తున్న సంగతి గ్రహించగలడు. భవిష్యత్తుకు ప్రణాళికలు, పథకాలు వెయ్యగలడు. గతాన్ని చిత్తరువుల ద్వారా, శిల్పాల ద్వారా, ఫోటోల ద్వారా, సినిమాల ద్వారా, రికార్డింగుల ద్వారా కాలానికీ, స్థలానికీ అతీతంగా వుంచగలడు. అతడి బుద్ధి సహజ ప్రేరణలతో పనిచేయదు జ్ఞానంద్వారా

పనిచేస్తుంది. జంతువులకు జన్మ పరంపరలోనే సమస్తమూ సంక్రమిస్తుంది. మనిషి అదనంగా తరాల వెంబడి జ్ఞానాన్ని పోగుచేసుకుంటూ రావాలి

**బుద్ధి సామాజిక భావం**

సామాజిక జీవితం మనిషితోనే ఆరంభం కాలేదు. ఇతర ప్రాణుల సామాజిక జీవితంలో పరిణతి లేదు ఎన్నో వేల ఏళ్ళుగా తేనెటీగలు ఇప్పటిలాగే తేనె నిలవజేస్తూ వస్తున్నాయి. చీమలు తమ "నగరాలు" నిర్మిస్తున్నాయి కాని ఏ ఇతర ప్రాణీ సాధించలేని "సామాజిక పరిణామం" మనిషి సాధించగలిగాడు జ్ఞానాన్ని సమాజంలో వ్యాప్తి చెయ్యడం ద్వారా ఇది సాధ్యమయింది మనిషి రాతి పరికరాలు చేసినప్పుడు కూడా వాటికి పనికివచ్చే రకరకాల శిలలనన్నిటిని ఎవడో ఒక్కడు కనిపెట్టి వుండడు.

సామాజిక పరిణామంలో భాష మొదట, లేఖనం తర్వాత ఎంతో అద్భుతమైన పాత్ర నిర్వహించాయి. వాటిద్వారా విజ్ఞానం కూడా స్థలానికి, కాలానికి అతీతమయింది. నాగరికతకు బలమైన పునాది అదే బుద్ధి వికాసానికీ, జ్ఞానానికీ మధ్య మరొక మెట్టు వున్నది అది కృషి లేక ఆచరణ. ఉదాహరణకు రాతియుగంలో నివసించే వాళ్ళకు అరఫర్లాంగు దూరంలో రాగిగని వుండవచ్చు. ఎవరైనా వాళ్ళకు రాగిని కరిగించి పోతపోసే పద్ధతులు తెలిపినప్పటికీ వాళ్ళు రాతి పరికరాలను వదిలేసి రాగి, కంచు పరికరాలను ఉపయోగించే దశలో వుండరు ఎందుచేత ? ఆనాటి సమాజం అదనపు వుత్పత్తి చేసే పరిణామ దశను అందుకోలేదు అదనపు ఉత్పత్తి వుంటే గాని కొందరు ఆహారోత్పత్తి నుంచి వైదొలగి లోహ పరిశ్రమకు అంకితం కాలేరు. ముడిరాగిని కరిగించే ఉష్ణోగ్రత సామాజికంగా ఇంకా సాధ్యం కాలేదు. కుండలు కాల్చే ఆముల్లో రాగి కరగదు అంతవరకూ పోనవసరం లేదు. ఇనుముకన్న రాగి చాలా అరుదుగా లభ్యమవుతుంది. అయినా ముందుగా రాగి, కంచులనే వాడారు తరువాత చాలా కాలానికి గాని ఇనుము ప్రచారంలోకి రాలేదు. ఇనుము ఉపయోగంలోకి రావడం మానవ నాగరికతకు పెద్ద ముందడుగు. మనం ఇంకా ఇనుము యుగంలోనే వున్నాం. ఇలా ఎందుకు జరిగిందంటే, ముఖ్య కారణంగా చెప్పదగినది ఇనుము కరిగేటంత ఉష్ణోగ్రతను కాంస్యయుగ సమాజాలు సాధించలేదు

కృషిలో కలిగిన అభివృద్ధి కూడా సామాజికమైనదే అది ప్రత్యక్షంగా బుద్ధి వికాసానికి తోడ్పడుతుంది.

**(ఆంధ్రజ్యోతి, దినపత్రిక, 14-9-1975)**

# 5. మానవ జీవిత గతి నిర్ణయంలో "బుద్ధి" నిర్వహించే కీలకమైన పాత్ర

మానవ నాగరికత, బుద్ధి వికాసం ప్రపంచమంతటా ఏకకాలంలో జరగలేదన్నది అందరికీ తెలిసిన విషయమే అదనపు ఆహారోత్పత్తి, ఇతర వృత్తుల ద్వారా సంపద సృష్టికావటం, వర్గ విభజన ముందుగా జరిగిన చోట ముందుగా నాగరికతలు వెలిశాయి. అయితే ఈ నాగరికతకు పునాది సామాజిక దోపిడీ కావడం జరిగింది. అల్పసంఖ్యాకులు సంపదతోపాటు భాషాసాహిత్యాలనూ, విజ్ఞానాన్ని నిర్బంధంలో వుంచి, వాటి సామాజిక స్వభావానికి అంతరాయం కలిగించారు అందుచేత ఆ దేశాలలో నాగరికత ముందడుగు వేసింది అలా కాకుండా ముందు నాగరికత సాధించిన దేశాలలో స్వేచ్ఛకీ, బుద్ధి వికాసానికి అవకాశం కలిగించి, సామాజిక దోపిడీ లేకుండా చేసిన పక్షంలో ఆ దేశాలే కాలక్రమాన పురోగమించేవి సంపదను సృష్టించడంలో ముందుండిన బ్రిటన్, అమెరికా జర్మనీ, ఫ్రాన్సులలో కాక సామాజిక విప్లవం రష్యా, చైనా ఇంకా బడుగు దేశాలైన క్యూబా, వియత్నాం దేశాలలో రావటాన్ని బట్టి ఈ విషయం మరింత స్పష్టమవుతుంది. ఎవరో చెప్పినట్టు అమెరికాలో సోషలిజం ఏర్పాటు చెయ్యటానికి విప్లవకరమైన మార్పులు ఏమీ అవసరం లేదు అందుకు అడ్డంగా వున్నది సామాజిక దోపిడీ ఒకటే

సామాజిక పురోగమనంలోకూడా చరమదశ బుద్ధికే సంబంధించి వుంటుంది రాజకీయ విప్లవాలు కొద్ది ఏళ్ళలో పూర్తి కావచ్చు కాని సాంస్కృతిక విప్లవాల అవసరం చాలా దశాబ్దాలూ, శతాబ్దాలూ అలాగే వుండిపోతుంది ఎందుకంటే సామాజిక దోపిడీని వదిలించుకోవటం చాలా కష్టం రాతియుగంనాటి బుద్ధులు తిరిగి సంపాదించటం అంతకన్న చాలా తేలిక ఎక్కడం కష్టం. కిందపడటం తేలిక రాజకీయ విప్లవం అల్ప సంఖ్యాకుల కృషితో సాధ్యమవుతుంది బుద్ధి వికాసం ప్రజలందరిలోను తీసుకురావటం అపారమైన శ్రమతో కూడిన పని

**బుద్ధి ఒక ప్రత్యేకమైన 'కొలత' ?**

బుద్ధి అన్నది ప్రాదేశికంగాని, కాలనియమితం కాదని పై అంశాలు రుజువు చేస్తాయనుకుంటాను. కాని బుద్ధి జగత్తులోనే ఒక శాశ్వతమైన అంతర్భాగం అనడానికి ఆధారం ఏమిటి ? ఇది శాస్త్రీయంగా నిరూపించడం నాకు సాధ్యం కాదు కొన్ని ప్రతిపాదనలు మాత్రం చెయ్యగలను

బుద్ధికి సంబంధించిన ప్రయోగాలు ప్రాదేశిక ప్రయోగాలలాగా విఫలమవుతున్నాయి

మెదడుకు సంబంధించిన ప్రయోగాల మాట వేరు 'ప్రాడిజీలు' ఎలా అద్భుతమైన మానసిక శక్తులు ప్రదర్శిస్తారో మనకు తెలియదనుకుంటాను వాళ్ళ మెదడు నిర్మాణంలో ఏదైనా ప్రత్యేకత వుండినా, వారి "జీన్"లలో ఏదైనా విశిష్టత వుండినా-వున్నట్టు నాకు తెలీదు అది ముందు తరం వాళ్ళకోసం సంబంధించినట్టు కనబడదు. అందుకు కారణం ఏదైనా "మ్యుటేషన్" అయితే అది తరువాత తరానికి సంక్రమించినట్టు కనబడదు అందుచేత "ప్రాడిజీలు" అనబడేవాళ్ళు బుద్ధి 'కొలతలు' ఆకస్మిక పరిణామం సాధించిన వాళ్ళని నేను అనుకుంటున్నాను

"ఇన్‌స్పిరేషన్", "ఇంట్యూషన్" అనేవి ఎలా లభించేదీ చెప్పడం సాధ్యం కాదని నా అనుమానం. అనేకమంది రచయితలు, కవులు, కళాకారులు, తమ కృషికి ఏదో "ఇన్‌స్పిరేషన్" ఎక్కడి నుంచో లభించినట్టు ఒప్పుకుంటారు ముఖ్యంగా ప్రముఖ రచనల సందర్భంలో ఇలా చెబుతారు నిజానికి వాళ్ళు ఆ మాట అనకపోతే వారికి మరింత కీర్తి వస్తుంది అలాంటప్పుడు

వాళ్ళు తమ గొప్పతనాన్ని కనిపెట్టుకుని తగ్గించుకోవలసిన అవసరం కనబడదు. (మన పూర్వీకులు తమకు కలలో దేవుడు కనబడి ఫలాని రచన చేయమన్నాడని చెప్పడంలో ఆ రచనకు పవిత్రత సంపాదించే దురుద్దేశం వుండవచ్చు )

శాస్త్రపరిశోధనలో యాదృచ్ఛికంగా జరిగినవి అనేకం వున్నాయి. యాదృచ్ఛికంగా గొప్ప శాస్త్రాంశం బయట పడదని వాదించడం మూర్ఖత్వమవుతుంది కాని అలాంటివి కొన్ని "బుద్ధి" (కొలత) పూర్వకంగా జరగలేదని వాదించడం కూడా పిడివాదమే కావచ్చు. ఎందుచేతనంటే భౌతిక పరిణామంలో ప్రాణులకు లభించే కొన్ని రక్షలు - కవచాలు, పరిసరాలకు అనుగుణంగా శరీరాలు, రంగులు ఏర్పడటం లాంటివి - "నాచురల్ సెలక్షన్" ద్వారా వ్యాప్తి చెందినా, అలాంటి ఏర్పాటు మొదలు ఆరంభం కావడం "బుద్ధి"కి చెందిన ప్రక్రియగా కనబడుతుంది శరీర ధర్మాల వెనుక అంతులేని ఆశయాల పుట్ట వుండటం అందరికీ తెలిసినదే

మనసుకు సంబంధించిన ప్రయోగాలు కేవలం మెదడుకు సంబంధించిన ప్రయోగాల లాగా వుంటున్నాయి ఉదాహరణకు, టెలిపతీ గురించి ప్రయోగాలు చేస్తూ రష్యన్ శాస్త్రవేత్తలు భావతరంగాలను ఊహించుకుని వాటిని నిరోధించడానికి ప్రయత్నించి విఫలులయ్యారు టెలిపతీ (ఆలోచనలు ఒకరి నుంచి మరొకరికి అందడం) "బుద్ధి" కొలతలో జరిగే ప్రక్రియ అనుకుంటే ఈ ప్రయోగం తప్పు.

"సైకిక్" ప్రయోగాలు విఫలం కావడానికి కూడా ఇలాంటి కారణమే వుండి వుంటుంది.

**ఆదర్శవాదం**

సృష్టిలో బుద్ధి అనేది సృష్టికి బహిరంగా వున్నదన్న భావాన్ని మన సనాతనులు ఒప్పుకుని దాన్ని భగవంతుడు చేశారు - కాలాన్ని చేసినట్టే సృష్టిలో 'చేత' వున్నది చేత అన్నది బుద్ధి ద్వారాగాని కాదు జడపదార్థం ఏమీ చెయ్యదు. అందుచేత బుద్ధి రూపుదైన ఈశ్వరుడు సృష్టి చేశాడు ఇదీ వాళ్ళ ధోరణి కాని ఈనాటి భౌతికవాదం జడపదార్థం అనేదాన్నే అంగీకరించదు పదార్థంలో అనంతమైన శక్తి, చైతన్యం వున్నాయి ఈ చైతన్యం "బుద్ధి"లోనే జరుగు తున్నదను కోవడానికి అభ్యంతరం వుండనవసరం లేదు. పదార్థం ఏ నియమాలకు లోబడి చైతన్యం ప్రదర్శిస్తున్నదో మనిషి తెలుసుకోగలడు. వాటిని ప్రయోజనకరంగా ప్రయోగించుకోగలడు మనిషి బుద్ధి అన్ని జడపదార్థాలను సార్థకం చేస్తున్నది. వెనకటికి అమెరికాలో కాబోలు, ఎవరో నీళ్ళకోసం బావితవ్వి, నూనె పడేసరికి లబోమని ఏడిచాట్ట అప్పటికి వాడి సామాజిక బుద్ధి నూనె విలువ గ్రహించలేదు అది అలా వుంచి, అతి సూక్ష్మమైన కాస్మిక్ పదార్థం నుంచి సమస్త మౌలిక పదార్థాలు తయారవుతున్నాయి సూర్యుడిలాంటి గోళాలు, గ్రహ ఉపగ్రహాలలాంటి గోళాలు తయారవుతున్నాయి. వీటిని మనం "స్థల" పరిజ్ఞానంతో అవగాహన చేసుకోగలం గనుక ఇందులో "బుద్ధి" పాత్ర వున్నట్టు భావించడం లేదు కాని గర్భంలోకి ప్రవేశించిన ఒక మిత్రమకణం అనేక కోట్ల సంవత్సరాల పరిణామాన్ని కొద్ది మాసాలలో సాధించితే అందులో "బుద్ధి" పాత్ర లేదనడం సాధ్యం కాదు ఇంతకూ "బుద్ధి" గురించి తెలుసుకోదగినది కొద్దిగా వుండటం సహజం తెలుసుకోవలసినదే చాలా వున్నది

నాకు ఇంకొక్క విషయం కూడా తడుతుంది. మనం బుద్ధికి సంబంధించిన అనేక విషయాలను అభౌతికంగా పరిగణిస్తున్నాం ఇది పొరపాటు అనుకుంటున్నాను ఆది మానవులు భావాలను - తమ నమ్మకాలను, భ్రమలను - భౌతికమైనవిగానే భావించారు. వాళ్ళ దృక్పథం కొంత వరకూ సమర్థనీయమేమో

వాళ్ళ మూఢ విశ్వాసాలు, నికృష్ట జీవితం మనకు ఆరాధనీయమని కాదు. స్థలానికి, కాలానికి సంబంధించిన వారి విజ్ఞానం చాలా అల్పమైనది. బుద్ధికి సంబంధించిన విషయాలను అప్రాముఖ్యంగా పరిగణించడం ద్వారానే మానవుడు ఇంతగా పరిణామం సాధించగలిగాడు ఆ మనస్తత్వమే మనని ఇంకా వెన్నాడుతున్నది

సామాజిక పరిణామం కోసం సమభావాలు, సోదర వైఖరి, సమధర్మమూ, న్యాయమూ మొదలైనవి అనేకం బలి అయాయి ఆఖరికి బానిస విధానం కూడా సామాజిక పరిణామానికి దోహదం చేసింది అలాంటి భావాల పట్ల మనం నేర్చుకున్న అలక్ష్యభావం కూడదని నాకు తోస్తున్నది. స్థలానికి, కాలానికి కట్టుబడని ఏ అనుభవాన్నీ మనం అర్థం చేసుకోలేని దశకు చేరుకున్నాం. బహుశా తిరిగి మానవుడు సర్వత్రా సమసమాజాన్ని స్థాపించే వరకూ “బుద్ధి” గురించి నిజమైన పరిశోధనలు ప్రారంభం కావేమో !

**(ఆంధ్రజ్యోతి, దినపత్రిక, 21-9-1975)**

# 6. "బుద్ధి" పొందిన వివిధ పరిణామ దశలు

ప్రపంచంలో జరుగుతూ వస్తున్న రెండు రకాల పరిణామాలు మనకు తెలిసినవే ప్రాణుల దేహాలలో పరిణామం జరిగింది ప్రాణి జాతులు ఒకదాన్ని మించి ఒకటిగా పరిణామం చెందుతూ వచ్చాయి. ఈ పరిణామం కాలబద్ధంగా జరిగింది ఒకప్పుడు అన్నీ జలచరాలే భూచరాలు లేని కాలం వుండేది అలాగే వెన్నెముక గల జంతువులు లేని కాలం వుండేది పిల్లలకు పాలిచ్చే ప్రాణులు లేని కాలం వుండేది మనుషులు లేని కాలం వుండేది. ఇలా కాలగతిని బట్టి ఈ పరిణామం సాగింది

ఈ పరిణామంలో అంతర్భాగమే ప్రాణుల మెదడులోను, నరాల మండలంలోనూ జరుగుతూ వచ్చిన అభివృద్ధి. ఇది కూడా అవిచ్ఛిన్నంగానే జరిగిందనుకోవచ్చు.

అలాగే బుద్ధి పరిణామం కూడా జరిగింది. చేపలు, కుందేళ్లు, కప్పలు, పశువులు, కోతులు, మనుషులు - ఈ ప్రాణుల బుద్ధిలో కూడా కనిపిస్తాయి

రెండు రకాల పరిణామాలకు ఒక పోలిక కూడా ఉన్నది మనిషి పరిణమించిన కారణంగా ప్రాణులన్నీ పరిణామం చెందలేదు. మనిషికన్న ఎన్నో కోట్ల ఏళ్ళు ముందు భూమిమీద అవతరించిన ప్రాణులు ఇంకా వున్నాయి. ఏకకణజీవులు మొదలుకొని మనిషి వరకు వివిధ పరిణామ దశలకు చెందిన ప్రాణులు వుండనే వున్నాయి అదే విధంగా బుద్ధి శక్తి కూడా అన్ని స్థాయిలలోను మనకు దొరుకుతున్నది

అయినా, రెండు రకాల పరిణామాలకూ మౌలికమైన తేడా వున్నది. ప్రాణుల దైహిక పరిణామం - మెదడులోను, నరాలలోను కలిగిన అభివృద్ధితో సహా - కాల, స్థల పరిస్థితులకు కట్టుబడి జరిగింది. ఆ పరిస్థితులు బొత్తిగా అనుకూలించని సందర్భాలలో కొన్ని ప్రాణి జాతులు - రాక్షసి బల్లులు, కత్తికోర పులులు, జడల ఏనుగులు లాంటివి - అనేకం పూర్తిగా అంతరించి పోయాయి.

కాని బుద్ధి పరిణామం ఇంతగా కాలానికి, స్థలానికి కట్టుబడలేదు. మెదడు స్వరూపం ఆ ప్రాణి జాతి గరిష్ఠ బుద్ధి శక్తికి హద్దు ఏర్పరచగలదే కాని వ్యష్టి బుద్ధి ప్రమాణాన్ని నిర్ణయించదు ఎలుకలన్ని జీవశాస్త్రరీత్యా ఒకటే కావచ్చు వాటి తెలివితేటలు, ఉపజ్ఞ భిన్నంగా వుంటాయి. అంతేకాదు, పరిణత మానవుడు తాను మచ్చిక చేసే జంతువుల తెలివితేటలను పెంపొందించవచ్చు. కుక్కలకు అనేక మాటలు అర్థమయేటట్టు చేయవచ్చు కాని పది కుక్కలకు ఒకే శిక్షణ యిస్తే అన్నిటి తెలివి సమంగా పెరగదు. వ్యష్టి వ్యత్యాసాలు వుండనే వుంటాయి. చింపాంజీలకు తెలివితేటలను మనిషి సహాయంతో పెంచుకునే శక్తి కొద్ది సంవత్సరాలు మాత్రమే వుండి తరువాత పోతుందట వీటన్నిటిని బట్టి రెండు రకాల పరిణామాలలోను తేడాలు ఉండటం మనం చూడ వచ్చు బుద్ధి పరిణామం పూర్తిగా కాలానికి కట్టుబడి వుండటం లేదన్నది స్పష్టం

ఒకే మనిషి బుద్ధి ఒకప్పుడున్నట్టు ఒకప్పుడు వుండదు. ఒక దశలో చాలా తెలివిగల వాళ్ళుగా కనిపించినవాళ్ళు మరొకదశలో పరిస్థితుల ప్రభావం వల్ల పశుప్రాయులై పోవచ్చు చిన్నప్పుడు మందమతులు అనిపించుకున్నవాళ్ళు కాలక్రమాన మహామేధావులు కావచ్చు అశోకచక్రవర్తి చిన్నతనంలో పరమ క్రూరుడట. అతనే అహింసా ప్రాతిపదిక మీద గొప్ప సామ్రాజ్యాన్ని నడిపాడు. జాతి పరిణామం ఇలా ఏ పరిస్థితులలోను అస్తవ్యస్తం అయిపోదు. ఏ పరిస్థితులలోనైనా మనిషి మానసికంగా పశుప్రాయుడై పోవచ్చు గాని పశువు మాత్రం కాలేడు

పైదాన్ని బట్టి దైహిక పరిణామంలో "బుద్ధి" పాత్ర లేదనుకోవడానికి వీల్లేదు ప్రాణుల

శరీరాలలో అద్భుతమైన ఇంజనీరింగు వున్నది. అవి మనిషి ఊహకు అందని క్లిష్ట రసాయనశాలలు శరీరంలోని ఇంజనీరింగులో 15 శాతం కూడా మనిషి సాధించలేకుండా ఉన్నాడని శాస్త్రవేత్తలు చెబుతున్నారు. శరీరాలు తయారు చేసే రసాయనాలలో ఏ ఒక్కటి కృత్రిమంగా తయారుచేసినా, నోబెల్ బహుమతికి అమాంతంగా అర్హత ఏర్పడుతుంది

ఇంతేకాదు, శరీరాల నిర్మాణంలో ప్రతి వివరం ప్రయోజనాత్మకంగా వున్నట్టు స్పష్టమవుతుంది ప్రయోజనం అన్నది బుద్ధి సొత్తు ఈ బుద్ధి ఎక్కడ వున్నట్టు ? ఆ శరీరాలలో లేదు తాము ఎట్లా పనిచేస్తున్నదీ ఆ శరీరాలకు, వాటిలో వున్న మెదడుకు తెలియదు రక్తంలోకి "శత్రు" పదార్థం రాగానే తెల్లకణాలు పరిగెత్తుకుంటూ వచ్చి, దాన్ని కబళించి, శరీరాన్ని దాని నుంచి కాపాడతాయి ఆ తెల్లకణాల సహజ స్వభావం అలాంటిది అనవచ్చు ఆ స్వభావాన్ని శరీరానికి రక్ష కలిగించటానికి ఉపయోగిస్తున్నట్టు వాటికి తెలీదు. "ప్రయోజనం" వాటికి బాహిరమని ఒప్పుకోవాలి

దీనికి "స్థల, కాలవాదం" ఒకలాగా చెబుతుంది పరిస్థితులలో కలిగే మార్పులకు అనుగుణంగా ప్రాణి శరీరాలలో యాదృచ్ఛికంగా జరిగిన కొన్ని మార్పులు మనుగడకు తోడ్పడ్డప్పుడు ఆ మార్పులు సంక్రమించిన ప్రాణులే దక్కాయి మిగిలినవి విజృంభించలేదనీ, ఖడ్గమృగానికి ముక్కుమీద కొమ్ము, కవచంలాంటి శరీరం, మాట వరసకు, అలాగే ఏర్పడ్డాయని అంటే ఇది చాలా హేతుబద్ధంగానే వుంటుంది గాని - కొన్ని కోట్ల కోతులు కొన్ని కోట్ల టైప్‌రైటర్ల మీద అనంతంగా కొట్టుతూపోతే ఒక షేక్స్పియర్ నాటకం వచ్చే "ప్రాబబిలిటీ" వున్నదన్నట్టు - విశ్వసనీయం కాదు. అలాంటి అనంతమైన కాలమూ లేదు కోట్ల కొద్దీ ఖడ్గమృగాల పూర్వీలూ లేవు వేరు వేరు ప్రాణి శరీరాల నిర్మాణంలోను, ఆ ప్రాణుల శరీర ధర్మాలలోను "ప్రయోజనం" కనిపిస్తుందన్నది ఒకటే నిర్వివాదం.

దీన్ని అడ్డం పెట్టుకునే ఆదర్శవాదులు అన్నిటికీ కారణభూతుడైన ఒక ఈశ్వరుణ్ణి ప్రసాదించి, వేలయేళ్ళుగా జనాన్ని భౌతికవాదానికి దూరంగా ఉంచగలుగుతూ వస్తున్నారు.

డార్విన్ వంటి శాస్త్రవేత్తకే సృష్టిలో బుద్ధి కనిపించింది లతలు పాకేటప్పుడు సమీపంలో వున్న ఆధారం కేసి సూటిగా తీగెలను పంపడం చూసి ఆయనకు వాటికి మెదడు వుంటుందా అన్నంత అనుమానం కలిగిందట ఆయన ఒక ట్రాంబోన్ యిచ్చి, దాన్ని గట్టిగా ఊదుతున్నాడట అది దడుచుకుంటుందేమోనని. కాని లత దడుచుకోలేదు ! "బుద్ధి" అనేది వున్నమాట నిజమేనని, అయితే అది లతకు బాహిరంగా వున్నదని అనుకోవాలి ఆ మాటకు వస్తే శరీర నిర్మాణంలోను శరీర ధర్మాలలోను ఇమిడి వున్న ప్రయోజనాన్ని మనిషి తన బుద్ధితోనేగదా తెలుసుకుంటున్నాడు. ఈ ప్రయోజనం కొలతకు, కాలమానానికి అందేది కాదు

తొలి భూగోళిక దశలు, తొలి ప్రాణి దశలు, తొలి మానవ సమాజ దశలు గురించి పరిశోధనలు జరిగినట్టే బుద్ధి తాలూకు ప్రాథమిక దశలను గురించి కూడా పరిశోధనలు జరగడం వల్ల ప్రయోజనం వుండవచ్చు

**(ఆంధ్రజ్యోతి, దినపత్రిక, 28-9-1975)**

# 1. అసాధారణ అనుభవాలు - ఉపోద్ఘాతం

ఆదిమానవులు బుద్ధిజీవులని మనం ఒప్పుకోలేం. వారి ఆచారాలూ, విశ్వాసాలూ, వాళ్ళు తమ సమస్యలను పరిష్కరించుకున్న పద్ధతులూ, బుద్ధి జీవనాన్ని సూచించవు. వాళ్ళ నరబలులూ, మంత్రాలూ, తంత్రాలూ అక్షరాలా "పాశవిక" దశనే సూచిస్తాయి.

యూఫ్రటీస్ - టైగ్రిస్, నైల్, సింధు వగైరా నదుల లోయలలో తొలి నాగరికతలను వెలయింపజేసినవారు మన లెక్కన అనాగరికులే అయినా బుద్ధి జీవులని ఒప్పుకుతీరాలి ఊబీ, తుంగలూ, చిట్టడవులూ, ఇసుక మేటలూ, వన్యమృగాలూ గల నదీ ప్రాంతాలు మానవ కృషిలో నాగరికతకు నిలయాలు అవుతాయని భావన చెయ్యటం బుద్ధి వికాసానికి పరాకాష్ఠ అని చెప్పాలి. నాగరికత వెంబడి వాళ్ళు కనిపెట్టిన లిపులూ, చక్రమూ, వాహనాలూ, నౌకలూ, ఇతర ప్రయాణ సాధనాలూ, వర్తకమూ లాంటివి ఈనాటి మన నాగరికతకు ఇంకా పునాదిగానే ఉన్నాయి అన్ని శాస్త్ర శాఖలకూ వాళ్ళు పునాదులు వేశారు గణితమూ, జ్యోతిశ్శాస్త్రమూ, రసాయన శాస్త్రమూ, వైద్య శాస్త్రమూ మొదలైన శాస్త్రాలన్నిటికీ పునాది కల్పించినది ఆ బుద్ధిజీవులే.

మానవుడి దేహ పరిణామం బుద్ధి జీవనానికి అనుకూలంగా జరిగింది మానవుడి మేధ స్థల, కాలాలలో కలిగే అనుభవాలను అవగాహన చేసుకుని, తద్వారా జ్ఞానాన్ని కూడబెట్టి ముందు తరాలకు అందించటానికి అనుకూలంగా పరిణితి చెందింది ఇందుకు తోడ్పడిన భాషా, లిపీ, పదిమంది అనుభవాలను పోగుచేసే సౌకర్యాలూ సమష్టి జీవితం నుంచి ఏర్పడ్డాయి. అసలు బుద్ధి జీవనం అంటేనే సమష్టి జీవనం. తొలి నాగరికతలు సమష్టి కృషి లేక అవతరించాయని కలలో కూడా అనుకోలేం

అయితే ఈనాడు మనకు ఆర్కియాలజీ ధర్మమా అంటూ మానవ సామాజిక జీవితం గురించి ఆరు, ఏడు వేల సంవత్సరాల రికార్డు కొంత లభ్యమవుతున్నది. దీనిని బట్టి మనిషి బుద్ధి జీవుడుగానే జీవించాడని చెప్పటానికి లేదు మానవుడు అనేక "మూఢ" విశ్వాసాలను - హేతుబద్ధం అనటానికి వీలులేని వాటిని - అవలంబిస్తూ, వాటి ప్రభావం సమష్టి జీవితం మీద వుండనిస్తూ నాగరికతలో పురోగమించాడు. ఆ మాటకు వస్తే ఈనాడు కూడా మానవ జీవితం బుద్ధి మీద కన్న రకరకాల అశాస్త్రీయ (మూఢ) విశ్వాసాల మీదనే నడుస్తున్నది. ప్రపంచంలో అత్యధిక సంఖ్యాకులు "మూఢ" విశ్వాసాలకు గురి కాకుండా జీవించలేని స్థితిలో వున్నారు. ఈ "మూఢ" విశ్వాసాలు అన్ని రంగాలలోనూ, రాజకీయ రంగాలలోను, వైజ్ఞానిక రంగాలలో సైతం వుంటున్నాయి. మానవుడు పూర్తి బుద్ధి జీవి కావటం ఏనాటికైనా సాధ్యమవుతుందా అన్న సందేహం కలుగుతుంది.

బుద్ధి జీవనం నూటికి నూరుపాళ్ళూ అమలుకాక పోవటానికి అనేక కారణాలున్నాయి బుద్ధిజీవికి జ్ఞానం ప్రధానం నాగరిక దశతోబాటు ప్రజలను వంచించే పద్ధతులు కూడా బయలుదేరాయి. మన దేశంలో అధిక సంఖ్యాకులకు జ్ఞానం సంపాదించే హక్కు, చదువుకునే హక్కు లేకుండా పోయింది ఇది సామాజిక "దోపిడి"కి చాలా అవసరం అయింది. ఇందులోనే ఒక భాగంగా ఒక వర్గం వాళ్ళు జ్ఞానాన్ని గుత్తకు తీసుకుని దాన్ని "రహస్య జ్ఞానం"గా ఉంచారు. దోపిడీకి అనుకూలంగా అనేక మూఢవిశ్వాసాలను జనబాహుళ్యంలో ప్రచారం చేశారు. మత విశ్వాసాలూ, పురాణాలూ, ధర్మశాస్త్రాలూ బుద్ధి జీవనానికి వ్యతిరేకంగా పనిచేశాయి మత విశ్వాసం ఎంత అవిశ్వసనీయంగా ఉన్నా నమ్మి తీరాలి ("నమ్మి చెడినవాడు లేడు") కృష్ణుడు దేవుడన్న గుడ్డి విశ్వాసం లేకపోతే అతను చేసిన అనేక పనులు పాపిష్టివని ఏ మామూలు మనిషి అయినా

ఒప్పుకుంటాడు. అలాగే రాముడు 'ఫాసిస్టు' హంతకుడనటానికి అతను వాలిని చంపిన తీరూ, దాన్ని సమర్థించిన తీరూ చాలు ధర్మశాస్త్రాలలో వర్ణ వ్యవస్థకు సంబంధించిన అమానుషాలు ఎన్ని ఉన్నా అవి పవిత్రమైనవే !

ఇందులో ఒక విశేషం ఏమిటంటే, అభివృద్ధి అవుతూపోయే జ్ఞానాన్ని జన సామాన్యం నుంచి దాచటం అంత తేలిక కాదు కప్పిపెట్టిన జ్ఞానం బయటపడుతుంది లేదా నశిస్తుంది నశించిన జ్ఞానాన్ని మానవులు తిరిగి కనిపెట్టాలి అల్ప సంఖ్యాకులు అధిక సంఖ్యాకులను ఎంత అంధకారంలో ఉంచ యత్నించినా ఏదో విధంగా వాళ్ళు "తెలివి మీరుతారు." అప్పుడు అల్ప సంఖ్యాకులు "అబద్ధాలను" ప్రచారం చెయ్యటంతో సరిపోదు గనుక, ఆ అబద్ధాలను తుపాకులతో సమర్థించి, ప్రజాస్వామ్యం పేర ప్రబలమైన హత్యాకాండలు కొనసాగించాలి ఆధునికయుగంలో చరిత్ర నిండా ఇందుకు ఉదాహరణలు కనిపిస్తాయి

## శాస్త్ర విజ్ఞానం

బుద్ధి జీవనం "నాలుగు పాదాల" నడవకపోవటానికి ఒక కారణం శాస్త్ర జ్ఞాన సంచయనంలోనే వున్నది ఇది ఎలాగో చూద్దాం

ప్రకృతి రహస్యాలను అన్వేషించటమూ, వాటి తాలూకు సత్యాలను నిర్వచించటమూ, ప్రకృతి ధర్మాలను పరివర్తన చెందించటమూ, ఈ మూడు దశలలో మానవుడి విజ్ఞానం పెరుగుతున్నది

ప్రకృతి రహస్యాలను అన్వేషించటానికి మనిషికి గల మూల సాధనాలు జ్ఞానేంద్రియాలు ఇవి మనిషికి అనుభవాన్ని కలిగిస్తాయి ఈ అనుభవాలలో సామ్యాన్ని కనిపెట్టి బుద్ధి కొన్ని సత్యాలను ప్రతిపాదిస్తుంది. ఉదాహరణకు నిప్పు ఎప్పుడు తాకినా కాలుతుంది. నీరు ఎప్పుడూ పల్లానికే ప్రవహిస్తుంది. తగిన ఉష్ణస్థితి ఉంటే అనేక పదార్థాలు కరుగుతాయి చలికి నెయ్యీ, నీరూ పేరుకుంటాయి, ఇత్యాది అనుభవం నుంచి నేర్చుకునే శక్తి అంతో ఇంతో ఉన్నత ప్రాణులకు అన్నిటికీ వున్నది. ప్రకృతి ధర్మాలను గ్రహించిన మీదట వాటిని మానవుడు తనకు అనుకూలంగా మార్చుకోగలుగుతాడు. చెయ్యి పడితే కాలే నిప్పే చలి నుంచి మనిషికి రక్షణ ఇస్తుంది. ఇళ్ళ మధ్య నీరు నిలిస్తే, దూరంగా వుండే పల్లపు ప్రదేశానికి గండి పెట్టి ఆ నీటిని వదిలించుకోవచ్చు.

ఆధునిక శాస్త్రవేత్త ఇంత తేలిక మార్గాల ద్వారా సంపాదించే జ్ఞానంతో తృప్తిపడడు. మానవుడు నాగరికత సాధించటానికి ఈ జ్ఞానం చాలదు. అందుచేత శాస్త్రవేత్తలు మొట్టమొదట మన జ్ఞానేంద్రియాల లిమిటేషన్‌లు తెలుసుకున్నారు. మన కన్ను చూసే "తరంగాలు" బహు కొద్ది. అంతకు అనేక రెట్ల తరంగాలు - రేడియో తరంగాలు మొదలుకొని అతి సూక్ష్మమైన "గామా" కిరణాల దాకా - కంటికి కనిపించవు. కాని అవి కూడా "కాంతి" తరంగాల జాతికి చెందినవే - విద్యుదయస్కాంత తరంగాలంటారు వాటిని.

ఇంతేకాక కొన్ని కొన్ని పరిస్థితులలో కొన్ని కొన్ని భ్రమలకు కన్ను లోనుకాగలదు. సినిమా చిత్రాలు కదలికలేని బొమ్మలతో కూడినవని అందరికీ తెలుసు ఆ కదలిక లేని బొమ్మలు తెరమీద అతి వేగంగా ఒక దాని తర్వాత మరొకటి వస్తే మనం "చలనం" చూస్తాం. చలన చిత్రాలు అనేమాట సినిమా చిత్రాలకు వర్తిస్తుందంటేనే మన కన్ను తాను చూసిన బింబాన్ని వెంటనే చెరిపెయ్యలేదని అర్థం ఈ సంగతే పసి పిల్లలు తమ ఆనందానికి వుపయోగించుకుంటారు. వాళ్ళు వెలిగించిన ఊదు వొత్తులు వేగంగా ఆడించి వెలుగు చారలూ వెలుగు వలయాలూ చూస్తారు.

అలాగే చెవులు అన్ని ధ్వనులనూ వినలేవు. మనిషి వినలేని ధ్వనులు కొన్ని కుక్కలకు వినపడతాయట వినపడని ధ్వనులను శాస్త్రవేత్తలు అనేక ప్రయోజనాలకు ఉపయోగిస్తున్నారు.

ఆఖరుకు చర్మం కూడా భ్రమలకు లోనవుతుంది. చలికాలంలో రాత్రి వేళ ఆరుబయట ఉండే కొయ్య బెంచీ, ఇనపబెంచీ ఒకే ఉష్ణోగ్రతలో వుంటాయి. అయినా కొయ్య బెంచీ తగిలితే చెయ్యి జిల్లుమనదు, ఇనుప బెంచీ తగిలితే అంటుంది

అచ్చంగా ఇంద్రియ జ్ఞానం మీదనే ఆధారపడి ఉంటే ఈనాడు మనకు రేడియోలుండేవి కావు విద్యుచ్ఛక్తి ఉండేది కాదు ఆకాశంలో ఎక్కడో ఉన్న నక్షత్రాలలో ఏ యే పదార్థాలున్నదీ తెలిసేది కాదు ఇంద్రియజ్ఞానాన్ని విస్తరించటానికి శాస్త్రజ్ఞులు అనేక వేల సాధనాలు కల్పించారు టెలిస్కోపులూ, మైక్రోస్కోపులూ, ఫోటోగ్రఫీ, ఎక్స్‌రేలూ, చీకట్లో చూడటానికి వీలయిన సాధనాలూ, రాడార్ వగైరాలు.

అలాంటప్పుడు "బుద్ధి జీవనం" అవిచ్ఛిన్నంగా ముందుకు సాగకపోవటానికి శాస్త్రజ్ఞానం చేస్తున్న ద్రోహం ఏమిటి ?

శాస్త్రజ్ఞానం ఇంతగా అభివృద్ధి అయిందంటే అది కొన్ని నియమాలు విధిగా పాటించింది ఆ నియమాలు జ్ఞానానికి సంకెళ్ళుగా పని చెయ్యక తప్పదు. వాటిని ఊడగొట్టుకోవటం ద్వారా జ్ఞానం ఒక మెట్టు పైకెక్కుతుంది. ఇదే విధంగా శాస్త్ర జ్ఞానాభివృద్ధికి అడుగడుగునా నియమాలు అడ్డు తగులుతూంటాయి.

శాస్త్రజ్ఞానం అనుభవం నుంచి కొన్ని ప్రతిపాదనలు చేస్తుంది ఉదాహరణకు లోహాలన్నీ ఘనపదార్థాల రూపంలో ఉంటాయి ఈ ప్రతిపాదనను శాస్త్రం పరమ సత్యంగా పరిగణించదు అందుచేత పాదరసం కూడా లోహమే అని తెలిసినప్పుడు ఆ ప్రతిపాదనకు సవరణ వస్తుంది. శాస్త్ర ప్రతిపాదనలను మళ్ళీ మళ్ళీ రుజువు చేసిన మీదట అది ఒక సిద్ధాంతంగా ఆమోదం పొందుతుంది కాని అప్పటికీ అది పరమ సత్యం కాదు ఉదాహరణకు, కాంతికిరణాలు సూటిగా ప్రసరిస్తాయనీ, న్యూటన్ గతి నియమాలు సర్వత్రా వర్తిస్తాయనీ ఎన్ని వందల సంవత్సరాల పాటు నమ్మినా, ఆ నమ్మకాలను సంస్కరించుకోవలసిన పరిస్థితి ఏర్పడితే శాస్త్రజ్ఞులు జంకలేదు. కాని కాంతి అనేది తరంగాలనటానికీ, కణాలనటానికీ కూడా ఆధారాలు కనిపించినప్పుడు శాస్త్రజ్ఞులు రెంటినీ పరిమితంగా ఆమోదించారు.

శాస్త్రజ్ఞానంలో చరమ సత్యం అంటూ లేదు ప్రతి సిద్ధాంతమూ తాత్కాలికంగా మాత్రమే నిజం ఇందువల్ల శాస్త్ర విజ్ఞానానికి విస్తృతమైన, లోతైన, బలమైన పునాది ఏర్పడిందా అంటే అదీ జరగలేదు జ్ఞానం వృద్ధి అయిన కొద్దీ సదసత్సంశయాలు బలమైనాయి చివరకు కాలమూ, స్థలమూ అనేవి సాపేక్షంగా తేలాయి

ఈ అయోమయం మత విశ్వాసాలలో లేదు. మతం ప్రచారం చేసినవాళ్ళు తాము చెప్పదలచుకున్నదేదో తెగేసి చెప్పారు మనుషులు పుటకలోనే హెచ్చుతగ్గులుగా పుడతారు, పూర్వజన్మ సుకృత దుష్కృతాలను బట్టి ఉచ్ఛ నీచ జన్మలు వస్తాయి - ఇత్యాది. శాస్త్రవేత్తలు సత్యాన్ని చేతితో పట్టుకోలేనప్పటికీ, వారి కృషిలో సత్యాన్వేషణ వున్నది. సిద్ధాంతాలను రుజువు చెయ్యాలన్న నియమం వున్నది మత విశ్వాసాలలో అదేమీ లేదు వాటిని కావాలన్నా ఎవరూ రుజువు చెయ్యలేరు. అవి సత్యాలో, కావో చెప్పేవాళ్ళకే తెలియదు వాటిని చాలా వరకు దండ నీతితో అమలు చేశారు. ముస్లిములు కాఫిర్లను చంపాలని బహిరంగంగా చెబితే, మిగతా మతాలవారు కుండపగలేసి చెప్పకుండానే తమ మతాలను వ్యతిరేకించిన వారిని తమ శక్తి కొద్దీ హింసకు గురిచేశారు

శాస్త్రజ్ఞులకు సత్యంలో నమ్మకం ఉన్నదిగాని, దాని కోసం అనంతమైన అన్వేషణ చెయ్యడానికి వాళ్ళు సిద్ధమే అయినా, అది తమకు తెలిసిందనటానికి సిద్ధంగా లేరు మతవాదులకు సత్యంలో నమ్మకం లేదు కాని తెలిసినట్టు నటిస్తారు నమ్మకం లేదని ఎలా చెప్పగలమంటే, పరిస్థితులను బట్టి వారి "సత్యాలు" మారిపోతాయి డబ్బుగలవాడికి స్వర్గంలో స్థానం లేదన్న క్రైస్తవ మతం ధనస్వామ్యయుగం రాగానే, సాధ్యమైనంత ధనం సంపాదించనివాడు భగవంతుడికి ప్రీతిపాత్రుడు కాడని చెప్పింది అలాగే భగవద్గీతలో ఉండిన బోధలకూ, వైదిక మత విశ్వాసాలకు ఏమీ సంబంధం లేదు

*(ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 29-7-1977)*

# 2. అసాధారణ అనుభవాలు - వివరణ

మతాలకు ఉన్నత రాజకీయాధికారాలున్న కాలంలో మతవాదులు శాస్త్రజ్ఞానాన్ని అనేక విధాల నిషేధించి, శాస్త్రవేత్తలను వేటాడారు భూమి, సూర్యుడు చుట్టూ తిరుగుతున్నందుకు శాస్త్రజ్ఞులు చిత్రహింసలకు గురి అయ్యారు అది విని ఈనాడు మనం విస్తుపోవటానికి కారణం ఏమంటే ఆ యుగం పోయి ధనస్వాములు మతవాదులను వెనక్కు నెట్టేశారు. ధనస్వాములకు శాస్త్రజ్ఞానం కావాలి కాని అది మరీ మానవజాతికంతకు మేలు చేయకూడదు.

**మతవాదుల వెనుకంజ**

ఈ శతాబ్దిలోనే అమెరికాలో పరిణామవాదం బోధించడం పెద్ద నేరంగా వుండేది అతి రహస్యాలను పై దేశాలవారికి అందించారన్న ఆరోపణ మీద వ్యక్తులు అమెరికాలో మరణశిక్ష పొందారు అన్ని దేశాలనూ మించి భౌతికంగా ముందుకు వచ్చిన అమెరికాలోనే మతవాదుల వైఖరీ, గుప్తజ్ఞానుల వైఖరీ ఇలా బయటపడింది

భౌతిక, రసాయన శాస్త్రాల మాట ఏమోగాని, మనస్తత్వమూ, వైద్యమూ, అర్థశాస్త్రమూ, సామాజిక శాస్త్రమూ మొదలైన వైజ్ఞానిక రంగాలలో నిజమైన సత్యాన్వేషణ స్థానంలో ప్రసిద్ధ శాస్త్రజ్ఞుల స్వార్థమూ, విజ్ఞానాన్ని పురస్కరించుకున్న పరిశ్రమల యజమానుల స్వార్థమూ ప్రవేశించాయి

**ధనస్వామ్యం ·**

మనస్తత్వశాస్త్రంలో ఫ్రాయిడ్‌లాంటి ప్రముఖులు ఏవో సిద్ధాంతాలు ప్రచారం చేసి, వాటిని బలపరిచే ఉదాహరణలనే తీసుకుని, వ్యతిరేకంగా వుండే వాటిని నొక్కిపెట్టారన్న ఆరోపణలు వున్నాయి కొత్తరకం చికిత్సలూ, మందులు కనిపెట్టేవారిలో చాలామంది పెద్ద మందుల కంపెనీలకు అమ్ముడుపోవటమూ, వాళ్ళు తయారు చేసిన మందులు అపాయకరమో, నిరుపయోగకరమో అయినప్పుడు కూడా మంచి పబ్లిసిటీలో వాటిని జనం కొనేట్టు చేయటమూ, ఆ మందుల వల్ల తీరని హాని జరిగినవాళ్ళు కోర్టుకు పోవటం ఎంతో కష్టం కావటమూ ఇదంతా చూస్తే వర్గ సమాజ స్వభావం సత్యాన్వేషణను గౌరవించదు సరికదా, తన స్వార్థానికి అడ్డు తగిలినప్పుడు ప్రతిఘటిస్తుంది కూడానని మనకు తెలుస్తుంది. ఈ వర్గ సమాజాలు మన మూఢ సిద్ధాంతాలను మనస్ఫూర్తిగా ప్రతిఘటించక పోవడం కూడా మనం చూడవచ్చు మానవ స్వభావమే స్వార్థంతో కూడుకున్నది అనుకున్నప్పటికీ గట్టిగా పదిశాతంలేని ధనస్వాముల స్వార్థం సమాజానికంతటికీ మేలు చేస్తున్నదని నమ్మటం అసాధ్యం

**వర్గ రాహిత్యం ·**

వర్గ రాహిత్యాన్ని చేపట్టిన సమాజాలలో శాస్త్రవిజ్ఞానం నిర్విఘ్నంగా అభివృద్ధి చెందుతుంది ఆ దేశాలలో కూడా విజ్ఞానాభివృద్ధికి ప్రతిబంధకాలుంటే అవి వర్గవ్యవస్థ కల దేశాల మూలంగా ఏర్పడినవే అయి వుంటాయి ఉదాహరణకు ఏ సోషలిస్టు దేశం కూడా అణుబాంబులతో మనుషులను మారణహోమం చెయ్యగోరదనుకుందాం. కాని అవతల కొన్ని దేశాలు అలాంటి ఉద్దేశంతో అణుబాంబులను పేరుస్తున్నప్పుడు సోషలిస్టు దేశాలు కూడా తప్పని సరిగా అణుబాంబులను తయారు చెయ్యాలి యుద్ధాలు మానాలన్న నిర్ణయాలు ఏకపక్షంగా జరగటానికి లేదు అలాంటి నిర్ణయాలు ప్రపంచమంతటా ఒకేసారి జరగాలి అంతదాకా వర్గ సమాజం జాడ్యాల ప్రభావం వర్గరహిత సమాజాల మీద ఏదో విధంగా ఉండనే వుంటుంది

**మడికట్టుకున్న మార్క్సిస్టులు ·**

కాని సోషలిస్టు దేశాలలో శాస్త్రవేత్తలు ఎలాంటి అనుభవాన్నీ నిరాకరించరు మాటలకు

భయపడరు  రష్యా, తూర్పు యూరప్ దేశాలో టెలిపతీలాంటి అసాధారణ అనుభవాలను గురించి పరిశోధనలు చేస్తున్నారంటే మనదేశంలో 'మడికట్టుకున్న' మార్క్సిస్టులు ఆ పరిశోధనలను 'బూర్జువా' పరిశోధనల కింద జమకట్టేశారు  వాళ్ళ లెక్కన 'టెలిపతీ' అనేది వుండటానికి వీల్లేదు  అది వాస్తవంగా వున్నట్టయితే దాన్ని రుజువు చెయ్యటం తప్పు  ఇది వర్గ సమాజ దృక్పథంగాని, మార్క్సిస్టు దృక్పథంకాదు. వర్గ సమాజంలో పుట్టి పెరిగిన వాళ్ళు ఎంత వీర మార్క్సిస్టులమనుకున్నా వర్గసంస్కృతి వుండటం సహజం.

అలాగే మావో మరణానంతర జీవితం ఉన్నదన్నట్లు మాట్లాడితే పెట్టుబడి దేశాలవారు దాన్ని 'అన్ మార్క్సిస్టు' అన్నారు  చౌఎన్‌లై కూడా తాను చచ్చిపోయి మార్క్స్, లెనిన్, స్టాలిన్‌లను కలుసుకుంటానన్నట్టు మాట్లాడాడు. అలా అనటంలో పెద్ద అంతరార్థం లేకపోయినా మాటలకు బెదిరే వర్గసమాజ మేధావులకు అలాంటివి పట్టిస్తాయి.

**బుద్ధి కొలత వాదం ·**

నేను కొంతకాలంగా సృష్టికి స్థలకాలాల కొలతల్లాగే బుద్ధికొలత వున్నదని వాదించటానికి ప్రయత్నిస్తున్నాను  అందుకుగాను ఈసారి సోవియట్ మనస్తత్వ శాస్త్ర రచనలను ఆధారంగా తీసుకోబోతున్నాను  సోవియట్ శాస్త్రవేత్తలు పచ్చి భౌతికవాదులే కాక, మార్క్సిస్టులు కూడాను అందుచేత వారు మనుషులకు కలిగే అసాధారణ అనుభవాలను భౌతికవాద దృష్ట్యానూ, మార్క్సిస్టు దృక్పథంలోనూ సమన్వయింప యత్నిస్తారు. ఈ దృష్టితోనూ, దృక్పథంతోనూ నాకు ఎంత మాత్రమూ పేచీలేదనీ చరిత్ర సమన్వయాలకన్నా ఒక్కోసారి 'బుద్ధి కొలత' ప్రతిపాదన మరింత సమంజసంగా వుంటుందనీ, వారు ఎలాంటి వివరణా చెయ్యలేని చోట కూడా బుద్ధి కొలతలో మనుషుల అసాధారణ అనుభవాలకు కొంత అర్థం వుంటుందనీ నమ్ముతున్నాను

**అసాధారణాలు**

ముందే చెప్పినట్టు శాస్త్రవేత్తలు తమ సిద్ధాంతాలకు అనుగుణంగా లేని అనుభవాలను భ్రమలనో, అబద్ధాలనో, వంచన అనో కొట్టి పారేస్తారు.  అందుకు వారిని తప్పుపట్టనవసరం లేదు.  ఎందుకంటే 95 శాతం మనుషుల అనుభవాలను తెలుసుకోదగిన కారణాలుంటాయి. లేదా అనుభవాలని చెప్పేవి అబద్ధాలై వుంటాయి  అనేకమంది జనాన్ని మోసం చేస్తున్న మాట అబద్ధం కాదు  అమాయకులైన ప్రజలు సులువుగా భ్రమలకు లోనై, తమకు అతీత శక్తుల దర్శనమూ, అనుభవమూ లభించిందనుకుని, వంచకులలో దైవత్వం చూస్తారు.  ఇందులో వంచకుడి హోదా కూడా లెక్కలోకి వస్తుంది  వీధి గారడివాడు చేసేదే కాషాయ బట్టలు కట్టుకున్నవాడు చేస్తే అందులో 'దైవత్వం' కనిపిస్తుంది. గారడివాడు బిచ్చగాడుగానే మిగిలిపోతాడు

**వాస్తవానుభవాలు**

అత్యల్ప సంఖ్యాకుల విషయంలో అసాధారణ అనుభవాలు వాస్తవమైనవిగా వుంటాయి కాని వాళ్ళు మామూలు మనుషులు. ప్రదర్శనలిచ్చేవాళ్ళు కారు  అవి భ్రమలను పోలివున్నా భ్రమలు కావు  ఆ సంగతి వారికి స్పష్టంగా తెలుస్తుంది  వాళ్ళు ఆ అనుభవాలను గురించి ఏ వైఖరి అవలంబించాలి ?  ఈ ప్రశ్నకు సమాధానం మీదనే మూఢ విశ్వాసాలకు పునాది నిర్మాణమవుతుంది. చచ్చిపోయిన మనిషి సోదెలోవచ్చి, సోదెలో చెప్పేదానికి తెలియటానికి వీలులేని విషయాలన్నీ యదార్థంగా ఎలా చెప్పింది ?  ఎవరో ఒకాయన చచ్చిపోయాక పిండాలు వేస్తే పోయినవాడి పిల్లను కనిపెట్టి వుంటామని బాధ్యతగలవాళ్ళు మాటయిస్తే కాని కాకులు పిండాలను ఎందుకు ముట్టలేదు ?  ఆఫీసుకు బయలుదేరిన మనిషి మధ్యదారిలో వెనక్కు తిరిగివచ్చి, వచ్చిన పది నిముషాలలో తల్లిపోయినట్టు టెలిగ్రాం అందుకోవటంలో రహస్యం ఏమిటి?

ఇటువంటి అనుభవాలు ఎవరైనా అన్వేషిస్తే వేల సంఖ్యలో కాదు, లక్షల సంఖ్యలో దొరుకుతాయి కాని శాస్త్రదృష్టికాని భౌతిక దృక్పథంగాని లేని సామాన్యులు ఈ అనుభవాలకు అర్థం భౌతికవాదాన్ని నిరాకరించే మతంలోనో, అనాదిగా వచ్చే మూఢ విశ్వాసాలలోనో వెతుకుతారు ఆ విశ్వాసాలకు ఈ అసాధారణ అనుభవాలు జీవం పోస్తూ వస్తున్నాయి మూఢ విశ్వాసాలకు సమర్థింపు కొల్లగా లభిస్తున్నది ఇది సామాజిక ప్రగతికి పెద్ద ఆటంకం

**శాస్త్రీయ పిడివాదం :**

ఈ సందర్భంలో ఇంకో ముఖ్య విషయం కూడా గమనించాలి ఈ అసాధారణ అనుభవాలు వ్యక్తులకు కలిగేవి. సామాజిక జీవితం సమష్టి అనుభవాల మీద ముందుకు పోవలసినది అయితే ఈ వ్యక్తి అనుభవాలను సమష్టి మత మూఢవిశ్వాసాలతో సమన్వయించటం చేత సామాజిక ప్రగతి ఎంతో దెబ్బతింటున్నది. ఆ కారణం చేతనే అసాధారణ అనుభవాలను భౌతిక దృష్టితో పరిశీలించడం అవసరం. అలాంటి అనుభవాలనన్నిటినీ కొట్టిపారేసి మూఢ విశ్వాసాలను అదుపులో పెట్టామని సంతోషించేవారిది శాస్త్రీయ దృక్పథం కాదు, పిడివాదం

శాస్త్ర దృష్టిలో సత్యాన్వేషణకు అనుభవం తప్ప మరో ఆధారం లేదు అత్యధిక సంఖ్యాకులైన సామాన్య ప్రజలు అనుభవాలు పొందుతారు. అందులో కొన్ని అసాధారణమైనవి కాకపోయినప్పటికీ, తెలియజెప్పేవారు లేక, అందులో కూడా ఏదో 'ఈశ్వర విలాసం' వుందని భ్రమపడతారు. అందుచేత అసాధారణంగా కనిపించే అనుభవాలకు సాధారణమైన వివరణ వున్నపుడు, దాన్ని శాస్త్రవేత్తలు ప్రజలకు వివరించాలి. ఈ పని సోషలిస్టు శాస్త్రజ్ఞులు మాత్రమే చిత్తశుద్ధితో చేస్తారు. ఇక అసాధారణ అనుభవాల మాటకు వస్తే శాస్త్రవేత్తలు రెండు మార్గాలు అవలంబించవచ్చు. వాటిని నిరాకరించవచ్చు, లేదా అణచిపెట్టవచ్చు వాటిని సమర్థించటానికి దేవుళ్ళనో, మతాన్నో ఆవాహన చెయ్యవచ్చు.

ఈ రెండోదానికి ఉదాహరణ చెబుతాను మామూలు మనుషులకేగాక, శాస్త్రవేత్తలకు కూడా అసాధారణ అనుభవాలు కలుగుతాయి టెలిస్కోపులలో నుంచి ఆకాశాన్ని స్టడీ చేసేవాడికి ఒక సూక్ష్మ జీవకణంలో వున్న 'ఇంజనీరింగు' దిగ్భ్రమ కలిగిస్తుంది. సాధారణంగా శాస్త్రవేత్తలు అనుకోవడం బుద్ధి అనేది మానవుడి మెదడు నుంచి పుట్టేది మాత్రమేనని, అంతకన్నా నిశితమైన 'తెలివి' సృష్టిలోనే లేదని, కనుక మెదడేలేని ప్రకృతిలో పదార్థం ప్రదర్శించే ప్రజ్ఞాపాటవాలు దేవుడికి అంటగట్టాలని బూర్జువా శాస్త్రవేత్తలకు తోస్తుంది. తాము ఎంతో శ్రమపడి అన్వేషించిన ప్రకృతి రహస్యాలను చూస్తూ చూస్తూ అణచిపెట్టడం వారికి సాధ్యమవుతుందా ? కాదు, "పలాని వెంకయ్య దయ్యాన్ని చూశాట్ట' అంటే 'వాడి మొహం' అనటం తేలిక గర్భంలో చేరిన జీవకణం అనేక రకాల ధాతువులుగా విభజన కావడమేగాక, ఏ ధాతువు ఏ స్థానంలో వుండాలో కూడా ఎవరి సహాయమూ లేకుండా నిర్ణయమవుతుందంటే 'ఏడిసింది' అనటం తేలికకాదు.

చాలా కాలంగా నేను ఎదుర్కొంటున్న సమస్య ఏమిటంటే అసాధారణ అనుభవాలను అబద్ధాలని చెప్పి కొట్టెయ్యటం అశాస్త్రీయం అవి సాధారణమైన అనుభవాలేనని రుజువు చెయ్యాలి లేదా అలాంటి అనుభవాలకు భౌతికవాదంతో కూడిన వివరణ యివ్వాలి. లేకపోతే, ఆ అనుభవాల చాటున ప్రజలలో ఆదర్శవాద విశ్వాసాలు, మూఢ నమ్మకాలు తామరతంపరగా వ్యాపిస్తాయి అసాధారణమైన అనుభవాలకు వెనుక దైవిక శక్తులున్నాయని ప్రచారం జరుగుతుంది

*(ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 5-8-1977)*

# 3. అసాధారణ అనుభవాలు - మరింత వివరణ

స్పృహకన్న ఆలోచన చాలా దూరం పోగలదని లెనిన్ అన్నాడు. అందుకు కారణం ఏమిటి ? స్పృహ స్థల కాలాలకు పరిమితమైనది ఆలోచన బుద్ధి కొలతలో పని చేసేది అని నా నమ్మకం. వెర్రి ఆలోచనలు ఒక్కొక్కసారి ఎంత తెలివిగలవాడి స్పృహను కూడా అవమానించగలవు రామాయణంలో చెప్పిన లక్షల కోట్ల సంఖ్యలో వానరులూ, రాక్షసులూ, వానరులు కొండ శిఖరాలను ఎండుపుల్లలను విరిచినట్టు విరిచి, వాటితో యుద్ధం చెయ్యటమూ వెర్రి భావనకు మచ్చుతునకలు అలాగే జానపద సాహిత్యంలో కథా నాయకులు అనేక లక్షల యోజనాలు ప్రయాణం చేసి ఇంకో చోటికి పోతారు వాళ్ళు గానుగెద్దుల్లాగా వలయాలలో ప్రయాణం చేస్తే తప్ప భూమి మీద అంతంత దూరాలు లేవు అదే విధంగా ఒక మర్రిచెట్టు కొమ్మల మీదుగా నలుగురు మిత్రులు పన్నెండేసి యోజనాలు నడిచి, వేరు వేరు నగరాలు చేరుతారు

ఇలాంటి వెర్రి భావనలవల్ల మానవజాతికి కలిగిన మేలేదీ లేదు - రామాయణాన్ని పూజించటం ద్వారా కొందరు అమాయకులు సంపాదించుకుంటున్నామనుకునే పుణ్యమే లాభం అనుకుంటే తప్ప.

**స్వభావం, బుద్ధి కొలత ?**

కాని ఫలప్రదమైన ఆలోచనలు లేకుండా, కేవలం స్పృహతో మానవజాతి పురోగమించేది కాదు ప్రాచీన కాలంలో తత్వవేత్తలు ప్రపంచంలో కనిపించే వైవిధ్యం చాటున పంచభూతాలు మాత్రమే ఉన్నాయనీ, ప్రతి పదార్థమూ పరమాణువుల సమ్మిశ్రణమని, ప్రకృతికి మూల స్వభావాలు సత్వరజస్తమాలేననీ భావన చేశారు (స్వ + భావం అనే మాట బుద్ధి కొలతను స్ఫురింపచేయటం లేదా ?) ఇప్పటికీ మనిషి జ్ఞానం బుద్ధి కొలతలో సరి అయిన దారిన పురోగమించటం ద్వారానే పెరుగుతున్నది ఆధునిక శాస్త్రజ్ఞులు కూడా అణువులూ, పరమాణువులూ అనేవి ప్రతిపాదించే నాటికి వాటిని గురించి ప్రత్యక్ష సాక్ష్యం ఏదీ లేదు తార్కికులు "అనుమానం" అనేది ఊహకు ఆధారమవుతుంది శాస్త్రజ్ఞులు ముందు ఊహిస్తారు తరువాత ఆ ఊహలను రుజువు చెయ్యటానికి ప్రయోగాలు చేస్తారు. ప్రయోగాల ద్వారా రుజువైన ఊహలు సిద్ధాంతాలుగా చలామణి అవుతాయి. కాని మరికొన్ని ప్రయోగాలు ఆ సిద్ధాంతాలకు విరుద్ధంగా ఫలితాలిచ్చినప్పుడు సిద్ధాంతాలు సంస్కరించబడతాయి ఈ విధంగా విజ్ఞానం పురోగతి భారీగా బుద్ధి కొలతమీద ఆధారపడి ఉంటున్నది.

**ఆలోచనకు ఆధారం ఏది ?**

ఆలోచనకు స్పృహ ఆధారం అంతేకాదు స్పృహ ఆలోచనను పరిమితం చేస్తుంది. ఆధునికులంత బాగా ప్రాచీనులు ఆలోచించలేదు. వారికి వాస్తవికత అనేది కూడా సరిగా అవగాహన కాదు. మరొక విషయం ఏమిటంటే స్పృహ సామాజికమైనది. ఏ కారణం చేతనైనా సమాజానికి దూరంగా పెరగటం జరిగినవాళ్ళకు మానవ సహజమైన స్పృహగాని, ఆలోచనాశక్తిగాని ఉండదు

ఏ కారణం చేతనైతేనేం 15 మంది పిల్లలు మనుషుల మధ్య కాక, తోడేళ్ళ మధ్య పెరిగారు వారిలో ఒక పిల్ల పేరు కమల. అయిదుగురు పిల్లలను ఎలుగుబంట్లు పెంచాయి. బెబూన్ కోతులూ, చిరతపులులూ, గొరైలూ పెంచిన పిల్లలు కూడా వున్నారు ఈ పిల్లలు నడవలేరు మాట్లాడలేరు ఆలోచించలేరు ఇవన్నీ మనకు ప్రత్యక్షంగా తెలిసినవి. పుక్కిటి పురాణాలలో ఇలాంటి కేసులు అసంఖ్యాకంగా వున్నాయి

### ఆమె బుద్ధివికాసం

కమల అనే పిల్లను 1920లో డాక్టర్ సింగ్ అనే ఆయన పసికట్టాడు ఇండియాలో ఒక తోడేళ్ళ నివాసంలో ఆయనకు ఇద్దరు ఆడపిల్లలు, 8 ఏళ్ళూ, 2 ఏళ్ళూ వయసుగలవాళ్ళు కనిపించారు. చిన్నపిల్ల త్వరలోనే చనిపోయింది పెద్ద పిల్ల మరి 10 ఏళ్ళు బతికింది డాక్టర్ సింగ్ ఆ పదేళ్ళలో కమలకు సంబంధించిన వివరాలు డైరీ రాశాడు కమల కాళ్ళతోబాటు చేతులు కూడా నేల మీద ఆనించి నడిచేది, కూర్చునేది, పరిగెత్తేది, తినేది, తాగేది, కతికి తాగేది ఆహారం తినేటప్పుడు ఎవరైనా సమీపిస్తే గుర్రుమనేది రాత్రిపూట మోరఎత్తి ఏడ్చేది. చీకట్లో చక్కగా చూసేది. వెలుగును అంతగా సహించేది కాదు నీరూ, నిప్పూ చూసి భయపడేది పగలు ఒక మూల కుక్కలాగా కూర్చుని గోడకేసి తిరిగి నిద్రపోయేది స్నానం చేయించనిచ్చేది కాదు బట్టలు వేస్తే చింపేసేది చలిగా వున్నా కప్పనిచ్చేది కాదు

ఆమెను నిలిచేటట్టు చెయ్యటానికి రెండేళ్ళు పట్టింది నడిచేటట్టు చెయ్యటానికి ఆరేళ్ళు పట్టింది కాని పరిగెత్తటానికి మాత్రం చేతులు కూడా ఉపయోగించేది నాలుగేళ్ళలో ఆరు మాటలు మాత్రమే నేర్చుకోగలిగింది 45 మాటలు నేర్చుకొనటానికి ఆమెకు పది ఏళ్ళు పట్టింది 17 ఏళ్ళు వయసున ఆమె బుద్ధి వికాసం నాలుగేళ్ళ పిల్లను పోలి ఉన్నది కమలకు రెండో పిల్ల అంటే చాలా ప్రేమ ఆ పిల్ల చనిపోయినాక ఆమె రెండు రోజుల పాటు తిండీ, నీరూ ముట్టలేదు

దీన్నిబట్టి మనిషి స్పృహకూ, ఆలోచనకూ మనిషి మెదడు మాత్రమే చాలదనీ, సంచితజ్ఞానమూ, సామాజిక వాతావరణమూ లేకపోతే మనిషి బుర్ర బుద్ధికొలతలో పని చెయ్యదని స్పష్టమవుతుంది

### కన్నుకావాలా ? చెవి కావాలా ?

మనిషి మెదడు బుద్ధి కొలతలో పనిచెయ్యటానికి జ్ఞానేంద్రియాల సహాయం ఏపాటి కావాలి ? చిన్న పిల్లలు గట్టిగా పైకి చదువుతారు ఆ దశలో వాళ్ళు చదివిన దాన్ని గురించి ఆలోచించరు చదివినది "వంటబట్టే" దశలో చదివేటప్పుడు కళ్ళ సహాయం చాలు చూసి చదివేవాడు తాము చదివేది గట్టిగా పైకి చదివితే అది అంత బాగా అర్థం కానట్టు కనబడుతుంది పైకి చదివేవాడికన్న వినేవాడికి మరింత బాగా అర్థమవుతుంది అంతే కన్నుగాని, చెవిగాని, ఏదో ఒకటి చాలునన్నమాట !

"ఇన్‌స్పిరేషన్" మాట ఏమిటి ? ఈ మాటకు అసలు అర్థం ఉచ్ఛ్వాసం - గాలి పీల్చటం కాని సృజనాత్మక కళల విషయంలో దీనికి వేరే అర్థం వున్నది. కళాకారుడు తన సహజ శక్తికి మించిన కళానైపుణ్యం ప్రదర్శించినట్టు ఒక్కొక్కసారి భావిస్తాడు రచయితలు తాము రాసినది కొంతకాలం గడిచాక చదువుకుని, "ఇది నిజంగా నేనే రాశానా ?" అనుకున్న సందర్భాలున్నాయి. ప్రపంచఖ్యాతిగల అనేకమంది కళాకారులు తాము కొన్ని రచనలు "ఇన్‌స్పిరేషన్"తో చేసినట్టు చెప్పారు. ఇన్‌స్పిరేషన్ అనేది భ్రమా ? లేక మెదడు తాలూకు ఒక స్థితికి ఫలితమా ? ఇది శాస్త్రజ్ఞులకు అంతు చిక్కినట్టు కనబడదు.

ఇన్‌స్పిరేషన్‌కూ, ఫాంటసీ (అద్భుత భావన)కీ ముడిపెట్టారు జానపద సాహిత్యం నిండా ఫాంటసీ వున్నది కామరూపులూ, ఎగిరే కోతులూ, డబ్బు ఇచ్చే దయ్యాలూ, చిలకల్లో ప్రాణాలున్న రాక్షసులూ వగైరా స్పృహకు అందనిదాన్ని భావన చెయ్యటమే ఫాంటసీ దానికీ, అపూర్వ ప్రేమ అనదగిన ఇన్‌స్పిరేషన్‌కూ సంబంధం ఏమిటో నాకు తెలియటం లేదు

### ప్రాడిజీలు

అసాధారణ ప్రతిభావంతులు ప్రతికాలంలోనూ, ప్రతిదేశంలోనూ ఉన్నారు. సుప్రసిద్ధ

సంగీత ప్రవీణుడు మొజార్ట్ నాలుగో ఏట హార్ప్సికార్డ్ వాయించాట్ట అయిదోఏట సంగీతం సృష్టించాట్ట ఎనిమిదో ఏట తన మొదటి సొనాటా, సింఫనీ రచించాట్ట పదకొండో ఏట ఒపేరా రచించాట్ట

అలాగే పుష్కిన్ ఏడెనిమిదేళ్ళ వయసులో కవిత్వం రాయనారంభించాడు ఇలాంటి "చైల్డ్ ప్రాడిజీలు" ఎందరైనా ఉన్నారు మన కళ్ళ ఎదుట మంగళంపల్లి బాలమురళీకృష్ణ వున్నాడు. తొమ్మిదో ఏట పాట కచేరీ చేసి పన్నెండేళ్ళకు కాబోలు 72 మేళకర్తల మీద కృతులు రచించాడు

ప్రాడిజీలకు స్వతసిద్ధంగా ఉండే ప్రతిభ తాత్కాలికంగా రావటమే ఇన్స్పిరేషన్ అని ఎందుకనుకోకూడదు ? ఇన్స్పిరేషన్ నిలిచి ఉండదు నిజమే కాని ప్రాడిజీలు కూడా కొందరు కొంత కాలానికి వట్టిపోవటం జరుగుతుంది అలాంటి సందర్భాలలో వాళ్ళ ప్రతిభను దీర్ఘకాలికమైన ఇన్స్పిరేషన్ అనవచ్చు.

ఇన్స్పిరేషన్నుగాని, ప్రాడిజీలనుగాని శాస్త్రవేత్తలు ఎలాంటి సంజాయిషీ ఇచ్చుకోలేరు మెదడు బుద్ధికొలతలో అసాధారణంగా పని చెయ్యటమే దీనికి మూలమని నేను ప్రతిపాదిస్తున్నాను కొన్ని వందల కోట్లలో ఉండే సంఖ్యను బోర్డు మీద రాసి దానికి ఏడో "రూట్" అడిగితే శకుంతల అనే పిల్ల అరనిమిషంలో చెప్పిందట ఇది బుద్ధి కొలతలో మెదడు అతి తీక్షణంగా పనిచెయ్యకుండా సాధ్యం కాదు

**స్మరణ**

"నేను" (అహం) అనే భావం ఏమిటన్నది మానవజాతిని వేధించిన పెద్ద సమస్యలలో ఒకటి అది శరీరానికి భిన్నమైనదనీ, ("నా ఒంట్లో బాగా లేదు") శరీరం పోయినా శాశ్వతంగా ఉండే ఆత్మ అదేననీ ("నాహన్యతే హన్యమానే శరీరే"), నిద్రలో అది శరీరాన్ని విడిచిపెట్టి సంచారం చేస్తుందనీ - ఇలా ఎన్నో విశ్వాసాలు ఈ "నేను" నుంచి ఏర్పడ్డాయి

ఇది స్మరణ (జ్ఞాపకం) ద్వారా ఏర్పడ్డ భావమని శాస్త్రవేత్తల అభిప్రాయంగా కనబడుతుంది 'A person 'I' is the continuity of his consciousness based on memory' కాని స్మరణ "అహం" కన్న చాలా అస్పష్టమైనది చాలా కాలం క్రితం జరిగినవి జ్ఞాపకం చేసుకున్నప్పుడు మనం అనదలచుకున్నవి నిజంగా అన్నట్టూ, చేద్దామనుకున్నవి నిజంగా చేసినట్టూ అనిపించవచ్చు. కొన్ని చిన్న అనుభవాలు మనకే జరిగాయో, మన దగ్గర వాళ్ళకు జరిగాయో కూడా స్పష్టంగా తెలియకపోవచ్చు.

**నేను అంటే ఎవరు ?**

మెదడు దెబ్బతిన్న మనిషి జ్ఞాపకశక్తి కోల్పోయి, "నేను ఎవరో తెలియటం లేదు" అంటాడు వాడి 'నేను' ఆరోగ్యవంతుడి 'నేను' ఒకటి కాదని ప్లతనోవ్ అంటాడు కాని ఇది నిజమా ? స్మరణ పోయినంత మాత్రాన 'నేను' అనే భావం పోతుందా ? స్మరణ పోనివాడు తన వ్యక్తిత్వాన్ని స్పష్టంగా ఎరిగి ఉండవచ్చు కాని స్మరణ పూర్తిగా పోయినవాడిలో కూడా 'అహం' ఉంటుంది. అది అనుభవానికీ, స్పృహకూ సంబంధించినదని నా ఉద్దేశం జ్ఞాపకశక్తి పూర్తిగా పోయినవాడు కూడా తాను చూసేదీ, తాను వినేదీ తన "సొంతం" అన్న సంగతి గ్రహించగలడు. తన సుఖదుఃఖాలకూ, ఇతరుల సుఖదుఃఖాలకూ తేడా గ్రహించగలిగినంతసేపూ 'నేను' అన్నది ఉండనే ఉంటుంది.

'అహం'కు సంబంధించిన స్మరణ 'కాలం'లో ముందుకూ, వెనక్కూ కూడా చూడగలడు అంటే గతించిన విషయాలే గాక, భావించిన విషయాలు కూడా స్ఫురణకు తెచ్చుకోగలడు

ఈ సందర్భంలో గమనించవలసినదేమంటే 'భిన్న వ్యక్తిత్వం' (Split Personality) ఇదొక చిత్రమైన స్థితి ఒకే మనిషిలో రెండు 'నేను'లూ, రెండు రకాల స్పృహలూ ఉండటం జరుగుతుంది

Flise అనే ఫ్రెంచి యువతి ఇలాంటి ద్వంద్వ వ్యక్తిత్వం ప్రదర్శించిందట ఒకప్పుడు జబ్బుగా, కూబిగా, దిగులుగా, పిరికిగా ఉండేదట ఉన్నట్టుండి మరో మనిషిలాగా మారిపోయి, ఉల్లాసంగా, చలాకీగా, కవ్వింపుగా, బుద్ధిహీనంగా కూడా ప్రవర్తించేదట ఈ ద్వంద్వ జీవితాల మధ్య సంబంధం లేదు ఏ జీవితంలో ఉన్నప్పుడు ఆ జీవితానికి సంబంధించిన విషయాలే స్మరించగలిగేది రెండో జీవితం గురించి స్మరణ లేకుండా వుండేది.

19, 20 శతాబ్దాల సంధి కాలంలో ఇలాంటి కేసులు సుమారు 20 రిపోర్టు అయాయట ఒక కుర్రవాడు ఆరు భిన్న జీవితాలు జీవించాడట !

**అహమా ? అహోలా ?**

దీనినిబట్టి 'నేను'కూ, స్మరణకూ విడరాని సంబంధం వున్నదంటాడు ప్లతనోవ్ కాని నా ప్రశ్న ఏమంటే, స్ఫురణ అనేది మెదడుకు సంబంధించినది మాత్రమే అయితే ఒకే మెదడు, దానికి అనుబంధించిన జ్ఞానేంద్రియాలు రెండు రకాల స్ఫురణలకు ఎలా ఆస్కారం ఇస్తున్నాయి? ఈ ప్రశ్నకు సమాధానం బుద్ధికొలత ఇయ్యగలదు మెదడు స్ఫురణకు సాధనమైన యంత్రం టెలిఫోన్ ఎక్స్టెన్షన్‌లాగా బుద్ధికొలతలో అది అనేక స్ఫురణలకు సాధనంగా పని చెయ్యవచ్చు ఒకే మనిషిలో రెండు 'అహం'లుఎలా ఉంటాయో శాస్త్రజ్ఞులు చెప్పలేరు ఆరు మాట దేవుడెరుగు!

స్మరణకు సంబంధించిన మరొక అనుభవం చాలామందికి వస్తుంది ఎక్కడికో మొదటిసారి వెళ్ళి 'ఇక్కడికి నేను అదివరకే వచ్చాను, ఎప్పుడు వచ్చాను' అని ఆశ్చర్యపడతారు. అలాగే కొన్ని మాటలు విన్నప్పుడు, అచ్చుగా అవే మాటలు అదే సందర్భంలో లోగడ విన్నట్టు భావన కలుగుతుంది స్పష్టంగా ఈ భావనకు స్థల కాల సంబంధమైన ఆధారం ఏమీ ఉండదు. దీన్ని గురించి శాస్త్రవేత్తలు ఏం చెబుతారు ? పూర్తిగానూ, అమితంగానూ అలసి ఉన్న మనిషికి ఇలాంటి భావన కలుగుతుందంటారు

ఇది నిజం కాదని నేను నా అనుభవం నుంచి చెప్పగలను నేను ఒకే ఒకసారి ఒక ముస్లిముల పెళ్ళి రిసెప్షనుకు పిలవని పేరంటంగా వెళ్ళాను ఎవరో బాయీజాన్ పాడుతున్నదంటే వినటానికి వెళ్ళాను. నన్నెవరూ అడ్డలేదు. లోపలకి వెళ్ళి కూర్చుని ఒక గంటసేపు పాట విన్నాను ఆ గంటసేపు నాకు "ఇదంతా నాకు అదివరకే తెలిసిన వాతావరణమే" అనిపించింది. అలాంటి భావం అంత బలంగా నాకు మరెన్నడూ కలగలేదు కాని నేను కొంచెం కూడా అలసి వుండలేదు బుద్ధి కొలతలో మనం ఊహించని అనుభవాలు సాధ్యమని నేను నమ్ముతాను కాని అదే ఇలాంటి భావనకు కారణమని వాదించను అలుపు వల్ల ఇలాంటి భావన వస్తుందన్నది నిజం కాదనటానికే నా అనుభవం చెప్పాను.

**ఈ అనుభవ మేనాటిదో !**

ఈ భావం నుంచి మూఢ విశ్వాసాలు పుట్టుతాయని ప్లతనోవ్ అంటాడు. నా అనుభవం విన్న హిందువులలో నూటికి 99మంది, "నువ్వు క్రిందటి జన్మలో ముస్లిమువి అయి వుంటావు" అనేస్తారు.

కొన్ని అసాధారణమైన అనుభవాలకు శాస్త్రవేత్తలు చాలా సాధారణమైన వ్యాఖ్యానాలిస్తారు ఒక చదువురాని మనిషి జబ్బుపడి, సంధించిన స్థితిలో గ్రీకు, హీబ్రూ భాషలకు చెందిన పుస్తకాల నుంచి నిర్దుష్టంగా పేజీల కొద్దీ అప్పజెప్పింది ఒళ్ళు తెలిసినాక ఆ పని ఎలా చేశావంటే

చెప్పలేకపోయింది అయినా శాస్త్రవేత్తలు కారణం కనిపెట్టారు ఎప్పుడో ఆమె ఒక పాస్టర్ వద్ద పనిమనిషిగా ఉండేదట అయనగారు గ్రీకు, హిబ్రూ గ్రంథాలను గట్టిగా పైకి చదివేవాడట అదంతా ఆమె బుర్రలో ఎక్కడో రికార్డయి ఉండి, సంధి పేలాపనలో బయటికి వచ్చింది.

ఈ వివరణను ఆక్షేపించే పనిలేదు. కాని శాస్త్రవేత్తలు అంతటితో ఎలా తృప్తిపడ్డారు ? ఒక నిరక్షరురాలు తనకు తెలియని భాషల పారాలు ఏళ్ళ తరబడి మెదడులో ఉంచుకుని, జబ్బులో వాటిని ఒక్క తప్పులేకుండా వల్లెవేయటం ఎలా సాధ్యమయింది ? మనస్తత్వవేత్తలు దీన్ని సాధారణ విషయంగా భావిస్తారా ? జబ్బుచేసి తన మామూలు స్పృహ అచేతనంగా ఉన్న దశలో ఆ మనిషి రెండో స్పృహ కాలంలో వెనక్కువెళ్ళి బుద్ధి కొలతలో ఆ పారాలు అప్పజెప్పిందని నా వాదం. బుద్ధి కొలతలో పనిచేసే స్పృహను ఆశ్రయించకుండా ఇలాంటి కేసులను అర్థం చేసుకోలేం

**విడ్డూరాలు**

ఇంతకన్నా విడ్డూరమైన కేసులున్నాయి ఒక అమెరికన్ యువతి తన రాష్ట్రం దాటి ఎక్కడికీ వెళ్ళనిది 17వ శతాబ్దినాటి ఇంగ్లీషు భాషలో రచనలు చేసింది. భాషా ప్రవీణులు ఆ రచనలను పరిశీలించి, 17వ శతాబ్ది అనంతరం ఇంగ్లీషు భాషలోకి వచ్చిన ఒక్కమాట కూడా వాటిలో లేదన్నారు ఇలాంటి కేసులను సైకిక్ రిసెర్చివాళ్ళు చాలా శోధించారు. కాని ప్లతనోవ్ వాటి జోలికి పోలేదు. వాటికి స్మరణ సహాయకారి కాదు.

స్మరణ అనేది కూడా విశ్వసనీయంగా ఉండాలి. 1812లో జిరాకోల్బర్న్ అనే ఎనిమిదేళ్ళ కుర్రాడు సంఖ్యలను 10వ పవరు, 16వ పవరుకూ పెంచటమూ, రూట్‌లు గుణించటమూ చేశాడు (ఉదాహరణకు 2ను 16వ పవరుకు పెంచితే వచ్చే సంఖ్య 65,536) ఆ కుర్రాడు 48 గంటలలో నిమిషాలు ఎన్ని అని అడిగితే తడుముకోకుండా 25,288,800 అని చెప్పాడు. అంతేగాక వెంటనే సెకండ్ల సంఖ్య కూడా చెప్పాడు

కాని దీనికీ స్మరణ శక్తికీ ఏమైనా సంబంధం ఉన్నదా ? ఏకసంతగ్రాహు లున్నారు చెకోవ్‌స్కీ రచించిన సింఫొనీలో ఒక్కసారి విని, రెండేళ్ళ అనంతరం వాటిని అప్పచెప్పిన రష్యను సంగీతవేత్త ఉన్నాడు. అలాంటిది స్మరణ శక్తిని సూచిస్తుందని ఒప్పుకోవచ్చు

× × ×

ప్రస్తుతానికి బుద్ధికొలత గురించి నేను చెప్పదలచుకున్నది ఇక్కడ ఆపేస్తాను న్యాయంగా సైకిక్ రిసెర్చి ఆధారం చేసుకుంటే నా వాదనను నిరూపించటం ఇంకా తేలిక అయితే సైకిక్ అనుభవాలు మూఢ విశ్వాసాలను మరింతగా ప్రచారం చేసేవిగా ఉంటాయి. శాస్త్రజ్ఞులు వాటిపట్ల ఉదాసీనంగా ఉన్నారు అందుచేత ఆ గొడవలోకి మరొకసారి పోతాను ప్రస్తుతానికి మనస్తత్వం మటుకే నా ప్రతిపాదనను పరిమితం చేశాను. నా వాదనలలో పొరపాట్లుంటే వాటిని శాస్త్రజ్ఞులు బయట పెట్టాలి

**(ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 9-9-1977)**

# 4. సృష్టిలో కొలతలు

విశ్వానికి కొలతలున్నాయన్న భావన ప్రాచీనమైనది కాదు ప్రాచీనులు విశ్వమంతా అయిదు భూతాలతో భూమి, నీరు, గాలి, ఆకాశములతో కూడుకున్నదన్నారు కొందరు ప్రాచీనులు ఆకాశాన్ని వదిలేసి నాలుగే భూతాలన్నారు స్థల, కాలాలు సృష్టిలో మౌలికమైన కొలతలన్నది శాస్త్రజ్ఞుల భావన

పామరుల దృష్టిలో దూరం అన్నది సర్వత్రా ఒక్కటే అలాగే కాలం కూడానూ. కాని గుణాత్మకంగా స్థలం స్వభావం మారుతుంటుందని, కాలం సర్వత్రా ఒకటి కాదని శాస్త్రవేత్తలు నిరూపించారు. చంద్రుడు మనకు మూడు లక్షల కిలోమీటర్ల దూరంలో ఉన్నాడనుకుందాం ఏ విమానంలోనైనా బయలుదేరి మూడు లక్షల కిలోమీటర్లు ప్రయాణం చెయ్యటం ఎవరికైనా సాధ్యమే కాని చంద్రుడి దగ్గరికి మనిషి పోవటానికి సహస్రాబ్దాల సాంకేతిక పరిణితి అవసరమయింది అలాగే మనం ఒక గంట అనేది భూమిమీద ఒక విధంగానూ, శూన్యాకాశంలో ఇంకో విధంగానూ, సూర్యుడి ప్రాంతంలో మరోవిధంగానూ సెకండుకు లక్ష కిలోమీటర్ల వేగంతో పోయేదానిమీద వేరే విధంగానూ వుంటుంది స్థలాన్ని, కాలాన్ని కొలవటానికి మనం ఉపయోగించే టేపులు, గడియారాలు చాలావరకు మన పరిసరాలకు మాత్రమే పనికివస్తాయి

**దేవుడు అసత్య కల్పన**

దూర, కాలమానాలు సాపేక్షమైనవి వాటి 'అసలు' ప్రమాణాలు తెలుసుకునేటందుకు వీలులేదు. కాని మనం మన బుద్ధితో గ్రహించే ప్రతిదీ స్థలంలోను, కాలంలోను ఉనికి కలిగి వుండాలి దేవుడు అసత్య కల్పన అనటానికి 'సర్వాతర్యామి', 'కాలాతీతుడు' అన్న నిర్వచనాలు చాలు ఈ రోజుల్లో శాస్త్రవేత్తలు సెకండులో 20 లక్షల వంతు కాలం మాత్రమే వుండే పరమాణు కణాలను కనిపెడుతున్నారు. అలాగే ఎలక్ట్రాన్ల బరువును, విద్యుదయస్కాంత సూక్ష్మ తరంగాల నిడివినీ కొలుస్తున్నారు. ఇవి సూక్ష్మాతి సూక్ష్మమైనవి అయినా కల్పనలు కావు స్థల, కాలాలలో వాటి ఉనికిని శాస్త్రవేత్తలు రుజువు చేయగలరు.

**బుద్ధి క్రమపరిణామం**

సృష్టిలో ముఖ్యంగా జీవరాశిలో బుద్ధి అనేది క్రమ పరిణామం చెందింది దానికి సాధనం మెదడు. ఉపకరణాలు కన్ను, చెవి లాంటి జ్ఞానేంద్రియాలు ఆదిమ ప్రాణులలో ఈ ఇంద్రియాలు వీటి పరిసరాలలో కలిగే మార్పులను గ్రహించటానికి, ఆ మార్పులు కొన్ని పరిమితులలో ఉంటే ఆత్మరక్షణ చేసుకొనటానికి తోడ్పడతాయి ఈ శక్తి ప్రత్యేక ప్రాణుల్లో ఉండటమేగాక, ఒక్కొక్క జాతిలోను ఒక్కొక్క దశకు వ్యక్తులలో సంక్రమిస్తూ వుంటాయి ఏకకణ జీవులు విభజన ద్వారా సంఖ్యావృద్ధి చెందడం తరాల వెంబడి సాగిపోతుంది. అలాగే జలచరాలకు ఈదటం లాంటి స్వభావాలు స్థల, కాల ప్రమేయం లేకుండా తరతరాలు సంక్రమిస్తాయి

అలాగే ఉన్నత పరిణితి చెందిన ప్రాణులలో అనేక కోట్ల సంవత్సరాల మీద జరిగిన పరిణామం పిండరూపంలో వుండగానే కొద్దివారాలలో లేక నెలలలో జరిగిపోతుంది

**మెదళ్ళలో వ్యత్యాసాలు**

ఏ ప్రాణికైనా సంక్రమించేది ఆ ప్రాణికి సహజమైన మెదడే గదా అది స్థల, కాలాలకు కట్టుబడినదే గదా అనవచ్చు ఆ మెదడు ఒక్క జీవకణం నుంచి రూపొందుతున్న విషయం అలా వుంచి, మెదడు బుద్ధికి గ్యారంటీ ఎంత మాత్రమూ కాదు మనుషుల మెదళ్ళలో వుండే స్వల్ప వ్యత్యాసానికి, వాళ్ళ బుద్ధులలో వుండే హెచ్చు వ్యత్యాసానికి పొంతన వుండదు పరిస్థితులు

బుద్ధికి చాలా తోడ్పడుతాయి. చదువుకున్నవాడి బుద్ధీ, చదువుకోనివాడి బుద్ధీ ఒకటిగా వుండదు- ఇద్దరూ కవలపిల్లలైనా సరే ధనికుడి బిడ్డల మనస్తత్వానికీ, శ్రామికుడి బిడ్డల మనస్తత్వానికీ ఎంతో తేడా వుంటుంది సంస్కర్తలు, రాజకీయవాదులు కుస్తీలు పట్టేది ప్రజల మెదళ్ళతోకాదు, బుద్ధులతో.

ఇంతకన్న మంచి ఉదాహరణ జంతువులు పెంచిన మనుషులు. వీరికి జన్మతః మనిషి మెదడే వచ్చినా, బుద్ధులు మనిషి బుద్ధులకు చాలా వ్యత్యాసంగా వుంటాయి. ఉదాహరణలు ముందు చూస్తాం.

ఒక 'కొలత'లో స్వేచ్ఛగా ముందుకూ వెనక్కూ పోవటానికి ఇంకో కొలతను ఆధారం చేసుకోవాలి. 'ఎవరూ ఒకే నదిలో రెండుసార్లు స్నానం చెయ్యలేరు' అని ఒక సామెత ఉన్నది కాని ఒకే చెరువులో ఒక మనిషి ఎన్ని సార్లయినా స్నానం చేయవచ్చు. నది నీరు క్షణక్షణమూ మారిపోతుంది ఒక మనిషి ఒకే క్షణంలో రెండు స్థలాలలో వుండలేడు కాని వ్యవధి యిస్తే ఒక చోటు నుంచి ఇంకొక చోటుకి మారగలడు బయలుదేరిన చోటుకి తిరిగి రాగలడు కూడా

మన బుద్ధి కాలంతో వెనక్కు పోగలదు. రాత్రివేళ మనం ఆకాశంలో చూసే నక్షత్రాలు ఒక్కోసారి కొన్ని లక్షల సంవత్సరాల క్రితం ఏ రూపంలో ఎక్కడ ఉన్నాయో అలాగే మనం చూస్తాం అవి ఈ క్షణంలో మాయమైనా కొన్ని లక్షల ఏళ్ళపాటు మనం లేక మన వారసులు చూడవచ్చునన్నమాట ఇది గతంలోకి చూడటమే గదా !

**గతంలోకి వెళ్ళేశక్తి ·**

ఇలా గతంలోకి వెళ్ళే శక్తి మన జ్ఞానేంద్రియాలకు ఒకే విధంగా వుండదు ముందు మెరుపు కనిపించి, తరువాత ఉరుము వినిపిస్తుంది. కంటికన్న చెవి కాలంలో వెనకబడి వుంటుంది దూరాన చాకలి బట్టలు వుతుకుతుంటే బట్ట బండక తగలటం కనిపించిన కొద్ది సేపటికి గాని చప్పుడు వినిపించదు

అయితే బుద్ధిజీవి అయిన మానవుడు తన జ్ఞానేంద్రియాల లోపాలను సరి చేసుకోవడం నేర్చుకున్నాడు. ఇది బుద్ధి ద్వారానే సాధ్యమయింది. ఎన్ని ఉదాహరణలైనా చెప్పుకోవచ్చు. యుద్ధంలో విమానాలను కూల్చేవాళ్ళు బాంబులను అవి కనబడిన చోటికి గురిచెయ్యరు బాంబులూ, విమానాలూ ఒకేచోటికి, ఒకే క్షణంలో చేరేలాగు గుర్తించి ప్రయోగిస్తారు శత్రు విమానం ఎంత దూరాన ఉన్నదీ, ఎంత వేగంలో ఏ దిక్కున పోతున్నదీ తెలియాలి. దాన్ని కొట్టే బాంబు విమానాన్ని చేరటానికి ఎంతకాలం పట్టేది తెలియాలి. ఇలాంటి సమస్యే శత్రునగర స్థావరాల మీద బాంబులు వేసే బాంబర్లకూ తేడా వుంటుంది. తేడా ఏమంటే, ఈ సందర్భంలో గురి స్థిరంగా వుండి, బాంబు ప్రయోగించే స్థలం కదులుతూ వుంటుంది

**శాస్త్రజ్ఞులు దివ్యదృష్టి .**

మరొక ఉదాహరణ తీసుకుందాం. ఏ చంద్రుడి మీదకో, శుక్రుడి మీదకో, అంగారకుడి మీదకో ఒక పరిశోధక యంత్రాన్ని దించాలనుకుందాం. ఈ గమ్యస్థానాలు కదిలేవి భూమిమీద నుండి ప్రయోగించి రాకెట్ వాటికి చేరేసరికి, అవి ఎక్కడ వుంటాయో స్పష్టంగా తెలియాలి వాటిని సమీపించే సమయానికి రాకెట్ వేగం ఒక పరిమితి దాటరాదు. దాటితే అది గమ్యస్థానాన్ని తప్పుకొని ఏ సూర్యుడి వైపో వెళ్ళిపోగలదు. ఈ పరిస్థితులలో ఈనాటి శాస్త్రవేత్తలు చంద్రుడి మీద, అంగారకుడి మీద యంత్రాలను దించడమే కాక, తాము కోరుకున్న ప్రాంతంలో దించగలుగుతున్నారంటే బుద్ధి ప్రభావం ఏ ప్రమాణానికి ఎదిగినదీ తెలుస్తుంది మన పురాణాలలో దివ్యదృష్టి గురించి చెప్పి వున్నది ఆ దివ్యదృష్టికి ఆధారం లేదు. కాని శాస్త్రజ్ఞుల 'దివ్యదృష్టి'

కి ఫోటోల సాక్ష్యం వున్నది. చంద్రుడి అవతలిపక్క భూమికేసి ఎన్నడూ తిరగదు కాని బుద్ధిజీవి అయిన మానవుడు దాన్ని ఫోటోలు తీసి చూడగలిగాడు అలాగే ప్రస్తుతం అంగారకుడి ఫోటోలు శాస్త్రజ్ఞులకు లభ్యమవుతున్నాయి

ఈ బుద్ధి వికాసం పరిణితి చెందటానికి సృష్టికి చెందిన బుద్ధి కొలత అవకాశమిచ్చిందని నా వాదం. బుద్ధిని మెదడు యొక్క ధర్మం అన్నది పొరపాటని నా నమ్మకం కాలం గడియారం యొక్క ధర్మం ఎలా అవుతుంది ? మెదడుకు భౌతికంగా దెబ్బ తగిలితే బుద్ధి పనిచెయ్యని మాట నిజమే, గడియారం ఆగిపోతే కాలం తెలియనట్టు

**పరిణామం బుద్ధి కొలతలో :**

ప్రాణులు పరిణామం చెందినట్టే బుద్ధి కూడా పరిణామం చెందింది ఆ మాట నిజమే అయితే ఈ పరిణామం అనివార్యంగా రాలేదు కాలంలో మాత్రమే జరిగినది కాదు అలా కాలంలో జరిగే పరిణామాలు బాల్యం నుంచి వార్ధక్యం దాకా జరుగుతాయి. అవి అనివార్యమైనవి. అతి ప్రాచీనమైన జీవకణాల నుంచి మానవుడి వరకూ కాలం కొలతలో పరిణామం జరిగినప్పటికీ, అనేక పరిణామ దశలలో ఉత్పత్తి అయిన జీవరాశి అంతా ఇంకా అలాగే జీవించి వున్నది, అంతరించి పోయిన కొన్ని జాతులను మినహాయిస్తే ఉదాహరణకు - వానరాలకు వారసుడుగా మానవుడు అవతరించాడు. కాని వానరాలన్నీ మానవులుగా పరిణమించలేదు ఈ కారణం చేత పరిణామం బుద్ధి కొలతలో జరిగినదని నా ఉద్దేశం

గతం ఎలా జ్ఞాపకం వుంటుంది ? భవిష్యత్తును ఎలా సరిగా అంచనావేసి, దానికి తగినంత ఏర్పాట్లు ముందుగానే చేసుకోగలుగుతున్నాము ? పుస్తకాల ద్వారా, ఫోటోల ద్వారా, రికార్డుల ద్వారా గతాన్ని ఏ శక్తితో శాశ్వతంగా వుంచగలుగుతున్నాం ? బుద్ధి కొలతలో మనకు వునికి లేకపోతే ఇనవీ్న సాధ్యం కావు. గతానికి సంబంధించిన విషయాలు మనకి తెలిసి జ్ఞాపకం లేనప్పుడు కూడా మెదడులో ఏ మూలో దాగి వుండి, హిప్నొటైజ్ చేసినప్పుడు పైకి రావటం కద్దు నయమైపోయిన రోగ లక్షణాలను హిప్నొటిక్ సజషన్ ద్వారా తెప్పించారు

**భవిష్య పురాణం :**

అదే ఎవరైనా భవిష్యత్తులోకి తొంగిచూసి రానున్నది చెప్పటం జరిగితే మనం చిత్ర విచిత్రంగా రియాక్టు అవుతున్నాం దాన్ని దైవికశక్తిగా కొందరు ప్రచారం చేస్తారు కొందరు యాదృచ్ఛిక సంఘటన అంటారు. మరికొందరు అంతా వట్టి కల్పన అంటారు

రానున్నది చెప్పటమనేది స్థల కాల పరిజ్ఞానంతో చెబితే పేచీరాదు మే, జూన్ నెలలలో రైళ్ళలో ఇంతమంది అదనపు ప్రయాణీకులు పోతారు. యిన్ని అదనపు రైళ్ళు నడపాలి అంటే ఎవరూ హిస్టీరియా తెచ్చుకోరు అలాంటిది మింగుడుపడే 'జోస్యం' ఫలాన రోజున ఫలాన రైలుకు ప్రమాదం జరుగుతుంది అని ఎవరైనా చెప్పి అది నిజమైతే ఆ సంఘటన మింగుడు పడదు. అలాంటి జోస్యంలో దేవతాశక్తుల ప్రభావం ఏమీ లేదనీ బుద్ధి కొలతలో ముందుకు చూడగలవాడికి అది సాధ్యమేననీ గ్రహించడం తేలిక కాదు.

**(ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 12-8-1977)**

# 5. నిద్రలో బుద్ధికల్పన - ఉపోద్ఘాతం

ఇందులో మరొక సమస్య కూడ ఉన్నది నాటకకర్త కొన్ని క్షణాలలో కన్న కల అక్షరాలా అలాగే జరిగిందో లేదో అంటే ప్రదర్శన అలాగే సాగిందో లేదో ప్రేక్షకులు హర్షించారో లేదో మనకు తెలియదు. అచ్చుగా అలాగే జరిగివుంటే నాటక రచయిత భవిష్యత్తు చూశాడనాలి అంటే అతని స్మృహ భవిష్యత్తులోకి పోయిందన్నమాట లేని పక్షంలో అది అతని బుద్ధిచేసిన కల్పన అప్పుడొక ప్రశ్న వస్తుంది. నిద్రావస్థలో మనిషి బుద్ధి అలాటి కల్పన ఎలా చేస్తుంది ?

**కలలో ఇలలో రెండురకాల స్పృహలు**

కలల విషయంలో మనం జాగ్రదావస్థలో అనుకొనేవే చిత్ర విచిత్ర రూపాలతో కలలుగా రావడం కద్దు కలలు శరీర ఆరోగ్యస్థితినిబట్టి వస్తాయనటానికి కూడ సందేహం లేదు (హోమియోపతిలో కలలనుబట్టి మందులు కూడ ఇస్తారు.) కాని కలలలో మనిషి ప్రదర్శించే స్పృహకూ మేలుకొని ఉన్నప్పటి స్పృహకూ సంబంధం ఉన్నట్లు కనబడదు. ఫలానిరకమైన కలరావాలని తీర్మానించుకుని అలాగే కలగనటం నాకెన్నడు సాధ్యపడలేదు మనిషిలో రెండురకాల స్పృహలున్నట్టు కలలు రుజువు చేస్తాయని నా నమ్మకం. ఈ రెండింటిమధ్య అవ్యక్తమైన సంబంధం వున్న మాటైతే నిజమే

ఈ నా నమ్మకాన్ని ఒక విధంగా రుజువు చేస్తూ ప్లతనోవ్ ఇలా అంటాడు. "నిద్ర ఎంత గాఢంగా వుంటే నిద్రపోయేవాడి స్పృహ అంతగా గతంలోకి పోతుంది." దీని అర్థమేమిటి. జాగ్రదావస్థకు చెందని స్పృహ ఎంత తక్కువ అయితే నిద్రలో స్పృహ అంత గాఢమవుతుంది

ఒక చేపలు పట్టేవాళ్ళ బృందంలో ఒక వ్యక్తి అందరికన్న ఎక్కువ చేపలు పట్టేవాడు. ఇది మిగిలిన వాళ్ళకు ఆశ్చర్యంగా ఉండేది "చేపలు ఎక్కడ ఎక్కువ సంఖ్యలో వుంటాయో నాకు ఇన్ట్యూయిషన్ ద్వారా తెలుస్తుంది" అన్నాడట ఆ చేపలు పట్టేవాడు "ఇన్ట్యూయిషన్" అంటే "సహజ జ్ఞానం" అని అర్థం చెబుతున్నారు ఆప్టేగారు.

**సహజ జ్ఞానం :**

సహజ జ్ఞానం అనేదాన్ని అనేక సందర్భాలలో అనేకమంది ప్రదర్శించటం చూస్తాం. భౌతికవాదం దీనిగురించి ఏం చెబుతుంది ? "స్పృహకు చెందిన అనేక సూక్ష్మ అంశాలు సమష్టి ఫలితమే ఇన్ట్యూయిషన్" ఆ సూక్ష్మాంశాలు తెలియరావు ఈ నిర్వచనం నాకు కొంచెం కూడా విశ్వసనీయంగా కనబడలేదు మనుషులలో అనిర్వచనీయంగా అసాధారణ శక్తులు కోకొల్లలుగా ఉన్నాయి. (వాటిని గురించి ముందు ముందు చర్చిస్తాం.) ఇది కూడా అలాటి శక్తులలో ఒక అల్పశక్తి అని ఎందుకు అనుకోకూడదు ? సముద్రం మీద చేపలు పట్టడానికి వెళ్ళేవాడికి ఎటుగా వెళితే చేపలు తుగిడీలుగా దొరుకుతాయో ఏ సూక్ష్మాంశాలు తెలుపుతాయి ? అవి ఏవో అన్వేషించి చేపలు పట్టేవారందరికీ ఎందుకు మేలు చేయకూడదు ? అనుభవం గల రైతు పంట ఎలా ఉండబోయేదీ అంచనా వెయ్యటమూ, అనుభవం గల వైద్యుడు రోగిని చూస్తూనే రోగనిదానం చెయ్యటమూ ఇదే జాతికి చెందిన ఉదాహరణలుగా ఇవ్వబడ్డాయి. ఇది కూడ సరిఅని తోచలేదు రైతు తన అంచనాకు కారణాలు చెప్పలేకపోవచ్చు కాని అనుభవం గల రైతులందరూ చాలావరకు పంట ఎలా ఉండబోయేది చెప్పగలరు. డాక్టరు తాను రోగాన్ని ఎలా పోల్చినది చెప్పగల స్థితిలో ఉండను కూడా వచ్చు. లెక్కల "ప్రాడిజీ"లు తొమ్మిది అంకెల సంఖ్యన్ను మరో తొమ్మిది అంకెల సంఖ్యతో హెచ్చవేస్తే ఎంత వచ్చేది అరనిముషంలో చెప్పేస్తారు దాన్ని "స్పృహకు చెందిన

సూక్ష్మాంశాల సమష్టి ఫలితం" అని ఎవరూ అనలేరు ఇన్ట్యూయిషన్ అంత గొప్పశక్తి కాకపోయినా అదే తరగతికి చెందినట్లు కనిపిస్తుంది.

ఇన్ట్యూయిషన్ అనేది "బుద్ధికొలత"లో మనిషి బుర్ర అసాధారణంగా చొరబడే శక్తి అని నా నమ్మకం. అది స్పృహతో వేసే అంచనాలంత విశ్వసనీయంగా ఉండదు ఒక్కోసారి "ఇన్ట్యూయిషన్" తప్పిపోతుంది

**మెదడులో సుడిగుండం :**

ఇంకొక విచిత్రమైన మనఃస్థితి ప్రస్తావించబడింది మనిషి నీరసంగా ఉన్నప్పుడు అతని బుర్రలో ఒక వాక్యమో ఒక పాట చరణమో అంటుకుపోయి ఎంతకూ వదలదు ఈ మధ్య జబ్బుపడ్డప్పుడు నా మెదడు ఇలాంటి సుడిగుండంలో పడి నన్ను చాలా చిరాకు పెట్టింది నిద్రలో కూడా గ్రామఫోను రికార్డు మళ్ళీ మళ్ళీ పెట్టినట్టుగా ఒక పాట మోగేది అది ప్రత్యేకించి నాకు ఇష్టమైన పాట కూడ కాదు. దీనికి ఈ పుస్తకంలో చెప్పిన వివరణ సరిగ్గా ఉన్నట్టే తోస్తుంది. మెదడు పై పొరలో ఏదో కేంద్రం దుర్బలమవుతుంది ఆరోగ్యవంతులలో కూడ ఈ స్థితి కలుగవచ్చు, ప్రాణవాయువు చాలకపోతే ఉదాహరణకు మీరు ఎత్తున విమాన ప్రయాణం చేసేటప్పుడూ, గాలిప్రసారం సరిగాలేని గనులలోను ఇది జరగవచ్చు మనిషిబుద్ధి "బుద్ధికొలత"లో చిక్కుకు పోవడం కూడ ఈ స్థితిని సూచిస్తుందని నా నమ్మకం అందుకు ఉదాహరణగా ఆరోగ్యవంతుల ఇతర అనుభవాలు చూడవచ్చు. రవిశంకర్ సితార్ వాద్యంలాంటిది విన్న తరువాత కొన్ని సంగతులు బుర్రలో ఇరుక్కుపోయి, రోజుల తరబడి వదలవు. స్వర్గీయ పొన్నస్వామి పిళ్ళై హంసధ్వని రాగంలో వేసిన ఒక వరస యాభై ఏళ్ళ తరువాత ఇంకా నా మెదడులో ఆడుతూనే వున్నది ఇలాగే మనం చదివే పుస్తకాలలో కొన్ని వాక్యాలు మెదడునుంచి ఒకంతట చెరగవు ఇవన్నీ మనిషి మెదడు బుద్ధికొలతలో బంధించడానికి నిదర్శనలన్ని, బుర్రకు ప్రాణవాయువు అందకపోవడంతో దీనికి సంబంధం లేదనీ చెప్పగలను జబ్బుగా వున్నవారిలోనూ, ప్రాణవాయువు లోపించిన సందర్భాలలోను ఇలా జరుగుతుందంటే సాధారణ స్పృహకు అవకాశం లేనప్పుడు అసాధారణ స్పృహ మరింతగా పనిచేస్తుందన్న నా వాదన బలపడుతున్నది మెదడు ఆలోచన మొండిపడినపుడు ఏదైనా జ్ఞాపకం రానప్పుడు రెండో స్పృహ అందుకొని మరచిపోయినదాన్ని జ్ఞాపకం చేస్తుంది.

**హిప్నాటిజం .**

స్పృహ అనేది అచ్చంగా మెదడు పై పొరలకు మాత్రమే సంబంధించినది కాదని హిప్నాటిజంలో రుజువు అవుతుంది. హిప్నటైజ్ చేయబడిన వ్యక్తి నిద్రావస్థ లక్షణాలు కొన్ని ప్రదర్శించినా అచ్చంగా నిద్రావస్థలో ఉండడు. తనను హిప్నటైజ్ చేసినవాడికి తప్ప అతను ఇంకెవరికీ పలకడు - చంటిబిడ్డ తల్లి పిల్ల ఏడుపుకు మాత్రమే లేచినట్టు. అతని మెదడుమీది పొరలు చాలా చైతన్యం కోల్పోతాయి. అయినా అతను తనను హిప్నటైజ్ చేసినవాడి ప్రశ్నలకు సమాధానాలిస్తాడు నడువమంటే నడుస్తాడు. చెప్పిన పనులు చేస్తాడు. హిప్నాసిస్ నుంచి స్పృహ వచ్చినాక తను ఏమన్నదీ ఏమి చేసినదీ జ్ఞాపకం తెచ్చుకోలేడు. హిప్నటైజ్ అయిన మనిషి ప్రదర్శించే స్పృహ మామూలు స్పృహ కాదు. అంతేకాదు ఆ స్పృహలో మనిషి అసాధారణ దేహశక్తులను ప్రదర్శిస్తాడు "నీ చెయ్యికాలింది" అనగానే చేతిమీద బొబ్బ వస్తుంది. చెప్పకుండా కాల్చినా బొబ్బరాదు సరేకదా, బాధ కూడా వుండదు తాగిన మత్తులో వున్నవాణ్ణి హిప్నసిస్ ద్వారా నిద్రపుచ్చి కొద్దిసేపు విశ్రాంతి అనంతరం లేవగొడితే నిషా పూర్తిగా దిగిపోయిన సందర్భం ఈ గ్రంథములో చెప్పి వున్నది

**మాటల ప్రభావము :**

హిప్నటిజంతో వేరుగా సంబంధం లేకుండా మాటలు ఎలాంటి ప్రభావం కలిగిస్తాయో మనస్తత్వ వేత్తలు పరిశోధించారు మాట తెచ్చిన ముప్పుకు ఒక ఉదాహరణ ఇయ్యబడింది ఒక యువకుడైన డాక్టరు ఒక ముసలామెకు వైద్యం చేస్తూ ఆమెకు ధైర్యం చెప్పటానికి "అవ్వా నువ్వు నేనూ ఒకసారే పోతాం"అన్నావ్వూ కొన్ని రోజుల అనంతరం ముసలామె వైద్యంకోసం డాక్టరు దగ్గరకు వెళ్ళగా డాక్టరు చనిపోయినట్టు తెలిసింది "ఇంకా నేనెలా బతికి వున్నాను ?" అని ఆమె అక్కడే చచ్చి పడిపోయింది

ఆమె చావుకు కారణం డాక్టరు అన్నమాట అని తృప్తిపడి ఊరుకోవచ్చునా ? డాక్టరు ఆమెను ఎన్ని విధాలనైనా ప్రోత్సహించి ఉండవచ్చు జోస్యం చెప్పినట్టుగా ఎందుకు మాట్లాడాడు ? అలాగే అతను కొంతమందికి ఇలాంటి ప్రోత్సాహవచనాలు చెప్పాడనుకొందాం ఎందరో చచ్చిపడి వుండేవాళ్ళు ఇందులో భవిష్యత్తుకు సంబంధించిన అవ్యక్తజ్ఞానం వున్నట్టు కనబడుతుంది. కొన్ని సంవత్సరాల క్రితం మద్రాసులోని ఒక డాక్టరుగారు చనిపోయిన వాడి డెత్ సర్టిఫికెట్ "చావబోయేవాడు చచ్చినవాడికి సర్టిఫికెట్ ఇయ్యటం ?" అని జోక్‌చేసి, రోడ్డు ప్రమాదంలో మరణించినట్టు విన్నాను ఇలాంటి సందర్భాలు కోకొల్లలుగా లభ్యమవుతున్నాయి గనుక ఈ ఒక్క ముసలామె మాట ప్రభావంతోనే చచ్చిందని సిద్ధాంతం చెయ్యనవసరం లేదు భవిష్యత్తు గురించి తెలిసినట్టుగా మనుషులు మాట్లాడిన అసంఖ్యాకమైన సందర్భాలలో డాక్టరు అన్నది కూడ ఒకటి అనుకోవచ్చు

**టెలిపతీ**

ఇక "టెలిపతీ"కి వద్దాం ఒక మనిషి ఆలోచనలు ఇంకొక మనిషి బుర్రలోకి ప్రవేశించడం "టెలిపతీ". దీన్ని గురించి ఎకడమీషియన్ వ్లదీమిర్ మిఖయాలవిట్ అనే సైకియాట్రిస్ట్ ఇలా చెప్పాడు "శాస్త్రానికి ఇంకా అంతుచిక్కని కొన్ని పరిస్థితులలో ఒక మనిషి మెదడు దూరానవున్న మరొక మనిషిమీద పనిచేస్తుంది ఇది స్థల - కాలవైజ్ఞానిక దృక్పధం మెదడుమీద మరొక మెదడు పనిచెయ్యటం బుద్ధికొలతలో జరుగుతుందనుకొంటే ఇందులో అయోమయం ఏమీ లేదు. టెలిపతీకి వాహకం ఏదీ లేదనడానికి అనేక ప్రయోగాలు సాక్ష్యం యిచ్చాయి ఇందులో ఈ క్రింది ప్రయోగం ఉదహరించబడినది ఇది 1959 లో అమెరికాలో జరిగింది తన భావాలను అందించే వ్యక్తి సముద్ర తీరానికి ఇవతల వున్నాడు వాటిని అందిపుచ్చుకొనేవాడు 2,000 కిలోమీటర్ల దూరాన సబ్మరీన్‌లో అనేక వందల మీటర్ల లోతున వున్నాడు. రేడియో తరంగాలు సైతం కొన్ని సెంటీమీటర్ల నీటిలో నిరోధించబడతాయి ప్రతిరోజూ ఒక నియమిత సమయానికి "ఒడ్డున" వున్నవాడు ఒక యంత్రం ముందు కూర్చునేవాడు ఆ యంత్రంలో ఐదు రకాల చిత్రాలు గల వెయ్యి కార్డులుండేవి యంత్రం ఆ కార్డులను కలిపి ఒక క్రమం అంటూ లేకుండా నిముషానికి ఒక కార్డు చొప్పున బయటపడేసేది యంత్రం ముందు కూర్చున్నవాడు ఆ కార్డుకేసి మనసు కేంద్రీకరించి చూసేవాడు అదే సమయంలో సముద్రం అడుగున వున్నవాడు కార్డులమీద ఉండే అయిదు బొమ్మలలో తనకు స్ఫురించిన బొమ్మను గీసేవాడు. ఈ ప్రయోగాలు రోజుకు రెండుసార్లు చొప్పున 16 రోజులు జరిగిన దానిమీదట ఫలితాలు పరిశీలించారు. ఒడ్డున వున్నవాడు కార్డుమీద చూసిన బొమ్మనే సముద్రంలో వాడు గియ్యటం 20 శాతం రైటయితే అది యాదృచ్ఛికం టెలిపతీకి రుజువు ఏమీ లేదన్నమాట. కాని ఈ ప్రయోగాలలో ఫలితం 70 శాతం పైగా ఉన్నాయి.

**స్వభావం బుద్ధికొలత**

కాని ఫలప్రదమైన ఆలోచనలు లేకుండా కేవలం స్పృహతో మానవజాతి పురోగమించేది కాదు ప్రాచీన కాలంలో తత్వవేత్తలు ప్రపంచంలో కనిపించే వైవిధ్యం చాటున పంచభూతాలు

మాత్రమే వున్నాయని, ప్రతి పదార్థమూ పరమాణువుల సమ్మిశ్రణమని, ప్రకృతికి మూల స్వభావాలు సత్వరజస్తమాలేనని భావన చేశారు. (స్వ + భావ అనే మాట బుద్ధికొలతను స్ఫురింపచేయడం లేదా) ఇప్పటికీ మనిషి జ్ఞానం బుద్ధికొలతలో సరియైన దారిని పురోగమించడం ద్వారానే పెరుగుతున్నది ఆధునిక శాస్త్రజ్ఞులు కూడ అణువులూ పరమాణువులు అనేవి ప్రతిపాదించేనాటికి వాటిని గురించి ప్రత్యక్ష సాక్ష్యం ఏమీలేదు తార్కికులు "అనుమానం" అనేది ఊహకు ఆధారమవు తుంది. శాస్త్రజ్ఞులు ముందు ఊహిస్తారు. తరువాత ఆ ఊహలను ఋజువు చేయడానికి ప్రయోగాలు చేస్తారు. ప్రయోగాల ద్వారా రుజువైన ఊహలు సిద్ధాంతాలుగా చలామణీ అవుతాయి కాని మరికొన్ని ప్రయోగాలు ఆ సిద్ధాంతాలకు విరుద్ధంగా ఫలితాలిచ్చినప్పుడు సిద్ధాంతాలు సంస్కరించబడతాయి. ఈ విధంగా విజ్ఞానం పురోగతి భారీగా బుద్ధికొలతమీద ఆధారపడి వుంటున్నది.

*(ఆంధ్రజ్యోతి వారపత్రిక, 26-8-1977)*

# 6. నిద్రలో బుద్ధికల్పన - వివరణ

## ప్లతనోవ్ ప్రయోగం

ఇంతకన్నా వింత అయిన సంగతి ప్లతనోవ్ బయటపెట్టాడు అయన తండ్రి (The wordits physiological and theraupttc value అనే గ్రంధం రచించినవాడు) తన కొడుకు ప్రేరణతో ఒక రోగిని మానసిక ప్రబోధంతో హిప్నొటైజ్‌చేసి నిద్రపుచ్చి, తిరిగి అదే పద్ధతిలో నిద్ర లేపాడు! ఇది జరిగినది 1923లో 1924 లో ఈ ప్రయోగాన్ని ఆయన లెనిన్‌గ్రాడ్‌లో మనో వైజ్ఞానికుల సమావేశంలో ప్రదర్శించాడు కూడా.

టెలిపతీలాటి శక్తి పూర్వం చాలా హెచ్చుగా వుండేదనీ, అది ఇప్పుడు చాలావరకు అంతరించి, సకృతుగా కానవస్తున్నదనీ లియోనిద్ లియోనిద విచ్ వసెన్వెవ్ అనే శాస్త్రవేత్త అభిప్రాయం పరిణామం బుద్ధికొలత నుంచి ప్రాణులను ఎడంచేసి స్థల-కాల కొలతలలో ముందుకు తీసుకుపోయిందన్నది కూడా నా నమ్మకం సామూహిక, సామాజిక పరిణామానికి బుద్ధికొలత ఎందుకో దోహదకారి కాలేదు బుద్ధి కొలతలో హెచ్చుగా జీవించినవారు సహస్రాబ్దాలపాటు పాశవిక దశ దాటిరాలేకపోయారు

అయితే ఒకటి గమనించాలి పరిణామంలో మనిషి మృగాలకుండిన అనేక శక్తులను - ఎగరటమూ, చీకట్లో చూడటమూ, వాసనలు పసిగట్టటమూ, నిశ్శబ్ద శబ్దాలను వినటమూలాటి శక్తులనూ, దేహబలాన్నీ, వేగంగా పరిగెత్తే శక్తులనూ - పోగొట్టుకున్నాడు, కాని వాటిని తనకు బాహిరం చేసుకుని బుద్ధిబలంతో సాధించుకుని పోటీలో దాదాపు అన్ని జంతువులనూ మించిపోయాడు అలాగే మానవుడు బ్దుదికొలత మీద కూడా అధికారం సంపాదించవచ్చు. అయితే దాని ప్రయోజనం జాతికంతకూ వుండాలి.

## స్పృహ పూర్వ చరిత్ర

"స్పృహ" మనిషిలోనే సృష్టి అయిందనీ, అది వాక్కు మూలంగానూ, శ్రమనుంచీ కలిగిందని "మనసు" అనేది జంతువుకు కొన్ని ప్రేరణలు "సంకేతాలు"గా ఉపయోగపడి "కండిషన్డ్ రిఫ్లెక్స్" కావడంతో ఏర్పడిందనీ ఈ గ్రంధం చెబుతున్నది. "కండిషన్డ్ రిఫ్లెక్స్"లు ఏర్పడాలంటే నరమండలం ఒకటి అవసరం !

ప్రాణులలో "ఇన్‌స్టింక్" (సహజ బుద్ధి) వుంటుంది అది స్పృహకు సంబంధించినది. కాని స్పృహకన్న నిర్దుష్టంగా పనిచేస్తుంది. దీనికొక మంచి ఉదాహరణ ఉన్నది. తేనెటీగలు తేనెపట్టు నిర్మించేటప్పుడు వాటి గదుల కోణాలు 70° 32° ఉండేలాగా చూస్తాయి ఒక బ్రిటిష్ గణితవేత్త తన గణన సామర్థ్యమంతా వినియోగించి తేనెపట్టు గదుల కోణాలు 70° 34' ఉండాలనీ, తేనెటీగలు చిన్న పొరపాటు (ఒక డిగ్రీలో 30వ వంతు) పడుతున్నాయనీ అనుకున్నాడు. కాని తీరాచూస్తే తప్పు పోయినది గణితవేత్తే - తేనెటీగలు కాదు.

## రిఫ్లెక్సుల వెనుక బుద్ధిశక్తి ·

"దేహ ధర్మ దృష్ట్యా ఇన్‌స్టింక్‌కూ, రిఫ్లెక్స్‌కూ చెప్పుకోదగిన తేడా లేదన్నాడు పార్లోవ్ రిఫ్లెక్స్‌లు కూడా స్పృహకు సంబంధించినవి కావు కాని వాటివెనుక బుద్ధిశక్తి వున్నది. ఇన్‌స్టింక్‌లు 'గుడ్డిగా' పనిచేసేమాట నిజమే. ఆత్మరక్షణకు తోడ్పడవలసిన సహజప్రేరణ పురుగులను మంటల్లోకి తీసుకుపోతుంది. కాని నియమిత పరిస్థితులలో ఇన్‌స్టింక్ట్ అనేది ప్రాణుల ఆత్మరక్షణకూ, వ్యాప్తికీ తోడ్పడుతుంది. గనుక దానివెనక స్థలకాలాతీతమైన జ్ఞానం ఉందని ఒప్పుకు తీరాలి. ఈ జ్ఞానం బుద్ధి కొలతకు చెందినదని ఒప్పుకోకపోతే తిన్నగా భగవంతుడికే అంటగట్టేవాళ్ళున్నారు ఈ

రిఫ్లెక్స్‌లూ, ఇన్‌స్టింక్ట్‌లూ ఏ జాతి ప్రాణులకు ఏవి అవసరమో అవి జన్మతః ఏర్పడటం గమనించదగినది. ఈ పారంపర్యానికి కారణం జీవకణాలలో ఉండే రసాయనాలే అంటారు కొన్ని రసాయనాలకు అలాటి శక్తి వుంటే అది కేవలమూ స్థలకాలాలలో పనిచేసేదని ఎలా నిరూపించటం? ఎందుకంటే అది స్థలానికీ, కాలానికీ అతీతమైన శక్తి అని శాస్త్రవేత్తలే ఒప్పుకుంటున్నారు.

"Instinct knows everything in the invariable sphere which is fore-ordained for it." నిర్ణీతమైనటువంటీ, మార్పులేనటువంటి జీవిత పరిధిలో ఇన్‌స్టింక్ట్‌కు తెలియనిది లేదు. ఆ పరిధి దాటితే దానికి ఏమీ తెలీదు కాని ఇన్‌స్టింక్ట్‌ను మార్చవచ్చును పిల్లి ఎలుకలను సాకేలాగా చేయవచ్చు. ఇది కండిషన్డ్ రిఫ్లెక్సెస్ ద్వారా సాధ్యమవుతుంది. ఇన్‌స్టింక్ జన్మతః వచ్చేదీ. తరతరాలు సంక్రమించేదీను. కండిషన్డ్ రిఫ్లెక్స్ తాత్కాలికమైనది, సంక్రమించేది కాదు. అందుచేత దాన్ని బుద్ధికొలతలో తాత్కాలిక చైతన్యంగా భావించవచ్చు

సాధారణంగా జంతువులకు మనుషులు శిక్షణ ఇచ్చేటప్పుడు ఆ శిక్షణ బుద్ధి కొలతలో జరుగుతుంది కాని, మనిషి కున్నంత పరిణిత మేధలేని జంతువులు "ఉన్నత" జ్ఞానం ప్రదర్శిస్తే ఏమనాలి ?

**ఆస్టెన్‌గారి గుర్రం**

అస్టెన్ అనే జర్మన్ ఉపాధ్యాయుడివద్ద ఒక గుర్రం వుండేది దానిపేరు "తెలివైన హాన్స్". దానికి వుండిన అసాధారణ "గణిత" శక్తులను గురించి 1904 లో పత్రికలు ప్రచారం చేసి, దానికి ప్రపంచ ఖ్యాతి సంపాదించి పెట్టాయి అలాగే 1912 లో కార్ల్ అనేవాడు ఎల్బెల్ ఫెల్ట్ నగరంలో "మహమ్మద్" అనే అరబ్‌జాతి గుర్రాన్నీ, మరి అయిుమ గుర్రాలనూ ప్రదర్శించాడు వాటికి జర్మను, ఫ్రెంచి భాషలు అర్థమయ్యాయి ఒక రకమైన అక్షరమాల సహాయంతో ప్రశ్నలకు అవి సమాధానాలు చెప్పాయి. గుణించాయి, లెక్కలు చేశాయి, 'రూట్'లు కూడా వేగంగా చెప్పాయి

**రోజర్ :**

అటు తరువాత ఒక కుక్క ప్రదర్శించబడింది దాని పేరు "రోజర్" అది చీట్లపేకాటలో మనుషుల మీద గెలిచింది. లెక్కలు చేసింది, విడి అక్షరాలతో వాక్యాలు నిర్మించింది

**యజమానుల మోసం**

ఇలాటి సంఘటనలు మూఢ విశ్వాసాల పుట్టుకకు మంచి అవకాశాలు కలిగిస్తాయి లేదా అందులో ఏదో మోసం వుందని తేల్చాలి చివరకు అదే తేల్చారు. ఈ జంతువుల యజమానులు అతి సూక్ష్మమైన సంకేతాలు చేస్తారనీ, జంతువులు వాటిని గ్రహించి, వాటికి అనుగుణంగా ప్రవర్తిస్తాయనీ నిర్ణయించారు. నిజమే అయి వుంటుంది అవి కిందటి జన్మలో శాపం పొందిన మనుషులు అనుకునేకన్న ఇదే మేలు అయితే జంతువులు అలా సూక్ష్మ సంకేతాలను గమనించటమూ, వాటి ప్రకారం ప్రదర్శనలిచ్చి జనాన్ని నమ్మించటమూ తక్కువ "తెలివి" కాదు బుద్ధికొలతలో - పైకి కనిపించిన విధంగా కాకపోయినా కొంతవరకు వాటి బుర్రలు అసాధారణంగా పనిచేశాయనే అనాలి కాకపోయినా ఒకేజాతి జంతువులలో "తెలివి" వేరు వేరుగా ఉండటం మనం రోజూ చూస్తూనే వుంటాం ఆహారం వేసినప్పుడు ఎగబడే కాకులలో ఒకటో రెండో మిగిలినవాటికన్న హెచ్చు బుద్ధి సూక్ష్మం ప్రదర్శించి, ఆహారం ఎక్కడ పడబోతుందో మిగిలిన వాటికన్న ముందుగా గ్రహిస్తాయి బుద్ధికొలతలో అందరు మనుషుల బుర్రలూ సమంగా పెంచుకుపోనట్టే జంతువుల బుర్రలు కూడానూ. ఏ ఎద్దో, కుక్కో అసాధారణమైన తెలివి ప్రదర్శిస్తే దాన్ని దేవుణ్ణిచేసి పూజించటానికి సిద్ధంగా వున్న మనుషులు బుద్ధికొలతలో దానంత దూరం కూడా పెంచుకుపోలేదనుకోవాలి.

ఇంద్రియ జ్ఞానం

మనిషి చర్మం వేడినీ, చలినీ తెలుసుకోగలదు వేడిలేని కాంతికిరణాలను అది స్పర్శద్వారా గ్రహించగలదా ? ఎవరైనా చెప్పే సమాధానం అది సాధ్యంకాదని కాని 1940 లో, వియొంత్యేవ్ అనే మనస్తత్వ వేత్త ప్రయోగాలు చేసి మనుషులలో అలాటి శక్తి కలిగించటం సాధ్యమని నిరూపించాడు

అటు తరువాత 22 సంవత్సరాలకు రోజా కులిషోవ అనే 22 ఏళ్ళ రష్యన్ అమ్మాయి కళ్ళకు గంతలు కట్టుకుని, వార్తాపత్రికను వేళ్ళతో స్పృశిస్తూ ధారాళంగా చదివెయ్యసాగింది అలాగే ఒక ఫొటోను చూడకుండానే చేత్తో తడిమి, అందులో ఉన్న వ్యక్తి ఎవరో, ఏ పోజులో ఉన్నాడో చెప్పింది రంగుల బొమ్మలమీద గాజుపలకలను గాని, సెలోఫేన్‌గాని, పలచని కాగితంగాని కప్పితే పైపైన తడివి అడుగున ఉన్న రంగులు చెప్పింది. మూసిన సంచీలో నుంచి కోరిన రంగుదారాలూ, చీట్లపేకముక్కలూ తడివి, ఫొటోలో ఉన్న మనిషి ధరించిన చెవి పోగులనుబట్టి మనిషిని గుర్తించింది.

ఈ వార్త కార్చిచ్చులాగా ప్రపంచమంతటా పాకింది. (మనదేశపు పత్రికలు కూడా దాన్ని ప్రకటించాయి )

**అతీంద్రియ జ్ఞానం**

ఇది దైవత్వమా ? అతీంద్రియ జ్ఞానమా ? రోజాకున్న శక్తిలో మోసం ఏదీ లేదని శాస్త్రవేత్తలు ప్రయోగాల ద్వారా నిరూపించారు మనదేశంలో ఈ ప్రయోగాలు కూడా అవసరం లేకుండా జనం రోజాకు దైవత్వం ఆరోపించెయ్యగలరు లేదా కనీసం అతీంద్రియ జ్ఞానమని అయినా నిర్ణయించగలరు కాని ఇలాంటి శక్తులు అరుదే అయినా అభ్యసించినట్లయితే అలవడతాయని త్వరలోనే రుజువైంది. అభ్యాసం చేసిన వారందరికీ శక్తి రాకపోవచ్చు కాని ఆరుగురిలో ఒకరికి స్పర్శ ద్వారా రంగులు తెలుసుకునే శక్తి వచ్చింది అందులో విడ్డూరమైన విషయం ఏమంటే, ఏడేళ్ళ క్రితం గుడ్డివాడైపోయిన ఒక మనిషి, రంగు కాగితానికి గజం ఎత్తున చెయ్యిపెట్టి, కాగితం రంగు చెప్పగలిగాడు. లేనబ్లిజ్నోవ అనే 9 ఏళ్ళ పిల్లలో ఈ శక్తి అభ్యాసం చెయ్యకుండానే (సహజంగానే) ఇంకా హెచ్చుగా కనిపించింది

"ఇది (ఈ శక్తి) ఏమిటి ? ఇది ఆదిమానవులలో ఉండినదా ? లేక ఎవరైనా అలవరచుకోదగినదా ? ఎవరూ చెప్పలేరు" అంటాడు ప్లతనోవ్

**సైకిక్ రీసెర్చి :**

ఒకప్పుడు మనిషిలో సహజంగా వుండి సామాజిక పరిణామానికి దారితీసిన భౌతిక పరిణామంలో మనిషి పోగొట్టుకుని తనకు బాహిరం చేసుకున్న అనేక శక్తులలో ఇది ఒకటి అయి వుండవచ్చు ఇది అసాధారణ శక్తి అని వేరే చెప్పనవసరం లేదు కొందరు అసాధారణ శక్తులు గలవారు ఒక వస్తువును స్పృశించి దాని పూర్వ చరిత్ర - దాని సొంతదారు ఎలాటివాడో, అతని జీవిత విశేషాలేవో - చెప్పగలవాళ్ళు ఉన్నట్లు సైకిక్ రీసెర్చ్ నిరూపించింది. అలాటి అసాధారణ శక్తే ఇది కూడానూ. ఇది సహజంగా అబ్బినవారు, కాని అలాటివాళ్ళు చాలా కొద్దిమంది అభ్యాసం ద్వారా ఆ శక్తిని సాధించడం కొందరికైనా సాధ్యమేనని రుజువైంది.

"ఈ శక్తులవల్ల కలిగే సామాజిక ప్రయోజనం ఏమిటి ?" అని ప్రశ్నించుకున్నప్పుడు ఆదిమానవులు సామాజిక పరిణామంలో వీటిని ఎందుకు పోగొట్టుకున్నారో స్పష్టమవుతుంది. అయితే బుద్ధికొలతలో మానవుడు పురోగమించగలడని రుజువైతే అందువల్ల సామాజిక ప్రయోజనం కూడా స్పష్టమవుతుంది మానవుడు సాధించిన జ్ఞానమంతా క్రియకు బుద్ధి కొలతతో సాధించినదే "ప్రయోగాలు జరగాలి...... సైన్సుకు అంతా తెలుసును అనుకోరాదు" అంటాడు ప్లతనోవ్ నిజం!

# 7. నిద్రలో బుద్ధికల్పన - మరింత వివరణ

**More in Time Dimension**

1. Dimensions are fundamental to the material universe A thing that exists only in space or only in Time is unreal The relation between Time of space has been dealt with by Einstein

2 One can move freely in one dimension with the help of another dimension For example, one cannot move in space without the help of Time You cannot be in 2 different places at the same Time The freedom to move in space is made possible with the help of time

Again take the case of a person crossing a street A very fast vehicle may have passed the spot when he was only a second back. Still he is as safe as though he was miles away from that spot Time has made him "Independent" of space

Similarly space makes us independent of Time when we look at the stars of galaxies in the sky, some of them are literally millions of light years away and we continue to see them for millions of years after they disapper.

We also arrest Time in space with the help of photos, films, books, paintings etc ,

3 Mind dimension is as fundamental as Time of Space. Man finds freedom to move in Time as well as space in the mind Dimension. Man's most vital assets are preserved in this dimension - history, special evolution, religions, all sciences ideologies etc

There are sciences pertaining to all dimensions Archaeology is a science of Time mainly. It establishes chromology of things - which species came after which, which human "culture" was followed by which, how cultures evolved in time, how they were diffused of so forth

Geology is the science of space mainly With its help we know what minerals expect when, where to expect tectonic movements to occur

Marxism is the science of Mind mainly You come across a social structure and Marxism tells you where to place it in social evolution

The essential points about a true science is that it not only explains nature but shapes it by controlling it Various sciences have helped man to pass through the stages of savagery, barbarism and civilization but they have changed the face of nature according to man's specifications This process goes on and on Marxism deals with social evolution

in a similar way By understanding the basic laws of social evolution it proceeds to change society in a particular direction

All this activity is confined to Mind dimension - this freedom to act in both space and Time

It is perfectly true that Man's being determines his consciousness which in turn determines his becoming But what Marxism does is, to determine his being from his consciousness

While all sciences are projects in the Mind Dimension I think Marxism is the only science which can fix Men and Societies in chrondogical Time with a great deal of accuracy with the help of the prevalent superstructure. Hence Marxism can predict the next step in the growth of man or society and also determine the means to achieve it. Where as the other sciences may help a frozen feudal society to dominate better societies with the help of oil or precious minerals, cause wars in the struggle to get access to minerals, to manufacture more and more lethal weapons etc., while most sciences help man to advance in what may be called civilization there is hardly any science which can prevent human society from becoming anarchic Marxism alone seems to be capable of producing order in this chaos

4 I feel that Marxists must recognise the significance of Mind Dimension to be able to move freely int he dimensions of Time and place The idea that consciousness is a mere outgrowth of being, makes that consciousness more or less accidental This cannot be true. Marxism has helped the most primitive minds to cover millennia in a matter of a few years and actually project into the future In the Mind dimension the Chinese society was almost in the Dark Ages and we find it racing ahead There is much more order in it today than most other societies

This is not to underrate the transformations brought about in Chinese space and the immense effort that went into the revolution. But of all the transformations that in the Mind dimension is the most vital and most striking And without Marxism to guide in action, nothing would have been achieved Recollect all the earlier attempts at revolution in China that had failed.

I tried to explain the nature of dimensions of the material universe. I am not expecting anybody to shed to lethargy of Time-space confinement in a hurry Let this be on record so that time may prove the truth of what I am trying to say, or prove me to be a damn fool It is good either way

# 8. మానసిక-శక్తుల ప్రదర్శనలు

రానున్నది ఎవరైనా చెప్పగలరా ? చెప్పారా ? అన్న ప్రశ్నకు సమాధానం తడుముకోకుండా చెప్పవచ్చు. అది సాధ్యమని సోషలిస్టు శాస్త్రజ్ఞులు కూడా ఒప్పుకుంటున్నారు అందుకు ఉదాహరణలున్నాయి వాటికి 'భౌతికశాస్త్రం' ఆధారం కానప్పుడు అది అసాధారణమైన అనుభవం కింద చెబుతుంది లేడీ డాక్టరు ఒక గర్భవతిని పరీక్షించి, ఆమె ఏ రోజుకు ప్రసవిస్తుందో చెబితే అందులో విడ్డూరం లేదు. ఒక జ్యోతిష్కుడు ఒక ఆడదాని జాతకం చూసి ఆమెకు ఎంతమంది పిల్లలు కలుగుతారో సరిగ్గా చెప్పినా అది శాస్త్రజ్ఞానమే అవుతుంది, జ్యోతిషం శాస్త్రమని మనమంతా ఒప్పుకోకపోయినా కూడా అలాటిదే హస్త సాముద్రికం ఇలాటి అనుమానాస్పదమైన శాస్త్రాలు భవిష్యత్తును సరిగ్గా చెప్పడం జరిగితే అది అసాధారణ మానసిక శక్తులమీద ఆధారపడి మాత్రం కాదు

ఇప్పుడు నేను అసాధారణమైన మానసిక శక్తులకు ఉదాహరణలను ఒక సోవియట్ శాస్త్రగ్రంథం నుంచి తీసుకుంటాను దానిపేరు సైకాలజీ ఆజ్ యుమే లైక్ ఇట్ రచయిత పేరు కె ప్లతనోవ్ ఇది పూర్తిగా మార్క్సిస్టు శాస్త్రీయ దృక్పథంతో రాసిన గ్రంథం ఇందులో అనేక మానసిక ప్రదర్శనలకు భౌతిక వివరణలు ఉన్నాయి కాని బుద్ధికొలత దృష్ట్యా ఇంకా మంచి వివరణలీయ వచ్చునని నేను అనుకుంటున్నాను

**స్పృహకు సంబంధించిన కొన్ని గడ్డు సమస్యలు**

స్పృహ అనేది మానవ మేధసృష్టి అని మార్క్సిజం నిర్వచిస్తుంది సామాజిక వ్యవస్థ, సామాజిక స్పృహను నిర్ణయిస్తుంది మానవ మేధ వాస్తవ జగత్తును ప్రతిబింబించడమే గాక దాన్ని సృష్టిస్తుంది పునస్సృష్టి చేస్తుంది . మనిషి పరిస్థితులు తనకు అనుకూలంగా లేకపోతే వాటిని మార్చుతాడు. ఇలాంటి స్పృహ మనిషికి మాత్రమే ఉన్నది

ఉచ్ఛ నరమండల చైతన్యం స్పృహను కలిగిస్తుంది. ఈ చైతన్యం ఇతర జంతువులలో కూడ వుంది. అది మనిషిలో విప్లవ పరిణితి పొందింది

భరించరాని బాధ కలిగినప్పుడో ఆకస్మికంగా ఉద్రేకానికి గురి అయినపుడో మనిషికి "స్పృహ తప్పుతుంది" ఆ పరిస్థితులలో జరిగేదేమిటి ? మెదడుకు రక్తం తగినంతగా వెళ్ళక దానికి ప్రాణవాయువు అందకపోవడం జరుగుతుంది. బుర్రమీద బలమైన దెబ్బ తగిలినా మనిషి స్పృహతప్పి పడిపోతాడు. అందుచేత మెదడు స్పృహకు కేంద్రం అని రుజువవుతుంది

ఒక రకమైన మూర్ఛవ్యాధిలో మనిషి పడిపోయి కాళ్ళుచేతులు కొట్టుకోడు, కాని కొద్ది క్షణాలపాటు స్పృహ కోల్పోతాడట. అలా స్పృహలేని సమయంలో అతను చాలా పనులు చేయవచ్చు కాని స్పృహ వచ్చాక ఆ పనులు మరెవరో చేశారనుకుంటారు

ప్రశ్న స్పృహలేని పరిస్థితిలో ఎవరుగాని స్పృహతో చేయవలసిన పనులు ఎలా చేస్తారు?

భౌతిక దృక్పథం లేనివాళ్ళు ఈ ప్రశ్నకు సమాధానంగా అతీత శక్తులను ప్రతిపాదించారు అనేక మూఢ విశ్వాసాలు బయలుదేరాయి మూర్ఛల వ్యాధి ఉన్నవాళ్ళను కొన్నిచోట్ల పూజించడం కూడా జరిగింది

మామూలుగా స్పృహ అనేది మెదడు ఉపరి భాగంలో ఉన్న పొరలకు అంటగట్టితారు జ్ఞానేంద్రియాల అనుభూతులను అది విశ్లేషిస్తుంది గాఢనిద్రలో ఆ పొరలు నిశ్చేతనంగా ఉంటాయి గనక స్పృహ వుండదు.

స్పృహ

కాని జ్ఞానేంద్రియాలు పని చెయ్యనవసరం లేకుండానే, కొద్ది క్షణాలుగాని అంతకన్న ఎక్కువేగాని, స్పృహ వుండటానికి అవకాశం వున్నది ఇందుకు ఉదాహరణలు కొల్లలుగా దొరకుతాయి లోగడ చెప్పిన 'మూర్ఛ" రోగం ఒక ఉదాహరణ పోను పోను ఇంకా చాల ఉదాహరణలు ఈ రష్యన్ శాస్త్ర గ్రంథంలోనే దొరుకుతాయి

ఈ సందర్భంలో నా సొంత అనుభవం ఒకటి చెప్పాలి నా ఎనిమిదోఏట నేను చదివే స్కూలులో చిన్న ప్రమాదం జరిగింది ఆ ప్రమాదం గురించి నాకు తెలీదు నేను స్పృహతప్పి పడిపోయాను ఆ దశలో నాకు కొద్దిక్షణాలసేపు (15 సెకండ్లు ?) స్పృహ వచ్చింది నా ఎదురుగా మా హెడ్మాష్టరు గారుండి "ఇది ఎవరి పని ?" అని అడుగుతున్నారు నా చుట్టూ నాలుగైదు వరుసలలో విద్యార్థులున్నారు చివరి వరుసలలో విద్యార్థులున్నారు చివరి వరుసలో దూరంగా మా బంధువు (నాకన్న రెండు క్లాసులు పెద్ద) ఎర్రదారపు టోపీ పెట్టుకొని కనిపించాడు హెడ్మాస్టరుగారు నన్నే అడిగారనుకొని "నాకు తెలీదు" అని చెప్పాను కాని నా గొంతు నాకే వినిపించలేదు

ఈ నా అనుభవం ఎంత సహజంగా కనుపించిందంటే అందులో మిస్టరీ ఉన్నదని నాకు చాలా ఏళ్ళదాకా తెలియలేదు స్పృహతప్పి పడిపోయిన నేను తిరిగి హెడ్మాష్టరుగారి గదిలోనే ఒళ్ళు తెలుసుకున్నట్టు తెలియవచ్చింది. నేను మూర్ఛపోయిన దశలో కళ్ళుతెరచి ఉంటే నాకు పిల్లల కాళ్ళు తప్ప మొగాలు కనిపించే అవకాశం లేదు నేను స్కూలులో ఆఖరు తరగతిలో చదువుతున్నాను అట్టే ఎత్తు లేను. హెడ్మాస్టరుగారి మొహంనాకు ఎదురుగా ఎట్లా కనిపించింది? నాలుగైదు వరుసల విద్యార్థుల ముఖాలూ, అందరికన్నా దూరంగా ఉన్న మా బంధువు టోపీ ఎలా చూశాను ? స్పృహ వుండి నేను లేచినిలబడినా నాకు అది చూడటం సాధ్యంకాదు సూర్యుడు దాదాపు నడినెత్తిన వున్నట్టు ఎండ కూడ కనబడింది ఈ స్పృహ చాలా కొద్దిక్షణాలే వున్నది అయినా కూడ దీన్ని అసాధారణ అనుభవం క్రిందనే జమకట్టాలి. మనుషులకు భ్రమ జనితంగా దృశ్యాలు కనబడడం కద్దు కాని వాస్తవికమైనవి అవటానికి రుజువు దొరకదు నిజంగా భ్రమలే కావచ్చు కానీ నేను చూసింది నూటికి నూరుపాళ్ళు వాస్తవదృశ్యం స్థలమూ, సమయమూ సందర్భమూ అన్నీ వాస్తవంగా ఉన్నాయి. అలాగే నిద్రలో కూడా ఒక్కొక్కసారి మెదడు పనిచేస్తున్న లక్షణాలు కనిపిస్తాయి

**నిద్రలో మెదడు పనిచేస్తుందా ?**

ప్లతనోవ్ ఈ సంఘటన వివరించాడు ఆయన ఒకరోజు పగలే రైలు ప్రయాణం చేస్తున్నాట్ట. పై బెర్తుమీద మరొక మనిషి నిద్రపోతున్నాట్ట ఉన్నట్లుండి ఆ మనిషి ఒక ముద్దాయి తరుపున "చాలా తెలివిగా" వాదించ నారంభించాడు. వాదన పూర్తి అయినాక ఆయన మరికొంతసేపు నిద్రపోయి లేచాడు

"మీకు ఏం కలవచ్చింది ?" అని ప్లతనోవ్ ఆయన్ని అడిగాడు. తనకు ఏ కలా రాలేదనీ మొద్దులాగా నిద్రపోయానని ఆయన జవాబు చెప్పాడు. మొద్దులాగా నిద్రపోయినవాడి మెదడు పొరలు పూర్తి అచేతనావస్థలో వుంటాయి. అయితే కేసు "తెలివిగా" వాదించటానికి స్పృహ బాగా ఉండాలి. ఇది ఎలా సాధ్యమయింది ? కాని ఈ సందర్భంలో అతీత శక్తుల సమస్య లేదు (అవి కూడా ముందు ముందు మనని బాధిస్తాయి) ఆయన లాయరు ఏదో విచారణలో వాదించటానికే పోతున్నాడు

**బుద్ధి ఒంటికాలిమీద**

గమనించవలసిన మరొక విషయం ఏమంటే గాఢనిద్రలో "బుద్ధి ఒంటికాలిమీద" నిలబడి వుంటుంది. అంటే మెదడుకూ స్పృహకూ అతిసూక్ష్మమైన బంధం మాత్రమే మిగిలివుంటుంది.

గత ప్రపంచ యుద్ధమప్పుడు రష్యా యుద్ధరంగంలో చాలా రాత్రులు నిద్ర లేకుండా పనిచేసిన డాక్టరు సందు చూసుకొని నిద్రపోయాడు ఇంతలో యుద్ధరంగం నుండి క్షతగాత్రుల యాగిడీ వచ్చింది డాక్టరును నిద్రలేపాలి కాని అది సాధ్యంకాలేదు తట్టినా, ముఖాన నీరుచల్లినా ప్రయోజనం లేకపోయింది కాని ఆయన చెవిలో చిన్నగా "డాక్టర్, క్షతగాత్రులు వచ్చారు చికిత్స చేయాలి" అనగానే ఆయన చివాలున లేచి కూర్చున్నాడు

**కుంభకర్ణుని మేల్కొలుపు**

రామాయణంలో కుంభకర్ణుని నిద్ర మేల్కొలపటానికి రాక్షసులు డప్పు వాయించీ, గడలతోబాది, ఏనుగులనూ, గుర్రాలనూ అతనిమీదగా తోలి నానా హైరానా పడిపోయారు కాని ఎవరైనా అతని చెవిలో "నీ అన్న రావణుడు యుద్ధంలో ఓడిపోయాడు నీవులేచి యుద్ధానికి వెళ్ళాలి" అంటే చప్పున లేచివుండేవాడేమో ?

బిడ్డతల్లి ఎంత చప్పుడుకూ లేవకపోయినా చంటిబిడ్డ 'కో' అంటే వెంటనే లేస్తుంది

అష్టపది (అక్టోపస్) నిద్రపోతున్నప్పుడు దాని ఎనిమిది కాళ్ళలో వకటి 'మేల్కొని' ఉంటుందట

దీన్నిబట్టి స్పష్టమయ్యేదేమిటంటే నిద్రకూ, స్పృహకూ వుండే లంకె అతి సున్నితమైనది అందుచేత నిద్రలో మనిషి స్పృహతో కూడిన పనులు చెయ్యడం ఎలా సాధ్యం అన్నది తేలని ప్రశ్న.

**కలల సహాయంతో**

ఈ క్రింది ఉదాహరణలు చూడండి

కెకులే అనే జర్మన్ రసాయనశాస్త్రవేత్త బెన్జాల్ అణునిర్మాణ స్వరూపాన్ని కలలో తెలుసుకొన్నాడు. మెండలీయేవ్ పీరియాడిక్ టేబిల్‌ను ఒక కల సహాయంతో రూపొందించాడు. అనేక సమస్యలు కలల ద్వారా పరిష్కారం కావడం జరిగింది

ఇది ఎలా సాధ్యమయినది ? చిత్రమేమంటే నిద్రలో ఇలా వ్యక్తమయ్యే స్పృహ జంతుస్పృహ కాదు. మార్క్సిస్టులు స్పృహ అనేది ప్రకృతి రహస్యాలు వెలికితీసేది ఇలాంటి నిద్రావస్థలో ఎలా సాధ్యమవుతున్నదని ఏ శాస్త్రవేత్త ఆలోచించినట్లు లేదు.

స్పృహ "బుద్ధికొలత"కు సంబంధించినదనీ, మేధోజీవిగా పరిణమించిన మానవుడిలో స్పృహ పూర్తిగా మెదడు పై పొరలకు పరిమితమై పోయినప్పటికీ అరుదుగా ఇలాంటి సందర్భాలలో స్పృహ మెదడు పై పొరల సహాయం లేకుండానే బుద్ధికొలతలో పనిచేస్తుందని నా ప్రతిపాదన. ఇంకా చాలా ఉదాహరణలు వున్నాయి

**కాలానికి అడ్డుదారి**

కాలానికి అడ్డుదారి సాధించాలంటే అది ఇంకో కొలతలోనే సాధ్యపడుతుంది ఆ కొలత స్థలం కావటం మనకు అనుభవమే. ఆకాశంలో నక్షత్రాలు కొన్ని లక్షలు, కోట్ల సంవత్సరాల క్రితం ఉన్నట్లు కనిపిస్తాయి. మనం చూసిన క్షణంలో వాటిస్థితి ఏమిటో తెలిసికొనే అవకాశం మనకు కాదుగదా. అసలు మానవజాతికే ఉంటుందో ఉండదో చెప్పలేం

కాలానికి అడ్డుదారి బుద్ధికొలతలో కూడ సాధ్యమవుతుందనడానికి ఆధారా లున్నాయి ప్లతనోవ్ ఇచ్చిన ఈ ఉదాహరణ చూడండి

మేరి అనే ఫ్రెంచి చరిత్రకారుడికి ఒక కల వచ్చింది అవి ఫ్రెంచి విప్లవం రోజులట విప్లవ న్యాయస్థానం హడావుడి అంతా ఆయన చూశాడు. ప్రసిద్ధ విప్లవకారులను చూశాడు వాళ్ళత వాదించాడు. చివరకు ఆయనకు మరణశిక్ష విధించారు ఆయనను వధ్యస్థానంలో నిలబెట్టారు గిలోటిన్ ఆయన మెడమీద పడింది ఆయన తల శరీరం నుండి వేరయింది ఆయన త్రుళ్ళిపడి లేచాడు. మరేమీలేదు దోమతెర కర్ర ఆయన మెడమీద పడింది. ఆ వాస్తవ సంఘటనకు ఉపోద్ఘాతంగా బ్రహ్మాండమైన కల

ఎంత పెద్ద కల అయినా చాలా కొద్దిసేపట్లో అయిపోతుందనీ క్షణాలమీద కలలో యుగాలు గడుస్తాయని శాస్త్రజ్ఞులు చెబుతారు. ఇందుకు మరొక ఉదాహరణగా మరొక కల.

పేరుమోసిన నాటకకర్త తన నాటకం తొలిప్రదర్శన చూస్తూ, నాటకం ఆరంభంకాగానే నిద్రపోయాడు నిద్రలో ఆయన నాటక ప్రదర్శన సాంతం చూశాడు ప్రేక్షకులు హర్షించటం విన్నాడు నిద్ర లేచాడు నాటకం ఇంకా ఆరంభంలోనే వుంది ఆయన నిద్రపోయింది కొన్ని క్షణాలు మాత్రమే ఇది స్పష్టంగా తెలుస్తూనే వుంది.

దీని దృష్ట్యా మొదటికలను పరిశీలిద్దాం. అది చరిత్రకారుడి కల. అరసెకండు మాత్రమే పట్టిందనుకొందాం ఆ కాస్తకాలంలోనే కాలం తలక్రిందులు కావడం మనం చూడగలం. కలకు సంబంధించిన స్పృహ కాలానికి ఎదురీదిందన్నది స్పష్టం లేదా మెడమీద కర్రపడిన అనంతరమే స్పృహ ప్రారంభమైన కలలో అది ముందునుంచి వెనక్కు నడిచివుండాలి అంటే కలలో కాలమన్నా తలక్రిందులు కావాలి లేదా స్పృహ అయినా తలక్రిందులుగా నడవాలి.

*(ఆంధ్రజ్యోతి వారపత్రిక, 19-8-1977)*

# 9. భవిష్యత్తు తెలుస్తుందా ?

మనిషికిగల అర్థంకాని, అంతుచిక్కని అనేక శక్తులను గురించి శాస్త్రజ్ఞులు పరిశోధనలు చేస్తున్నారు ఇలాటి పరిశోధనలు వాస్తవ ఘటనలనుంచి ప్రారంభం కావాలి ఒక "దయ్యం పట్టిన" మనిషి పదిహేనుమంది కదిలించలేని "ఊరిరోలును వది, పన్నెండు అడుగుల దూరం వెళ్ళిపడేట్టు తోసింది అన్న సంఘటన యదార్థమని రుజువుకాగానే శాస్త్రజ్ఞుడు దెయ్యాలు లేవని వాదించటం అర్థంలేని పని 'దయ్యం పట్టింది' అన్నది తప్పుడు అవగాహన కావచ్చు మూడు వారాలుగా తిండిలేని యిరవై ఏళ్ళ ఆడమనిషి రోలును దొర్లించటం మాత్రం నిజం దాన్నే శాస్త్రవేత్తలు పరిశోధించవలసింది దయ్యాలున్నాయా, లేవా అనేది తేల్చటం తప్పుగాట్లో పడటమే.

**హేతువాదుల భయం**

అటువంటి మానవశక్తులలో అరుదైనది భవిష్యత్తులో జరుగనున్నది ముందుగా చెప్పటం. ఇది పదే పదే జరుగుతున్నది దీన్ని హేతువాదులూ, మార్క్సిస్టులమనేవారూ కూడా వ్యతిరేకిస్తున్నారు వారి అభ్యంతరం దేనికీ ? కొందరు భవిష్యత్తును ముందు చెబుతున్నారన్నది అబద్ధం అనికాదు అది నిజం కావటానికి వీల్లేదని ! ఒక మార్క్సిస్టు ముందు జరిగేది ఇప్పుడే నిర్ణయమై వుంటే, దానినుంచి ఎన్ని అనర్థదాయకమైన 'కంక్లూషన్స్' లాగవచ్చునో మూడు అరటావులు రాశాడు

ఇది మూఢ విశ్వాసాలకు 'రేషనల్'గా ఊడిగం చెయ్యటమేనని నా వాదం ఏమిటా మూఢ విశ్వాసం ! కర్మసిద్ధాంతం, నుదుటి రాతలు, గుడ్డి నమ్మకం ఎవడు ఎక్కడ భవిష్యత్తు గురించి సరిగాచెప్పినా ఈ మూఢ విశ్వాసాలు బలపడతాయని 'హేతువాదుల' భయం కొందరు మార్క్సిస్టుల మనుకునేవారు కూడా ఇదే రొంపిలోకి దిగుతున్నారు

కర్మసిద్ధాంతాలు, విధి నిషేధాలూ కాక భవిష్యత్తును గురించి ముందుగా తెలుసుకునే మరోశక్తి మానవుడు నానాటికీ పెంచుకుంటున్నాడు అది 'నిర్ధారణ' శక్తి (Determinate) శిలాయుగం మానవులకు స్థల, కాలాలమీద అధికారం సంపాదించటానికి లక్షలాది సంవత్సరాలు పట్టింది కాని ప్రకృతిని గురించి పరిజ్ఞానం పెరిగినకొద్దీ భవిష్యత్తును తెలుసుకునే శక్తికూడా పెరిగింది. ఆహారం ఏరుకునే దశలో మానవుడికి రేపు తాను ఏం తింటాడో తెలీదు అలాగే వేటాడేవాడికి రేపు ఏ జంతువు మాంసం తనకు ప్రాప్తమో తెలీదు కాని, వ్యవసాయం నేర్చినవాడికి నాలుగునెల్ల అనంతరం తనకు ఏ పంట చేతికొచ్చేదీ మిగిలిన ఏడాది తాను ఏం తినేదీ ముందే తెలుసు అలాగే పశుపోషణ నేర్చిన మానవుడికి తాను రేపు ఏ మాంసం తినేది ముందే తెలుసు ఇది కర్మసిద్ధాంతం కాదు. విధి నిర్ణయం కాదు. మనిషి యత్నఫలం, మానవ నిర్ణయం

ఆధునిక నాగరిక జీవనం నూటికి తొంభైపాళ్ళు నిర్ధారణశక్తి మీదనే ఆధారపడి వుంది ప్రయాణించబోయే జనుల సంఖ్య, రేషన్ సరుకుల ప్రమాణం, ఉత్పత్తి ప్రమాణాలు, స్కూళ్ళలో సీట్లులాంటి లక్షలాది విషయాలు ముందుగా నిర్ధారణ కావాలి సరేకదా అందులో పొరపాటు జరిగితే చెప్పరాని కష్టాలు సంభవిస్తాయి సమ్మెలలాటివి అనుకోకుండా జరిగితేనే జీవితం తారుమారయి పోతుంది

మరుక్షణం, మరుసటిరోజు, వచ్చే సంవత్సరం ఏం జరిగేదీ తెలీదని, తెలుసుకోవడం అసాధ్యమని కాళ్ళు బారజాచటమే హేతువాదమనీ, సరియైన మార్క్సిస్టు దృక్పథమనీ అనుకునేవాళ్ళు చాల తప్పుతోవలో వున్నామని గ్రహించాలి.

పోతే వాళ్ళు రెండు వాదనలను అవలంభించవచ్చు

1 "మనిషికి దేన్నయినా విధిగా జరగకుండా ఆపే శక్తి వుందని నమ్మాలి ఏదీ అనుల్లంఘనీయం కాదు" బాగానే వున్నది కాని, రేపు సూర్యోదయం అవుతుందనుకోవడం మూఢవిశ్వాసమా ? చాలా రోజులపాటు సూర్యుణ్ని ఉదయించకుండా చేసిందని చెప్పుకునే అనసూయ గొప్ప హేతువాదా ? మార్క్సిస్టా ? ఇంకొన్ని నెలలలో వేసవి వస్తుందని, దాన్ని మనం ఆపలేమని అనుకోవటం మూఢవిశ్వాసమా ? ఇవన్నీ అనివార్యాలు కావా ?

2. "పుట్టిన మనిషి చస్తాడని చెప్పటం వేరు. ఫలానా రోజున ఫలాని మనిషి చస్తాడని చెప్పడం వేరు".

దీన్ని గురించి కొంత చర్చించవచ్చు. ఒకటి ఫలాన రోజున ఫలానా మనిషి చస్తాడన్నది అబద్ధంగా పరిణమిస్తే దాన్ని గురించి ఆలోచించే పనిలేదు కాని అది నిజం అయితే శాస్త్రీయ దృక్పధం కలవాడు ఏ వైఖరి అవలంబించాలి ఆ జోస్యం కాకతాళీయం కావచ్చు దీన్నే ప్రాబబిలిటీ, ఛాన్స్ అంటారు. దాన్ని గుణించవచ్చు. అది లక్షలో ఒక ఛాన్స్ అయితే కాకతాళీయం, యాదృచ్ఛికం అని కొట్టి పారేయటానికి శాస్త్రం ఒప్పదు. ఇలా కొట్టిపారెయ్యటానికి వీలులేని జోస్యాలు రోజా ఎక్కడో అక్కడ ఎదురౌతుంటే ఎలా కొట్టిపారెయ్యటం !

**వాన రాకడా, ప్రాణం పోకడా,**

ఒకటి నిజం ఈనాడు శాస్త్రం ఎంత అభివృద్ధి అయిందంటే వానరాకడా, ప్రాణం పోకడా కూడా ముందుగానే నిర్ణయించవచ్చు. కాని కొన్నిరకాల 'జోస్యం' ఎలా జరుగుతుందీ మనకింకా తెలీదు దుండుముక్కలాగున్న మనిషి సాయంత్రానికి చస్తాడని ముందే సరిగ్గా చెప్పటానికి గల ఆధారాలేమిటో ఏ శాస్త్రమూ చెప్పలేదు చెప్పేవాడు వైద్యుడైనా కాడు

ఇందుకు కారణం శాస్త్రజ్ఞానం పరిపూర్ణత దరిదాపులలో లేకపోవడం.

మరొక సంగతి ఏమంటే గణితంలో ప్రాడిజీలు ఏదన్నా లెక్కయిస్తే వెంటనే 'అన్సరు' సరిగా చెప్పేస్తారనుకోండి, అది ఎలా సాధ్యమో శాస్త్రం మనకు చెబుతున్నదా ? చెప్పటంలేదు.

ఇదంతా నేను చెబుతున్నది భవిష్యత్తును గురించి ఏ అడ్డమైనవాడు ఏమి చెప్పినా అందరూ నమ్మాలని కాదు. ముందు జరిగేది సరిగా-చెప్పే మానవశక్తి గురించి ఆసక్తి వున్నవాళ్ళు పరిశోధన చెయ్యవచ్చు. అలాటి శక్తులు లేవని వాదించటంలో కాలయాపన చేసేవాళ్ళు తమ కాలం వృధా చేస్తున్నారు తమది శాస్త్రీయ దృక్పధమని అపోహపడుతున్నారు

**(ఆంధ్రజ్యోతి వారపత్రిక, 2-12-1977)**

# 10. PREDICTION

Prediction is many steps away from precognition of implies it

I am taking it that precognition is proved both in lab and much more so in life. I assume that precognition is very closely akin to Telepathy. In card experiments the subject guesses a card some one is/seeing or someone is going to see and nobody has yet seen In either case it matters very little to the subject whether he is getting the "information" through another mind or divert from the object

Precognition is confined to knowledge of something which is already there - happened in a sense But what we call predictions are "not there" already. Take the case of Dr Soul and Davis Dr Soul was given details about a house which Davis was yet to occupy which include 8 details, including Mrs Davis of her child - all correct

This sort of prediction is extremely difficult, even positively impossible to analyse or rationalise

If experiments are to be done in this direction at all, a start must be made with short range predictions. While appearing for my B A exam. (practical) I was reading friction in my room and my co-student (in the hostel) saw me and asked me why I was not mugging up my "Record Book" I showed him what I had recorded on the wall "K of a Galvanometer" That was exactly what I got that evening - a simple case of precognition But when I was only sixteen a relative of mine predicted the death of her grandson who was having only "fever" Even as she predicted the boy died next day It would have been interesting to find out the "fever" was a fatal one If it was she was predicting something quite inevitable

I donot know if research psychologists can arrange capable subjects to make short range predictions and then try to find out if there is an inevitable chain of events leading up to the fulfilment of the prediction Such things are as good as having happened like tomorrow's sunrise and the next lunar eclipse

But the trouble is with the type of prediction I had from a dead friend of mine who predicted that I would go to the South "more or less permanantly" in June 1939 The prediction began to come true innocently with an offer from AIR for a talk in June 1939 - my first radio talk. I should have returned home the next day but the late Gudavalli Ramabrahmam would not let me go till his inauguration of his రైతుబిడ్డ which was some nine days away In the mean/time a friend suggested that I help SVS Rama Rao with script for బాలనాగమ్మ. The prediction was

fulfilled ! There was no inevitable chain of events I could have got the talk in April or August Ramabrahmam need not have detained me so many days for the event SVS need not have prefered me More than that, the events are totally unconnected

My idea is if you can experimentally establish the inevitability of the fulfilment of prediction on some scale or other, it would be an excellant working hypothesis for investigating more complicated ones statistical investigations will not do in this case and a huge crowd of investigators must be on the front to record every possible prediction and the time of its utterance and fulfilment. Or people with yogic powers could be pursuaded to help The dead friend who made two very accurate predictions (one of them at my request) was an excellent sport without any pretentions Once he perpetrated professional mischief and it worked He asked me how it could work and I was in a position to tell him Such open - minded fellows are rare

On your suggestion I am concentrating on this queer business of predictions and will pass on to you what ever ideas come to me.

*(12-5-79)*

# 11. ఏవి మూఢ విశ్వాసాలు ?

మూఢ విశ్వాసం అనేదానికి నిర్వచనం అవసరంగా కనబడుతుంది "ఇవి, ఇవి మూఢవిశ్వాసాలు" అని శిలాక్షరాలుగా చెప్పటంవల్ల చాలా చిక్కులున్నాయి. సంఘక్షేమం కోసం అమ్మవార్లకు కొలుపులు, జాతరలూ చెయ్యటం మూఢాచారమనీ మూఢవిశ్వాస జనితమనీ, అంటే చాలామంది ఒప్పుకుంటారు కాని, ఈనాడు మానవజాతి ఆర్థిక పురోగమనానికి పెట్టుబడిదారీ తప్ప మరోమార్గం లేదన్నది మూఢవిశ్వాసమంటే చాలామంది పోట్లాటకొస్తారు పెట్టుబడిదారీ ఒక్క ఆర్థిక సమస్యను పూర్తిగా పరిష్కరించలేదనీ, అది సృష్టించే 'అరాచకం' వల్ల అంతులేని జన సంక్షోభం కలుగుతుండటం కళ్ళారా చూస్తున్నా ఆ మూఢ విశ్వాసాన్ని వదలుకోరు

1 రుజువు కోసం చూడకపోవడం మూఢవిశ్వాసానికి ఒక లక్షణంగా కనిపిస్తుంది కొన్ని విశ్వాసాలు ఆరంభంలో కారణం ఉండే ఏర్పడ్డాయి. ప్రజలు చిన్న చిన్న సంఘాలుగా జీవించేటప్పుడు భార్యాభర్తలది మరీ సన్నిహిత 'రక్తం'గా వుండకుండా సగోత్ర వివాహాలు నిషేధించారు. ఈనాడు ముప్పై తరాలమీద ఎలాటి సంపర్కమూలేని సంబంధం, వాంఛనీయమైంది వస్తే ఒకే గోత్రమైందని మానుకోవడం స్పష్టంగా బుద్ధి తక్కువ వ్యవసాయం చాలా హీనస్థితిలో వున్న కాలంలో వేదకాలపు ఆర్యులు యజ్ఞాలను ప్రధానంగా పెట్టుకొని, జంతువులను కోసుకు తినటంలో అర్థం వుండేది. వ్యవసాయం అభివృద్ధికి వచ్చి, దాని ఆధారం మీద విస్తృత సమాజాలు ఏర్పడి, పశువులను చంపటం ఆర్థికంగా అవివేకంగా పరిణమించినప్పుడు (బుద్ధుడి కాలంలో) యజ్ఞాలకు విరుద్ధంగా తీవ్ర ప్రచారం సాగింది. మానవ సంఘాలు ఆటవిక దశ నుంచి వ్యవసాయంలోకి ప్రవేశించిన కొత్తలో ప్రపంచం అంతటా మాతృ దేవతారాధనా, మాతృ స్వామ్యమూ లాటివి అమలు జరిగాయి. కాళీమాత అలాటి మాతృదేవత శివుడు ఆరాధనకన్న కూడా కాళీ ఆరాధన ప్రాచీనమయినది. ఆ అనాగరిక యుగం పోయింది

2. పనికిరాకుండా పోయిన విశ్వాసాలను మూఢ విశ్వాసాలనవచ్చు. వాటి చారిత్రక విశిష్టత మనకు అనవసరం.

కొన్ని నమ్మకాలకు ఎలాటి ఆధారమూ ఉన్నట్టు కనిపించదు. అవి పుట్టుకతోనే మూఢవిశ్వాసాలుగా మనకు తోస్తాయి ఇంటర్నల్ కంబశ్చన్ ఇంజన్లులేని కాలంలో గంధర్వులు, ఇతర దేవతలు అప్పుడప్పుడు రాముడు లాంటి మనుషులూ విమానాలలో తిరగటం ఏమిటి ?

ఇలాటి విశ్వాసాలను, ఇంతకన్న 'దారుణమైన' విశ్వాసాలనూ నమ్మవచ్చునని ఇప్పుడు శాస్త్రవేత్తలు వాదించటం ఆరంభించారు. చిత్రమేమిటంటే వారి వాదనలు చాలా 'సబబు'గా కన్పిస్తున్నాయి. కొన్ని ఉదాహరణలు తీసుకుందాం.

ఈజిప్టులో పిరమిడ్లు ఎవరు నిర్మించారు ? ఎలా నిర్మించారు ? వాటి నిర్మాణం జరిగిన నాటికి చక్రం కూడ సృష్టికాలేదు. ఈనాడు అద్భుతమైన ఇంజనీరింగు పరికరాలు ఉన్నప్పటికి ఆధునిక మానవులు పిరమిడ్లను లోపల గదులతోను, మార్గాలతోను నిర్మించలేరు. అది నిస్సందేహంగా మానవాతీతమైన కృషి. ఇంగ్లండులో 'స్టోన్ హెంజ్' కూడా మానవులకు సాధ్యమయ్యే నిర్మాణం కాదు పెరూలో నేలమీద రాక్షస బొమ్మలు రచించివున్నాయి. వాటిని ఎప్పుడు, ఎవరు రచించారో తెలీదు నేలమీద నడిచేవారికి ఆ బొమ్మలున్నట్టు అనుమానం కూడా రాదు విమానయానాలు వచ్చినాక ఆకాశంలో నుంచి చూసినప్పుడే అవి కనిపించాయి వాటివల్ల ప్రయోజనం కూడా ఏమీలేదు - లోకాంతరాల నుంచి వచ్చేవారికి అవి కొండగుర్తుగా తప్ప

ఇలాటివి - ఈ యుగపు మానవులకు అసాధ్యము, అనూహ్యము, అతీతమూ అయినవి

- ఎన్నైనా వున్నాయి వీటిని గురించి 'శాస్త్రీయంగా' చర్చించగలవారే పురాణాలను కొట్టిపారెయ్యటానికి వీలులేదంటున్నారు జలప్రళయం కథను నమ్మవచ్చునట 'దేవతలు' (మనలాటి ప్రాణులేగాని మనకన్న చాలారెట్లు పరిణతి చెందినవారు ) ఒకప్పుడు భూమి మీద వుండి, మనం ఊహించలేనంత గొప్ప నాగరికతను నెలకొల్పారని, జలప్రళయంలో అదంతా తుడిచిపెట్టుకుపోయి, తిరిగి మానవుడు పాశవికదశతో పరిణామం సాగించాడని ఒక వాదం. ఇందులో లోకాంతరాల నుంచి వచ్చిన మనుషుల ప్రమేయం వుందని మరొక వాదం. ప్రాణి పరిణామవాదం శుద్ధ అబద్ధమని మరొక వాదం.

ఇలాంటి విశ్వాసాలను గురించి రెండు విషయాలు మనం గమనించాలి. ఇవి ఈనాటివి సంప్రదాయకంగా వస్తున్నవి కావు ప్రాచీన విశ్వాసాల అధునిక పునః ప్రతిష్ఠ అయినప్పటికీ రెండో విషయం వీటిని ప్రతిపాదించేవారు శాస్త్రజ్ఞులు - "పామరులు" కాదు పైపెచ్చు వీటివల్ల సామాజికంగా బాగుపడేవర్గం ఏదీ వున్నట్టు కనబడదు

అయినా ఈ రకం విశ్వాసాలు శాస్త్రీయంగా విలువ గలిగినవైనా, సామాజికంగా నిరుపయోగంగా కనబడతాయి. ఒకప్పుడు స్వర్ణయుగం వున్నదని, మన పూర్వులు దేవతలలాంటి వాళ్ళని, బైబిల్‌లోను, మన పురాణాలలోను చెప్పినట్టు మానవజాతి పతనమయిందని ఒప్పుకున్నంతమాత్రాన ఏమయింది ? మన సమస్యలు ఈ 'పతిత' మానవుడి సామాజిక పరిణామం నుంచి ఏర్పడినవే వాటి పరిష్కారం ఈనాటి మానవుడి మేధ ద్వారానే సాధ్యం కావాలి. పిరమిడ్లుగాని, బృహత్ శిలానిర్మాణాలు (Megaliths) గాని మన సమస్యను పరిష్కరించవు

నేను విశ్వసించే బుద్ధికొలతలో విశిష్టజ్ఞానం నిక్షిప్తమై వుంటే దాన్ని మానవుడి మెదడు ఎప్పటికైనా అందుకుని, వందలేసి టన్నుల బరువుగల రాళ్ళను అవలీలగా డజన్ల కొద్దీ మైళ్ళు తీసుకుపోయి అద్భుతమైన ఇంజనీరింగు పనులు సాధించవచ్చు

మానవులు అప్పుడప్పుడు ప్రదర్శించే అసాధారణ శక్తులను కొట్టిపారెయ్యనవసరంలేదని నేను వాదిస్తాను. గణితంలో అద్భుతాలు చెయ్యగలవారున్నారు కాని వాళ్ళు చేసే లెక్కలు సరిఅయినవో, కావో, మనం గంటల తరబడి, రుజువుచేసుకుంటేనేగాని వారి శక్తిని నమ్మం అక్షహృదయం ఉండేదట, ఒక చెట్టుకు ఎన్ని ఆకులున్నది చూడగానే చెప్పేవారట వాళ్ళు నోటికి వచ్చిన సంఖ్య చెప్పలేదని ఏమిటి ? ఆకులన్నీ ఎంచినమీదట కదా అక్ష హృదయం రుజువయేది?

ఇటువంటి శక్తులు మానవుడికి ఒకప్పుడు స్వతసిద్ధంగా వుంటే వాటిని ఈనాటి మానవుడు వెలుపలనుంచి సాధిస్తున్నాడు ఎంత కఠినమైన గణిత సమస్యలైనా 'కంప్యూటర్' అరక్షణంలో పరిష్కరిస్తుంది రాకెట్లద్వారా ఆధునిక మానవుడు లోకాంతర యానాలకు ఉద్యుక్తుడవుతున్నాడు మనకు దక్కుడు ఇదేగాని పిరమిడ్లు నిర్మించిన వాళ్ళ ప్రతిభ కాదు.

3 కొన్ని విశ్వాసాలను, అవి ఎంత శాస్త్రసమ్మతమైనా, మనకు ప్రత్యక్షంగా పనికి రానప్పుడు, భావ ప్రపంచ పరిధిలోనే వుంచాలి అవి మూఢ విశ్వాసాలు కావు. మనకు ఉపకరించే విశ్వాసాలూ కావు.

*(17-2-78)*

# 12. చిలక పలుకులు

ఇటీవల నన్ను హెచ్చుగా బాధిస్తున్నదేమంటే కొందరు మేధావులుగా వ్యవహరించ వలసినవాళ్ళు (బెర్నార్‌షా భాషలో ఇతరుల కోసం ఆలోచించటం వృత్తిగా గలవాళ్ళు) సందర్భశుద్ధి పాటించకుండా తాము నమ్మిన ప్రమాణ గ్రంధాల నుంచి ఏకరువుపెట్టటం. ఇది కొత్త జబ్బుకాదు మన తెలుగు మేధావులు ఒకప్పుడు భారత, భాగవతాది ఉద్గ్రంధాలనుంచి కొటేషన్లు విసిరేవారు తరువాత స్వాతంత్రోద్యమ కాలంలో "రవీంద్ర కవీంద్రుడి" ప్రవచనాలు ప్రమాణమయ్యాయి తరువాత రసెల్ లాటి పాశ్చాత్య తత్వవేత్తలు "కోటబుల్"గా పరిగణించబడ్డారు ఇటీవల ఈ కొటేషన్ల దురభ్యాసం మార్క్సిస్టు మేధావులను బలంగా పట్టుకున్నట్టు కనిపిస్తుంది

మార్క్సిజం అలాటి అభ్యాసాన్ని ప్రోత్సహిస్తుందని కాదు మావో రచన "ఆన్ ప్రాక్టీస్" ఉపోద్ఘాతం ఆరంభంలోనే ఈ మాటలున్నాయి

"Marxsim is not a dogma but a guide to action and overcoming people with words and phrases from Marxist works from out of contexts

మార్క్సిజం పిడివాదమనీ ఏ మార్క్సిస్టూ పొరపాటున కూడా వాదించరాదు మార్క్సిస్టు సాహిత్యంలోంచి సందర్భశుద్ధి లేకుండా 'కోట్' చేసి, జనాన్ని గాభరా పెట్టజూడడం మార్క్సిస్టులు అనుసరించదగిన పద్ధతి కాదు అయినా ఈ ట్రిక్కు నామీద కొందరు, సదుద్దేశంతోనే అనుకోండి, ప్రయోగించారు.

ఎవరైనా కొత్త ప్రతిపాదన చేయదలచినప్పుడు హేతుబద్ధమైన విమర్శ కోరుతాడు. తన ప్రతిపాదన రేకెత్తే అనుమానాలు తీర్చే ప్రయత్నంలో ఆ ప్రతిపాదన బలపడవచ్చు లేదా, దానికి పునాదిలేదని నిరూపణ కావటమూ, అది గాలికి ఎగిరిపోవటమూ జరగవచ్చు

కాని చిలక పలుకులు ఈ రెంటిలో ఏపనీ చెయ్యలేవు ఒక మార్క్సిస్టు మేధావి "డిటర్మినిజం, ఫాటలిజం" అనే వాటికి తేడా తెలియకనూ, భవిష్యత్తు గురించి అయోమయంలో వుండటం మార్క్సిస్టు మేధావికి గొప్ప గీటురాయి అనీ నమ్మి, భవిష్యత్తు ముందే నిర్ణయం అయి వుంటుందనే నమ్మకంలో గల అంతరార్థాన్ని రెండు అరఠావులు పైగా రాశాడు అలాటి దృక్పధాన్ని నవరణ చెయ్యడానికి ఒక వ్యాసం రాశాను.

ఇంకో మార్క్సిస్టు మేధావి నేను చెప్పేది అర్థం కాలేదని ఒక చెంప ఒప్పుకుంటూనే నా భావాలు తప్పు అని నిరూపించటానికి విశ్వప్రయత్నం చెయ్యటం జరిగింది ఉదాహరణకు - ఎంగెల్సు ఎక్కడో చారిత్రక దృష్టితో "మనిషి అది చేశాడు, ఇది చేశాడు" అని రాశాడు. దానికీ నా బుద్ధి కొలత ప్రతిపాదనకూ ఎక్కడా ఏ విధమైన సంబంధం లేదు. అయినా ఇలాటి చిలక పలుకులకు జవాబు రాస్తూ అది పచ్చి అబద్ధమని వాదించవలసిన స్థితిలో పడ్డాను రేపు ప్రపంచమంతటా వర్గ రహిత సమాజాలు ఏర్పడితే, "మానవుడు సామాజిక విప్లవం ద్వారా భూమి మీద వర్గ సమాజాన్ని అంతం చేశాడు" అని చారిత్రక దృష్టితో అనవచ్చు. అది నిజమవుతుందా ? ఏ మానవుడు, ఏ విప్లవం, ఎలా జరిగింది, ఏ సిద్ధాంతాలను బట్టి జరిగింది, ఎలాంటి వైరుధ్యాలను ఏ విధంగా పరిష్కరించవలసిన వచ్చింది వగైరా ప్రశ్నలు వెయ్యకుండా "ప్రోసెస్" అర్థమవుతుందా ?

ఏ సిద్ధాంతానికైనా గీటురాయి ఆచరణ అన్నది ఏ మార్క్సిస్టూ మరవరాదు. నేను ప్రతిపాదించే బుద్ధికొలత ఆచరణలోఏ మాత్రమైనా సార్థకత కలిగి వున్నదా లేక మార్క్సిస్టు మేధావులను తప్పుదారి పట్టించటానికి ఉపయోగిస్తుందా ? ఈ ప్రశ్నకు సమాధానం అందరికీ ఎంత ముఖ్యమో, నాకూ అంత ముఖ్యమే.

ఇంకొక ముఖ్యమైన సంగతి. "ఆచరణ" గురించి, మావో రాసిన వ్యాసంలో ఆచరణ నుంచి జ్ఞానం ఎలా పుట్టేదీ, ఎలా మారేదీ జ్ఞానం ద్వారా ఆచరణ ఎలా మార్పు చెందేదీ చక్కగా చర్చించబడింది కాని ఇదంతా జ్ఞానం సృష్టి అయి పరిణామం చెందటం గురించి మాత్రమే. ఉన్న జ్ఞానాన్ని (మార్క్సిస్టు సాహిత్యాన్ని) ఆచరణకు వుపయోగించుకునే వాడిపాట్లు ఈ వ్యాసంలో లేవు అయితే ఇందులో ఆచరణకు మరింత ప్రాముఖ్యం వస్తుంది మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్, మావోలు సృష్టించిన మహత్తర విజ్ఞానాన్ని పూర్తిగా అవగాహన చేసుకోవటమే పెద్ద యజ్ఞం. దాన్ని ఏకరువు పెట్టటం తేలిక, కాని ఆచరణలో పెట్టటం మాట వచ్చేసరికి జ్ఞాన సేకరణ ప్రక్రియ మళ్ళీ మొదటికి వస్తుంది అంటే, మొదటిది జ్ఞానేంద్రియాల ద్వారా కలిగే స్పృహ మార్క్సిస్టు సాహిత్యం ఏం చెబుతున్నదీ పైపైన తెలుస్తుంది కాని ఆచరణలో పెడితేగాని అది జీవితంలో రేపే వైరుధ్యాల స్వరూప స్వభావాలు అవగాహన కావు. అటువంటివాళ్ళు ఏకరువుపెట్టే మార్క్సిజం ఏ మార్క్స్ కాలానికో, ఏ పాశ్చాత్య దేశానికో చెందినట్టుంటుంది తప్ప, ఈ కాలానికీ, ఈ దేశానికీ తగిలీ తగలనట్టుంటుంది

సిద్ధాంత సంబంధమైన ఆచరణలో బుద్ధికొలత ప్రాముఖ్యం చాలా ఉన్నదని నేను నమ్ముతున్నాను ఇలా బుద్ధికొలతలో "ఆచరణ" ద్వారానే మార్క్సిజంను లెనిన్, స్టాలిన్, మావోలు సజీవంగా ఉంచగలిగారు వాళ్ళు తాము జీవితమంతా మార్క్స్, ఎంగెల్సులను "కోట్" చేస్తూ కూర్చుంటే, ప్రపంచంలో ఇంపీరియలిజమూ, కేపిటలిజమూ చెక్కు చెదరకుండా ఉండేవే

ఇంతకూ నేను చెప్పేదేమంటే వున్న జ్ఞానాన్ని సామాజికంగా ఆచరణలో పెట్టదలచిన వాడు ముందుగా బుద్ధిరీత్యా ఆచరణలో పెట్టాలి లేని పక్షంలో జ్ఞానం దారి జ్ఞానందీ, ఆచరణ దారి ఆచరణదీ అయిన, కొటేషన్ల చాటభారతాలు మిగులుతాయి

**(ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 10-2-1978)**

# 13. మానవ జీవితంలో మనస్సు పాత్ర

"ఆదర్శాలూ, భావాలూ మనిషిని, ఏ జంతువూ చెయ్యని పనులు చెయ్యటానికి ప్రేరేపిస్తాయి.... పాశవిక మానవులతో సహా మనకు తెలిసిన మానవ సంఘాలన్నీ బాధాకరమైన ఆచారాలు పాటిస్తూ, తమకు అందుబాటులో వున్న సుఖాలను త్యజిస్తాయి" - గోర్డన్‌చైల్డ్

జంతువుల నుంచి మనుషులకు మెదడులో కలిగిన పరిణామ ఫలితాన్ని పై వాక్యాలు కొంతవరకు నిరూపిస్తాయి అయితే ఈ తేడా వెనక అతి ముఖ్యమైన విషయం ఒకటున్నది - అది సామాజిక జీవనం ఆదర్శాలూ, భావాలూ, ఆచారాలూ సమష్టి జీవితంలోనే ఉత్పత్తి అయి, తరాల వెంబడి ప్రచారమవుతాయి

ఇందుకు కారణం భాష - భాష జగత్తులో గల వస్తువులకూ, క్రియలకూ, అభిప్రాయాలకూ సంకేతాలు సరఫరా చేస్తుంది మాటలు కృత్రిమమైనవి - వాటిని ఆమోదించిన సమాజంలోనే వాటికి అర్థం ఉంటుంది ఒక భాషవారికి మరొక భాష అయోమయంగా ఉంటుంది ఏ సమాజం కూడా తనకు నిరుపయోగమైన మాటలు సృష్టించదు ఏడాదిపొడుగునా మంచులో జీవిస్తూ, తోలు బట్టలు ధరించేవారికి విసనకర్రలు అవసరం ఉండవు - వారి భాషలో ఆ వస్తువుకు మాట అవసరం లేకపోవచ్చు - అలాగే సంఘ జీవనంలో మార్పులు వస్తున్న కొద్దీ కొన్ని పదాలకు స్థానం లేకుండా పోతుంది అర్థశాస్త్రంలో చెప్పిన అనేక రాజకీయాధికారుల పేర్లు అంతరించాయి, కారణం ఆ అధికారాలు అంతరించడమే ఏ మేకకూ, పులికీ "దేవుడు, విధి, పుణ్యం పాపం, కర్మ" లాంటి భావాలు కలగవు. భాషను ఉపయోగించకుండా వీటిని వివరించి, మరొకరికి అర్థమయేటట్టు చెయ్యటం సాధ్యం కాదు ఇలాంటి మాటలు అన్ని భాషలలోనూ ఉన్నాయి గదా అనవచ్చు - అన్ని భాషల వాళ్ళూ ఏదో ఒక సామాజిక పరిణామ దశలో ఈ భావాలు అవసరమని భావించారనుకోవాలి ఏ యదార్థ వస్తువునూ నిర్దేశించలేని ఈ మాటలు సమాజాలను గుర్తుపట్టటానికి వీలులేకుండా మార్చాయి. బుద్ధుడికీ, క్రీస్తుకూ, మహమ్మదుకూ ముందూ, వెనకా ఉండిన సామాజిక జీవితాల మధ్య తేడాలు చారిత్రకమైనవి ఇంతటి మార్పులకు ఆధారం శుష్కమైన మాటలేనా అనుకున్నప్పుడు చాలా ఆశ్చర్యం వేస్తుంది కాని ఆ మాటలు వాస్తవ సామాజికావసరాల నుంచి పుట్టాయని గ్రహించాలి.

అయితే "శుష్క" పదజాలాన్ని సృష్టించి ముందుకు పోయే సమాజం తన అవసరాలు గుర్తించగానే మాటలను సృష్టించుకోలేదు. ఆ మాటలు సృష్టి అయి ఆ భావాలు సమాజపరంగా మనుషులకు అవగాహన అయేదాకా సమాజం నష్టపోతూనే ఉంటుంది

ఉదాహరణకు "దొంగతనం" అన్నమాటను తీసుకుందాము వ్యష్టి ఆస్తి హక్కులు లేని సంఘాలు ఆ మాటను సృష్టించలేవు, వింటే అర్థం చేసుకోలేవు. అట్లాగే రాజరికం ఉన్న కాలంలో "ప్రజాస్వామ్యం" అనేమాటకు అర్థం ఉండదు అన్ని స్వామ్యాలూ రాజువీ, రాజు బావమరిదివీను. ఇవాళ మనం వర్గరహిత సమాజం గురించీ, సమసమాజం గురించీ, సోషలిస్టు వ్యవస్థ గురించీ, కమ్యూనిజం గురించీ మాట్లాడుతున్నాం. ఈ మాటలు మానవుడి అవసరం నుంచీ పుట్టిన మాట నిజమేగాని, ఇవి అందరికీ అర్థం అవుతాయని చెప్పటానికి వీలు లేదు మానవ జాతి భవిష్యత్తు ఈ మాటల మీద ఎంత ఆధారపడి ఉన్నదో, ఆ భవిష్యత్తు కొన్ని దేశాలలో ఏ విధంగా రూపుపొంది, ప్రజల సమస్యలను - నిరుద్యోగం, ద్రవ్యోల్బణం లాంటివి - ఎలా రూపుమాపిందో గ్రహించక పోగా, ఈ మాటలను చూసి బెదిరిపోయే వాళ్ళు కూడా ఉన్నారు

అంతేకాదు ఈ "శుష్క" పదాలను సామాజిక దోపిడీకి చక్కగా వాడుకుంటు న్నారు

ఒక దశలో తొలి సంఘాలు వృద్ధి పొంది, సాంకేతిక నైపుణ్యం పంచుకొని సృష్టించిన అదనపు సంపదకు హక్కుదారుగా దేవుడు వచ్చి, బ్రహ్మాండమైన ఆలయాలలో మకాం పెట్టాడు. రాజు తానే దేవుణ్ణి అని ప్రకటించుకుని, సంపద కంతకూ హక్కుదారునన్న తరువాత న్యాయంగా దేవుడితో పని తీరింది కాని దేవుడు పోలేదు దోపిడీకి వాడు అవసరమయాడు.

దోపిడీకి అవసరమైన మరో మాట ప్రజాస్వామ్యం కమ్యూనిజంలో తప్ప నిజమైన ప్రజాస్వామ్యం సాధ్యం కాదు. కాని సంఘ దోపిడీగాళ్ళు "ప్రజాస్వామ్యం" కూ "కమ్యూనిజం"కూ వైషమ్యం ఉన్నట్టు ప్రచారం చేస్తున్నారు

ఇవన్నీ చరిత్రగతిని నిర్ణయిస్తున్న "శుష్క" పదాలు

ఇలాటి శుష్క పదాలతో కూడుకున్నవే ఒకనాటి ధర్మశాస్త్రాలూ, ఈనాటి చట్టాలూనూ వాటిలో చెప్పిన నిషేధాలు సమాజంలో ఉండిన కొన్ని ఆచారాలను బయటపెడతాయి, వాటిని నిషేధించటం సంఘానికి మొత్తంగా గాని, ఒక వర్గానికి గాని లాభం కావచ్చు "పరస్త్రీతో పోగూడదు" అంటే రెండు విషయాలు స్పష్టం అవుతాయి. అలాగే తాగుడూ, జూదమూ నిషేధించటం జరుగుతుంది కాని కౌటిల్యుడి అర్థశాస్త్రం నాడు తాగుడూ, పడుపు వృత్తీ, జూదమూ, గోమాంసమూ లాటివి చట్టవిరుద్ధం కాదు వాటి మీద పన్నులూ అవీ వసూలు చేసే ఉద్యోగులు ఉండేవారు

**జ్ఞానమూ, విజ్ఞానమూ :**

జ్ఞానమూ, విజ్ఞానమూ అనేవాటికి భాషతోనూ, సమాజంతోనూ, మనస్సుతోనూ ప్రత్యక్ష సంబంధం వున్నది ఇందులో దేని పాత్రను తీసేసినా అవి సాధ్యం కావు - మాట వరుసకు, ఆచరణ ద్వారా ఒకరికి తెలిసినది మరొకరికి భాష అవసరం లేకుండా నేర్పవచ్చు - పిల్లి కూనలకు వేటాడటం నేర్పినట్టు కాని ఇలా చూసి నేర్చుకున్నది జ్ఞానం అనిపించుకోదు - ఎందుకంటే ఆచరణకు సంబంధించిన పరిస్థితులు మారగానే చూసి నేర్చుకున్నది ఎందుకూ పనికిరాకుండా పోతుంది. భాషవల్ల ఆచరణ తాలూకు మూలసూత్రం తెలుస్తుంది ఈనాడు మతాచరణలన్నీ జ్ఞానశూన్యమైనవే ఎందుకంటే తంతు జరిపించే పురోహితుడికిగాని, జరిపే గృహస్థుకు గాని తాము ఏది ఎందుకు చేస్తున్నారో తెలీదు మతాలు మనిషిని జ్ఞానానికి దూరం చేసి, జంతువుగా మార్చేశాయనటానికి ఇంతకంటె మంచి ఉదాహరణ లేదు.

జ్ఞానానికీ, విజ్ఞానానికీ తేడా గుర్తించాలి జ్ఞానం లోకవృత్తానికి సంబంధించిన పరిజ్ఞానం ఇది తత్కాలానికీ, తత్ప్రాంతానికీ మాత్రమే చెంది ఉంటుంది మార్క్సిస్టు పరిభాషలో "సూపర్ స్ట్రక్చర్" అనేదంతా జ్ఞానమే సమాజం తన మనుగడకు ఎంత జ్ఞానాన్ని ఉపయోగించుకోగలిగితే అంత ఉచ్ఛస్థితిలో ఉంటుంది ఆ జ్ఞానాన్ని ఎంత వేగంగా సంస్కరించుకోగలిగితే అంత శీఘ్రంగా ముందుకు పోతుంది భౌతిక ప్రాతిపదికలో జరిగే మార్పులను బట్టి కొంత జ్ఞానం నిరుపయోగమవుతుంది దాని వల్ల సామాజికులు లాభం పొందలేరు - అలా శిథిలమైన జ్ఞానాన్ని పట్టుకు వేళ్ళాడే సమాజంలో అది మూఢ విశ్వాసాల రూపం ధరిస్తుంది, అజ్ఞానం కూడా అనిపించుకుంటుంది

విజ్ఞానం ఇలాటిది కాదు - విజ్ఞానాన్ని మనం 'సత్యం' అంటాం. అది కాలానికీ, ప్రదేశానికీ కట్టుబడినది కాదు - కాలం గడిచిన కొద్దీ దాని సమగ్ర రూపం మనిషికి తెలియవస్తూ పోతుంది జీవితంలో కలిగే మార్పులు విజ్ఞానాన్ని మార్చలేవు దానికి మెరుగుపెట్టవచ్చు - విజ్ఞానాన్ని శాస్త్రం అన్వేషిస్తుంది.

శాస్త్రజ్ఞానం వర్గాతీతమైనది - సామాజికమైనది శాస్త్రజ్ఞానాన్ని పెంపొందించే పని ఒక

కులానికి గాని, వంశానికి గాని అంటగట్టలేం దాని పురోగమనానికి ప్రపంచమంతటా కృషి సాగుతున్నది మనిషి సంఘజీవి అయినది మొదలు శాస్త్రజ్ఞానం అతడికి అడుగడుగునా తోడ్పడింది అయినా మన పూర్వులు వ్యక్తిని ఉద్ధరించే మతాచారాలకూ, పుణ్యపాపాలకూ, ఊర్ధ్వలోకాలకూ, మోక్షానికీ ప్రాముఖ్యం ఇచ్చి, బళ్ళ కొద్దీ చెత్త పేర్చి పెట్టారు. ఇవాళ కూడా అవే ఉద్గ్రంథాలు ఒక కుమ్మరికి గాని, వడ్రంగికి గాని, కమ్మరికిగాని, వ్యవసాయదారుడికి గాని, మరో వృత్తి పనివాడికిగాని పనికివచ్చే గ్రంథం సంస్కృతంలో ఎన్నడూ రాలేదట మార్క్సిజం శాస్త్రీయం కావడం చేతనే మన మధ్యతరగతివాళ్ళు కూడా దానిపట్ల లక్ష్యం చూపారనుకోవాలి మార్క్సిస్టు సూత్రాలను మత సూత్రాలలాగే చూసే మార్క్సిస్టులు కూడా మనదేశంలోనే ఎక్కువేమో.

ఒక్కొక్కసారి మనకు విజ్ఞానంగా కనబడేది విజ్ఞానం కాకపోవటం జరుగుతుంది ఉదాహరణకు, మనం కొత్త చోటికి వెళ్ళి, అక్కడి దిక్కులు తెలుసుకోగోరి నప్పుడు, తూర్పు కోసం సూర్యుడు ఉదయించే దిక్కు చూస్తాం "సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు" అన్నది మనకు సత్యంగా ఉపయోగపడుతుంది. కాని తరిచి చూస్తే "దిక్కు" అన్నది ప్రాంతీయం, సూర్యుడు ఉదయించటం అన్నది పూర్తిగా అబద్ధం ! దక్షిణ ధృవాన ఉన్నవాడికి ఉత్తరం తప్ప మరొక దిక్కులేదు వాడు ఎటు అడుగువేసినా ఉత్తరానికే కదులుతాడు అంతేకాదు ఒకరికి తూర్పుగా ఉండేది మరొకరికి పడమరగా ఉంటుంది, గ్రామాల మధ్య పొలిమేరల్లాగా, భూమి పరిభ్రమించేటప్పుడు మనం ఉండే ప్రాంతం సూర్యకాంతిలోకి వస్తే అదే సూర్యుడు ఉదయించటం

జ్ఞాన విజ్ఞానాలకు తేడా ఉన్నా, సంబంధం కూడా ఉన్నది సామాజిక జ్ఞానం విజ్ఞానానికి వ్యతిరేకంగా ఉండకూడదు, అంటే సామాజిక జ్ఞానం శాస్త్రీయంగా ఉండాలి - లేకపోతే అజ్ఞానం అవుతుంది భారీ ఎత్తున ఆహార పదార్థాలు అగ్నికి ఆహుతి చేస్తే తిండి కరువు పోతుందనేది అజ్ఞానం పార్టీ ఫండ్ పోగు చెయ్యటంలో ఉన్న సౌకర్యం దానిలో ఉంటుందని మాత్రం ఒప్పుకోవచ్చు. అగ్నికి ఆహుతి అయే ముందు ఆహారపదార్థాలు పుష్కలంగా కార్యకర్తల చేతికి అందుతాయి, తరువాత ఏమన్నా కానీ !

విజ్ఞానాన్ని అన్వేషించటంలోనూ, జానంలో సామాజిక శ్రేయస్సుకు అవసరమైన, అనుగుణమైన మార్పులు నిర్ణయించటంలోనూ, అశాస్త్రీయ దృక్పథాలను ఖండించటంలోనూ మానవమేధ నిర్వహించే పాత్రను మార్క్సిస్టులు తక్కువ చేయరాదు మానవుడు అవలంబించే భావజాలానికి వాడి భౌతిక జీవనం పునాది అయితే, ఆ భౌతిక జీవనంలో పరిణతి సాధించటానికి ఆ భావజాలం తాలూకు నూతన చైతన్యమే పునాది ఈ విషయానికి కూడా తగిన ప్రాముఖ్యం ఇయ్యకపోతే మార్క్సిస్టులు పాశవిక మానవుల లాగా ఊహకూ, వాస్తవానికీ తేడా తెలుసుకోలేని స్థితికి దిగజారుతారు

**(సృజన మాసపత్రిక, డిశెంబరు, 1978)**

# 14. మనిషిలో మనిషి - A

"మనిషిలో మనిషి" అన్నమాట చాలామంది వాడేది బాహ్యశరీరం చచ్చిపోయినాక, ఇంకో అంతశ్శరీరం తన జీవితాన్ని కొనసాగిస్తుందన్న విశ్వాసంతో కానేకాదు-మనిషి పైకి వ్యక్తం చేసుకునే బుద్ధులకు భిన్నమైనవి (సాధారణంగా అసభ్యమైనవి) లోపల దాచుకుంటాడని, ఈ రెండురకాల మనస్సులూ స్పృహతో కూడుకున్నవే వ్యక్తికి సంబంధించినంత వరకూ గోప్యంగా వుంచుకున్న బుద్ధులే వాస్తవమైనవి. పైకి ప్రకటించేవి సామాజిక వంచన

అయితే మనస్తత్వవేత్తలు వ్యక్తమూ, అవ్యక్తమూ అని మనసులో రెండు అంతస్థులను గుర్తిస్తున్నారు కాని "అవ్యక్తం" అన్నదాన్ని గురించి శాస్త్రజ్ఞులకే ఏకాభిప్రాయం లేనట్టు కనబడుతుంది ఈ నిర్వచనాలు ఇలా వున్నాయి

1 పైన చెప్పినట్టు మనుషులు సభ్యతకోసం తమలో అణచిపెట్టుకునే "అసలు" భావాలు "అవ్యక్తం"గా ఉండిపోయి, "అండర్ గ్రౌండ్" కార్యకలాపాలు చేస్తాయట అప్పుడు మనిషి సహజ మనస్థితి సభ్యతా నియమాలతో తీవ్ర వైరుధ్యంపొంది, మనిషికి "శారీరక-మానసిక" రుగ్మతలు కలిగిస్తాయట. ఆ జబ్బులను మనోవైజ్ఞానికులు విశ్లేషించి, నయం చేస్తారు

2 ఇంకో నిర్వచనం ఏమంటే, మనసులో ఉండే "చెత్తకుండీ"యే అవ్యక్తమనీ, అందులోకి మరచిపోయిన భావాలన్నీ చేరిపోతాయని, మనిషి వ్యక్తిగత జీవితంలోగాని, సామాజిక జీవితంలోగాని ఈ చెత్తకుండీ లాటి అవ్యక్తం పాత్ర తెలీదు

3 మనిషి యొక్క స్పృహ పరిమిత భావాలతో కూడుకున్నది కాగా మిగిలిన "జ్ఞానం" యావత్తూ నిక్షిప్తమై వుండేది "అవ్యక్తం" అని అలా అయితే, అవ్యక్తం అందరికీ కావాలి, వ్యక్తం మటుకు ఎవరిది వారిది

నిజానికి ఈ నిర్వచనాలేవీ తృప్తికరమైనవి కావు ఎందుకంటే, మనుషులతో ఈ అవ్యక్తం పనిచేసే తీరును గమనించినట్లయితే, వ్యక్తం వెంట ఒక వ్యక్తి వున్నట్టే, అవ్యక్తం వెంట మరొక వ్యక్తి వున్నట్టు నిదర్శనాలు కనిపిస్తాయి. ఈ రెండు వ్యక్తులకు సంబంధం వుండి తీరుతుంది సాధారణంగా, అలాగే తేడా కూడా వుంటుంది - కొన్ని అరుదయిన సందర్భాలలో ఇద్దరు వ్యక్తులకూ ఏమీ సంబంధం లేదేమోనన్నంత తేడా కూడా వుండవచ్చు

ఈ జంట వ్యక్తిత్వాలకు కొన్ని వాస్తవమైన ఉదాహరణలను పరిశోధకులు గమనించారు.

అనేక జీవిత రంగాలలో సృజనశక్తి అద్భుతమైన "రచనలు" చేసిన సంగతి మనకు తెలుసు ఈ రచనలు ఆయా కళాకారుల స్పృహ వెలుపలినుంచి ఉత్పన్నమైనట్టు కనబడతాయి

"కవులు తమ కృతులను తమ తెలివి తేటలతో గాక, ఒక విధమైన ప్రాకృత శక్తితోనూ, ప్రేరణతోనూ చేస్తారనీ, తమ రచనలను తామే అర్థం చేసుకోలేరనీ నేను ఏనాడో కనిపెట్టాను" అన్నాడు గ్రీకు తత్వవేత్త సోక్రటీస్ (క్రీ పూ 470-399)

"ఎంతటి మహాకవి అయేదీ, నేను కవిత్వం రాస్తానని అనలేడు కవిత్వం హేతు బద్ధంగానూ, బుద్ధి పూర్వకంగానూ రాసేది కాదు" అన్నాడు పి బి షెల్లీ (1792-1822)

"మిల్టన్" అన్న కావ్యం రాసిన బ్లేక్ (1757-1827) ఇలా అన్నాడు. "నేనీ కవితని ఎవరో చెబుతుంటే రాసాను తడవకు 12, ఒక్కొప్పుడు 20 లేక 30 పాదాల చొప్పున ముందు అనుకోకుండా, నాకు ఇష్టం లేకుండా కూడానూ"

"హైపెరింబాన్" రచించిన కీట్స్ (1795-1821) ఆ రచనలోని తృతీయ ఖండంలో అరవ పాదంలో వర్ణన "యాదృచ్ఛికంగా, ఎవరో అందజేసినట్టుగా" తనకు లభించిందన్నాడు,

కొన్ని భావాలు తాను రచించిన అనంతరమే వాటిలోని సౌందర్యం తనకు అవగతమయిందనీ, తన రచన మరెవరి రచనలాగో కనిపించి తనకు విస్మయం కలిగించిందనీ కూడా అతనన్నాడు

జార్జ్ ఇలియట్ (మేరియన్ ఇవాన్స్ - 1819-1880) తన ఉత్తమ రచనలన్నీ 'తానుకాని' ఎవరో తనని అవహించగా రాసినవని భావిస్తున్నట్టు జె డబ్ల్యు క్రాస్ అనే ఆయనతో చెప్పింది

"రాసే ముందు నేను ఏమి రాయ బోతున్నదీ నాకు తెలీదు, రాస్తుంటే నాకు తెలియని విషయాలు రాస్తున్నట్టు స్పష్టమవుతుంది" అన్నది మదామ్ గయాన్

"నన్ను సృష్టించినది నా కవితలు, నేను వాటిని కాదు" అన్నాడు గేథె (1749-1832)

తాను రాయటానికి ఉపక్రమించినప్పుడు ఏదో శక్తి తనకు దారి చూపేదని చార్లెస్ డికెన్స్ (1812-1870), తన పాత్రలు ప్రకటించే భావాలు తనను ఆశ్చర్యపరిచేవనీ, ఏదో అతీతశక్తి తన కలాన్ని నడుపుతున్నదా అన్నట్టు తోచేదనీ థాకరే (1811-1863) అన్నాడు

తనకు సలహా ఇయ్యటానికి సొంత "భూతం" ఒకటి వుండి, తన రచన మొరాయించి, తాను మరే విషయమో ఆలోచిస్తున్నప్పుడు, అది పైకి వచ్చి, ఎలా చేస్తే బాగుంటుందో చెప్పేదని కిప్లింగ్ (1865-1936) తన ఆత్మకథలో చెప్పుకున్నాడు (ఈ ఉదాహరణలో "భూతం" స్పష్టంగా మరొక వ్యక్తిత్వం కలిగినట్టు కనబడుతుంది. వ్యక్తంలో జరిగే ఆలోచనలకు అవ్యక్తంలో నుంచి వచ్చే ఆలోచనలు విఘాతం కలిగించిన ప్రతి సందర్భంలోనూ అవ్యక్తం గురించి ఈ కాలపు శాస్త్రవేత్తల నిర్వచనాలు సరికావని స్పష్టమవుతుంది

"ఆలిస్ ఇన్ వండర్ లాండ్"తో జగత్ప్రసిద్ధి సంపాదించిన లూయిస్ కారొల్ (1832-1898) ఒక కొండ ప్రాంతంలో ఉండగా ఒకే ఒక పద్య పాదం తలలోకి వచ్చిందట దానికి అర్థం ఏమిటో ఆయనకు తరవాత కూడా తెలియనే లేదు కాని దానిచుట్టూ ఒక కవిత పుట్టింది (నండూరి సుబ్బారావుగారు మద్రాసులో ట్రాములో పోతుండగా "గుండె గొంతుక లోన కొట్లాడుతాది" అన్న వాక్యం స్ఫురించి, అది కాలక్రమాన ఎంకి పాటలకు దారితీయటం మనకు తెలుసు )

ఇలా అనేక రంగాలలో అనేకమంది సుప్రసిద్ధులు తాము అఖండఖ్యాతిని ఆర్జించగల అద్భుత సృష్టి చేసికూడా, తమ కర్తృత్వాన్ని కించపరచుకోవడం ఎందుకు జరిగిందని మనం ఆలోచించాలి.

వైజ్ఞానిక రంగంలో లార్డ్ కెల్విన్, సాంకేతిక రంగంలో ఎడిసన్, శాస్త్ర సిద్ధాంత బ్రహ్మ ఐన్‌స్టీన్, ఇంకా అసంఖ్యాకులైన ఇతరులు తమ అవ్యక్తాల మీద భారీగా ఆధార పడినట్టు స్పష్టమవుతుంది. సంగీతంలో చెకోవ్‌స్కీ, మొజార్ట్ మొదలైన వారు తమలో ఉన్న "అసాధారణ" మేధస్సుతో సంగీతం సృష్టించారు.

ఒక అంశం గురించి ఉదాహరణలు సంకలనం చేసే అలవాటు పాశ్చాత్యులకు ఉన్నట్టుగా మనకు లేదు అందుచేత మనదేశానికి చెందిన వేలాది ఉదాహరణలు (ఉండే ఉండాలి) నాకు అందుబాటులో లేవు ఉన్న ఉదాహరణలు మన ఆముష్మిక దృక్పథం ధర్మమా అంటూ అనుమానాస్పదంగానూ, నిరుపయోగం గానూ కనబడతాయి మాట వరసకు పోతనగారు, "పలికించెడివాడు రామభద్రుండట" అని ఏ ఉద్దేశంతో అన్నాడు ? పిల్లలమర్రి పినవీరభద్ర కవికి సరస్వతీదేవి స్వయంగా రచించిందన్న కట్టుకథ ఏ కారణంచేత పుట్టింది ? అది అంత గొప్ప లోకోత్తర గ్రంథమేమీ కాదు. "వాణి నా రాణి" అని ఆయన ఏ కారణంచేత అన్నాడట ? స్పష్టంగా తెలీదు

"జీనియస్" అనే మాట వాడతాం - దాన్ని నిర్వచించుతూ FWH మేయర్స్ దానికి రెండు లక్షణాలుండాలన్నాడు, అది స్వతంత్రంగానూ, నవ్య సృష్టిగానూ, అబోధితంగానూ, యాదృచ్ఛికంగానూ ఉండాలి దీనితోబాటు అది జనాదరణ కూడా పొందాలి.

"వ్యక్తం"లోకి వెలుపలి నుంచి ఏదో రావాలి దానికి వ్యక్తం రూపకల్పన చేయాలి ఇతరులు చెప్పినదీ, చదువుకున్నదీ, ఎవరికైనా స్ఫురించదగినదీ, జనానికి పట్టనిదీ జీనియస్ అనిపించుకోదు

పైన వివరించిన ఉదాహరణలనుబట్టి వ్యక్తమూ, అవ్యక్తమూ రెండు ప్రత్యేక బుద్ధి విశేషాలనీ, వాటి వెంబడి రెండు ప్రత్యేక వ్యక్తిత్వాలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయనీ ఊహించవచ్చు.

అయినా రెంటికీ సంబంధం ఉన్నది ఎవరి వ్యక్తం వారిదై అందరి అవ్యక్తమూ ఏక సముద్రం అయితే షెల్లీ సింఫోనీలు రాయవచ్చు ఎడిసన్ నాటకాలు రాయవచ్చు, గుడ్డివాడు చిత్రరువులు చిత్రించవచ్చు కాని అలా జరగదు. వ్యక్తానికీ, అవ్యక్తానికీ డిప్లొమాటిక్ సంబంధాలు ఉన్నాయి ఈ సంబంధాలు ఎలా ఉంటాయన్న దానికి "బుద్ధికొలత" కొంతవరకు సమాధానం ఇస్తుంది

మనం వ్యక్తం అనుకునేది ఇంద్రియాల ద్వారా విషయసేకరణచేసి, జ్ఞానాన్ని పోగుచేసి, వేరు వేరు విషయాల మధ్య సంబంధాలనూ, వైరుధ్యాలనూ నిరూపణ చెయ్యగలదు కాని దానికి అజ్ఞాతాన్ని భావనచేసే శక్తి లేదు అందుకు అది బుద్ధికొలతలో నూతన అన్వేషణలు సాగించి, కొన్ని నూతన నిర్మాణాలు చేసుకోవాలి. ఇందులో వ్యక్తానికి అవ్యక్తం సహాయపడుతుంది. చేపలు పట్టేవాడి ప్రయాణం నీటి మీదనే సాగినట్టుగా, ఎవడి అన్వేషణ ఏ వాతావరణానికి సంబంధించి ఉంటే వాడి బుద్ధి "బుద్ధికొలత" అలాటి వాతావరణాన్నే అన్వేషించడంతో బాటు, దాన్ని తన అవసరాలకు తగినట్టుగా పునర్నిర్మిస్తుంది - తొలికాలపు మానవులు అరణ్యాలను ఛేదించి వ్యవసాయానికి అనువుగా భూ స్వరూపాన్ని మార్చినట్టు.

ఈ పరిజ్ఞానం ప్రతికాలంలోనూ అవసరం. బుద్ధికొలతలో తగిన సృజనాత్మకమైన కృషి జరగకుండా ప్రజలకు పీడన పోదు, ప్రజాతంత్రం రాదు. ధనికుల సంక్షేమం కొరకు బుద్ధికొలతలో నిర్మాణాలు జరిపి, తద్వారా సోషలిజం తెస్తామనే వారు మూఢులు కావాలి, అసత్యవాదులైనా కావాలి. విప్లవాలు రావటానికి కూడా దానికి అనుగుణమైన దోహదం బుద్ధికొలతలో జరగాలి

లోపలి మనుషులు వెలుపలి మనుషులను అవసరమైన దిక్కుగా బుద్ధికొలతలో నడిపించే పక్షంలో మానవజాతి ఎన్ని అద్భుత పరిణామాలైనా సాధించగలదు. గత మానవ చరిత్రలో సాధ్యమైన అద్భుతాలన్నీ "జీనియస్"ను ప్రతిబింబించేవే !

**(రచనా కాలం : 1-12-1978, బుద్ధికొలత పుస్తకంలో అచ్చయింది)**

# 15. మనిషిలో మనిషి - B (టెలిపతీ - భ్రమలూ)

కొద్ది సంవత్సరాల క్రితం నాకు ఒక సినిమా ప్రొడ్యూసర్ - డైరక్టరు విడవకుండా, అకారణంగా జ్ఞాపకం వస్తూ వచ్చాడు నాకే ఆశ్చర్యం వుండేది, అతనితో నాకు పనిలేదు ప్రత్యేకించి అతన్ని గురించి నాకు తెలియవలసినది కూడా లేదు ఇలా కొంతకాలం గడచినాక, అతన్ని గురించి ఆలోచించటం మానేశాను అకస్మాత్తుగా అతను తారసిల్లి, "ఏం కుటుంబరావు ? ఈ మధ్య నువు తెగ జ్ఞాపకం వచ్చావయ్యా !" అన్నాడు. ఇద్దరమూ ఒకరిని గురించి ఒకరం ఆలోచించి వుండాలి ఎవరి మనసును ఎవరు లేపి వుంటారో ఈ నాటికీ తెలీదు అతనికి కూడా నేను నాతో ఏమీ పని లేకుండానే "తెగ జ్ఞాపకం" వచ్చాను

ఈ విధంగా ఒకరి మనను ఇంకొకరి మనసును చైతన్యపరచడాన్ని శాస్త్రజ్ఞులు "టెలిపతీ" అని పిలుస్తూ, అందులో చాలా ప్రయోగాలు చేసారు ఒకప్పుడు "నాన్సెన్స్" అన్నప్పటికీ "టెలిపతీ"ని ఈనాడు నాన్సెన్స్ కింద ఎవరూ జమకట్టటం లేదు ఎందుకంటే శాస్త్రీయంగా ఋజువైన మనఃప్రవర్తనలలో ఇది ఒకటి

నేను ముందు చెప్పిన అనుభవం టెలిపతీకి మంచి ఉదాహరణ కానేకాదు, ఇద్దరు మనుషులు ఒకరినొకరు అకారణంగా తలచుకోవటం తప్ప, ఒకరి భావాలు ఒకరికి అందటం జరగలేదు కాని శాస్త్రవేత్తలు పరిశోధించిన కేసులలో ఒకరి భావాలు ఒకరికి తెలియటమూ, ఒకరి దృగ్భ్రమలు మరొకరు పంచుకోవటమూ కూడా జరిగింది

టెలిపతీకి, భ్రమలకూ సంబంధం వున్నదన్నమాట తరువాత చర్చించుతాం ముందు భ్రమలను గురించి కొంత ఆలోచింతాం

భ్రమలు అందరికీ కలుగుతాయి వాస్తవంగా లేనిది మనసుకు స్ఫురిస్తే అది భ్రమ రజ్జు సర్ప భ్రాంతి అంటారు రజ్జు నిజం, సర్పం భ్రమ ఆ భ్రమకు రజ్జు ప్రత్యక్షంగా వున్నది గదా అనవచ్చు కాని రజ్జు సర్పానికి సంకేతం మాత్రమే.

అలాగే మనం మంచి వర్ణన చదువుతున్నప్పుడు వర్ణించబడిన వస్తువులు- గాలికి ఊగే పైరూ, ఎండలో మెరిసే భవంతులూ, చీకట్లో అస్పష్టంగా దూరాన కనిపించే దీపం, వానలో బురదతోనిండిన మట్టిదారీ, కురిసే ఇళ్లూలాటివి ఎన్నో కనిపించినంతగా భ్రమ కలుగుతుంది కాని అవి ఎక్కడ వున్నాయి ? వాటి తాలూకు సంకేతాలుగా మాటలు మనకళ్ళ ఎదుట వున్నాయి. ఈ సంకేతాల సహాయంతో మనం నవ్వులూ, ఆర్తనాదాలూ, సంగీతాలూ వినగలం కూడా అయినా క్రియకు అంతా భ్రమ

ఈ భ్రమలు ఎవరికివారు సృష్టించుకునేవి కథ చదివేటప్పుడు కథానాయిక వర్ణన ద్వారా అందరికీ ఒకే రకం మూర్తి స్ఫురించకపోవచ్చు. ఈ భ్రమలను అనేకమంది పంచుకోరు కాని మాస్ హిప్నాటిజం చేసేవాళ్ళు ప్రేక్షకులందరిలోనూ ఒకే రకం భ్రమ కలిగించగలరట అందరికీ ఒకేసారి ఒకే రకంగా మంటలు కనిపిస్తాయట.

హిప్నాటిస్ట్ ఎవడూ సమీపంలో లేకుండానే ఒకే భ్రమను పట్టపగలు ముగ్గురు పంచుకున్న సందర్భం ఒకటి జరిగింది

కానన్ బోర్న్ అనే ఆయన తన ఇద్దరు కుమార్తెలతోనూ వేటకు వెళ్ళాడు తండ్రి వేట తొందరలో ముందుకెళ్ళిపోతూ వుంటే కుమార్తెలు తిరిగి పోవాలని బండివాణ్ణి హెచ్చరించారు. కాని అంతలోనే తండ్రి దూరాన కనిపించి, టోపీ ఊపుతూ, రమ్మని వారికి సైగచేసినట్టు కనబడ్డది ఆయన తెల్లగుర్రం ఎక్కి వున్నాడు బట్టలు మట్టికొట్టుకుని వున్నాయి ఆయన టోపీ ఊపుతూ

పిలవడం కూతుళ్ళూ, బండివాడు కూడా చూసారు ఆయనకు ఏదో ప్రమాదం జరిగిందని వాళ్లు ఆయన కనిపించిన దిక్కుగా బయలుదేరారు దారిలో ఒక పల్లపు ప్రదేశం దాటి మెరకకు రాగానే ఆయన జాడ కనిపించలేదు తరువాత వాళ్లు చాలాదూరం వెళ్ళి, ఆయనను కానక ఇంటికి తిరిగి వచ్చారు ఇంతకూ వారు చూసినది భ్రమ ఆయనకు ఏ ప్రమాదమూ జరగలేదు ఆయన వారికి సైగ చెయ్యలేదు, వారిని చూడనుకూడా లేదు ఈ భ్రమ ఆ ముగ్గురిలో ఎవరి మనసులో ఉత్పన్నమైనప్పటికీ మిగిలిన ఇద్దరూ పంచుకోగలిగారు

ఇలాగే ఇద్దరు దంపతులు ఒక కొత్త ప్రదేశానికి పోతూ, వాళ్ళు తాత్కాలికంగా బస చెయ్యటానికి వొక దివ్యమైన లాడ్జిని బస్సులోనుంచి చూశారు వారు ఆగినచోట మంచి లాడ్జిలేదు తాము బస్సులోపోతూ స్పష్టంగా చూసిన లాడ్జికోసం వెనక్కు నడిచి వచ్చారు అలాటి లాడ్జి వారు చూసినచోట లేదు

ఈ రెండు ఉదాహరణలూ స్పష్టంగా టెలిపతీని సూచిస్తాయి ఇలాగే ఇద్దరు ముగ్గురు కలిసి "దయ్యాలను" చూసి, వొకే విధంగా వర్ణించిన సందర్భాలున్నాయి.

వాస్తవానికి సంబంధించిన టెలిపతీ కేసులు అన్వేషించటానికి వీలుగా వుంటాయి ప్రత్యేకమైన చోట్ల పేకముక్కలు చూస్తుంటే ఇంకో గదిలో వున్న మరొకడు సరిగా ఊహించగలిగితే, అది వాస్తవానికి సంబంధించిన ప్రయోగం.

భ్రమలకు సంబంధించిన టెలిపతీలో ప్రత్యేకత ఉన్నది. స్థల కాలాలలో లేని దృశ్యాన్ని ముగ్గురుగాని, ముప్పైమందిగాని ఒకేరీతిగా చూసారంటే అందులో ఒక "వాస్తవికత" ఉన్నది. అది స్థల కాలాలకు చెందిన వాస్తవికత కాదు ఆ దృశ్యం ఒక్క బుద్ధికొలతలో మాత్రమే వాస్తవమై ఉండాలి (ఒకే కొలతలో ఉండే వాస్తవికతను యదార్థమైన వాస్తవికత అని ఒప్పుకోం అది వొక సంకేతం మాత్రమే ఫోటోలో ఒక మనిషి రూపం ఉంటుంది అది వాస్తవంగా మనిషికాదు, మనిషికి సంకేతం )

వాస్తవం కాకుండా వాస్తవానికి చెందిన సంకేతాలు లేకుండా మనకు జరగదు గ్రంధాలలో మనం చదివేది వాస్తవ జీవితం కాదు కాని వాస్తవ జీవితం నుంచి మనం నేర్చుకోలేని సత్యాలు గ్రంధాల నుండి నేర్చుకోవచ్చు గోడల నిడివీ, పెరడు వైశాల్యం, వస్తువుల ధరలూ, ఎన్నికలలో వొక అభ్యర్థికి వచ్చిన ఓట్ల సంఖ్యాలాటివి అన్నీ సంకేతాలే

టెలిపతీలో మెదడు భావ తరంగాలను పంపుతుందనీ, వాటిని మరో మెదడు "రిసీవ్" చేస్తుందనీ, ఈ తరంగాలను కృత్రిమంగా నిరోధించవచ్చుననీ శాస్త్రవేత్తలు ఊహించి, ప్రయోగాలు చేసి, "తరంగాలను" నిరూపించలేక పోయారు వారి ఆలోచనలో స్థలకాల కొలతలే తప్ప బుద్ధికొలత లేదు అలాటి తరంగాలే ఉంటే వొకసారి వొకరి భావాలు వొకరు అందుకోవటం జరిగినప్పుడు అదేపని ఎల్లప్పుడూ జరిగే అవకాశం ఉంటుంది - రేడియో స్టేషను పనిచేసినంతసేపూ రేడియో సెట్ పనిచేసినట్టు ఈ ఉపమానం కూడా సరికాదు - ఇద్దరూ వొకరినొకరు ప్రభావితం చేసుకుంటే, రెండు మనసులు బుద్ధికొలతలో కలుసుకుంటేనే టెలిపతీ సాధనం

బుద్ధికొలతను ఆమోదించకుండా టెలిపతీని నిర్వచించడం విజయవంతం కాదు. భ్రమలేగాక, అనేకరకాల భావన స్థల కాలాలకు అతీతంగా ఉంటుంది. భావన పిచ్చిగా గుర్తింపబడవచ్చు, అపూర్వమైన కళాసృష్టిగా గుర్తింపబడవచ్చు, కాని, అది స్థలకాల పరిమితులలో "వాస్తవం" అనటానికి లేకపోయినా, దాని వాస్తవికతను ప్రపంచం గుర్తిస్తుంది. విశ్వసాహిత్యంలో కొన్ని కల్పిత పాత్రలూ, సన్నివేశాలూ చారిత్రక వ్యక్తులకన్నా, చరిత్రకన్నా కూడా మనుషుల మీద బలమైన ముద్ర వేసాయి

కళలలో సంగీతం కన్నా "అవాస్తవం" మరొకటి లేదు. దానికి మూలాధారమైన స్వరాలు ఏ భౌతిక పదార్థాలకూ సంకేతాలు కావు. సంగీతం ప్రకృతిలో గాని, మానవ జీవితంలోగాని దేనినీ నిర్దేశించదు కాని మానవుడి మనస్సుపై దాని ప్రభావం అద్వితీయం సంగీతం మానవుడి మనస్సులో నవరసాలూ సృష్టించగలదు ఆటవిక దశను దాటని మనుషులు సంగీతంలోనూ, నృత్యంలోనూ రోజుల తరబడి ఓలలాడగలరు తొలికాలపు శ్రమజీవులు సంగీతం ఊతతో శ్రమించారు వేదకాలపు ఆర్యులు సామగానం లేకుండా జీవించలేకపోయారు ఈనాడు మనకు ఉద్గ్రంథాలు ఎన్నయినా ఉన్నాయి కాని అవి "కృతుల"తో పోల్చితే అంత "సజీవం" కావు

సంగీత ప్రభావాన్ని స్థల కాలాలకు పరిమితం చెయ్యటం సాధ్యం కాదు దాని ఫలితంగా కలిగే మానసిక చైతన్యం బుద్ధికొలత లేకుండా సాధ్యం కాదు

**(రచనా కాలం : 3-12-1978, బుద్ధికొలత పుస్తకంలో అచ్చయింది)**

# 16. మనిషిలో మనిషి - C (భవిష్యజ్ఞానం)

స్థలకాల సిద్ధాంతానికి పరిమితమై శాస్త్రదృష్టికి కొరుకుడుపడనిది అప్పుడప్పుడూ కొందరు మనుషులు ప్రదర్శించే భవిష్యజ్ఞానం కొన్ని రకాల భవిష్యజ్ఞానాన్ని శాస్త్రం ఒప్పుతుంది నూరు సంవత్సరాలవైనా ఈనాడు పంచాంగాలు రాసి, గ్రహణాలు గంట లతో, నిమిషాలతో సహా చెప్పవచ్చు అది విజ్ఞానం మీద అధారపడిన విషయం, కాని మనిషి ఏ రోజు, ఎన్ని గంటలకు అంగారక గ్రహం మీద దిగుతాడో ఎవరన్నా చెబితే దానికి విజ్ఞానం ఆదారం కావటానికి వీలులేదు అలాగే ఈనాడు శాస్త్రవేత్తలు, కొన్ని సాంక్రమిక జాత లక్షణాలను బట్టి బిడ్డ ఆయుర్దాయం నిర్ణయించవచ్చు, కాని ఫలానా మనిషి ఫలానా రోజు విమాన ప్రమాదంలో పోతాడు అని చెబితే దానికి విజ్ఞానం ఆధారమని చెప్పలేం చిన్న చిన్న విషయాలలో జ్ఞానేంద్రియాల అనుభవంతో కూడా సమీపభవిష్యత్తు చెప్పవచ్చు మెరుపు మెరిసిన తర్వాత ఉరుము వినిపించటమూ, అన్నం పొయ్యిమీది కెక్కించినాక అది ఉడికి వార్పుకు రావటమూ లాటివి అసంఖ్యాకంగా ఉంటాయి. పాలకోసం ఏడ్చే పాకలేని పసిపిల్ల కూడా, తల్లి బుడ్డిలో పాలు పోస్తూండటం చూసి, ఏడుపు మాని, కాళ్ళూ చేతులూ కొట్టుకుంటుంది, పాలు నోటికి అందబోతున్నాయని దానికి తెలుసు.

ఈ విదంగా విజ్ఞానంగాని, అనుభవంగాని ఆధారం కాకుండా ఎవరైనా భవిష్యత్తులో జరిగేది చెప్పగలిగితే దాన్ని భవిష్యజ్ఞానం అంటారు రుజువైన భవిష్యజ్ఞానం గురించి మనం రెండు, మూడు వైఖరులు అవలంబించవచ్చు - అవి కాకతాళీయ మనవచ్చు, వాటికి సంబంధించిన వార్తలు కల్పనలు అనవచ్చు, వాటికి శాస్త్రీయమైన వివరణ ఏమిటో ఆలోచించవచ్చు అన్నిటిలోకీ కష్టసాధ్యమైనది ఆఖరుది అందుకే హెచ్చుమంది మొదటి రెండూ అవలంబిస్తారు

భవిష్యత్తు గురించి తెలుసుకునే శక్తి మనిషికి ఉండే అవకాశం లేదని వాదించే వాళ్ళవల్ల లోకానికి పెద్ద నష్టం లేదు నిజానికి భవిష్యత్తు గురించి తెలుసుకోవటం ఆధునిక నాగరిక జీవితానికి ఎంతైనా అవసరం. ఫలాని ప్రదేశంలో ఉప్పెన రాబోతున్నదంటే ఆ ప్రదేశాన్ని ఖాళీ చేయించి, జననష్టం తగ్గించవచ్చు. ఏ సందర్భంలో ఏ దిశగా రైళ్ళలో రద్దీ ఎక్కువగా ఉంటుందో తెలిస్తే అటుగా రైళ్ళు ఆ సమయానికి పెంచవచ్చు. ఒక్క ముక్కలో చెప్పాలంటే, ఈనాటి మానవుడి సమర్థత చాలావరకు భవిష్యత్తును తెలుసుకోవటం మీదనే ఆధారపడి వుంది. నాగరిక మానవుడు తక్షణజీవి కాడు

అయితే "అశాస్త్రీయ"మైన భవిష్యజ్ఞానం సరిఅయినదే అయినా అది నిజమైనదని నిరూపణ అయినదాకా దాన్ని నమ్మటానికి లేదు, తీరా రుజువైనాక దాని నుంచి లాభం పొందే అవకాశం లేదు ఆ మాటకు వస్తే శాస్త్రీయమైన భవిష్యజ్ఞానాన్ని కూడా వినియోగించుకోలేని జనం హెచ్చు వచ్చే క్షణం ఏం జరుగుతుందోనన్న వైఖరి అజ్ఞాన చిహ్నం, విధిలో నమ్మకాన్ని సూచిస్తుంది. మనదేశంలో అధిక సంఖ్యాకులు అటువంటివారు తుఫాను వొస్తుందని రేడియో 24 గంటలు ముందుగా హెచ్చరించినా పట్టించుకోక, అనేకవేలమంది తీవ్రమైన కష్టాలకు గురి అయినట్టు పత్రికలలో వచ్చింది

కనక భవిష్యజ్ఞానం - ఒక అసాధారణ శక్తి ఫలితంగా సామాజిక ప్రయోజనం కలదికాదు అది కొందరు వ్యక్తుల కుండే విశేషశక్తిగా మాత్రమే గుర్తింపు పొంది, అన్వేషకులకు దిగ్భ్రమ కలిగిస్తుంది. అయితే ఇటువంటి శక్తి ఉన్నట్టు శాస్త్రీయంగా రుజువు అయింది. దానివల్ల బుద్ధికొలత పాత్ర మరింత స్పష్టమవుతున్నదని నా నమ్మకం (టెలిపతీ ప్రయోగాలు ఒక్కొక్కసారి టెలిపతీని రుజువు చెయ్యలేవు గాని భవిష్యజ్ఞానాన్ని రుజువు చేశాయి ఇక్కడ ఉదాహరణలు ఇయ్యటం లేదు )

భవిష్యజ్ఞానం అనేసరికి ఎటువంటివాడికైనా కలిగే అనుమానం జరగనిదాన్ని గురించి ఎవరు గాని ఎలా తెలుసుకోగలరు ? గతం చచ్చింది భవిష్యత్తు పుట్టలేదు వర్తమానం మాత్రమే స్పృహకు అందదగినది. శాస్త్రీయంగా ఊహించదగిన భవిష్యత్తు - కామన్ సెన్స్‌కు అందేది - ఊహించవచ్చు ఒంటిగంటకొట్టిన గడియారం మరోగంటకు రెండు కొట్టుతుంది ఇంకా పెళ్ళే కాని కన్యకు ఫలానా ఏట ఆడపిల్ల పుట్టుతుందంటే అది ఏ విధమైన భవిష్య జ్ఞానం ? అది నిజమైతే యాదృచ్ఛికం కాదని ఎలా వాదించటం?

ఇక్కడ కొందరు చేసిన సూచన ఒకటి గమనించదగినది "మనం వర్తమానం" అనేది ఏ సందర్భంలోనూ ఒక 'క్షణం' (కాలంలో ప్రమాణం లేనిది) కాదు. ఒక క్షణంపాటు జ్ఞానేంద్రియమూ పనిచేసి స్పృహకు దోహదం చెయ్యడం లేదు అనేక కాంతి తరంగాలు కంటపడితేగాని ఏ రంగో తెలియదు, అలాగే ధ్వని ఎలాటిదో తెలుసుకోవటానికి అనేక శబ్ద తరంగాలు కావాలి మహా విద్వాంసులు కూడా అపశ్రుతి గమనించటానికి కనీసం అరసెకండు కాలం తీసుకుంటారు

ఇద్దరు కూర్చుని ఒక గంటసేపు మాట్లాడితే వారి సంభాషణకి సంబంధించి నంతవరకు ఆ గంటా "వర్తమానమే" అలాగే సినిమా చూసేవాడికి అది నడిచినంతసేపూ వర్తమానమే చిత్రం అకాలంలో ఎక్కడ తెగిపోయినా అది 'మధ్య'లో తెగినట్టే 'పెళ్ళిరోజు', 'పుట్టినరోజు', ఫలానావిడ "పెద్దవాణ్ణి కడుపులో ఉన్న రోజులు", "అశోకుడు రాజ్యం చేసిన" 'కాలం'" ఇవన్నీ కాలంలో ఏకఖండాలుగా మనం వ్యవహరిస్తూనే ఉన్నాం, సందర్భానుసారంగా

కాని మనం నిర్ణయించుకునే కాలఖండాలను నిర్ణయించేది "వ్యక్తం" అనబడే మనిషి మనసు. అవ్యక్తంగా వ్యవహరించే కాల ఖండాలు ఇంతకన్న చాలా పెద్దవి కావచ్చు కొన్ని సంవత్సరాలకు విస్తరించవచ్చు కాని ఏ సందర్భంలోనూ భవిష్యజ్ఞానం అనేక శతాబ్దాలు ముందుకు వెళ్ళినట్టు దాఖలా లేదు

ఉదాహరణకు "సైకోమెట్రీ" అని పరిశోధకులు నిర్దేశించే శక్తి కొందరిలో ఉన్నట్టు కనిపిస్తుంది వాళ్ళు ఎవరి వస్తువునైనా తాకి, ఆ మనిషిని గురించి కొన్ని విషయాలు చెప్పగలరట వాళ్ళు ఎంత ప్రాచీన విషయాలైనా "సైకోమెట్రీ" ద్వారా తెలుసుకోగలిగితే, ఆర్కియాలజిస్టులకు తరుచు దొరికే రాతి పరికరాలను తాకి, వాటిని వుపయోగించిన వారిని గురించి చెప్పవచ్చుగాక ! అయిదు లక్షల నాటి "చేతి గొడ్డళ్ళు" వున్నాయి. వాటిని వుపయోగించినవారి మనస్థితి వగైరాలు తెలియటం శాస్త్రవేత్తలకు ఎంతో ఉపయోగంగా వుంటుంది కాని అది సాధ్యంగా కనబడదు.

దీన్ని బట్టి "మనిషిలో మనిషి"కి వర్తమానంగా కనిపించేది మామూలు స్పృహకు దీర్ఘకాలం అయినా, సాధారణ మనిషి లెక్కలో అంతులేని కాలం మాత్రం కాదు "వర్తమానం"లో జరిగేది చెప్పవచ్చు "భవిష్యజ్ఞానం" దీన్ని మించి పోదేమో పరిశోధకులు ఇంకా దారీ తెన్నూ తెలియని పరిస్థితిలో ఉన్నారు

నా పరిభాషలో చెప్పమంటే భవిష్యజ్ఞానం బుద్ధికొలతలో ఉనికి సంపాదించి ఇంకా శిథిలం కాకుండా ఉన్న జ్ఞానానికే పరిమితమవుతుందంటాను బుద్ధికొలతలో ఇంకా నిర్మాణం కానిదీ, నశించిపోయినదీ ఎంతటి మహత్తర భవిష్య జ్ఞానానికీ అందదు

"భవిష్యజ్ఞానం" అందుకున్న మటుకు జరగబోయేవి కూడా ఉనికిగలవి అనుకోవాలా? అనుకోవాలి వాటి ఉనికి గురించి శాస్త్రీయంగా నిరూపించటం సాధ్యంకాకపోతే అది మన పరిమిత శాస్త్ర పరిజ్ఞానం తప్పు మరోకారణం మన 'అవ్యక్తం' శాస్త్ర నియమాలను ఉల్లంఘించి పనిచెయ్యటం "అక్ష హృదయం" తెలిసిన-శకుంతల 201 అంకెలుగల సంఖ్య యొక్క 23వ "రూట్" అడిగితే, 50 సెకండ్లలో చెప్పిందట అదే 'స్పృహ'తో చెయ్యాలంటే రోజులూ, వారాలూ పట్టవచ్చు కంప్యూటర్

కూడా 59 సెకండ్లు తీసుకున్నదట "కాలం" కొలతలు ప్రయాణించే శక్తిలో వ్యక్తానికీ, అవ్యక్తానికీ గల తేడా దీన్ని బట్టి ఊహించవచ్చు

ఇంకో విషయం మనిషి ఊహించగల ప్రతి సంఖ్యకు ఎన్నో రూట్లూ, పవర్లూ ఇతర విభాగాలూ ఉండవచ్చు కాని పరిణిత మానవుడు అదంతా అవసరజ్ఞానంగా భావించడు పరిణామంలో మానవుడు తన స్పృహను ప్రయోజనకరమైన జ్ఞానానికి మాత్రమే పరిమితంగా ఉండేటట్టు చేసుకున్నాడు తన బుర్రకన్న కొన్ని లక్షలరెట్లు చురుకుగా పనిచేసే యంత్రాలనూ, తన కండరాలకు అసాధ్యమైన పనులు చేసే యంత్ర పరికరాలనూ తనకు బాహిరంగా సృష్టించుకున్నాడు. 201 అంకెలు గల సంఖ్య తాలూకు 23వ రూట్ దేనికి ? సమాజానికి కావలసిన గణితం ఈనాడు కంప్యూటర్లు చేస్తూనే ఉన్నాయి

అయితే శకుంతల లాటివారికి గల శక్తులతో మనకేంపని ? అవి బుద్ధికొలతను అనేక విధాలుగా రుజువు చేస్తాయి. బుద్ధికొలత వాస్తవమని రుజువైనాక మనుషులు అందులో జీవిస్తున్న సంగతి గుర్తించి, దానిలో భవిష్యత్తుకు అత్యవసరమైన 'నిర్మాణాలు' చేసుకోవచ్చు కాలమూ, స్థలమూ ఎంత వాస్తవమో, బుద్ధికొలత కూడా అంత వాస్తవమే

**(రచనా కాలం 7-12-1978, రాతప్రతి,**

# 17. మనిషిలో మనిషి - D (సైకోమెట్రీ)

ఈ శతాబ్ది తొలి సంవత్సరాలలో యూజీన్ ఓస్టీ అనే ఫ్రెంచి వైద్యుడు అసాధారణ మానసిక శక్తులను గురించి పట్టుదలగా ఏళ్ళ తరబడి పరిశోధనలు చేసి, తన అనుభవానికి అందిన అనేక విషయాలను గురించి పుస్తకాలు రాశాడు వాటిలో కొన్నిటిని గురించి మాత్రమే నేను చదివాను వాటిలో "బుద్ధికొలత" రుజువు చేసే అనుభవాలను మాత్రమే వివరిస్తాను డాక్టర్ ఓస్టీ చేసిన పరిశోధనలలో 'సైకోమెట్రీ' ప్రధానంగా కనిపిస్తుంది

ఈ ప్రయోగాలలో 'సెన్సిటివ్'లు అనేవాళ్ళకు 'బుద్ధికొలత'లో తమ స్పృహను స్వేచ్ఛను విహరింపజేసే శక్తి ఉన్నట్టు కనిపిస్తుంది (డా॥ ఓస్టీకి బుద్ధికొలత గురించి తెలుసుననికాదు) పృచ్ఛకులకు ఈ సెన్సిటివ్‌లు గతమూ, భవిష్యత్తూ కూడా చెబుతారు సెన్సిటివ్‌కూ, పృచ్ఛకుడికీ మధ్య "సంపర్కం" కావాలి దానికిగాను పృచ్ఛకుడు ఏం చేస్తాడంటే, తాను ఏ వ్యక్తి గురించి తెలుసుకోదలిస్తే ఆ వ్యక్తి తాలూకు వస్తువు ఒకటి ఇస్తాడు, సెన్సిటివ్ దాన్ని చేత్తో పట్టుకోవచ్చు ఊరికే తాకవచ్చు, లేదా దాన్ని చూడవచ్చు (మన సోదె వాళ్ళు పృచ్ఛకుడికి పుల్లనిచ్చి ఒక చివర పట్టుకోమని రెండో చివర తాము పట్టుకుంటారు )

ఈ వస్తువు 'సెన్సిటివ్' కు ఏ విధంగా ఉపయోగించేదీ పరిశోధకులు అర్థం చేసుకున్నట్టు కనబడదు అది ఉపయోగిస్తుందన్న విషయం అనేక డజన్లసార్లు రుజువైనట్టు తెలుస్తున్నది

తన ప్రయోగాలలో డా ఓస్టీ ఈ క్రింది విషయాలు గమనించాడు

1 సెన్సిటివ్ తాను పట్టుకున్న వస్తువు సహాయంతో తాను చెప్పవలసిన విషయాలు అవగతం చేసుకున్నాక ఆ వస్తువును నిర్మూలించినా నష్టపడకుండా చెప్పేస్తాడు

2. ఆ వస్తువు దేనితో చేసినదైనా ఇబ్బంది లేదు

3. ఇలాటి వస్తువులు ఒకదానికొకటి తాకినా 'సెన్సిటివ్' శక్తి దెబ్బ తినదు

4. ఆ వస్తువు దాని సొంతదారువద్ద ఎంతకాలం ఉన్నదన్నది గణనలోకి రాదు.

5 అది సొంతదారువద్ద ఎంతకాలం నుంచీ లేదన్నది కూడా గణనలోకి రాదు

6. ఆ వస్తువు సహాయంతో దాని సొంతదారు జీవితం సెన్సిటివ్‌కు ఒకసారి అందినాక, అతడు ఆ వస్తువును తన అధీనంలోకి తెచ్చుకోక పూర్వపు విషయాలూ, అది అతను విడిచిపెట్టిన అనంతరం విషయాలూ కూడా చెప్పవచ్చు ఆ వస్తువు అతని వద్ద వున్న కాలంలో జరిగినవే చెప్పగలడన్నది లేదు

"వీటిని బట్టి మనిషి జీవిత వివరాలు ఆ వస్తువులో నిక్షిప్తమై ఉన్నాయనటానికి ఆధారం లేదు 'సెన్సిటివ్' ఆలోచన సరి అయిన దిక్కుగా వెళ్ళిన అనంతరం ఆ వస్తువుతో పని తీరిపోతుంది "ఇది ఎలా సాధ్యమో మాత్రం మనకు తెలియటం లేదు" అంటారు పరిశోధకులు

నేను 'బుద్ధికొలత' గురించి చెప్పటానికి ప్రయత్నించే విషయాలు స్థూలంగా అర్థం చేసుకున్న వారికి ఎవరికైనా పై విషయాలు క్షణంలో అర్థం కావచ్చు

'సెన్సిటివ్' ఉపయోగించే వస్తువు ఆ వస్తువు కలవాడి చిరునామా - బుద్ధికొలతలో ఎడ్రసు దొరికినాక చిరునామా కాగితంతో పనిలేదు. బుద్ధికొలత గురించి ఎలాంటి 'సందేహమూ' లేని వారికి ఆ వస్తువు చేసేపని గారడీలాగా ఉంటుంది ఒకసారి మనిషి ఎడ్రసు దొరికాక, ఆ మనిషి గతచరిత్రా, ఒక్కొక్కప్పుడు భవిష్యత్ సంఘటనలూ (బుద్ధి కొలతలో నిర్ధారణ అయివున్న మేరకు) అవగతమవుతాయి

బుద్ధికొలత గురించి నేను చేస్తూ వస్తున్న ప్రతిపాదనలు డా ఓస్టీ వివరణల ద్వారా ఎంత బాగా రుజువవుతాయో చూడండి (ఆయనకు బుద్ధికొలత గురించి ఆలోచన లేదు ) పన్నెండేళ్ళ పరిశోధనల అనంతరం ఆయన ఇలా అన్నాడు.

"ఇతరుల భవిష్యత్తు గురించి చెప్పగలవారున్నారని నేను రూఢి చేసుకున్నాను. ఇతరుల భవిష్యత్తు అంటే భవిష్యత్తు అంతా అని నా అభిప్రాయం కాదు ఈ మాట నేను రుజువు చేసుకో లేదు."

వ్యక్తం కన్న అవ్యక్తం వర్తమానాన్ని చాలా రెట్లు విస్తరించి చూడగలరు అది మన సాధారణ స్పృహకు భవిష్యత్తు కావచ్చు, కాని అవ్యక్తానికి వర్తమానమే ఇది ఒక పాయింటు, రెండో పాయింటు ఏమిటంటే బుద్ధికొలతలో రచితమై వున్న వాటినే 'సెన్సిటివ్' తెలుసుకోగలడు. అందుచేత 'సెన్సిటివ్'లు ఆదర్శప్రాయమైన భవిష్యజ్ఞానం కలవారనీ, వారిది దైవికశక్తి అనీ అనుకోవడం లేదు.

"భవిష్యజ్ఞానం పూర్తిగా రుజువైనది ఇది వింతగానూ, విపరీతంగానూ, నమ్మదగినది గానూ కాని అది వాస్తవం భవిష్యత్తు గురించిన స్పృహతో కూడుకున్నది".బుద్ధికొలతను భౌతిక వాస్తవం అని గ్రహించిన తరువాత భవిష్యజ్ఞానం, దాని పరిమితిలో ఏ మాత్రమూ అసహజం కాదు

బుద్ధికొలతలో స్వేచ్ఛగా సంచరించగల అవ్యక్తం తాలూకు 'పరిమితులు' కూడా నా బుద్ధికొలత ప్రతిపాదనలను బలపరుస్తున్నాయి. చూడండి, ఓస్టీ అభిప్రాయంలో "మరీ దూర భవిష్యత్తులో జరిగేవి అంత స్పష్టంగా కనబడవు, సమీప భవిష్యత్తులోవి చాలా స్పష్టంగా తెలుస్తాయి " స్థలం కొలతలో మన దృష్టి పనిచేసే పద్ధతికీ, దీనికీ ఎంత పోలిక !

మరో అంశం · కొద్ది దూరంలోనే అయినా రేపు కట్టబోయే ఇల్లు ఇవాళ కనబడదు కట్టుతూ, కట్టుతూ ఉన్న ఇంటి పునాదులు గోడలు సగం లేచిన ఇల్లు యొక్క ఆకారం అస్పష్టంగా కంటికి కనబడుతుంది. బుద్ధికొలతలో "చూసే" వారికి కూడా ఈ విధమైన చిక్కులు ఉన్నాయి.

ఆదర్శవాదులు దృష్టిలో ప్రపంచంలో ప్రతి స్వల్ప విషయమూ ముందే నిర్ణయించి ఉంటుంది కాని బుద్ధి కొలతలో నిర్మాణాలు రూపొందుతుంటాయి, శిధిలమవుతుంటాయి మరోక్షణం జరిగేది కూడా భవిష్యత్తే అని గ్రహించే వ్యక్తానికి బుద్ధి కొలతలో నిర్ధారితమైన విషయాలు ముందే తెలియటం అసహజంగా కనిపించవచ్చు. "ఫలాని పిల్లకు భాద్రపదమాసంలో పెళ్ళి అవు తుంది" అని చెప్పిన దైవజ్ఞుడు భవిష్యత్తులో ఏదైనా చెప్పగలడన్న భ్రమ కలిగి, మూఢ విశ్వాసాలకు బలంగా పనిచెయ్యవచ్చు ఈ మూఢవిశ్వాసం మనదేశంలో కోట్లాది జనాన్ని fatalist గా, జీవితమంతా 'దైవాధీనం' అయినట్టుగా ప్రవర్తింపచేస్తున్నది

బుద్ధికొలతలో భవిష్యత్తుకు పనికివచ్చే నిర్మాణాలు చేయవలసినది మనుషులు - గ్రహాలూ, దయ్యాలూ, దేవుళ్ళూ కాదు అలాంటి నిర్మాణాలు ఒకప్పుడు మతప్రవక్తలు చేశారు, ఈనాడు శాస్త్రవేత్తలు చేస్తున్నారు. ఈనాటి చరిత్ర గతికి మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, మావో లాటివారు బుద్ధికొలతలో తయారుచేసిన నిర్మాణాలు, మజిలీ కేంద్రాలూ కాదనగలవారు ఎవరన్నా ఉన్నారా?

**(రచనా కాలం . 3-12-1978, అముద్రితం)**

# 18. జ్ఞాపకశక్తి

ప్రాణులన్నిటిలోకీ గతాన్ని జ్ఞాపకం చేసుకునే శక్తి నమ్మకంగా ఉన్నది మనిషికి. కనీసం మనం జ్ఞాపక శక్తి అనుకునేది మనిషి మెదడుకే ఉన్నట్టు కనిపిస్తుంది కుక్కలూ, పిల్లులూ, మేకలూ, ఆవులూ లాంటివి జ్ఞాపకశక్తి ఉన్నట్టు ప్రవర్తించే మాట నిజమే నిన్న మన దొడ్లో వచ్చిపడి పూల మొక్కలను మేసిపోయిన మేక ఇవాళ మళ్ళీ వస్తుంది ఒకసారి రాతి దెబ్బతిన్న కుక్క మనం రాయి తీయగానే పారిపోతుంది కాని అది జ్ఞాపకశక్తి కాదు రిఫ్లెక్స్-కండిషన్డ్ రిఫ్లెక్స్ నిన్న మన దొడ్లో మేసిన పూలమొక్కలను గురించి మేక పడుకుని గుర్తు తెచ్చుకోగలదను కోలేం

ఏ ప్రత్యక్ష ప్రేరణ సహాయం కూడా లేకుండా జరిగినదాన్ని జ్ఞాపకం తెచ్చుకోవడమే నిజమైన స్మరణ ఈ శక్తి వుండబట్టే మనిషి యెదుటలేని ప్రమాదాలను గురించి భయపడగలడు అడవిలో జంతువులు పులిని చూడగానే భయంలో స్తంభించిపోతాయి కాని అది ఒక జంతువునుకొట్టి, లాక్కుపోగానే భయం తీరి యెదుటి సంగతి అవి చూసుకుంటాయి అమ్మాయికి యిప్పట్లో సంబంధం కుదరదేమో, అబ్బాయికి యెప్పటికి ఉద్యోగం దొరుకుతుందో - ఈ ధోరణిలో బాధపడే శక్తే కాదు, ఆశపడే శక్తి కూడానూ

అయితే మనం జ్ఞాపకశక్తి అనేది మెదడుతో సంబంధం లేకుండా ఎన్ని రకాలుగా వ్యక్తమవుతున్నదీ గమనిస్తే, మనిషి మెదడుకు గల జ్ఞాపకశక్తి సముద్రంలో కాకిరెట్ట అని తెలిసిపోతుంది

ప్రాణుల శరీరాలలో అనేకవేల రకాల జీవకణాలు ఉంటాయి అవి శరీరంలో ఆరంభం నుంచీ ఉండేవి కావు మధ్యలో వచ్చి మధ్యలో పోయేవి కాని అవి తమ 'జాతి' గుణాలను 'జ్ఞాపకం' ఉంచుకుని తమ ధర్మాలను తూ చా తప్పకుండా నిర్వర్తిస్తాయి (వాటితో పోలిస్తే ఎంత క్రమశిక్షణ గల సైనికుడు కూడా జడ్డి వెధవే !)

ఏ విత్తునుంచి ఆ చెట్టే వస్తుంది జాతి భేదాలను పాటిస్తూ మరీనూ ! తల్లి కడుపులో ఒక్క కణంగా జీవితం ఆరంభించిన బిడ్డ తన తల్లిదండ్రుల శరీర లక్షణాలను కొన్నింటిని మరచిపోకుండా తనలో దాచుకొనడమేగాక, ప్రాణుల పిండదశకు చెందిన పరిణామాన్ని కూడా జ్ఞాపకం చేసుకుంటూ పెరుగుతుంది

చిత్రం ఏమంటే, మనిషి మెదడుకు గల జ్ఞాపకశక్తి ఉజ్జాయింపుగా వుంటుంది కాని మెదడుతో ప్రమేయంలేని ఈ జీవకణాల శక్తి చాలా స్ఫుటంగా వుంటుంది

కొంగ ముక్కూ, దొప్ప చెవులూ, అడ్డతలా, పిల్లికళ్ళూ లాంటి జాత్య లక్షణాలు మాత్రమేకాదు, పిల్లలకు తల్లిదండ్రుల సాంక్రమిక వ్యాధి లక్షణాలు కూడా "జ్ఞాపకం" ఉంటాయట బట్టతలా, మధుమేహమూ, క్షయా, ఉన్మాదమూ లాంటివి జాతి లక్షణాలు కావు వ్యక్తి లక్షణాలు వాటిని కూడా తల్లి గర్భంలో ప్రవేశించిన సంయుక్త జీవకణం జ్ఞాపకం ఉంచుకుంటుంది

ఇంతకన్న విచిత్రం ఏమిటంటే, మన శరీరాలు తమకు జీవితంలో కలిగిన అనుభవాలన్నిటినీ జ్ఞాపకం ఉంచుకునేలాగ కనబడతాయి ఏనాడో తగిలిన గాయాల మచ్చలు చాలా ఏళ్ళ అనంతరం 'పచ్చి' అయినట్టు అనిపించడం చాలా మందికి అనుభవంలో వుండవచ్చు తిరిగి వచ్చేది గాయం కాదు, దాని స్మరణ మాత్రమే.

కొన్ని రకాల మొండి వ్యాధులకు పోస్ట్ హిప్నొటిక్ సజెషన్ ద్వారా నయం చేస్తారు వ్యాధి నివారణ అయినాక అనేక సంవత్సరాలకు ఆ మనిషి మళ్ళీ హిప్నొటైజ్ చేసి, "నీకు

ఫలానవ్యాధి వున్నది' అనగానే ఆ వ్యాధి లక్షణాలను ప్రదర్శించాడట ! "పోయింది" అనగానే ఆ లక్షణాలు పోయాయనుకోండి -

పూర్తిగా నయమైన వ్యాధులను కూడా శరీరాలు 'జ్ఞాపకం' పెట్టుకుంటాయంటే, అణచిపెట్టిన వ్యాధుల మాట వేరే చెప్పాలా ?'

అలోపతీ మందులు అన్ని వ్యాధులనూ పూర్తిగా నయం చేస్తాయనుకునేటందుకు లేదు కొన్నింటిని అణచి పెడతాయి వరసగా నాలుగు రోగాలను 'ఇంగ్లీషు' మందులతో 'నయం' చేసుకున్నాననుకున్నవాడు అయిదో రోగానికి హోమియో వైద్యుల 'పంచదార మాత్రలు' తీసుకుని, అయిదో రోగాన్ని నయం చేసుకుంటూ నాలుగో రోగాన్నీ, దాన్ని నయం చేసుకుంటూ మూడోరోగాన్నీ, తరువాత రెండో రోగాన్నీ విరుద్ధ క్రమంలో తిరిగి తెచ్చుకోవడం హోమియో వైద్యులకు తెలిసిన విషయమే అంటే శరీరం రోగాల లక్షణాలను మాత్రమే గాక, రోగాలనే జ్ఞాపకం పెట్టుకోగలదన్నమాట !

ఇలాంటి సవాలక్ష జ్ఞాపకాలకు మెదడు యెంత మాత్రమూ అవసరం లేదు పైగా మన బతుకూ, భవిష్యత్తూ వీటి మీద ఆధారపడి వుంటున్నది

ఇంకొక చిత్రం ఏమిటంటే, మెదడు జ్ఞానేంద్రియాల సహాయంతో మాత్రమే పని చేస్తుందని అపోహ పడతాం ఇది పరిమితంగా మాత్రమే నిజం ఎందుకంటే కలల్లో కళ్ళ సహాయం అవసరం లేకుండానే మెదడు ఏవేవో దృశ్యాలు చూస్తుంది ధ్వనులు వింటుంది. సంతోషిస్తుంది భయపడుతుంది కలలు కూడా జ్ఞాపకాలేననీ, పగలు చూసినవే రాత్రి కలలు వస్తాయనీ కొందరు అనుకోవచ్చు కాని అది నిజం కాదు కలల్లో ఎన్నడూ చూడని స్థలాలూ, వ్యక్తులూ కనిపిస్తారు కనిపించే దృశ్యాలకూ, మేలుకుని వున్నప్పటి ఆలోచనలకూ బాదరాయణ సంబంధం వుండొచ్చు ! కాని కలల్లో మనం చూసేవీ, వినేవీ స్మరణ అనడానికి ఆధారం లేదు.

ఇన్ని రకాల "జ్ఞాపకాలూ" బుద్ధికొలతలో జరుగుతాయని నా వాదం. బుద్ధి కొలత అంటే అదేదో ఆధ్యాత్మిక మనుకుంటున్నాననీ, దాన్ని నేను భౌతిక ప్రపంచానికి సంబంధించినది అనుకోవటం లేదనీ అనేక మంది మిత్రులు అపోహ పడ్డారు

బుద్ధి కొలత కూడా స్థలకాలాల లాంటిదే. వాటి నుంచి వేరుచెయ్యరానిదీనూ దాన్ని మరొక కొలతగా భావించటానికి గల ఆధారాలు సంగ్రహంగా చెబుతాను

1 విత్తు చచ్చి, అందులోనుంచి చెట్టు వస్తుంది ఆకుపురుగు చచ్చి అందులో నుంచి సీతాకోకచిలుక వస్తుంది గుడ్డు చచ్చి పక్షి వస్తుంది. కాని ఇలాంటి సందర్భంలో 'చావు' అన్నది స్థల కాలాలలో జరిగేది కాదు - బుద్ధి కొలతలో మాత్రమే జరుగుతుంది స్థల కాలాలలో చచ్చిన విత్తుగాని, ఆకుపురుగుగాని, గుడ్డుగాని కొత్త జన్మకు దారి తియ్యవు (వెనకటికి ఎవడో వేయించిన నువ్వులు పచ్చివాటికన్న రుచిగా ఉన్నాయని పొలంలో వేయించిన నువ్వులు జల్లించాట్ట !)

2 స్థల కాలాలకు వర్తించే 'శక్తి' సూత్రాలు బుద్ధికొలతకు వర్తించలేవు. శరీరశ్రమ చేసినవాడు యెక్కువ తిండి తింటాడు బుద్ధిని దీర్ఘంగా వుపయోగించినవాడు చిన్నమెత్తు శక్తిని కోల్పోడు సరిగదా, తిన్నది కూడా అరిగించుకోలేడు వాడికి కావలసింది అదనపు ఆహారం కాదు, బుర్రకు విశ్రాంతి

3 ప్రయోగితమైన శక్తి క్రమంగా ఛిద్రమైపోతుంది కాని ప్రాణుల జీవశక్తి అలా వట్టిపోకపోగా వున్నత రూపాలు తీసుకుంటున్నది ఏకకణ జీవుల నుండి బహుకణజీవులూ, అల్ప ప్రాణుల నుండి పరిణత ప్రాణులూ రూపొందుతున్నాయి

4 బుద్ధి చైతన్యం వున్నత స్థాయికి వచ్చిన మానవుడు స్థల కాలాలకు అతీతంగా

సృష్టి చేయగలుగుతున్నాడు. ఏనాడో రచించిన పుస్తకాలూ, పాటలూ, ఏనాడో బతికిన వాళ్ళ ఫొటోలూ, సినిమాలూ, రికార్డులూ స్థలకాలాలు స్తంభించగా నిలిచిన రూపాలే. బుద్ధికొలతలో స్వేచ్ఛగా సంచరించని జంతువుల మెదళ్ళ నుంచి ఇలాంటివి రావటం సాధ్యం కాదు

5 ప్రకృతిని స్వాధీనపరచుకుని, పరికరాలలో బుద్ధి పూర్వకంగా మార్పులు తెచ్చే శక్తి మనిషి బుద్ధికి మాత్రమే సాధ్యం కావటానికి కారణం అతని మెదడు బుద్ధి కొలతలో ఐచ్ఛికంగా పనిచెయ్యటమే

6. మనసును మనం సరిగా అర్థం చేసుకున్నా, బుద్ధి కొలత అర్థం అవుతుంది. ఒకప్పుడు శాస్త్రవేత్తలు, మనస్సు అనేది జ్ఞానేంద్రియాల ద్వారా మెదడులో కలిగే చైతన్యమే అనుకున్నారని తోస్తుంది కాని ఈనాడు అలా ఎవరూ అనుకోరు చెవులకూ, కళ్ళకూ, ముక్కుకూ, స్పర్శకూ కూడా మనసు అతీతంగా ఉండి తనమానాన తాను ఆలోచించగలదు ఒక్క ముక్క తలకెక్కకుండా చదవగలం కళ్ళ ఎదుట ఏం జరుగుతున్నదీ తెలియకుండా చూడగలం. "వాడి మనసు ఇక్కడ లేదు, ఎక్కడో ఉంది !" అంటాం అది ఎక్కడ ఉన్నా, బుద్ధి కొలతలో అది ఒక ప్రాంతం అవుతుంది.

7 మామూలు మనుషులు తమకు అంతు చిక్కని వాటినన్నిటినీ దేవుడికో, విధికో, కర్మకో అంటగట్టినట్టు, ప్రాణులకు సంబంధించిన అనేక విషయాలను DNA కూ, జీన్స్‌కూ అంటగట్టడం ఆధునిక 'శాస్త్రీయ' పద్ధతిగా వుంటున్నది. కాని అసాధారణ ప్రతిభతో, ఏదో ఒక సాంస్కృతిక రంగంలో ఈడుకు మించిన శక్తులు ప్రదర్శించే గణితజ్ఞులూ, సంగీతజ్ఞులూ ఎలా వస్తారన్నది చెప్పటానికి DNAగాని, జీన్స్‌గాని సహాయపడవు. ఒక ప్రాడిజీకి ఇటు ఏడు తరాలూ, అటు ఏడు తరాలూ ఎడారి కావచ్చు. బుద్ధి కొలతలో ఒక ప్రత్యేక కేంద్రంలో మెదడు విశిష్టంగా పనిచెయ్యడం వల్ల ఈ శక్తి వస్తుందని గ్రహించలేని స్థితిలో, "పూర్వ జన్మ సుకృతం !" అన్నమాటను ఆమోదించవలసిన దుస్థితిలో వుంటాం

8 ఒకప్పుడు బుద్ధి కొలత తాలూకు కొన్ని రంగాలలో చురుకుగా పనిచేసిన వ్యక్తి, ఆ రంగాన్ని విసర్జించిన కొంత కాలానికి, 'ఇప్పుడు అలా పాడలేను', 'అలా బొమ్మలు వెయ్యలేను', 'ఆ గణితం నాకిప్పుడు కొంచెం కూడా అర్థంకాదు' అనటం కద్దు. చిన్నతనంలో చూసిన ప్రదేశాలను పెద్ద అయి పూర్తిగా మరిచినట్టే !

9 కాలధర్మం దాన్ని విశ్లేషించగలవాణ్ణి సృష్టిస్తుందని మార్క్సిస్టులు ఒప్పుకుంటారు న్యూటన్ రోజుల్లో ఐన్‌స్టైయిన్ రాలేదు. మార్క్స్ కాలంలో మావో రాలేదు కాని ఆ యా కాలాల్లో ఒకడే బుద్ధుడు, ఒకడే న్యూటన్, ఒకడే ఐన్‌స్టైయిన్. ఒకడే మార్క్స్, ఒకడే లెనిన్, ఒకడే మావో రావటానికి కారణం ఏమిటి ? నన్నడిగితే ఆ యా కాలాలను తగిన విధంగా బుద్ధికొలతలో బుర్రలు పనిచేసినవాళ్ళే అలాంటి వ్యక్తులుగా వెలిశారంటాను.

10. మనిషి మెదడును బుద్ధికొలతలో అసాధారణంగా పనిచేయించటానికి హిప్నొసిస్ మాత్రమేగాక L S D లాంటి డ్రగ్గులు కూడా ఉండటం గమనించాలి.

**(ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 1-8-1980)**

# 19. ఆఖరి సమాధానం

సమాధానం మామూలు మెదడు బుద్ధికొలతలో అసాధారణంగా పనిచేసే టట్టు చెయ్యటం ఒక ప్రయోజనం అని నా అభిప్రాయం కాదు. బుద్ధి కొలత వెనక భౌతికవాదం లోపించినట్లు చాలామంది ఇంకా భ్రమపడుతున్నారు. ఎల్.యస్.డి తీసుకునే వారిలో చాలామంది అసాధారణ అనుభవాలు కోరిన వారు లేరా ?

(రచన : 12-8-1980)
(ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 5-9-1980)

కృష్ణాబాయిగారికి

దయ్యాలను గురించిన భోగట్టా శాస్త్రీయంగా పరిశోధన జరిగినంతవరకు నమ్మదగినదే. జ్యోతిషం అసలు శాస్త్రమే కాదనిగానీ, పరిపూర్ణమైన శాస్త్రమనిగాని చెప్పే స్థితిలో లేం. వాస్తవమైన అనుభూతులను భౌతికంగా అన్వేషించేదే శాస్త్రం అది జ్ఞాపకం ఉంచుకున్నట్టయితే ఏది ఎంతవరకు శాస్త్రమో, ఏది బొత్తిగా శాస్త్రమే అనిపించుకోదో మనం నిర్ణయించవచ్చు జ్యోతిషం ఒకప్పుడు సమగ్ర శాస్త్రమేమో కాని ఈనాడు కాదు 'దయ్యాలు' అని మనం అనే వాటిలో చాలా రకాలున్నాయి- శాస్త్ర దృష్టితో చూస్తే వీటన్నిటిలోకి నాకు వింతగా కనిపించినవి బతికున్నవాళ్ళ దయ్యాలు ! కొన్ని దయ్యాలకు - Apparitions కు - వాస్తవమైన అస్తిత్వం ఏమీ లేనట్టే కనబడుతుంది. వాటిని మనం ఎలా చూస్తామో సరిగా అర్థం కావటంలేదు ఈ Apparitions ని చూసినవాళ్ళు అసంఖ్యాకంగా ప్రపంచమంతటా ఉన్నారు పునర్జన్మ విషయం ఎటూ తేల్చటం చాలా కష్టం. తమకిందటి జన్మ వృత్తాంతాలు చెబుతూ వచ్చే ఆడ, మగ పిల్లల విషయాలు పత్రికలలో వస్తున్నాయి వాళ్ళు తమ "పూర్వజన్మ వృత్తాంతాలను" పొల్లు లేకుండా చెప్పినప్పుడు కూడా నాకది పునర్జన్మకు తగిన సాక్ష్యాధారంగా తోచటంలేదు. హిప్నాటిజం, టెలిపతీ, ప్రీకాగ్నిషన్, క్లెవయాన్స్, యోగశక్తులు మొదలైనవన్నీ ఒకప్పుడు భౌతికశాస్త్రానికి మింగుడు పడనివే. కాని వాటిని గురించి శాస్త్రీయంగా పరిశోధనలు జరుగుతున్నాయి ఈ పరిశోధనల్లో మొదటి మెట్టు "అలాంటిది ఉన్నది" అని రుజువు చెయ్యటం, రెండో మెట్టు దానికి గల భౌతిక కారణాలు అన్వేషించటం, మూడో మెట్టు పరిశోధనవల్ల ఒక కొత్త శక్తిని హస్తగతం చేసుకోవటం ఇదే శాస్త్ర పురోగమన పద్ధతి

*

ఓల్గాకి

మీ అనుమానాలు నన్ను చాలా confuse చేస్తున్నాయి. సగం confusion పరిభాషకు చెందినట్టు కనిపిస్తుంది అందుచేత నేను basic concepts అనుకున్నవి ముందు వివరిస్తాను.

1 పరిణామంలో అభివృద్ధి చెందుతూ వచ్చినది మెదడు, బుద్ధికాదు. మెదడులో వుండే వైవిధ్యంకన్న బుద్ధిలో వైవిధ్యం చాలా ఎక్కువ ఇది బుద్ధికొలతలో మెదడు పనిచేసే తీరునిబట్టి ఉంటుందని నేను అంటున్నాను చివరకు ఎలుకల్లో కూడా చొరవ అన్నింటా ఒక విధంగా ఉండదని ప్రయోగాలు రుజువు చేస్తున్నాయి. మెదడు మనిషిలో అకస్మాత్తుగా పరిణతికి రాలేదు అది క్రమ పరిణామమే అయితే మనిషిలో జరిగినది విప్లవ పరిణామం. తక్కువ ప్రాణుల మెదళ్ళు బొత్తిగా పనిచెయ్యకపోలేదు కాని వాటి జీవితం హెచ్చుగా instinct మీద ఆధారపడి ఉండేది Bird migration, homing pigeons, భూకంపాలను మనకన్నా ముందు గ్రహించే చేపలు వగైరాలు బుద్ధికొలతలో పనిచేయవలసిందే, స్థలకాలాలు చాలవు

2 జ్ఞానం సామూహికం మనిషి Instinct నుంచి విముక్తి పొంది, దాని స్థానంలో జ్ఞాపకశక్తినీ, భాషనూ, లేఖనాన్ని పెంపొందించుకున్నాడు. సుమేరియా, ఈజిప్టు ఎడారులలోనూ, సింధులోయలోను తొలి నాగరికతలను సృష్టించిన మానవులు వ్యక్తులుగా ఆ పని చేయలేదు. అది సమష్టి (సామాజిక) కృషిద్వారానే సాధ్యమయింది అయితే సామాజిక లేక సామూహిక జీవనం మనిషి సృష్టికాదు చాలా జంతువులు సామూహికంగా జీవిస్తాయి అవి చెయ్యలేనిది సామాజిక పరిణామం సాధించలేకపోవడం. చీమలు లక్షల ఏళ్ళమీద తమ సమష్టి జీవితాన్ని కొంచెం కూడా మార్చుకోలేదు.

3 సృష్టి కొలతలు శాశ్వతమైనవి. బుద్ధికొలతను మనిషి సృష్టించాడనడం కన్న అశాస్త్రీయం ఉండదు బుద్ధికొలత అనేది లేనేలేదంటే ఒక రచనలో, లేక మార్క్సిజంలాంటి సిద్ధాంతంలో లేక క్రైస్తవంలాంటి మతంలో స్థలకాలాలు తప్ప ఇంకేమీ లేదనదలిస్తే బుద్ధికి ఆధ్యాత్మిక ప్రతిపత్తి ఇయ్యవలసి రాదా ?

జ్ఞాపకశక్తి అన్నది ఒక eternal concept అని నా వాదనలో ఎక్కడ వుంది? ఎడారులూ, కొండలూ eternal concepts అవుతాయా ? జ్ఞాపకశక్తి అచ్చగా మన conscious mind కి సంబంధించినది కాదు Hypnotic state లో మనిషి ఏనాడో జరిగినవి vivid గా జ్ఞాపకం తెచ్చుకుంటాడు ఇది mind dimension లో మాత్రమే సాధ్యం

జ్ఞాపకశక్తి అనేది కాలంలో వెనక్కి ప్రయాణం అని ఒప్పుకుంటే అది బుద్ధికొలతలోనే సాధ్యం కావాలి ఎందుకంటే ఒక dimension లో free గా move కావటానికి ఇంకో dimension సహాయం కావాలి. మనం అనేక కోట్లనాటి నక్షత్ర కాంతిని ఈనాడు చూడగలుగుతున్నామంటే అది space dimension లోనే సాధ్యం జ్ఞాపకశక్తికీ, instinct కీ ఒక విషయంలో తేడా లేదు ఒకటి memory of the individual, రెండోది memory of the race ఈ race memory ఎట్లా transmit అవుతున్నదంటే Genes అని చెబుతారు Genes ఏ dimension లో పనిచేస్తున్నాయి - స్థలంలోనా, కాలంలోనా ?

మానవుడు space dimension లో నగరాలు నిర్మించాడు, యంత్రాలు నిర్మించాడు, సముద్రాలను దాటాడు, గాలిలోకి, చివరికి ఆకాశంలోకి ఎగిరాడు కాని ఈ పనులు అందరు మానవులూ చెయ్యలేదు స్థలం కొలతలో కొందరు చేసిన నిర్మాణాలు అందరికీ పనికివచ్చాయి కనీసం పనికిరానున్నాయి అలాగే కాలంలో యుగాలు నిర్మించాడు పాశవికదశ, అనాగరిక దశ, నాగరిక దశ, వీటి తాలూకు అనేక అంతర్దశలూ మానవుడు కాలంలో నిర్మించాడు కాని అందరు మానవులు ఈ దశలో లేరు Kalahari Desert లో రాతియుగం మనుషులున్నారు ఈ దేశంలో మనం యంత్రయుగం వెనుక seat లో కూర్చుని వున్నాం.

అలాగే బుద్ధికొలతలో మహా నిర్మాణాలు జరిగాయి వాటిలో మనం గొప్పగా చెప్పుకునేది మార్క్సిజం మార్క్సిస్టు సిద్ధాంతాలు చదివినవారంతా ఆ పొలిమేరలలో జీవించటం లేదు. ఒకప్పుడు గంగా మైదానంలో కీకారణ్యాలు తప్ప ఏమీ లేనట్టు, మార్క్సుకు పూర్వం మార్క్సిజం లేదు మార్క్సిజం బుద్ధికొలతలోనే రావాలని నేను వాదిస్తున్నాను ఇది అచ్చగా జ్ఞానం సమస్యకాదు గాంధీ మార్క్సు రచనలు చదివి మార్క్సిస్టు కాలేకపోయాడు గాంధీ మెదడు బుద్ధికొలతలో మార్క్సిజాన్ని ఆశ్రయించలేదు Counter espionage వాళ్ళు కమ్యూనిస్టు సాహిత్యం క్షుణ్ణంగా చదువుతారట. దాన్ని జ్ఞానంగా ఉపయోగించరు

మనిషి స్థలకాలాలు ప్రకృతి కొలతలని తెలుసుకున్నాడన్నది సమగ్ర సాహిత్యంకాదు. నూటికి 99.99 మందికి అలాంటి కొలతల అవగాహన ఏ మాత్రమూ లేదు - Relativity మాట దేవుడెరుగు ! Neanderthal తప్పిస్తే తొలి మానవులు ఈనాటి మానవులకన్న ఎక్కువ ఎత్తుగానూ, దృఢంగాను ఉండేవారని శాస్త్రజ్ఞులు చెప్పడంలేదు వాళ్ళ ఆయుఃప్రమాణం తక్కువ. వాళ్ళు అన్నిరకాల అంటు వ్యాధులకు గురి అయ్యేవాళ్ళు

"Any branch of science. . . . are developed by sheer mensity of the prevailing conditions !" ఈ మాట ఎవరన్నారోగాని ఇది పచ్చి అబద్ధం ఏ సైంటిస్టూ ఒప్పుకోడు మనిషి గాలిలో ప్రయాణం చెయ్యాలని తహతహలాడగా విమానాలు రాలేదు. Electrical invention మీద భావినాగరికత ఆధారపడుతుందని ఫారడే కలలో కూడా అనుకోలేదు

All along history a few men built knowledge and the others made use of it కొన్ని discovery లు శతాబ్దాల తరబడి గుంటపూలు పూశాయి.

మానవుడి బుద్ధినీ, నేను బుద్ధికొలత అనేదాన్నీ confuse చేయవద్దు మానవుడి బుద్ధి unstable, chaning, developing and sometimes receding, a strictly socio-historical product దాన్ని condition చేసి ఏ రాతియుగంలో గాని, అనాగరిక దశలోగాని నిలపవచ్చు

చివరకు ఒక సలహా యియ్యాలి ఈ సమస్యను, ఏ సమస్యనూ idealistic attitude తో చూడవద్దు.

మధుసూదనరావు నా రచన మౌలికమైనదనీ, అలాటివి చాలా రాయమనీ రాశాడు జైరామ్ నా భావాలు మార్క్సిజంకు వ్యతిరేకం కాదని రాశాడు నా సిద్ధాంతం మార్క్సిస్టులకు ఉపయోగపడకపోతే దీన్ని ప్రతిపాదించడం ఉత్త distraction and diversion అవుతుంది నా theory మార్క్సిస్టు అవగాహనకు ఎలా తోడ్పడేదీ మధుకి రాశాను కాని మీ విషయంలో మీ సందేహాలే నాకు సరిగా అర్థమైనట్టు నమ్మకం చిక్కలేదు. పైన ఏదో idealistic attitude, confusion of words వున్నట్టు అనుమానంగా ఉన్నది. అయితే అనుమానాలను raise చేసేవారే నాకు ఎక్కువ ఉపకారం చేస్తారు

తవ్వకాలలో ఒక fossil దొరికితే అది ఏ కాలానిదో చెప్పవచ్చు హిమాలయాల మీద sea shells దొరికితే అవి ఎంతకాలం క్రితం సముద్రం అడుగున వుండేవో చెప్పవచ్చు ఒక పుస్తకాన్ని తీసుకుంటే దానికి సంబంధించిన స్థలమూ, కాలమూ వాటితోబాటు బుద్ధికొలతలో దాని స్థానం కూడా చెప్పవచ్చు

ఈ బుద్ధికొలతను పరిగణించకుండా మనం చాలా విషయాలు విశ్లేషించేం దానిలో ఒకటి basis మీద super - structure ప్రభావం ! దీన్ని గురించి మధుకి రాశాను

*

4-10-1977

తోలేటి జగన్మోహనరావుగారి సందేహాలు - నా సమాధానాలు

1. జ్యోతిషం, హస్తసాముద్రికం, ప్రశ్న, సోదె-నిజం కావటం నాకు తెలుసునన్నది అబద్ధం అంటున్నారా ? లేక అవి సమగ్రశాస్త్రాలని నన్ను ఒప్పుకోమంటారా ?

అనుభవాన్ని నిరాకరించటం మార్క్సిస్టు లక్షణమూ కాదు, సైంటిస్టు లక్షణమూ కాదు మన వాస్తవ అనుభవాలకు భౌతిక వివరణ ఇయ్యలేనిది అసమగ్రమైన శాస్త్రం అని నేను అనుకుంటున్నాను. Particle wave theory వచ్చేదాకా శాస్త్రవేత్తలు రెండు సిద్ధాంతాలనూ ఆమోదించవలసి రావటం మీకు తెలిసే వుండాలి.

2. కొన్ని సంఘటనలు "ముందే నిర్ణయం" నిర్ణయించి ఉన్నదనుకోవటం ప్రమాదంతో కూడుకుని ఉన్నదన్న భావం కనిపిస్తుంది. అందులో నాకేమీ ప్రమాదం కనిపించలేదు

మనకు గల శాస్త్రీయ జ్ఞానంతో మనం భవిష్యత్తులో జరగబోయేదాన్ని అనేక వేల సందర్భాలలో ముందే తెలుసుకుంటున్నాం. అటవికుల జీవితం మాట ఏమోగాని, నాగరిక మానవుడు జరగబోయేదాన్ని ఎంత ఖచ్చితంగా తెలుసుకుంటే అంత సార్థకజీవి అవుతాడు పిల్లలు పెరుగుతారు. ఏదో ఒక వృత్తి చేస్తారు. బాలారిష్టాలు వస్తాయి. పుట్టినవారంతా విధిగా చస్తారు రేపు ఇంతమంది రైళ్ళలో పోతారనీ బస్సులో పోతారని ముందుగానే తెలుస్తుంది. ఏ దినాలలో, ఏ

రైళ్ళల్లో, ఏ బస్సులలో జనం రద్దీ పెరిగేదీ ముందుగా అంచనా కట్టవచ్చు ఇదంతా భవిష్యత్తు తెలుసుకోవటం అని మనం అనుకోం ఎందుకంటే అలా ఎందుకు జరిగేదీ తెలుసుగనక ఫలానా జాతకుడికి ఫలానివి జబ్బురోజులు అని జ్యోతిష్కుడు చెబితే దానికి ఆధారమేమిటో మనకు తెలీదు. ఒక్కోసారి జ్యోతిష్కుడు ఆధారమనుకున్నది అబద్ధం అవుతుంది భవిష్యత్తును చెప్పేవాళ్ళు నూటికి ఒకసారి నిజం చెబితే తొంభైతొమ్మిదిసార్లు తప్పు చెబుతారు అందుకే అది అసమగ్ర శాస్త్రమనీ దానికి సరియైన పునాది లేదనీ అన్నాను జ్యోతిష్కులు నిజమయ్యేది chance అనవచ్చు. కాని కొన్నిసార్లు అది one in a million chance అవుతుంది అప్పుడేం చెయ్యాలి నేను స్వయంగా జ్యోతిషంమీద గాని అలాటి ఇతరవాటిమీదగాని ఆధారపడను. ఆధారపడని వారిని తప్పు పట్టను కాని వాళ్ళు దీర్ఘపరిశోధనలు చేసినట్టుగా అవి అబద్ధాలు అంటే వారిది శాస్త్రీయదృక్పథం కాదంటాను There are many things about human physiology about which we do not know but some holymen in India seem to know (actual quotation కాదు) అని Prof J B.S Haldane అన్నాడు అదీ శాస్త్రీయ దృక్పథం. Astrology నీ, palmistry నీ perfect science చెయ్యకపోతే human progress నిలిచిపోదు అది ఉత్త bash అంటే మనం మరింత వేగంగా ముందుకుపోయేదీ లేదు Social Science perfect science కాదని వాదించేవాళ్ళున్నారు. కాని నేను దాని ఆధారంమీద, మిగిలిన Marxists లాగే పెట్టుబడిదారీ పోతుందని జోస్యం చెబుతున్నాను Dogmatism తో పని జరగదు, ఎన్నడూ జరగలేదు

ముందే నిర్ణయించి ఉండటమంటే determinism ను అంగీకరించటమే గతితార్కిక భౌతికవాదం ఏ విధమైన determinism ను ఒప్పుకోదా ? Fertilized egg develop కావటంలో dialectical process లేదా ? ఆ process మనకు తెలియటంచేత అది dialectical కాకుండా పోయిందా ? మీరు మూఢ విశ్వాసాలకు react అయి ఆలోచిస్తున్నారా ? లేక clear scientific reasoning ఉపయోగిస్తున్నారా ?

మనకు కలిగే అనుభవాలన్నిటినీ మనం explain చెయ్యలేనప్పుడు వాటిని separate compartments లో ఉంచి, సమన్వయం సాధ్యమయ్యే జ్ఞానంకోసం ఎదురుచూడాలి, లేదా కృషి చేయాలి ఇది శాస్త్రవేత్తలకే తప్పటం లేదు. 200 potency హోమియో ఔషధంలో actual medicine 1 in $10^{-400}$ ఉంటుంది. ఇది ఏ రూపంలో ఉంటుందో ఏ chemist గాని physicist గాని చెప్పగలడా ? ఆ పొటెన్సీ మందు 3 doses ఇచ్చి 11 ఏళ్ళుగా ఉన్న asthma నయం చేశాను. హోమియో మందులు భౌతికవాదరీత్యా fraud అని నాతో వాదించిన comrades 1945 లో ఉండేవారు తరువాత ఒక కామ్రేడ్ పిచ్చిని పంచదార మాత్రలు నయంచేశాక వాళ్ళ "భౌతికవాదం" ఎగిరిపోయింది అలాంటి భౌతికవాదం నేను చాలా చూశాను.

జరగబోయేది ముందే నిర్ణయమై వుంటే అంటూ మీరు draw చేసిన conclusions ఏవీ నిజంకావు Determinism కూ fatalism కూ తేడా పాటించకుండా మీరు వాటిని ప్రతిపాదించినట్టు కనబడుతుంది ముందు తెలిసి జరిగేవాటికి భౌతిక కారణాలుండవని లేదు. New moon, full moon, seasons వీటిని మనం ఆపలేం గనక fate అంటామా ? లేక మీ వాదనలో నేను గ్రహించలేని తత్వం ఏదైనా ఉన్నదా ? Precognition గురించి శాస్త్రీయ ప్రయోగాలు జరగటం గురించి మీరు విన్నారా ? అది రుజువుకావటం దోపిడీ వర్గాలకు ఎలా లాభం ? (కర్మ సిద్ధాంతానికీ విధిలో విశ్వాసానికీ ప్రజాసామాన్యంలో తేడా లేదు.) తమ కష్టాలకు తమ పూర్వజన్మ కర్మే అనుకునేవాళ్ళు ఎలాగూ దోపిడీని సహిస్తూనే ఉన్నారు వాళ్ళకు, వర్గనిర్మూలన

ఎలా "రాసిపెట్టి" ఉన్నదో శాస్త్రీయంగా చెప్పటంవల్ల విప్లవం వాయిదా పడుతుందా ? అలాటి భాష ఉపయోగించిన లెనిన్, మావోలది మూఢవిశ్వాసమంటారా ఏం ?

న్యూఢిల్లీలో బయలుదేరిన రైలు ఫలానావేళకు విజయవాడ చేరుతుందనటం భవిష్యత్తులోకి చూడటం ఎందుకు కాదు ? రేపు ఫలాని ప్రాంతాలలో భారీ వర్షం పడుతుందని చెప్పటం ఎందుకు జోస్యం కాదు ? ఆ చెప్పటానికి గల భౌతికాధారాలు మనకు (కనీసం చెప్పేవారికి) తెలుసునని మనం నమ్ముతున్నాం గనక. నాగపూర్‌లో మధ్యలో రైలుప్రమాదం జరగటానికి భౌతిక కారణాలే గదా ఉంటాయి ? ఆ సంగతి ముందే జోస్యం చెబితే, చెప్పినవాడు ఎలా చెప్పాడో వాడికీ తెలీదు, మనకూ తెలీదు. అలా చెప్పటానికి వీలులేదు అని బల్లగుద్ది చెప్పేవాళ్ళు తమ భౌతికజ్ఞానం పరిపూర్ణమనుకునేవాళ్ళు అలాటి పరిపూర్ణ జ్ఞానం ఎవరికీ ఉన్నదని నేను ఒప్పుకోను మనం సమగ్ర జ్ఞానంకేసి పోతున్నామని మార్క్సిజం చెబుతుంటే, సమగ్ర జ్ఞానాన్ని సంపాదించామని కొందరు అప్పుడే నమ్మేస్తున్నారు. strange

కాని determinism మీద మీరు చాలా పెద్ద ఊహాగానం చేశారు. అదంతా air castle building లాగున్నది గాని, precognition ఉదాహరణ ఒక్కటి మీ అనుభవంలోకి వచ్చిందా ? మీది dry logic అని తెలిసిపోతుంది.

గతి తార్కిక భౌతికవాదం ఏమి చెబుతుందో మీరిచ్చిన కొటేషన్ గురించి నాకేమీ అభిప్రాయ భేదం లేదు. "Internal and necessary self movement" నిజం "Outside admixture నూ, fanciful ideas నూ నేనూ ఆమోదించను "వాస్తవాలకు అనుగుణంగా సిద్ధాంతాలు ఉండాలి" అని ఒప్పుకుంటాను

నేను ఈ రచనలతో రెండు పనులు సాధించాలని చూస్తున్నాను. ఒకటి, నాకు తెలిసిన మార్క్సిస్టు మిత్రులు కొన్ని dogmatic ideas నుంచి బయటపడి ఆలోచించటానికీ, రెండు, మీవంటి శాస్త్రవేత్తలు నా ఆలోచనా ధోరణిలో అశాస్త్రీయమైన అవగాహనలుంటే చూపుతారనీనూ ఇప్పటికి నా మిత్రులు (ఎమర్జెన్సీలో జైళ్ళకు పోయినవారే) నేను చెప్పేది మౌలికంగా ఉన్నదని ఒకరూ అది మార్క్సిజంకు విరుద్ధంగా లేదని ఇంకొకరూ రాశారు

అందరూ జ్యోతిష్యాన్ని నమ్మండి అని చెబుతున్నట్టు మీకు తోచివుంటే మీరు నా రచనలు సరిగా చదవలేదు. కాని నా దృక్పధం ఎలాటిదో నిర్ణయించుకునే స్వేచ్ఛ పాఠకులకు ఇచ్చేశారు. అయితే మీ వ్యాసాన్ని ఆంధ్రజ్యోతివారు నాకు పంపారు. వారు ప్రచురించరు కాబోలు ప్రచురిస్తే బాగుండేది. మీలాగా ఆలోచించేవారు వందల సంఖ్యలో ఉంటారని గ్రహించలేనంత చచ్చు మార్క్సిస్టును కాను, దీనిమీద మీ అభిప్రాయం నాకు రాయండి చర్చిస్తేగాని నిజం తేలదు

*

25-10-77

డాక్టర్ మిత్రాకి

10-2-78 ఆంధ్రజ్యోతి వారపత్రికలో డా॥ జి మిత్రాగారు నా శాస్త్రీయ చాదస్తం మీద చాలా పెద్ద ఆక్షేపణ తెలిపారు ఆయన విమర్శించిన అసాధారణ అనుభవాలు కొంతవరకు పాత చరిత్ర అసాధారణ అనుభవాల కింద చెలామణీ అయ్యే వాటిలో అబద్ధాలు, మోసం ఉండే మాట నిజమే కాని అలాంటివి వుండవనేది పిడివాదం. అలాంటివి ఉండవని డా॥ మిత్రాగారికి ఎలా తెలుసు ? ఎవరో లేవన్నారు గనక. అదే ధోరణిలో నేను ఎవరో ఉన్నాయన్నారు గనుక నేను నమ్ముతున్నానంటే డా॥ మిత్రాగారు ఒప్పుకుంటారా ? నాకు స్వయంగా డజను అసాధారణ

అనుభవాలు కలిగాయని డా॥ మిత్రాగారికి ఇందుమూలంగా చెబుతున్నాను అయితే నేనూ 'అపనమ్మకంలో' డా॥ మిత్రాగారికి తీసిపోను అందుచేత ఆ అనుభవాలే ఇంకొకరు నాకు చెబితే నేను బహుశా నమ్మను. ఈ ఒక్క కారణం చేతనే ఈ అసాధారణ అనుభవాల పట్ల కొంత శాస్త్రీయ వైఖరి (కేవలం 'నమ్మను గాక నమ్మను' వైఖరి కాదు) ఏర్పరచవలసి వుంది

మరో ప్రశ్న - మార్క్సిస్టుకు ఈ అసాధారణ అనుభవాలతో ఏం పని ? మన దేశపు ప్రజాసామాన్యం మూఢవిశ్వాసాలలో మునిగి తేలుతున్నది మామూలు బైరాగిగాడి దగ్గరనుంచీ దేవుడి అవతారాలైన బాబాల దాకా కృత్రిమ అసాధారణ అనుభవాల గారడీతో జనాన్ని మభ్యపెడుతున్నారు ఈ అనుభవాలకూ వాస్తవంగా అప్పుడప్పుడూ ప్రజలకు కలిగే నిజమైన అసాధారణ అనుభవాకూ తేడా తెలుసుకునే నేర్పు ప్రజలకు వుంటుందనుకోను.

ఒక్క విషయం డాక్టర్ మిత్రాగారు స్పష్టం చేసివుంటే నాకు ఉపయోగంగా వుండేది నేను ఏ మూఢ విశ్వాసాలను బలపరచి సామాజిక దోపిడీకి అవకాశం కలిగించాను ? పారాసైకాలజీ అనేది అంతా అబద్ధమేనా ? పెట్టుబడిదారీ వ్యవస్థను నిలిపి వుంచటానికే పరిశోధనలు జరుగుతున్నాయా ?

"కాలే కడుపుకు గంజినీళ్ళు దొరకనివాడికి ఏ మూఢనమ్మకాలు పిరికితనాన్ని నూరిపోస్తున్నాయో ఆ మూఢనమ్మకాల్ని నాశనం చెయ్యాలని అంటూనే మరో పక్కన వాటికి శాస్త్రీయ ఆధారాలు కావాలి అనడం బుద్ధిజాడ్యం కాదా ?" అంటున్నారు. ఏ మూఢనమ్మకాలకు శాస్త్రీయ ఆధారాలు కావాలని నేను అన్నాను ? అన్ని మూఢనమ్మకాలకూ ఏవో ఆధారాలుంటాయి ఆ ఆధారాలకు కాలదోషం పట్టినప్పుడు గదా అవి మూఢనమ్మకాలయ్యేది ? కాలదోషం పట్టినవాటికి శాస్త్రీయ ఆధారాల సమస్య ఏమిటి ? నేను ముందు మూఢ విశ్వాసాలను నమ్మి తరువాత వాటికి శాస్త్రీయ ఆధారాలు కావాలంటున్నానట ! డాక్టర్ మిత్రాగారు కలలు గన్నారా ? నేను రాసినదానిలో భౌతిక దృక్పథం వున్నదీ లేనిదీ వారు గట్టిగా తేల్చక, 'ఏ కాస్త' భౌతిక దృక్పథం వున్నా నేనే ఆలోచించుకోవాలంటున్నారు.

**(ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 17-2-1978)**

*

**3-3-78**

చలసాని ప్రసాద్‌కి,

మీ నిన్నటి ఉత్తరం అందింది. నా Mind Dimension ideaకు form ఏమిటి ? content ఏమిటి ? నాకు అర్థంగాలేదు. ప్రపంచంలో ఉండే కొండలూ, ఎడారులు, inter stellar distances వగైరాలు Space Dimension కావు, అవి Space Dimension లో ఉంటాయి. Superstructure, భావజాలం etc , ఏవో Mind Dimensions. అసలు Mind Dimension అన్నది scientific concept - Mindless Dimension అన్నది stupidity అన్నట్లే. ఈ concept Marxists కు ఏ విధంగా ఉపయోగిస్తుందన్న విషయం ఆలోచించవచ్చు. Mind Dimension అనేది ఒకటి ఉందా లేదా అని ఆలోచించదలిస్తే ఎంగెల్స్ or మార్క్స్‌ని quote చెయ్యటం వృథా

Memory అనేది ఏమిటి ? దాని existence ఏ Dimension లో ? Human Mind లో అనవచ్చు. కాని అది complete answer కాదు Human Brain లో అనుకున్నా, Brain Space / Time Dimension లోనే exist కావాలి. మనం చాలా విషయాలు

మరిచిపోతాం  కాని కొన్ని పరిస్థితుల్లో పాత విషయాలు జ్ఞాపకం వస్తాయి. అట్లాగే hypnotic state లో కొన్ని విషయాలు పూర్తిగా మరిచిపోయినవి జ్ఞాపకం వస్తాయి. అవి ఏదో dimension లో exist కావాలి. Brain is not Mind, only its instrument

ఇంతకన్నా కూడా explain చేయడం Memory of the Species All lower animals function more with instincts than with a Mind. The dog knows instinctively how to live and behave like a dog What it learns by example is very little This little becomes zero as you go to the lower biological orders Now this Memory of the species is supposed to be codified in the DNA & RNA నా వాదన ఏమంటే ఈ codification Mind Dimenstion లో జరగాలనీ, space-time dimensions దీన్ని explain చెయ్యవనీ

Dimension concepts లేనివాళ్ళు నా Mind Dimension Concept ను Marxism కు ఎలా ఉపయోగించుకుంటారో తెలియటం లేదు If it is too confusing just ignore it. If you can manage without it no need to misunderstand my Mind Dimension Concept

ఈ concept Marxism కు చాలా ఉపయోగమని నేను వాదించటానికి ప్రయత్నిస్తున్నాను So long as the understanding of Marxism is confined to the 'cerebral cortex' of the brain concept & practice of Marxism do not blend fully So long as practice & knowledge are looked upon as seperate things the result will be what are called 'Marxist abortions"

మనకు Mind Dimenstion లో పనిచేసే part of the brain వేరే ఉన్నది. It produces some of the queer qualities of Mind in man prodigies, inspiration, intuition etc , ఇవన్నీ non-material అనీ, spiritual అనీ fool చేసే వాళ్ళున్నారు. They are perfectly material and the operation is more in the Mind dimension. Since we are more attuned to Space-Time they look like mysterious ఇది కాదని చెప్పటానికీ, మన priggish Marxists ని convince చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాను.

Material basis అదృశ్యమయ్యాక savage beliefs ఎందుకు persist అవుతాయి? Mind Dimension కు దానితో సంబంధం లేదా ? అది Space-Time Dimension లో ఉంటుందా ? Material basis లేకుండా space-time లో ఏదన్నా ఉండగలదా ? ఉండగలదని ఏ materialist అయినా పట్టుకుని ఎందుకేడుస్తున్నారు ? దుర్గకు basis stone age తోనే పోయిందే ! దయచేసి ప్రస్తుతానికి Mind Dimension నీ మార్క్సిజాన్నీ కలపకండి రెండూ విడివిడిగా అర్థమయ్యాక కలిపిచూద్దాం.

Engles letter etc , తాపీగా చదివి నేను opinion ఇయ్యవలసిన అవసరం ఉందేమో చూస్తాను

అందర్నీ అడిగానని చెప్పండి. ఉంటాను.

*

12-3-78

చలసాని ప్రసాద్కి,

I am now almost certain that I have been wasting my breath trying to explain Dimension itself, let alone Mind Dimension I tried to explain it to Volga & failed You have read my letters to her besides what I have written and did not get the idea of dimension I shall make one more basic attempt and then leave off

You know the 3 dimensions of space (length, breadth & weight). A straight line has only one dimension, inches and centimeters measure a single dimension Surfaces have 2 dimensions, square feet, acres and hectares measure 2-D space Pints, liters etc , measure 3-D

Now, if a straight line has to make a bend it requires another dimension It can do only in an area If a surface has to bend it can do only in 3-D space I have been trying to explain that bends in space ca occur obly in time & vice versa You hear thunder after it has occurred and see the light of stars after they have left their source - sometimes millions of years later

Similarly space is known to alter only in Time

So the question comes up : how does memory (individual or racial - biological) cut across time & space ? If we are to consider thought as material (as Marxists) what material medium do we provide for their existence Besides simple memory, the sciences can look into the past and visualise how things have been happening on earth, in the universe and in nature We can decide which fossils were earlier and which later, though none belongs to an existing species We can also see into the future and visualise crops in deserts and cities in the wilderness. The poeple who cut down the dense forests in the Ganges valley during the early Iron Age were not mad, they know in advance that the soil can, if cultivated, support huge settlements Marx was not mad when he visualised the end of classes through struggle while class struggle itself was in a chaotic condition

The idea that Ideas are generated only under the necessary material circumstances, seems totally unmarxist for several reasons

1) that Ideas are treated as abstract and not concrete

2) that the idea plays almost no role since the material circumstances - for a change - already exist, and

3) that nature makes man and man does not make nature - all unmarxist assumptions Man has to remake nature and he has been

doing it without the help of thought & knowledge of what he has been doing, in a sort of haphazard way ?

sometimes I am amazed at the published arguments flung at me in the press by pseudo - Marxists  I do not know whether they belong to Virasam, whether they are employed by revolutionary elements to attack every new attempt to promote a Marxist idea. The gentleman who attacked me in Ajweekly is asking Virasam members why they are allowing me to go on  I suppose Virasam will reply if he is not of Virasam or support him if he is.

As I have been making it clear for years, I am not conpetent to go into the politics of Marxists  But I think I can make people extend their ideas of knowledge and matter  Until now I have not had any success with the poeple I want to cooperate with me and help me clarify my ideas  Some fool actually says I want to be ranked with Marx & Einstein ! He and I put together will not be worth a hair of either of those giants. And he pretends to have looked into my mind

I would like to know who else is scanning my letters to you. If I have failed to make clear what is abaolutely clear to me to more than 3 persons, I may as well give up  In any case what I am saying does not seem to be urgently needed by any one.

Sincerely Yours<br>
K K.

*

చినబాబుకి

శ్రీ సి.ఎం చినబాబు ఈ శీర్షిక క్రింద రాసిన దానిలో నన్ను భావవాది కింద జమకట్టారు. కారణం ఆయన భౌతికవాదం అనుకునే దానితో నా వాదం కలవటం లేదు. నా బుద్ధికొలత ప్రతిపాదనను ఇంకా "వాదం" అనటానికి అవకాశం లేదు. నేను బాధపడిపోతున్నది నన్ను మార్క్సు సరసనా, ఐన్‌స్టీన్ సరసనా నిలబెట్టలేదని కాదు నేను చెప్పేది సరిగా అర్థం చేసుకోవడం లేదని మాత్రమే దానికి శ్రీ చినబాబుగారు ఒక నిదర్శనంగా నిలబడుతున్నారు

"పదార్థమా ? చైతన్యమా ? ఏది ప్రాథమికమైనది ? అన్న ప్రశ్నకు వచ్చే సమాధానాల్లో భౌతిక, భావవాదుల మధ్య విభజన ప్రారంభమవుతుంది పదార్థం ప్రాథమికమనీ, చైతన్యం దుర్భరమనీ చెప్పేవాళ్ళు భౌతికవాదులు అంటున్నారు శ్రీ చినబాబు

నాకు తెలిసిన భౌతికవాదంలో ఇది తప్పు. పదార్థం నుంచి దాని చైతన్యాన్ని (శక్తిని) వేరుచేయటానికి వీలు లేదు  Conservation of matter, Conservation of energy అన్న సూత్రాలు రెండూ పోయి, Conservation of energy- matter అన్నదాన్ని భౌతికశాస్త్రం గుర్తించుతున్నది

చైతన్యం పదార్థంతో సంబంధించకుండా వుండగలదని నేను ఎక్కడా అనలేదు.

ఇక సృష్టి కొలతల మాటకు వస్తే స్థలంగానీ, కాలంగాని సృష్టి తాలూకు ఒక కొలత అన్న భావం ఎంతమందికి వున్నదీ నాకు తెలియదు నాతో ఏకీభవించలేనివాళ్ళు నాకు రాసే ఉత్తరాల్లో తమకు 'కొలత' అన్నది సరిగా అర్థం కాలేదని స్పష్టం చేస్తున్నారు

సృష్టిలో ఒక బుద్ధి కొలత అనేది వున్నదనుకోవటానికి నాకు గల ఆధారం చాలా తేలికగానే వివరించాను ప్రతి ప్రాణీ స్థలకాలాలకు కట్టుబడి వున్నది మన శరీరాలు ఒక్క గంట చిన్నవి కాలేవు. అంటే కాలం కొలతలు వెనక్కు పోలేవు అలాగే మనం ఒకే క్షణంలో రెండు ప్రదేశాలలో వుండలేం కాని మనిషి మెదడు కాలంలోనూ, స్థలంలోనూ కూడా స్వేచ్ఛగా పనిచెయ్యగలదు. జరిగినవి జ్ఞాపకం వుంచుకునే శక్తి, శాస్త్రజ్ఞాన సహాయంతో నశించిన ప్రాణికోటిని గురించీ గతించిన మానవ పరిణామ దశలను గురించీ తెలుసుకునే శక్తి మానవ మేధస్సు పని చెయ్యగలదు. అది బుద్ధి కొలతలో పని చేస్తుందని నేను ప్రతిపాదించాను ప్రతి ప్రతిపాదన ఒక 'వాదం' లేక 'సిద్ధాంతం' అనిపించుకోదు అయినా నేను ఇలా ప్రతిపాదించే సరికి నాది భావవాదం అన్న బ్రహ్మాండమైన సత్యాన్ని శ్రీ చినబాబు ఇట్టే కనిపెట్టేశారు

విరసం సభ్యులను వారు నా మీదికి వుసికొల్పుతున్నారు

శ్రీకాకుళం జ్వాలగారు నా కొటేషన్ల ఉపయోగాన్ని అర్థం చేసుకోలేదు నేను సాధారణంగా కొటేషన్లు ఇయ్యను. కొటేషన్లకు విరుద్ధంగా వున్న కొటేషన్ ఇచ్చాను అంతకన్నా మరేమీ లేదు

ఇంకొక్క సంగతి లోకానికి విశదం చేసి ఈ చర్యనుంచి నేను స్వయంగా విరమించుకుంటాను "ఆంధ్రజ్యోతి" వారపత్రికలో నేను వివరించిన అసాధారణ అనుభవాలు నేను కల్పించినవి కావు. అవి అభౌతికవాదం కావు. ఒకప్పుడు దైవిక శక్తులని జనం భ్రమపడినవన్నీ ఇతరులు సాధించగలిగినవేనని రుజువయింది వాటిని నమ్మటమే మూఢ విశ్వాసం అన్న ప్రబుద్ధులు కాదు అలా రుజువు చేసింది వాస్తవమైన ప్రతి అనుభవమూ భౌతికమైనదేనన్న విశ్వాసంగలవాళ్ళు హిప్నటిజంను చికిత్సకు వాడుతున్నారు ఒక ఆడపిల్ల కళ్ళతో చూడకుండా కాగితాన్ని తడివి అక్షరాలు చదవటము చేస్తే, ఇంకా అనేకమంది అభ్యసించి అలా చెయ్యగలిగారు మనం పాశవిక దశ నుంచి చాలా కొద్ది దూరమే వచ్చి వున్నందున మనకు అంత భౌతిక దృష్టి అలవడలేదు. ఎవరి భౌతికదృష్టి ఏ పాటిదో తెలియకుండా ఒకరినొకరు భావ వాదులనటం పెద్ద మౌఢ్యం కాదా !

17-3-1978

*

సృజన సంపాదకుడు

మన మేధావులు తమ మేధస్సును ఎంత మాత్రం బాధపెట్టకుండా చిన్నప్పుడు చదువుకున్న పాఠాలు ఏకరువు పెట్టటం ఎవరికీ అంతగా ఉపయోగపడదు సుదర్శనంగారి భావవాదాన్ని (సహేతుకంగానే) ఖండిస్తూ, "పదార్థం యొక్క ప్రభావం మనస్సు మీద వుంటుంది గాని మనస్సు యొక్క ప్రభావం పదార్థం మీద వుండదు - కాబట్టి పదార్థం, మనస్సు ఒకదాని మీద ఒకటి పని చేస్తున్నాయనడం అశాస్త్రీయం" అని జైరామ్ అంటున్నాడు

ఇది ఎందుకు అశాస్త్రీయమో నాకు తెలియటం లేదు. దారే పొయ్యేవాణ్ణి ఆపి 'వెధవా !' అని తిట్టితే వాడి మనస్సు యొక్క ప్రభావం బుర్రమీదా, రక్త ప్రసరణం మీదా, హృదయ స్పందనం మీదా ఎలా ఉంటుందో చిన్న పిల్లలకు కూడా తెలుసు. ఇంతకన్న గంభీరమైన విషయం తీసుకున్నట్టయితే superstructure ప్రభావం base మీద ఉంటుందని మార్క్సిస్టులు ఎలా నమ్మగలుగుతున్నారు ? ఏ మనస్సు ప్రభావమూ లేకుండానే ఎడారుల్లో తొలి నాగరికతలు

వెలిశాయా ? మానవ చరిత్రలో సామాజిక విప్లవ దశలన్నీ ముందు భౌతికంగా జరిగిపోయి, తరువాత మనస్సులు ప్రభావితాలయాయా ?

"పదార్థానికీ చైతన్యానికీ వున్న సంబంధం పైనా, వ్యత్యాసంపైనా రచయితకు శాస్త్రీయమైన అవగాహన లేదు పదార్థానికీ, చైతన్యానికీ సంబంధమూ వుంది. వ్యత్యాసమూ వుంది పదార్థం మనస్సుకు వెలుపల వున్న భౌతిక అస్తిత్వం చైతన్యం ఆ పదార్థ అస్తిత్వం యొక్క ప్రతిబింబంతో మెదడు యొక్క పరిణామక్రమంలో ఉద్భవించిందే"

మెదడు యొక్క పరిణామ క్రమమూ, బాహ్య పదార్థ అస్తిత్వం యొక్క ప్రతిబింబమూ కాక చైతన్యాన్ని నిర్ణయించేవి ఇంకేవీ లేవా ? మెదడు యొక్క పరిణామ దశ పరిణిత మానవులు - Homo sapiens అందరిలోనూ ఒకే విధంగా ఉంటుంది ఒకే బాహ్య భౌతిక ప్రపంచాన్ని తమ మెదడులో ప్రతిబింబించుకున్న వారందరి చైతన్యమూ ఒకే రకంగా ఉంటుందా ? అలా అయితే మార్క్సిస్టు సాహిత్యమంతా ఎందుకు ? వర్గ పోరాటాలకు ఆధారం ఏమిటి ?

చేతులు ఉపయోగించటం ద్వారా మనిషి మెదడు పెరిగిందని మార్క్సిస్టులతో బాటు బూర్జువా శాస్త్రవేత్తలు కూడా ఒప్పుకుంటున్నారు మెదడు యొక్క పరిణామం ప్రభావం చైతన్యం మీదా, చైతన్యం ప్రభావం ఆచరణ మీదా, ఆచరణ ప్రభావం తిరిగి చైతన్యం మీదా ఉంటుందన్న మాట స్పష్టం. పెట్టుబడిదారీ యుగపు భౌతిక స్వభావాల ఆధారం మీద గాని వర్గరహిత సమాజ భావాలు ఉత్పన్నం కావటం సాధ్యం కాలేదు. గతితార్కిక భౌతికవాదం ఆధారం మీద గాని వర్గ రాహిత్య కార్యక్రమానికి పునాది ఏర్పడదు

మావో ప్రతి మార్క్సిస్టునూ 'అద్వైతం' (monism) సాధించమన్నాడు మన మార్క్సిస్టులు కొంత భౌతికమనీ, మానవ జ్ఞానానుభూతులలో కొంత భౌతికం కాదని వాదించటం చిత్రంగా వున్నది

**(సృజన, మాస పత్రిక, ఏప్రిల్, మే, 1978)**

*

జైరాం

ఆగస్టు 'సృజన' లో జైరాంగారు నాకు రాసిన సమాధానం చూశాను. సుదర్శనం గారి 'భావ'వాదం నిశ్చయంగా తప్పే మనసుకు స్పృహకలిగించే పదార్థమే వాస్తవం కనుక మనసే గొప్పది అన్న ధోరణిని చిన్నపిల్లలు కూడా ఆమోదించరు ముందు పదార్థం ఏర్పడి, తరువాత పదార్థంతో కూడిన మెదడు సహాయంతో మనసు పనిచేస్తున్నదన్నది కూడా ఎవరూ కాదనరు సుదర్శనంగారు "పదార్థానికీ మనస్సుకూ సంబంధంలేనట్లు రెండూ పూర్తిగా వేరువేరు అయినట్టు' ' గందరగోళ పరిచారని విమర్శిస్తూ, అనుకోకుండా జైరాంగారు మళ్ళీ అదే పనిచేస్తున్నారు - చూడండి

"ఎడారుల్లో తొలి నాగరికులు వెలియడానికి మనస్సు ప్రభావమే కారణమంటారా ? పదార్థానికి అతీతంగా ఉన్న మనస్సు ప్రభావమా అది ?" అని అడుగుతున్నారు

పదార్థానికి అతీతంగా మనస్సు ఉంటుందని నేననలేదు కాని సరికొత్త చైతన్యానికి వెనక నూతన మానసిక చైతన్యం ఉంటుంది ముందు శిల్పంగాని, రచనగాని వచ్చి అటు తరవాత దానికి సంబంధించిన భావం రాదు. తొలి నాగరికతలు ఏర్పడిన నాటికి వాటికి నమూనా లేదు అవి యాదృచ్ఛికంగా వచ్చినవీ కావు అంటే ఎవరి మనసులోనో వాటి ఉత్పత్తికి తగిన కల్పనా, ప్రేరణా ఉన్నాయన్న మాటే గద విప్లవ చైతన్యం లేకుండా విప్లవం రాదని మనం

అనుకోవటం లేదా ? ఇనుప ముక్కను అయస్కాంతంగా మార్చాలంటే దానిలోని 'నలుసు' లన్నిటినీ ఏకోన్ముఖం చెయ్యాలి. ఇందులో వితర్కించదగినది ఏమీలేదు.

అసలు పాయింటు ఏమంటే తొలి నాగరికతలను భావించిన మనసులు పూర్వానుభవంతో సంబంధం లేకుండా మనుష్యుల తలలోకి దిగినవి కావు. భౌతికమైన మార్పులు జ్ఞానంలో కలిగే మార్పులకు కారణాలూ, ఫలితాలూ కూడా అవుతాయి నేను జైరాంగారిని ఎదురు అడుగుతాను. తొలి నాగరికతలకు మనస్సు ప్రభావం కాదంటారా ? జైరాంగారు అడిగిన ప్రశ్న ఆయనకు తెలియకుండానే మనస్సునూ, పదార్థాన్నీ, ఏదో ఒక స్థాయిలోనైనా, వేరుచేసి చూస్తున్నాదను కోవటంలో నేను పొరపడ్డానా ?

"వెధవా అనే తిట్టు చేతనత్వంలేని ప్రాణిపై పనిచెయ్యదు ఉదా శవంపై "

తిట్టు శవంమీదా, గోడమీదా, నక్షత్రాల మీదా పనిచేసే సమస్య ఎందుకొచ్చిందీ ? శవానికి మనసు లేదు గద నేను మాట్లాడుతున్నది తిట్టుతిన్నవాడి మనసు వాడి శరీర పదార్థం మీద కలిగించే ప్రభావం గురించి శవం ఉదాహరణ అనవసరం

"ఒక అర్థాన్ని మరొక అర్థంగా, ఒక సందర్భాన్ని మరొక సందర్భంగా, ఒక విషయాన్ని మరొక విషయంగా తీసుకొని రకరకాల వ్యాఖ్యానాలు అలానే తయారవుతున్నాయి" అన్నారు జైరాంగారు దీనితో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ఈ అయోమయం నేను సరిచెయ్యటానికే ప్రయత్నిస్తున్నాను గాని, పెంచటానికి ప్రయత్నించటం లేదు కాని అందరి గ్రహణశక్తీ ఒకే విధంగా ఉండదు గదా !

*(సృజన మాసపత్రిక, సెప్టెంబరు, 1978)*

*

అల్లం రాజయ్యగారికి,

నమస్కారం మీ 24 ఉత్తరం కూడా ఈ పూట అందింది మీ కిందటి ఉత్తరానికి సమాధానం ఏమీ లేదనిపించింది దానికి తోడు నా ఎడమ కాలు అకస్మాత్తుగా అవిటిదైపోయి, కదలలేకపోయాను 5, 6 రోజులు ఎక్కడికీ పోలేదు జబ్బేమిటో తెలీదు. డాక్టరు ఏదో మందు లిచ్చాడు. ఇప్పుడు మామూలుగానే ఉన్నది

పారా సైకాలజీ మీద నేను రాసినది పూర్తిగా హేతుబద్ధంగా ఉన్నదని ఆంధ్ర యూనివర్సిటీ సైకాలజీ డిపార్టుమెంటు లెక్చరరు ఒకరు ఒప్పుకున్నారు నా భౌతిక దృష్టి "నిర్దుష్టం' ' అని కూడా ఆయన రాశారు. ఆయన మార్క్సిస్టులాగా కనిపిస్తుంది. ఎందుకంటే నా బుద్ధి కొలత మార్క్సిస్టు దృక్పధంతో ఎలా అతుకుతుందని అడిగారు చెప్పాను

మన మార్క్సిస్టులు చాలామంది తమకు తెలియకుండానే డాగ్మటిస్టులు. డా. మిత్రాలాంటి వారికి సరి అయిన భౌతిక దృష్టి ఉన్నదా అన్న అనుమానం నాకు లేకపోలేదు. అయితే వారి చిత్తశుద్ధిని శంకించడం పొరపాటు అవుతుంది నా జవాబులో నేను ఏది "ఒప్పుకున్నానో" తెలీదు నా అభిప్రాయాలను కొంచెం కూడా సంస్కరించవలసిన అవసరాన్ని ఎవరూ ఇంకా కలిగించలేదు అది నాకే నష్టం ఎందుకంటే జ్ఞానం పదునెక్కటానికి సంస్కారం పొందాలి

పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు చెప్పినదే కార్ల్‌మార్క్స్ కూడా అన్నాడు పెట్టుబడిదారీ సంస్కృతి తన స్వార్థం కోసం తయారు చేసుకున్న సౌకర్యాలు విప్లవానికి తోడ్పడతాయని ! మార్క్సిస్టు సాహిత్యాన్ని బూర్జువా పబ్లిషర్లు లాభాల కోసం అచ్చు వేస్తారు. అదే వారి ప్రయోజనం ఏ

మేరకు అనేదానికి ఎవరు సమాధానం చెప్పగలరు 30 శాతం లాభం కోసం పెట్టుబడిదారీ ఆత్మహత్య కూడా చేసుకుంటుందని కార్ల్‌మార్క్స్ "కాపిటల్"లో అన్నాడు; ఆ మేరకు !

మార్క్స్ అదనపు విలువ సిద్ధాంతానికీ ఫ్రాయిడ్ సిద్ధాంతాలకూ ఏమిటి సంబంధం ? ఏమైనా ఉందేమో నాకు తెలీదు ఫ్రాయిడ్ విశిష్ట వ్యక్తి వాదమే ఆ మాటకు వస్తే పారాసైకాలజీ కూడా అంతే. దాన్ని సామాజిక ప్రయోజనాలకు ఎలా ఉపయోగించుకోవాలో చెప్పినవారు లేరు యోగమూ, హిప్నటిజం, అసాధారణ శక్తులూ అన్నీ విశిష్ట వ్యక్తివాదానికి చెందినవే అనాలి. అంత మాత్రాన అవి శాస్త్రీయం కావనక్కర్లేదు.

చలంగారు భౌతికవాది అవునా, కాదా అన్న ప్రశ్నకు తావు లేదనుకుంటాను. ఆయన ఇతర లోకాలను నమ్మలేదు భౌతిక సమస్యలకు ఆధ్యాత్మిక పరిష్కారాలు బలపరచలేదు ఆడది స్వేచ్ఛగా వ్యభిచరించినంత మాత్రాన ఏమీ తలకిందులు కాదన్నది ఒక విధంగా పచ్చి భౌతికవాదం. అయినా ఆయన భౌతికవాదంలో ఒక "విశ్వదృష్టి" లేదు. పరిణామాల అవగాహన లేదు. పదార్థం కన్న మనసుకు ఒక విధమైన ఆధిక్యత ఉన్నట్టు భావించాడు భావవాది లక్షణం గద !
28-6-1979

*

కె వి.ఆర్.

1. "హృదయం, అనుభూతి అనేవాటికి ఆధారం జ్ఞానం. దానికి భౌతిక ఆధారం ఉంటుంది. జ్ఞానానికి భాష పునాది భాషలో చెప్పటానికి లేనిది అనుభూతి కాజాలదు అయితే nonsensory ideation (ఇంద్రియేతర భావనిర్మిత - కె.వి ఆర్ ) అనేది ఉన్నట్టు psychologists (మనోవైజ్ఞానికులు - కె.వి ఆర్.) ఒప్పుకుంటారు కానీ ఆదికవులు చెప్పే అనుభూతి కాదు. Social man (సమాజ జీవి అయిన మనిషి - కె వి ఆర్.) సంచిత జ్ఞానంతో ముందుకు పోతున్నాడు ఈ జ్ఞానం అనుభవం నుంచే అనాదిగా వస్తూ, పెంపొందుతూ, భౌతికావసరాలకు అనుగుణంగా మారుతున్నది గతం అనుభవమైతే భవితవ్యం భావన అది ఆశాజనకంగా వుండాలన్నది అభ్యుదయ దృక్పధానికి గీటురాయిగదా. మనిషి జీవితాన్ని పొదిగివుండే super structure (ఉపరితల నిర్మాణం - కె.వి ఆర్.) కళలు వగైరాలనుంచి ఆశాభావాన్ని బలపరిచే భావాలూ, చైతన్యాన్ని పెంపొందించే భావాలూ ఆనందాన్ని యిచ్చేవి, ప్రయోజనకరమైనవీనూ. ఆదిమ వాసులు వాన నృత్యాలు, వేట నృత్యాలు మొదలైన వాటిద్వారా ముందుగానే ఆత్మవిశ్వాసాన్ని బలపరచుకొని చైతన్యం పొందేవాళ్ళు ఇప్పటికీ Social man ఈ పనే చేస్తున్నాడు. రావలసిన జీవితపు మార్పులను ముందుగానే రూపకల్పన చేస్తూ, అందుకోసం త్యాగాలు కూడా చెయ్యగల స్థితిలో వున్నాడు.

2 "కళాభిరుచీ, విజ్ఞానమూ ఒక జాతికి చెందినవి కావని నా నమ్మకం ముఖ్యమైన తేడా కళాభిరు మనిషికి లోగడ వుండిన అనుభవం ఆధారంతోనూ, జ్ఞానం ఆధారంతోనూ కలుగుతుంది విజ్ఞానం కొత్త సత్యాలను కనిపెట్టుతుంది. (విజ్ఞానం = truth) కళాభిరుచి వాస్తవికత నుంచి తృప్తి చెందుతుంది విజ్ఞానంలో వాస్తవికత అనుమానం నిరూపణ కావలసినది

"నా దృష్టిలో కళలవల్ల కలిగే ఆనందం అచ్చుగా స్పృహనుంచి (conscious నుంచి) కలుగదు. unconscious & conscious minds కలిపి పనిచెయ్యగా కళలకు సంబంధించిన ఆనందం కలుగుతుంది. (ఇది అన్నిరకాల ఆనందానికీ వర్తిస్తుందని నా నమ్మకం)

3 "మెదడు సాధనం. జ్ఞానేంద్రియాలు పొందే అనుభూతిని మనస్సుకు అందించగలదు

- చైతన్యవంతంగా వున్నప్పుడు, రోగగ్రస్తమైనప్పుడు భ్రమలు కూడా కలిగించగలదు సుషుప్తిలో నిరుపయోగంగా కూడా వుండగలదు వేల, లక్షల అనుభవాలను వర్గీకరించి, అన్వయించి, భావజాలాన్ని సృష్టించగలది మనసు spirit అనే మాటను నేను మనస్సుకి వాడను. అది నా బుద్ధికొలత సిద్ధాంతానికి సంబంధించినది active గా (క్రియాశీలంగా కె వి.అర్.) mental structures కల్పించి మనిషి పురోగమనానికి కావలసిన idealogies (భావజాలాలు) ను రూపొందించగలది spirit మనసు ఒక ప్రత్యేకమైన పద్ధతిలో పనిచేస్తేనే కాని ఇది సాధ్యంకాదు దాదాపు అందరికీ మనస్సుంటుంది మనస్సును పెంపొందించుకునేది వేరు - spirit పెంపొందించుకోవటం వేరు

4 "అతీంద్రియానుభూతులు అనేవి మనం సాధారణంగా అనుకునేవి కావేమో. అసాధారణ శక్తులు అభ్యసించి అందరూ అలవరచుకోవచ్చుననేటందుకు ఆధారం వున్నది ఏమీ అలవరచుకోకుండానే hypnotic stage (మనో వశీకరణ దశ . కె.వి అర్.) లో మామూలు మనుషులు అసాధారణ దైవిక మానసిక శక్తులు - ఎలాగూ నయంకాని రోగాలు నయం చేసుకోవటం సైతం - సాధించవచ్చునని ప్రయోగాలు రుజువు చేశాయి

"పోతే అతీంద్రియ శక్తులనేవాటికీ nonsensory ideation అనేదానికి సంబంధం వుండవచ్చు. ఉదాహరణకు ఒకాయన ఉయ్యూరునుంచి బెజవాడ వచ్చి, ఉత్తరదేశానికి టిక్కెట్టు కొనబోతూ ఏ కారణము లేకుండానే తెనాలికి టిక్కెట్టు కొని, ఆ క్రితం రాత్రి చనిపోయిన తన తండ్రి శవాన్ని తెనాలిలో చూశాడు ఇది ఇంద్రియాల-అంటే మెదడు సహాయం లేకుండా తెలుసుకోవడం ఇలాటివే పలువేల సంఖ్యలో నమోదు అయినప్పుడు ఇంద్రియాతీతమైన తెలివిడి వున్నదన్నది నిర్ధారణ అవుతుంది నిర్ధారణ అయినాక కూడా Right hunches & wrong hunches (సరైన లేదా సరికాని ముందు తెలివిళ్ళు - కె వి అర్.) వుంటాయి. వాటిని రుజువు చేసుకున్నాకనే ఇంద్రియాతీత జ్ఞానం నిజమైనదని రుజువవుతుంది ఈ కారణంచేత సామాజిక జీవనానికిది నిరుపయోగం సరియైన Prediction (జోస్యం - కె.వి అర్.) ఇచ్చినవాళ్ళు లక్షలమంది వుండవచ్చు తప్పుడు prediction ఇచ్చినవాళ్ళు కోట్లసంఖ్యలో వున్నారు. వారుగాని, వీరుగాని జీవితాన్ని తీర్చిదిద్దినట్లు రుజువులేదు అతీంద్రియానుభూతులు లేనేలేవనే వాళ్ళవల్ల నష్టంకూడా కనబడదు

5 "అవ్యక్త చైతన్యం చాలా శక్తివంతమైందని స్వయంగా నేను నమ్ముతున్నాను. కాని దాన్ని organise (క్రమబద్ధం - కె వి.అర్ ) చేసే మార్గం లేదు చరిత్రలో గొప్ప తాత్విక విప్లవాలు కలిగించినవారూ, మత ప్రవక్తలూ విజ్ఞానంలో కొత్త మార్గాలు ఆవిష్కరించినవారూ ఆ అవ్యక్త చైతన్యం పొందినవారనే నా నమ్మకం ఈ అవ్యక్త చైతన్యం అప్పుడప్పుడు జంతువులు కూడా ప్రదర్శించటం జరుగుతుందని నా అనుమానం అలాంటి జంతువులు స్వజాతి లక్షణలను మించి ప్రదర్శిస్తాయి వాటి ప్రవర్తనకు భౌతికాధారాలు లేవన్న భ్రమతో ఆ జంతువులకు దైవత్వం అంటగట్టేవారున్నారు అవ్యక్తం కూడా పూర్తిగా భౌతికమే.

***(23-7-1979)***
***(అరుణతార 3-3, ఏప్రిల్ జూన్ 1980)***

మద్రాసు
30-7-80

నటరాజ్‌గారికి,

నమస్కారాలు బసవరాజుగారు (జ్యేష్ఠ) నన్నూ నా భార్యను కూడా transcendental meditation initiate చేశారు నా mind dimension theory కి ఎంతో లాభం కలుగుతుందనుకొని అయిదారు నెలలు యించుమించు regular గానే చేశాను. తరువాత ఆరోగ్యం బాగా పాడయింది ఆసుపత్రిలో చేరాను. TM మానేశాను నా భార్య మొదట్లోనే మానేసింది ఇందువల్ల మీరు చేయబోయే సత్యాన్వేషణ ఏమిటో తెలుసుకోవాలని వుంది

*

మద్రాసు
9-8-80

నమస్కారం,

మీ వంటి శాస్త్ర పరిజ్ఞానం గలవారు భౌతిక విజ్ఞానాన్ని ఎందుకు మూఢ విశ్వాసంగా ప్రచారం చేస్తున్నారో అర్థం కాకుండా వున్నది నాకు తెలిసినంతలో డా మిత్రా గారిది చాలా sad case ఆయన చిత్తశుద్ధిలో నాకు నమ్మకం వున్నది కాని ఆయనకు భౌతిక విజ్ఞాన విస్తృతి ఏమీ అర్థమైనట్టు లేదు మామూలుగా hypnotic state లో మానవ శరీరం చాలా శక్తులు ప్రదర్శిస్తుంది Post hypnotic cases చదవలేదా ?

"The word as physiological of Therapeutic value" అనే రష్యన్ పుస్తకం చదవండి. 18వ శతాబ్దం భౌతికవాదంతోనూ, హేతువాదాలతోనూ కొట్టుకులాడకండి

Meditation లో నాకు results కనబడలేదు మన 'భావాలు' అనేవి మొత్తం పదార్థ చైతన్యంలో చాలా అల్పమైనవి కాని వాటి ప్రాముఖ్యం సామాజిక జీవనం మీదా, జీవిత పరిణామాల మీదా నూటికి' నూరుపాళ్ళు వుంటుంది. లాజిక్ పూర్తిగా భావాలకు పరిమితమై వుంటుంది. మార్క్సిస్ట్ ఆచరణ పూర్తిగా భావంతో కూడి వుంటుంది అందుకని వ్యక్తులు ప్రదర్శించే అసాధారణ శక్తులు లేవని రుజువు చేయటానికి నడుములు బిగించాలా ? సమష్టి (సామాజిక) సమస్యపట్ల శ్రద్ధ వున్నవాడు ఎవడైనా ఇది ఉద్యమంగా పెట్టుకుంటాడా ?

శ్రమపడి అన్వేషించరు. ఉన్నవి లేవనేస్తారు. అప్పుడు అసాధారణ శక్తులకు భౌతిక ఆధారం వెతకవలసి వస్తుందిగద ! దానికి ఓపికలేదు. శాస్త్రజ్ఞులు వెయ్యిసార్లు రుజావు చేసిన శక్తులు కూడా లేవని కేకలేస్తున్నారు చదువుకున్నవాళ్ళు కూడా

సైకిక్ రీసెర్చి ప్రపంచమంతటా జరుగుతున్నదే ఒక ప్రత్యేక వ్యక్తిలో సైకిక్ పవర్ లేదని రుజావు చెయ్యటం అసలలాంటిది లేనేలేదని రుజావు చేయటమవుతుందా ? ప్రజలు ఎంత మూఢులయితే ప్రజావంచన అంత పెద్ద ఎత్తున సాగుతుంది నెగెటివ్ రిజల్ట్స్ ప్రచారం కోసం ఎందుకు డబ్బూ, కాలమూ తగలేస్తున్నారు ? నమ్మకం లేనివాళ్ళు అపనమ్మకాన్ని బలపరుస్తున్నారు కాని నమ్మే మూఢుల్ని మార్చలేకపోతున్నారు. నమ్మేవాళ్ళంతా మూఢులు కాకపోవచ్చుననీ, వాళ్ళు తమ అనుభవాలకు గల భౌతిక ఆధారాలు తెలియక దైవశక్తులు అనుకుంటున్నారని మీకు తట్టలేదు

మెడిటేషన్ కన్న యోగాభ్యాసం వ్యక్తులకు చాలా మేలు చేస్తున్నట్టు కనబడుతుంది కాని సామాజిక ప్రయోజనాన్ని మాత్రం యోగం సాధించలేదు TM చేస్తున్న వాళ్ళు నాకు ఎవరూ తెలీదు

విశ్వాసంవల్ల ప్రయోజనం వుందా అని అడిగారు మనం జీవితంలో లక్షలకొద్దీ విషయాల్ని నమ్ముతాం వాటినన్నిటినీ రుజువు చేయటం మనవల్ల కాదు. To that extent విశ్వాసాలు అవసరాలకింద వస్తాయి. ఆచరణలో ఒకటి రెండుసార్లు రుజువు కాకుండా పోయే విశ్వాసాలు అనుమానానికి దారితీస్తాయి కొత్త ఆచరణతో పాతవిశ్వాసాలు సంస్కరించబడటం అన్నిరంగాలలోనూ శాస్త్ర, వైద్యరంగాలతో సహా వున్నదే

విశ్వాసాలలో ఒక రకం - హిప్నాటిస్టుని హిప్నటైజ్ అయినవాడు నమ్మటం. వాడికి ఆ స్థితిలో నమ్మకుండా వుండే శక్తి వుండదు ఏ కారణంచేతనైనా కాలదోషం పట్టిన నమ్మకాన్ని అంటిపెట్టుకున్నవాడు మూఢవిశ్వాసి నమ్మకాలలో కలిగిన సంస్కరణలు వాడు ఎరగడు ఒకప్పుడు మందులు లేని రోగాలకు ఈనాడు మందులున్నాయి ఆ రోజుల్లో అలాటి రోగాలకు ముడుపులు కట్టేవారు. నేను 1923 లో టైఫాయిడ్‌తో ఆశవదులుకునే స్థితికి వచ్చాను కింద పెట్టారు ఎవరూ ఏమీ చేయకుండానే బతికాను ఇలాగే 1939 లో డాక్టర్లు హోప్‌లెస్ అని చెప్పిన కొద్దిసేపటికి మా బావమరిది కోలుకున్నాడు శరీరంలో వున్న శక్తులు గురించి మనకు సహస్రాంశం తెలీదు అంతా తెలిసినట్టుగా 'ఇది తప్పుడు విశ్వాసం" అని ఢంకా బజాయించే హేతువాదుల్ని చూస్తే జాలి కలుగుతుంది

నాకు తేలుకుట్టింది మంత్రం వేశారు పారలేదు కొందరికి మంత్రం పారుతుంది విశ్వాసం అవునో కాదో కొన్ని పరిస్థితులలో శరీరశక్తులు అకస్మాత్తుగా విడుదల అయినట్టు పనిచేస్తాయి మీ ముసలమ్మది self hypnosis కావచ్చు - చాలా mild form లో దీనికి రివర్స్ కేసు చాలా దశాబ్దాల క్రితం ఇంగ్లండులో జరిగిందట ఒక బుచర్ చదునైన మాంసాన్ని హుక్‌కి తగిలిస్తూండగా చెయ్యి స్లిప్ అయి హుక్కు చేతిలో గుచ్చుకున్నది శోకాలు పెట్టసాగాడు. వైద్యులను చెయ్యి తాకనియ్యేడు. చివరకు థర్డ్ డిగ్రీ పెట్టి చెయ్యి లాగేస్తే హుక్కు అతని చేతిలో ఇరుక్కోలేదు, కోటులో ఇరుక్కున్నది.

ఇలాటి unreal realities జీవితంలో చాలా వుంటాయి. వాటిని నిరాకరిస్తూ చాలా rational గా వున్నామనుకునేవాళ్ళు priggish people నేను హేతువాదులను ఏనాడో ఖండించి materialism నీ, అందులోనూ dialectical materialism ని అవలంబించమన్నాను అది progress కి చాలా అవసరం

'నాస్తికుణ్ణి' అనే మాటకు సరియైన నిర్వచనం లేదు దేవుడున్నాడని నమ్మేవాళ్ళు దాదాపు అందరూ నాస్తికులేనని చాలా తేలిగ్గా రుజువు చెయ్యొచ్చు. కర్మసిద్ధాంతం నమ్మినట్టు చెప్పేవాళ్ళు తమవల్ల అయ్యే పనిని కర్మకు వదలరు.

హిప్నాటిజం, నమ్మకమూ ఒకటికాదు. హిప్నాటిక్ cases కు కొంతలో కొంత ఫిజియాలాజికల్ ఎక్స్‌ప్లనేషన్ వున్నది. అది పూర్తిగా భౌతికవాదమే దాని గురించి సందేహం అనవసరం

Time waste చెయ్యకండి Marxism వంటబట్టించుకోండి చాలా లాభం వుంటుంది దైవిక శక్తుల గురించి మాట్లాడేవాళ్ళను చేరనియ్యొద్దు. మనిషిలో కనిపించేవి దైవికశక్తులు ఎలాగవుతాయి ? శవంలో శక్తుల్ని చూపిస్తేయేమో గాని

ఉంటాను.

*

1-10-75

శ్రీ రామమోహనరావుగారికి,

నమస్కారాలు

మీ ఉత్తరం అందింది మీ దృక్పథమే నాదీనూ - కాకపోతే నేను మార్క్సిస్టు dialectical దృక్పథాన్ని పూర్తిగా ఆమోదిస్తాను. (అదే నా mind theory కి కొంత ఆధారం కూడానూ ) Dialectical గా ఆలోచిస్తే మూఢవిశ్వాసం పుట్టినచోట Scientific inquiry start అవుతుంది. అందుచేత చాలా scientific inquiries black magic లాంటి వాటినుంచి బయలుదేరినట్టు కనబడతాయి. Assimilate కాని అనుభవం దగ్గిర మూఢవిశ్వాసమూ, శాస్త్ర పరిశోధనాధారము చీలుతాయి.

నేను చాలాకాలంగా ఈ assimilate కాని అనుభవాలను గురించి ఆలోచించి చివరకు ఈ mind dimension దగ్గిరికి చేరాను. నిజానికి నన్ను ఈ దిక్కుగా ప్రేరేపించినది idealists దేముణ్ణి supermind అనటం ! Matter నుంచి దేన్ని ఎడం చేసినా నా scientific conscience సహించదు But I could see that Psychic Research was conducted mostly on futile lines అది స్పష్టమైన శాస్త్రశాఖగా ఎందుకు పరిణమించలేదో నాకు చాలాకాలం అర్థం కాలేదు Mind dimension conception వచ్చినాక spatial techniques of research fail కాక తప్పదని గ్రహించాను

నేను చందమామ గురించి చెప్పిన విషయంలాగే మీ కుర్రవాడి incident కూడా ఏమీ prove చెయ్యదు కాని Mind dimension దృష్ట్యా దానికి కూడా significance ఉన్నది I am prepared to go to the persistent beliefs of the most brutal aborigine to see if I can make some meaning for the supporting Mind నా వ్యాసాలు ఏ మూఢవిశ్వాసాలనైనా బలపరిచేటట్టుంటే అది చాలా శోచనీయం కానీ మూఢవిశ్వాసాలను reject చేసిపారేస్తే నా theory కి ఒక ఆకారం రాదు నేను రాసుకుంటున్న notes లో ఇంకా అనేకం interesting points ఉన్నాయి. వాటిని గురించి ఒక coherent వ్యాసం రాయటం సాధ్యంకాదు ఎప్పుడో ఆ పని చేస్తాను

తరువాత, మీరు అవలంబించిన వైఖరి rational అనే చెప్పాలి కొత్త view points లో మనసుకు firm hold చిక్కకుండా పాత view points వొదులుకోవటం చాలా పొరపాటు. Neospiritualist scientists పరమ మూఢులనటానికి సందేహం లేదు ఎప్పటికైనా నా notes మీరు చూద్దురుగాని అందులో కూడ ఒక cogent, coherent theory ఉన్నదని చెప్పలేను గాని, మన modern materialistic outlook తో human experience అంతా explain కాదనటానికి సందేహం లేదు. అలా చెయ్యటం సాధ్యమని మీరనుకునేది ఒక act of faith

చక్రపాణిగారి full impact చందమామ మీద ఉంటూ వచ్చినట్టుగా యువమీద కూడా లేదు అందుచేత ఆ effect చందమామ మీద ఎక్కువగా ఉండొచ్చు. Films లో ఆయన దాదాపు spent force అని చెప్పాలి ఆయన script మీద concentration పోయి ఇతరులతో కూర్చుంటూ వచ్చారు ఇప్పుడు పూర్తి అవుతున్న pictures చూస్తే గాని ఆయన genius అందులో ఎలా ఉన్నదీ తెలీదు ఉంటాను

*

6-3-79

శ్రీ రామమోహనరావుగారికి,

నమస్కారాలు మీ 3 ఉత్తరం అందింది నేను సంగీతం గురించి రాసిన వ్యాసం authoritative కాదు కావటానికి వీల్లేదు only provocative అయితే బాలమురళి ఆ వ్యాసంలో ప్రతి అక్షరమూ నిజమని అన్నాడు Controversial కాదన్నాడు నిజానికి అందులో అతన్ని విమర్శించే అంశాలు కూడా వున్నాయి ఏదైనా మనవాళ్ళకు discussion లోకి దిగే అలవాటు లేదు ఇదే అరవవాళ్లైతే ఈ పాటికి దుమ్ములేపేసేవాళ్ళు.

హనుమచ్ఛాస్త్రిగారి వ్యాసం గల సంచిక వచ్చింది నేను చదవలేదు పాణిని గురించి ఆయన ఏమనటానికైనా అర్హత గలవాడు. పాణిని వ్యాకరణం రాసి సంస్కృతాన్ని గొప్ప చేశాడన్న అభిప్రాయం నా సొంతంకాదు D D Kosambi గారిది పెద్ద పండితుడే గదా ! సంస్కృతం సజీవ భాష అని వాదిస్తున్నవారు చాలామంది ఉన్నారు సజీవభాష అంటే ఏమిటో వారికే తెలియాలి Usage తో మారే శక్తి లేని భాష నిర్జీవ భాష అని మనబోటివాళ్ళం అనుకుంటాం !

ఉన్నంతవరకు నా వాదనలో తప్పు పట్టటానికి ఏమీ లేదనీ, అయితే బుద్ధికొలత గురించి తప్పనిసరిగా నమ్మాలన్నది నేను రుజువు చెయ్యాలనీ ఆంధ్ర యూనివర్శిటీ సైకాలజీ, పారాసైకాలజీ డిపార్ట్‌మెంట్ వారన్నారు మామూలు "Science-religion" లో ఉన్న లోపాలు వారిలో ఉన్నాయి మీకు వ్రాసిన argument ఇంకా extend చేసి వారికి రాశాను ఏమంటారో చూడాలి

The argument is absolutely simple

మనం present లో millions of years past ను ఆకాశంలోకి చూస్తున్నాం అందుకు extended space dimension help చేస్తున్నది మనం అనేక దశాబ్దాల క్రితం విషయాలు recapitulate చేస్తున్నాం. ఏ dimension ? మన present కూ, స్మృతుల past కూ మధ్య సమాధానం ఏ dimension లో ?

Rare memory of transmission of charcters కూడా recapitulation of the past గానే భావించాలి. దానికి DNA, genes అని ఏవో మంత్రాలు చదువుతున్నారు. OK. మనిషి గర్భంలో నుంచి మనిషి బిడ్డ రావటానికి genes కారణం కాని ఒక fertilized egg cell evolutioary stages - gills, tail, body, fur- అన్నీ సంపాదించి, విసర్జించే శక్తి కూడా genes కీ ఉన్నదా ? దీన్ని నేను scientific mumbo - jumbo అని ఎందుకు అనరాదు ? Phylogeny space-time లో జరిగిందంటే అర్థం చేసుకోవచ్చు కాని అదే process ఇంకో dimension లేకుండా జరిగిందంటే ఎట్లా నమ్మటం ?

మీరు మరచిపోయి వుంటే biology, genetics, evolution పుస్తకాలు ఒక్కసారి తిరగెయ్యండి Mind Dimension చాలాచోట్ల కానవస్తుంది ఉంటాను

కొడవటిగంటి కుటుంబరావు

PS జయంతి రామయ్యపంతులుగారి మీద నేను supply చేసింది పనికొస్తుందా ?

*

8-2-79

Dear Krishna Rao Garu,

Got your 6th letter I have not the opportunity of presenting my thesis in "Mind Dimension" in a systematic form But I have with me parapsychology

